# లల్లరామాయణం



లల్లాదేవి

# అల్లరామాయణం



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సహాయముతో

ఆహ్లాదేవి

లల్లరామాయణం

By లల్లాదేవి

ప్రతులు 750

ప్రథమ ముద్రణ
డిసెంబరు 1997



ప్రచురణ :
లల్లాదేవి
ఎన్. జి. వి. పాలెం (పోష్టు)
ప్రత్తిపాడు (మండలం)
గుంటూరు—522019.

ముద్రణ ;
సహాయమాతా ప్రింటర్సు, గుంటూరు.

# రామం

## నిశాచర వినాశకరం, నమామి!

రాముడంటే నిశాచరులకు వినాశకరుడు. నిశాచరులంటే చీకటిలో ద్రిమ్మరుతున్నవారు. చీకటి అవిద్యకు,అజ్ఞానానికి సంకేతం!

తేజోమయయిన సాంఘిక జీవనాన్ని జంబూ ద్వీపంలో సువ్యవస్థితం చేయాలని రాముడు పోరాడాడు. శాస్త్రబద్ధం కాని జీవితమే చీకటి. తేజోమయమయిన బ్రతుకుదారి అంటే వేదాల విజ్ఞానపు వెలుగులో సంప్రాప్తమయే అద్భుత జీవితం!

సురగణాల పక్షపాతులయిన మౌనులు రామునికి వేదవిహితమైన బ్రతుకు దారిని ప్రబోధించారు. అది తేజోమార్గం.

అందుకు భిన్నమైన చీకటిని జయించేందుకు కోదండపాణి అయినాడు రాముడు. అందుకు అతడు ప్రజారంజకుడయిన పాలకుడయినాడు. అతనిది రామ రాజ్యమయింది.

దశగ్రీవుడు వేదాన్ని చదివారు. చదివించాడు. సురగణాలను జయించాడు. కాని వేదవిహితమయిన విజ్ఞానపు వెలుగుదారిని విడిచి పెట్టాడు. తన చుట్టూవున్న సమాజం కోసం తాను ప్రభువు అయినవాడు.

అలాకాక చుట్టూ వున్న ప్రపంచమంతా తన పద్ధతికోసం, తన సుఖం కోసం అనిభావించువాడు అది సామాజికమయిన అన్యాయం.

అందుకే రాముడు వధించాడు. చీకటిని జయించి వెలుగుబాటను ఉద్ధరించాడు కాబట్టే రాముడు తేజోమయుడూ, ప్రజారంజకుడు అయినాడు. అందుకే రామకథ చీకటి వెలుగుల పోరాటం !

చీకటిపై వెలుగు ఎగురేసిన జండా రామకథ! ఎన్నిమార్లు విన్నా తనివితీరని అమృతగాధ!

అటువంటి రామకథను వినూత్నకోణంనించి చెప్పే అవకాశం నాకు దక్కిందంటే అది నా అర్హత అనుకోలేను. కేవలం అదృష్టమే అనుకుంటాను.

అల్లాదేవి
శతాధిక నవలా రచయిత

గుంటూరు

# లల్లి రావణాయణం

ఆమె మంచి రూపసి!

పేరు కైకసి!!

దండకాటువిలో చీకటి క్రమ్మిన దారులవెంట నడుస్తోంది. తండ్రి అడుగులో అడుగు కలిపి అడివి దారులవెంట పురోగమిస్తోంది.

ఆమె అలా నడుస్తూవుంటే మంజీరాలు ఘణ ఘణ మంటున్నాయి. యౌవన రాగంతో రక్తవర్ణాన్ని సంతరించుకున్న పాదపల్లవాలు మరింతగా అరుణాంచిత మవుతున్నాయి.

ఈ దూరప్రయాణంనించి తనను అలయించిన తండ్రి వృద్ధమూర్తి. అతడూ అలసితుడవుతున్నాడు రవంత జాగు నడచి కుమారికోసం కనులు మరలించి చూడ సాగాడు చురుకుగా అడుగు కదిపి చేరవస్తోంది కైకసి!

పయోధర్మంనించి ఆమె పయోధరాలు ముంచు బరువుతో తలను వొంచి తరంగాలను ముద్దాడుతున్న పద్మాలవలె ఉన్నాయి. అధరాలుఅలయికవల్ల సన్నగా అదరుపాటు అవుతున్నాయి. చెంపలు పద్మరాగాలను చెక్కినట్లుగా తరళిస్తున్నాయి.

విశాల సుందరమయిన నేత్రాంచలాలు రవంత సంకుచితమవుతున్నాయి. వృద్ధమూర్తి అయిన తండ్రి దండకాడవిలో సుదీర్ఘరంగా తన శాఖల్ని చూచిన ఒక వసచూత వృక్షచ్ఛాయన విశ్రాంతుడయినాడు. వడివడిగా నడచి అతనిని చేర వచ్చింది కైకసి. తండ్రి ప్రక్కనే విశ్రాంత అయింది.

అప్పటికి నడిమింటి సూర్యుడు నడికొప్పుజారి పడుతున్నాడు. ఒకవంక మేఘశకలాలు యౌవ్వనవతి మగని నిరీక్షణలో చేస్తున్న అలోచనలవలె అందందు తారాడుతున్నాయి.

అది వసంతఋతువు! అందునించి మన్చుతునకలు తెల్లగా పీచుపీచుగా తేలి పోతున్నాయి. రవికాంతులు విస్తారంగా బాధించటల్లేదు.

అయినా నడచివచ్చిన దూరం సుదూరం. నడవవలసిన బాట మరింతగానే ఉంది. అందుకే ఈ అలత!

ఎక్కడి నాగలోకం! ఎక్కడి దండకావవి!

లక్ష్యమనేది సాధించదలచుకున్నవారికి దూరభారాలు యేముంటాయి?

విశ్రాంత అయిన కైకసివంక ప్రేమగా, జాలిగా చూచుకున్నాడు వృద్ధమూర్తి అయిన తండ్రి. ఆమె అధరపల్లవాలు మార్గాయాసంవించి రవంత అదిరిపడుతున్నట్లు అనిపించినాయి. ముఖంలో కాంతి స్ఫూర్తి వెనుక తట్టుపట్టినాయి. అలసట మూర్తీభవించినట్లుగా కన్పిస్తోంది కైకసి.

"అమ్మా! అడవిదారులవెంట నావెంట బహుదూరం నడచి వచ్చినావు. తల్లీ! దాహశాంతి అయేందుకు మంచినీరు తెచ్చి యివ్వనా? ఆకలి తీర్చుకుందుకు శాకమూలాలు అందించనా! ఈ దండకలో విస్తారంగావున్న ఫలవృక్షాల నించీ పండ్లు కోసి యివ్వనా? మాంసాహారం కావాలంటే చెప్పు, ఈ వాడిఖడ్గంతో ఏ దుప్పినో హతమార్చి తీసుకువస్తాను.

అలా ఉన్నావేమి? కేవలం యిది మార్గాయాసం వల్లనే వచ్చిన మార్పు కాదనుకుంటాను. నీ మనసులో మరేదో ఉన్నది. అది నీ తండ్రి నయిన నాదగ్గర ఎందుకు దాస్తావు? చెప్పు తల్లీ!" అని అనునయించి అడిగాడు వృద్ధుడు. అతని పేరు సుమాలి!

అతడు ఈనాటికిలా వయోభారంనించి కృంగిపోయినట్లు కనిపిస్తున్నాడు కాని ఉద్దండుడు. అనేక యుద్ధాలలో ఆరియు తేరిన వృద్ధమూర్తి. ముందుచూపు కలిగి మేధావి.

అమితమయిన పట్టుదలతో తరతరాలను సాధించాలని చూడగల తెంపరి. బహుకాలం అజ్ఞాతవాసం చేసిన బాధితుడు. సుదీర్ఘమైన అతని చరిత్ర నుదుటిమీది ముడుతలలో అభివ్యక్తమవుతూంది. దట్టమైన ఫలితకేశాలలో నక్కి ఉంది.

"పితృదేవా! ఆడపుట్టుక కదా! నావాడయిన పురుషుడు నాకు దక్కేవరకూ తండ్రి అయిన మీ అడుగుజాడలవెంట నడవడం నా విధి. దాహం ఆకలీ అలసటా ముప్పిరిగొన్నాయి. నన్ను వేధిస్తున్నాయి నిజమే! కాని నన్ను బాధించే ప్రస్తుతాంశం మాత్రం కాదు.

మీరు వృద్ధులు. బహుదూరం బ్రతుకు అనుభవాలవెంట వరుగిడినవారు. ఇప్పుడు అడవిదారులవెంట బహుదూరం నడవలేకపోతున్నారు. మార్గాయాసంవల్ల మీ ముఖం మరింతగా వాడిపోయింది. కన్నులు తేజస్సు తగ్గినట్లు కన్పిస్తున్నాయి. చెంపలు నొక్కుకుపోతున్నాయి.

ఇంత శ్రమకు ఓర్చి ఈ పయనం ఎనదుకు పితృదేవా! నాగలోకంలో నేను పుట్టిపెరిగాను. ఇన్నాళ్ళు అదే నా స్వస్థలమనుకున్నాను. కాని యిటీవలనే తెలిసింది.

మీరు కొన్ని దశాబ్దాలకు పూర్వం నాగలోకం వలన వెళ్ళినారని. కారణమేమిటో నాకు తెలియకురాలేదు. అదేకాదు. ఈనాడు మీరింత ప్రయాసకు ఓర్చి ఈ పయనం ఎందాకా కొనసాగించదలచినారోకూడ తెలియదు. అందుగురించే ఆలోచిస్తున్నాను. కానిమార్గాయాసం గురించి మాత్రం కాదు'' అని చెప్పింది కైకసి.

సుమాలి దీర్ఘంగా ఒక నిట్టూర్పు పుచ్చినాడు.

అతని ఆలోచనలు చైతన్యవంతము, స్ఫూర్తిమంతము అయిన తన గత జీవితపు పుటలలోనికి వెళ్ళినాయి. ఇంతకాలం లాగి ఉంచిన విల్లులా ఉన్న అతని ఆవేశం కట్టలు త్రెంచుకుంది. ఏ ఆశయంతో అయితే తాను తన కుమారిని బహు దూరం తీసుకువచ్చాడో ఆ కారణం గురించి అడుగుతోందామె.

ఏ బాధ అయితే యింతకాలం మనసు పొరలలో దాగి ఉందో అది యిప్పుడు తెలియలికట్ట దాటి ఉరికింది. ఏ అవమానానికి ప్రతీకారం తీర్చుకోవాలన్న ఆలోచనను యింతకాలం గుండెలమాటున దాచుకున్నాడో ఇప్పుడా సంగతులన్నీ జ్ఞాపకం వచ్చినాయి.

ఆవేశంతో అతని వక్షస్సు పొంగింది

అతని కంఠస్వరం ఉద్విగ్నమయింది.

"కుమారీ! ఈప్రశ్న నీవు అడిగే సుముహూర్తం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను. నీనిప్పుడు యౌవనవతిని అయినావు. క్షేత్రపతి అయేందుకు అర్హతను సంపాదించుకున్నావు. తల్లీ! ఆలనాడు నాకు మన అసురగణాలకు జరిగిన అవమానానికి అన్యాయానికి ప్రతీకారం నీవల్ల నెరవేరవలసిన సమయం ఆసన్నమయింది. నీవు ఈ కర్తవ్యాన్ని జాతిపట్ల విధేయతగా భావించి నిర్వహించాలి.

ఈ పవిత్ర కర్తవ్యంపట్ల నీవు అంకితభావంతో తలచాలి. ఇన్నాళ్ళు దాచిన నా గుండెమంట నీ వల్లనే చల్లారాలి'' అన్నాడు సుమాలి. కైకసి రవంత అబ్బురపడిపోయింది.

ఆమె నేత్రాలు ఆశ్చర్య విస్ఫారితాలై తరళించినాయి.

దృష్టివలయంలో తండ్రి తప్ప మరేమీ కన్పించలేదు. అలలు అన్నీ నిలిచిపోయిన సముద్రంలా ప్రశాంతంగా కల్పించే తండ్రి మనోగతంలో యింత ప్రళయభయంకరమయిన బాధ దాగి ఉందంటే రవంత అయినా నమ్మబుద్ధి వేయలేదు.

అతనికి కలిగిన అపజయ మేమిటో, తద్వారా అసురాగగణాలకు వాటిల్లిన అవమాన మేమిటో ఆమెకు యత్కించుత్తు అయినా అవగతంకాలేదు. తన కర్తవ్య మేమిటో బోధపడలేదు.

"పితృదేవా! మీ ఆలోచనలే నాకు ఆజ్ఞలు. మీ మనోఫలకంమీద కదులాడిన ఊహలు నాకు శిరోధార్యాలు. ఒకవేళ మీవంటి వారికిఅపకారం చేయగలిగిన వారు భూవలయం మీద ఉండి వుంటే, నావల్ల వారికి మీరు ప్రతీకారం చేయ గలిగితే అందుకు నేను అంకిత భావంతో నిలుస్తాను.

అది నా విధి. నాకు ఈ జన్మ యిచ్చిన తండ్రిపట్ల నేను నెరవేర్చుకోవలసిన కర్తవ్యం. తండ్రీ! త్వగరా చెప్పండి. అసలు జరిగింది ఏమిటి? యిప్పుడు నేను నెర వేర్చవలసిన కర్తవ్యమేమిటి?" అని అడిగిందామె మనః పూర్వకంగా!

కుమారి మనోగతాన్ని అవగాహనకు తెచ్చుకున్న సుమాలి హర్షాతిరేకంతో ఉబ్బొంగిపోయినాడు. సముద్రంలో నిలిచిపోయిన తరంగాలు తిరిగి విజృంభించినట్లు అయినాయి. వాయుఘాతానికి సుదూర తీరాలకు కొట్టివేయబడిన మేఘశకలాలు తిరిగి ఒక చోటున చేరినట్లు అయినాయి.

ప్రతీకార జ్వాలలు జీమూతాలవలె అతని మనసు మీద ముట్టడి చేసినాయి. హుబ దశాబ్దాలుగా అంతర్యంలో మందు పొతర్లో దాగి ఉండిన పథకాలు పైకి వచ్చాయి. కుమారికి తన మనోగతాలకు అనుగుణంగా మలుచుకునేందుకు అతడు సంసిద్ధుడయినాడు. ఏ వ్యక్తివల్ల అయితే తన కోరికలు ఈడేరనున్నవో ఆ కైకసి ముందు సంప్రాప్తమయిన ఈ అవకాశాన్ని అతడు రవంత అయినా వృథాపోనివ్వ దలచలేదు.

"అమ్మా! కుమారీ! కైకసీ! ఇది చాలాకాలం క్రితం జరిగిపోయిన ఒక దురదృష్టకరమయిన సంఘటన. ఆ కాలంలో నేను అసురగణాలకు అధ్యక్షుడుగా ఉండేవాడిని. నా నేతృత్వంలోని వారంతా ఉద్యన్స్ఫూర్తితో నివశించేవారు.

ప్రాణి లక్షణం చైతన్యమే కదా! అత్యంత చైతన్యం ఉన్నత మానవుని లక్షణం అని భావించేవాడిని నేను. అందుకే లోక విజేతనుకావాలని నిండు ఉత్సాహంతో ఉద్యమించాను. శరీరంలో చాలినంతశక్తి సంపన్నత ఉన్నది. తపో బలంతో అందివచ్చిన వరబలాలు అనేకం ఉన్నాయి. నా అనుచరులు నిశాచరులు. వారి యుద్ధ విద్యావిశారదత్వమూ, ఉద్య స్ఫూర్తి నాకు మరింత ప్రోత్సాహకాలు ఆఖ్ఖ ఆర్థగా నిలిచినాయి, నాకు నేనే సాటి అనిపించింది.

దేవ, గాంధర్వ, యక్ష కిన్నెర, గణాలలో వారంతటి శక్తిశాలి లేదు. ఆ విషయాన్ని లోకానికి చాటి చెప్పాలన్న ఆశయంతో బయలుదేరాను. రాక్షసబలం దేవ, యక్ష, గాంధర్వ, కిన్నెర గణాలకన్న అధికాధికమయినదని నిరూపించాలి.

ఎంతో ఉత్సాహంతో సేనల్ని కదలించాను. ఏకధాటి యుద్ధాల జంబూ ద్వీపం కల్లోలితమయింది. అసుర సేనల్ని గౌతమి దాటించి వింధ్య పర్వత శ్రేణికి తరలించాను. అక్కడనించి మేము తూర్పుముఖంగా పయనించి గంగాతీరం చేరుకున్నాము. యక్ష కిన్నెర గణాలన్నీ నాకు పాదక్రాంతమయినాయి.

బ్రహ్మావర్తంలోనూ, హిమావర్తంలోనూ నివశిస్తున్న గంధర్వదేశ వాసులయిన గాంధారుల్ని, దేవగణాలన్నింటిని కదిలించాలని నా ఆశయం. బ్రహ్మావర్తం తదాదిగా హిమావర్తం వరకూ దేవగణాలు విస్తరించి ఉన్నాయి.

సురలోకంగా పిలువబడుతున్న ఆ ప్రాంతాల మీదికి అమిత ఉత్సాహంతో సైన్యం సింధువును ఉరకలెత్తించాను. నేను సింధూ తీరప్రాంతాలకు వెళ్ళినప్పటికే బ్రహ్మావర్తంలోని సురగణాలు గడగడలాడినాయి.

గంగా సింధూ తీర భూముల్లో చాల ముని వాటికలున్నాయి. మునులంటే సిద్ధాంతరీత్యా సురగణాల పక్షపాతులు. వేదవిహితమయిన మార్గాలను ప్రబోధించే మేధావులు మునులు. అందునించే వేదమార్గాన్ని అనుసరించే సురపాళి అంతా వీరిని అభిమానిస్తున్నారు. పూజిస్తున్నారు.

వేదశాస్త్రాలను చదివినా అదొక్కటే జీవిత సర్వస్వం కాదని భావించే అసురాగానికి అధ్యక్షుడను నేను. అందునించి మునులు నాకు సిద్ధాంతరీత్యా విరోధులు.

జీవిత పద్ధతులలో, సామాజిక న్యాయరీతిలో వారికి మనకూ సహస్రాంశం భేదాలున్నాయి. వారికీ మనకూ మధ్య ఎవరూ పూడ్చరాని అఘాతం ఏర్పడింది.

మనవారిలో కొందరు నరమాంస భక్షకులున్నారు. భాత్రించరు లున్నారు. ఇది మునిజనపాళికి అసహ్యకరమయిన జీవిత విధానం. అందునించి అసురగణాలను వారు ఎంత కాదనుకుంటాలో, అసురగణ పురోగతిని ఎంతగా నిర్మూలించాలని ప్రయత్నిస్తారో అప్పుడే నాకు తెలిసింది.

నా పురోగమనాన్ని శపించాలని వారి కోరిక జంబూద్వీపం నావలు బరిలోకి వస్తే సాంఘిక మర్యాదలన్నీ మట్టి కరుస్తాయని వారి ఆరాటం.

అందునించి వారు నాగురించే ఆలోచించటం ప్రారంభించారు. నా విజయాలు, నా ప్రాభవాలు గంగా సింధూ తీర భూముల్లో ఆశ్రయాలు నిర్మించిన ముని జపాళిలో సంచలనం రేకెత్తించింది. వారంతా శక్తి సంపన్నులయిన వారికోసం అన్వేషణ సాగించారు. అనుచరుడు పాలిస్తే వేద సంస్కారం కలిగిన సురపాళి విచ్ఛిన్నమవుతుందని వారి బాధ. అలా అయితే శ్రమించి నిర్మించుకున్న నాగరికత ఎగిరిపోతుంది.

వారు క్షణం విశ్రమించలేదు.

ఆ సంగతులన్నీ చారులవల్ల తెలిశాక నేనూ క్షణం విశ్రమించలేదు. ప్రళయ గర్జనలా, సుడిగాలిలో భీభత్సం చేయ ప్రారంభించాను.

జాతి విరోధులయిన సురులను నిర్దాక్షిణ్యంగా హింసించాను. వారి హితాభిలాషులయిన మునుల్ని చంపివేశాను. మునివాటికలలో హోమధూమాన్ని అరికట్టి వాటికి అగ్ని సంస్కారం చేశాను. ఈ వార్తలు హిమావర్తం దాకా వెళ్ళాయి.

వెండికొండ మీద పాలమీగడ లాంటి మంచుసయ్య మీద కొలువున్న దేవగణాధ్యక్షులయిన వారందరికీ ఈ వార్తలు వేడి పుట్టించినాయి. వెనువెంటనే వారంతా కదలివచ్చారు. వారిలో దిక్పాలకులను నేను జయించాను.

కాని అజేయుడయిన విష్ణువు నన్ను నిరోధించాడు: విష్ణువును సురగణాలు, మునిగణాలు ఆశ్రయించినాయి. అతని దయాభిక్ష కోసం ప్రార్థించాయి. వారి అర్థింపులకు అభయముద్ర యిచ్చివేశాడు విష్ణువు

నా సైన్యాలను అతడు ఎదుర్కొన్నాడు. నా కన్నుల ముందు మెరుపులు మెరిపించాడు. నేను హతాశుడను అయినాను. మరలిపోవటం ప్రారంభించాను.

అసురగణాలు విక్కుతోచని దయనీయమయిన స్థితికి చేరుకున్నాయి. విష్ణువు వారి నందరిని వైకుంఠానికి పంపివేశాడు. నేను మాత్రం ఎలాగో చావు తప్పించుకుని పలాయన మంత్రం పఠించాను. అయినా విష్ణుచక్ర దాటి నన్ను విడువలేదు. తుదకు గతిమాలి నేను నాగలోకం పారిపోయినాను. నాగులే నాకు రక్షణ కల్పించారు.

ఆనాడు అవమానంతో నా అంతర్యంలో లేచిన అగ్నిమాత్రం యింకా చల్లారలేదు కైకసీ! ఆ మంటలను నువ్వే చల్లార్చాలి. అందుకు నీవు మాత్రమే చాలినదానవు" అన్నాడు సుమాలి ఆవేశంగా, అతని రక్తం తైలంలా సెగలు అవుతోంది. గుండెలు ఘూర్ణిల్లుతున్నాయి.

తండ్రి మనస్తాపాన్ని, హృదయావేదనకూ, అంతర్యంలోని అగ్నిజ్వాలను గ్రహించింది. కుమారి కైకసి. ప్రథమంలో ఆమె కన్నులు చమరించినాయి. కన్నులలో కింసుక వనాలు ప్రతిఫలించినాయి. పెదవులు శరీష వేశలమయినా అరుణాంచితమయినాయి. ముఖం అమరావతిలో నిచ్చిన మందారంలా అయింది. నిలువెల్ల ఉక్రోషంతో ఊగిపోయింది కైకసి.

తండ్రికి, తన వారికి కలిగిన ఈ పరాభూతి ఆమెను కదల్చి వేయసాగింది. ఇంత జరిగాక శక్తి చాలకనే కదా తన తండ్రి బహుకాల నాగలోకంలో అజ్ఞాతవాసం చేశాడు.

యిప్పుడాయన ప్రతీకారం తీర్చుకునే సమయమే యధార్థంగా ఆసన్నమయితే, అందుకు తాను తూలిక కావలసి వస్తే అంతకన్నా కావలసిన దేమున్నది. జాతిజనుల కోసం బ్రతుకు బలియిచ్చుకున్నా అందులో చింతిల్లవలసిన దేమున్నది?

కైకసి అన్నింటికీ సంసిద్ధురాలు అయింది.

"పితృదేవా! మీకు జరిగిన అవమానం తరతరాలకు మరువరానిది. అసుర గణాలకు వాటిల్లిన ముప్పు ఎన్నటికీ మాసిపోనిది. ఒకజాతి అణచివేయబడి అనుభవించిన రంపపుకోత ఎన్నటికీ చెరగిపోనిది. అందునించి ఈ ప్రతీకారం కోసం నా వంతు కర్తవ్యంగా మీరు ఏది నిర్ణయిస్తారో అది నా జీవిత గమ్యంగా భావిస్తాను. అసురగణాలకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుతాను. కర్తవ్యం బోధించండి" అన్నదామె. సుమాలి గుండెల్లో చెలరేగిన మంట తాత్కాలికంగా రవంత చల్లారిపోయింది. ఆనాడు తనకు జరిగిన అవమానానికి తన బిడ్డ ప్రతియోగం సాధిస్తానంటే ఆ పితృహృదయం ఆనంద కేదారమయింది. అతడు తృప్తిగా నిట్టూర్చాడు.

ఇంతకాలంగా ప్రతీకారజ్వాల చల్లార్చుకోటానికి తాను ఆలోచించి తయారు చేసిన వ్యూహాన్ని కైకసికి చెప్పివేయవలసిన సమయం ఆసన్నమయింది.

అతడు మనసున్న మాటల్ని కూడదీసుకుని చెప్పటం ప్రారంభించాడు. జాతికోసం బొదల దాల్చేందుకు తనవంతు కర్తవ్యంగా నిర్ణయించబడుతున్న ఆ మాటల్ని అత్యంత శ్రద్ధాపూర్వకంగా ఆలకించసాగింది కైకసి.

జాతిజనులకు జరిగిన అవమానానికి ప్రతీకారం రూపొందించే పథకంలో వారు యిరువురూ అలసటను మరచినారు.

అందునించి సురుల పక్షపాతి అయిన వాని వల్ల నీవు క్షేత్రవతివి కావాలి. ఒక సంకీర్ణజాతీయుడయిన మహాపురుషునికి తల్లివి రావాలి.

హిమావర్తము, ఆర్యావర్తము, యమావర్తము అనే ముల్లోకాలను ఆ మహాపురుషుడు జయించి అసురశక్తికి కేతనంలా చరిత్రలో మిగిలిపోవాలి. రక్కసిమూకలను తిరుగులేని అధినేత ఒకరు కావాలి. అతడు నీ గర్భవాసం నించిరావాలి.

ఆ సంకీర్ణ మహాపురుషుడు రక్షోగణాధ్యక్షుడయి రాక్షస బలాన్ని ముల్లోకాలలో ప్రదర్శించి, ఈ తాత అయిన సుమాలి తృప్తిగా తుదిశ్వాస విడిచేలా చేయాలి.

అందుకోసం నీవు జాతి విచక్షతను మరచి సంకీర్ణయోగాన్ని స్వీకరించక తప్పదు" అని బోధించాడు సుమాలి.

కైకసికి అప్పటికి సుమాలి అంతర్యమేమిటో రవంత అర్థమయినట్లు అనిపించింది. అతని ముందుచూపు అవలోకనమయింది. ఓ తండ్రీ ఇంతమేధావివిఅయిన నీ మంత్రాంగమేమన రాక్షసగణాలకు రక్షాకవచం కాగలదని భావించిందామె.

"పితృదేవా! మీ మేధాసంపన్నతను కైమోడ్పు చేస్తున్నాను. మీరు ఆజ్ఞాపించినట్లే ఒక విజాతీయుని అర్ధాంగిని అవుతాను కాలం కలిసివస్తే క్షాత్రవతినిఅయి ఒక సంకీర్ణ మహాపురుషునికి తల్లిని అవుతాను.

అంతటి అదృష్టమే నాకు సంప్రాప్తమయితే అతనిని తీర్చిదిద్దే బాధ్యతను పవిత్రభావంతో స్వీకరిస్తాను. కాని పులస్త్యుని కోడలు కావాలని అన్నారు కదా!

ఎవరా పులస్త్యుడు. అతని తనూభవుడు నా మనోహరుడు కావాలి కదా!అతని పేరేమిటి? ఎక్కడుంటున్నారు?" అని అడిగిందామె అత్యంత ఆసక్తితో.

యౌవనం వాంఛాపూర్ణమయినది!

సుమాలి కుమారి అంగీకారంతో తృప్తిపడిపోయివాడు.

"అమ్మా! పులస్త్యుడు బ్రహ్మకుమారుడు. బ్రహ్మపరంపరలో అతని స్థానం అపూర్వమయినది ఆ మహనీయుని తనూభవుడే విశ్రవసు ఇప్పుడాతడు దండకాటవిలో తపస్సు చేసుకుంటున్నాడు. అతని గురించిన వివరాలు అన్నీ నీకు తెలియాలి కదా! మార్గాయాసం కలుగకుండా దారి వెంట చెపుతాను. ప్రొద్దు పడమటింటికి జారిపోతోంది. మరి బయల్దేరు" అంటూ వినూత్నమైన స్ఫూర్తితో లేచాడు సుమాలి.

ఇపుడు మిగిలివున్న మార్గన అయాసాన్ని కలిగించగలదని భావించలేదు

వారు. వినూత్నమయిన చైతన్యంతో తమ లక్ష్యానికి దగ్గర దగ్గరవుతున్న ఆనం దంతో పురోగమించసాగారు.

అడవులు కొండలు వెనుకతట్టు పడుతున్నాయి.

తన మనోహరుడు కానున్న ఆ మహనీయుడు ఎవరో! ఎలాంటి వాడో, ఆ తన గతచరిత్ర ఏమిటో, ఇంతఃపూర్వం అతడు పుత్రవంతుడు అవునాకాదా? కానున్న సహచారుని శీలసంపద ఎలాంటిది? ఇటువంటి ప్రశ్నలన్నీ మనసున దోగాడగా తండ్రివెంట తరలివెళ్తోంది కైకసి. ఒక చోటున ఆ పయనం అసాంత మైంది.

# 2

క్రూరజంతువులకు ఆలవాలమయిన దండకాటవిలో అంతటి ప్రశాంత సుంద రమయిన ప్రదేశం ఉంటుందని ఊహించనయినా లేదు కైకసి. మునివాటికలో వున్న పర్ణశాలలమీదికి పూలతీగలు అల్లుకుపోయి కన్పించినాయి.

ఆ ప్రాంతాలలో మునికాంతలు విశ్రమించేందుకని లతానికుంజాలు స్వాగతం పలుకుతున్నాయి. ఆశ్రమప్రాంతాలలో అంతా ఎక్కడ చూచినా శాంతివనంలా అన్పిస్తోంది. మృగరాజులు సైతం గర్జించటం మరచిపోయి మౌనంగా విహ రిస్తున్నాయి. పులులు పంజాలు విప్పటంలేదు. హరిణ శాబకాలు పులిపిల్లలతో నెయ్యం కొనసాగిస్తున్నాయి.

హరిసుర్కటాలు అరమరికలు లేకుండా సంచరిస్తున్నాయి దూరం నించి హోమధూమం ఆకాశవీధుల్లోకి హవ్యవాహనుడికోసం ఎగసిపోవటం దృగ్గోచర మవుతూంది వేదనాదాలు సమీరతురంగాలమీద తరంగలిస్తూ వస్తున్నాయి.

ఎక్కడ చూచినా కందమూలాలకోసం గుద్దలించిన గోతులే కనిపిస్తున్నాయి. నాగజాతి ఆవాసాలవలె, రక్షోగణాల నివాసాలవలె ఆ ప్రాంతాలలో ఎముకల ప్రోవులు లేవు. విసిరేసి చితికిపోయిన ఖర్పరటాలు లేవు. దుర్వాసనలులేవు. అంతా శాంతి నెలకొనివుంది.

వాళ్లొక వృక్షచ్ఛాయన కూర్చొన్నారు, మునికాంతలు తాము స్వయంగా తయారుచేసుకుని రంగులు అద్దిన మట్టిపాత్రలలో సెలయేరునించి నీరు తెచ్చు కోవటం కనిపిస్తోంది. వారంతా నారచీరలు ధరించారు.

అడవిపూలు శిఖలలో తురుముకున్నారు. పెదవులమీద చిరునవ్వు ముఖాలలో కాంతి నింపుకున్నారు. అనాచ్ఛాదితమయిన నగ్నపాదాలతో లతానికుంజాలమధ్య ఆనటి నెలవులకు తరలిపోతున్నారు.

"పితృదేవా! వీరంతా ఎవరు? వారి ముఖాలలో ఎందుకా తృప్తి. వారి శరీరాలు అంతగా కాంతివంతమయి వున్నాయేమిటి? కన్నులు అలలు నిలచిపోయిన తటాకాలవలె ప్రశాంతమయి ఉన్నాయి ఎందుకని—?" అని ప్రశ్నించింది కైకసి.

సుమాలి చిరునవ్వు నవ్వినాడు.

"కుమారీ! వారే మునికాంతలు. ఇది పులస్త్యబ్రహ్మ కుమారుడయిన విశ్రవసు తపస్సు కొనసాగించే ఆశ్రమం అతడు అమిత తేజశ్శాలి. బ్రహ్మ కుమారుడు కావటంనించి విద్యాసంపన్నుడు. నిజం చెప్పాలంటే వేదాలు అతని ముఖంనించే ప్రాదుర్భవించినాయేమోనని అనిపిస్తుంది.

అటువంటి విజ్ఞాన విధానమయిన మౌని వివాహితుడు. వారంతా మునికాంతలు. ఆశ్రమవాసం నించి అద్భుతమయిన కాంతి తేజం మనిషికి దొరుకుతుంది. అందుకే వారంతా అంత ప్రకాశవంతులయినారు." అని బదులు చెప్పినాడు సుమాలి. కైకసి అబ్బురపడిపోయింది.

"పితృదేవా! అంతటి శాంతమూర్తులు, విజ్ఞానతేజంతో వెలుగొందు తున్న వారు అయిన మునులు మనకు విరోధులు కావటం నిజంగా మన దురదృష్టమే అనుకోవాలి.

"అలా ఎందుకు జరిగింది" అని అడిగిందామె అమితమయిన ఆసక్తి కంఠంలో ప్రతిధ్వనించగా.

వృద్ధమూర్తి అయిన సుమాలి రవంత యోచించినాడు. అతని ఆలోచనలు బహుకాలం జంబూద్వీపంలో చరిత్రను ఒకసారి అవలోకనం చేశాయి.

"కుమారీ? అది యీనాటిదికాదు. వారు వేదాలనే విజ్ఞాన పేటికలను సముపార్జించుకున్నారు. ఆ వెలుగులో వారికి సామాజికమయిన జీవనం సంప్రాప్తమయింది. వేదాలు అందించే విజ్ఞానమంతా మునుల తపఃఫలంగా అందివచ్చినదే! అయితే దాన్ని దేవ యక్ష కిన్నెర గంధర్వ గణాలు సర్వ ప్రమాణంగా స్వీకరించి శిరోధార్యం చేసుకున్నాయి.

రాక్షసగణాలు మాత్రం వేదాలు చదివినా వాటిని సర్వప్రమాణంగా స్వీకరించ

లేదు. అందునించి వారికీ మనకూ జాతివైరం నిలిచిపోయింది. అది తరతరాలకు మరింత పెద్ద అగడ్తగా మారుతూ వచ్చింది. ఇంక యిప్పుడు దారులన్నీ మూసుకు పోయినాయి. మునులకు వేదవిహితమయిన యజ్ఞయాగాది క్రతువులు ఎంతగా అను సరణీయాలో రక్షోగణాలకు వాటి మీద అంత తేలికభావం. వారికి విరోధులుగా భావించే దేవ యక్ష గంధర్వ కిన్నెర గణాలకు మునులు అండదండలు అంది స్తున్నారు కావటంనించి వీరూ మనకు శత్రువులే తల్లీ!

మన శత్రువు మిత్రుడు మనకు శత్రువు అవుతాడు. అది రాజనీతి. అందు నించి వారితో వైరం మనకు అనివార్యం. శత్రువులో ఉండే సుగుణాలను చూచి వైరాన్ని మరచిపోతే మనకు పరాజయం తప్పదు. అందుకే మన రాక్షసగణాలు వారిమీద దీర్ఘకాలంనించి ముగింపులేని సమరాన్ని సాగిస్తున్నాయి.

ఈ పోరాటాలు యింతటితో నిలిచిపోవాలంటే సంకీర్ణజాతీయుడయిన మహా పురుషుడుదయించాలి. అతడు నీ గర్భవాసాన జన్మించాలన్నదే నా అభిమతం.

ఇంక నీవు కార్యరంగంలోకి దిగాలి. నీ గర్భవాసాన ఒక మహా పురుషుడు ఉదయించే సుముహూర్తంకోసం నేను ఎదురుచూస్తూ ఉంటాను. జాగ్రత్తగా వెళ్ళిరా తల్లీ! కర్తవ్యమనేది కఠినతరమయినది. దాన్ని కాపాడుకునేందుకు ప్రాణ మయినా ఎదురొడ్డాలి అప్పుడే కర్తవ్యపాలనలో మనిషి వ్యక్తిత్వం వికసిస్తుంది.

ఆశయాలు నెరవేరుతాయి. నీ కర్తవ్యాన్ని నీవు పవిత్రభావంతో జాతిపట్ల విధేయతా భావంతో నిర్వహించాలి. ఇదే నాకు నాకడసారి సందేశం నీ కర్తవ్యాన్ని నిర్వహించి అటువంటి మహాపురుషుడు ఉదయించాక నేను సజీవుడను ఆయివుంటే తప్పక నిన్ను అభినందించేందుకు వస్తాను.

నేనున్నా లేకున్నా నా ఆశీస్సులు నీకున్నాయనేది మాత్రం మరువకు. వెళ్ళిరా తల్లీ!" అంటూ కన్నీటి పొరలమధ్య వీడ్కోలు చెప్పి ఆ ప్రదేశం విడిచి వెళ్ళిపోయినాడు తండ్రి.

కన్నీరు తుడుచుకుల కర్తవ్యపాలనలో మనసు లగ్నం చేసింది కైకసి. రెండు దివారాత్రులు ఆ చోటు కదలకుండా మునికాంతల రాకపోకలు జాగ్రత్తగా కనిపెట్టింది.

బ్రహ్మపుత్రుడయిన విశ్రవసు అగమన నిర్గమన సమయాలను జాగ రూకతతో అర్థంచేసుకుంది. ఇంక తాను చేయవలసిన కార్యాన్ని నిర్ణయించుకున్న

దామె. అప్పటికే ఆ పరిసరాలు బాగా అలవాటు అయినాయి. తాను ఈ పరీక్షతో నిరీక్షణలో ఉన్నంతకాలం కందమూలాలతో కడుపు నింపుకోవడం అలవరచుకుంది.

ఒకనాటి వేకువ అది. ప్రతిదినమూ తాను లేచేకన్నా ముందుగా లేచి సెల యేటి దగ్గరకు పోయింది కైకసి. శుచిగా స్నానం చేసి తాను స్వయంగా తయారు చేసుకున్న నారచీరను ధరించింది. సెలయేటి ఒడ్డున సైకత స్థలులమీద ఆదమరచి కూర్చుంది.

తండ్రి తనకు అప్పగించిన కార్యభారాన్ని నిర్వహించే మనోధైర్యాన్ని ప్రసాదించమని పరేతరాట్టు అయిన పరమశివుని మనసులో ధ్యానించుకుంది. వేకువ ప్రొద్దు ఆయన వేగుచుక్క పొడిచింది.

తూర్పు ఆకాశాన్ని వేగుచుక్క వెన్నముద్దలా మెరుస్తోంది. సకల సామంత దండనాయకమంత్రి సేనాధ్యక్ష పణికాగణికా సమూహంతో కొలువుదీర్చిన చక్రవర్తిలా ఆకశాన కొలువుదీర్చింది వేగుచుక్క. తూర్పు ఆకాశాన్ని వాలుతోంది.

తన ఆశలకు సంకేతమయిన వేగుచుక్క అలా పొటమరించగానే బ్రాహ్మీ ముహూర్తమయిందని భావించింది కైకసి. తన మనోహరుడయిన పులస్త్య బ్రహ్మ తనూభావుడు స్నానార్థం సెలయేటికి వచ్చే వేళఅయింది.

ఆమె అంతఃప్రపంచంలో ఆలోచనల సాగరంలో ఆరాటమనే ఉవ్వెత్తు కెరటాలు లేచి అంతర్యపు హద్దుల్ని తాకి దోలాడాలిగా విరిగి పడుతున్నాయి. తాను పరాభూతురాలు కాకుండా ఉండాలంటే విశ్రవసుని మెప్పించాలి.

అతడు అమిత తపశ్శాలి. మనోబల సంపన్నుడు. ఓజశ్శాలి. విద్యాశక్తి సముపేతుడు. అద్భుతమయిన తొంభైరెండు అంగుళాల శరీర మతనిది. ముండితమయిన శిరస్సు. శిఖాయజ్ఞోపవీతమూ! చేతిలో భూర్జపత్రాలు. దండకమండలాలు నారచీరలు, కర్రతో నిర్మించిన పావుకోళ్ళు.

కన్నులలో వేదవిజ్ఞానపు వెలుగులు తారకల్లా తరళిస్తుంటాయి. పెదవులమీదనించి వేదమంత్రాలు వర్షిస్తున్నాయా అన్నట్లు ధృతిసంపన్నమయి వుంటుంది ముఖముద్ర. అన్నింట యోగ్యుడయిన ఆతని అర్థాంగి కావటమంటే మాటలా?

ఆ అదృష్టానికి సాటిరాగల మహర్దశ జీవితంలో మరొక్కటి లభించగలదా! ఆ ప్రాటి పొందిన తల ఎత్తడు. కనుచూపు రవంత అయినా ప్రక్కకు మరల్చడు. బాహుదండాలను బహుదూరం విస్తరుకున్నయినా నడువడు.

కాలిక్రింద చీమ చిటుక్కుమనకుండా మౌనముద్రాంకితుడయి రాకపోకలు సాగిస్తుంటాడు. ఆ మౌని వచ్చేవేళ అయింది. అనగానే మునికాంతలు ఎక్కడి వారక్కడ తప్పుకుపోతారు శిష్యగణాలు అంజలులుపట్టి నిలుస్తారు.

అతని మహిమాన్వితమయిన మనోహరరూపము కనులపడాలంటే ఎంత నోచుకోవాలి. అతనితో మాటాడేందుకు ఎంత విజ్ఞానం కావాలి. యింక అతని అర్థాంగి అయేందుకు ఎన్ని అర్హతలు కావాలి.

అవన్నీ ఉన్నాయి తనకు? యౌవనం తాలూకు మెరమెరలు తప్ప తనకే అర్హతలున్నాయని మరి ఆ అర్హతలన్నీ సాధించేందుకు తానేమి చేయాలి? ఏదో చేయాలి.

అలనాడు పర్వతరాజ తనయ బావ అయిన శార్వాణి పరౌతరాట్టును ఎలా మెప్పించింది. తన అర్హతలతోకాదు. ఆదరణతో సేవతో అంకిత భావంతో ఆమె మహాదేవుని మనోహారి కాగలిగింది. అదే అంకిత భావంతో సేవతో ఆదరంతో తాను ఈ మహా పురుషుని అర్థాంగి కావాలి.

ఈ ఆలోచన వచ్చాక ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఏమి స్థాయికి వచ్చినాయి. హృదయ స్పందనలోని తీవ్రతరవం తనెమ్మదించింది. గుండెదిటవు మరింత అయింది. ఆకాశంలో తారకల లాగున ఆశలు చివురించినాయి. ఊహాలేఉయ్యాల లయినాయి.

ఆమె ఆలోచనా వివశ అయివుండగానే అల్లంత దూరాన యిసుకతిన్నెలపై మెత్తమెత్తగా పాముకోళ్ళ కదలివొస్తు సవ్వడి అయింది. అమలిరుల శబ్దతరంగాలు కాలంకుటి నీటితుంపరలతో శీతలమయిన ప్రాతః సమీరాలపై తేలి వచ్చినాయి. కైకసి వర్ణపుటాలను తాకినాయి. అదలించినట్టుగా ఉలికిపడ చూచింది కైకసి.

ఆమె శరీరం వికసించిన వకుళమే అయింది.

"ఓయి మహాపురుషుడా! నీపాద రజస్సు సోకిన ఈనేల ఎంత పవిత్రమయినది. నీ కరగ్రహణం చేయగలిగిననాడు నా బ్రతుకు వింతవుమనతం కాగలదు" అని మనఃపటలం మీద అతని పాద చిహ్నాలను ముద్రించుకుంది ఆమె.

అతడు రేవతి నిదరియవచ్చిన సోమునిలా, కన్యారాసిలోకి ప్రవేశించే రవి బింబంలా అల్లనల్లన సాగివచ్చినాడు. మరింత చేరువ అయినాడు. సితవేదికలపై సోకుతున్న అతని పద ఘట్టనలు ఆమె హృదయస్పందనలను శాసిస్తున్నాయి.

ఆతని ఊర్పులు ఆమె శరీరాన్ని సోకలేదు కాని వివశను చేస్తున్నాయి. వొంగిమళ్ళీ నిటారుగా అవుతున్న ఆతని జానువుల అందం ఆమె ఆలోచనలను ఆరేస్తోంది. జానువుల ప్రక్కన రవంత నెమ్మదిగా కదలాడుతున్న హస్తాంగుళులు పాళిపల్లవాలతో భద్రంగా ఒదగిఉన్న తాళపత్రాలు.

అవి వేద నిధానాలు దండక మండలాలు. ఆతడు మరింతచేరువు అయి అల్లనల్లకమును బిలమును సాగిపోయినాడు. నీటిమడుగుని దాసిన మౌనిపులితోలు పరచినాడు. దానిపై తాకపత్రాలను దండకమండలాలను అర్చన సామగ్రిని అమర్చినాడు. వెళ్ళినీటిలో మూడు మునకలు వేసాడు.

అప్పటికి బ్రాహ్మీముహూర్తం ఆరంభమయింది. ఉష స్సంధ్యలో తూర్పున తొలి తెలిరేకలు విచ్చుకుంటున్నాయి. స్నానం ముగించి వచ్చి అతడు పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. కనులు అర మొగిచినాడు. కాలం నిలిచినట్లు అయింది.

ఆతని ప్రతి కదలికను అత్యంత నిరీక్షణాసక్తితో పరిశీలిస్తున్న కైకసి రెప్ప వేయటం ఆ పాంతం మరచిపోయింది. ఆ కాసింత సేపు అసురకాంత అనిమేష అయిపోయింది.

ఓహో ఆతడింత నిష్ఠాగరిష్ఠుడు. ఎంత పవిత్రమూర్తి ఎంత ప్రశాంతమయిన కదలికలు ఆపనిది అనుకొంటూ అబ్బురపడి పోయింది. ఎంతకాలం గడచిందో తెలియదు. అరుణ మందారంలో అమరిన రవి బింబం మంచుముద్దలా ఉన్న సూర్యుడు వజ్రపు పొడిముద్ద చేసినట్లు దుర్నిరీక్షమడయినాడు.

అలా అలా ప్రొద్దు అల్లంతపైకి ఎగసివచ్చింది అలాగే చూస్తు కూర్చుంది కైకసి పోయటప్పుడు మాసిన చీకటి. తొలి తెలరేకువిచ్చని కుతపకాలం. అందునించి తనను గమనించి ఉండకపోవచ్చు. ఈసారి ప్రొద్దు పై పైకి వచ్చిది.

ప్రపంచమంతా దృష్టి వలయంలో ముద్రాంకిత మవుతుంది. అటువంటి సమయాన ఆ మహా పురుషుడు తనను గమనించక పోవునా? అని భావించింది కైకసి.

విశ్రవసు తపసు చాలించి లేచాడు. తిరిగి తుని సారిసూర్యనమస్కరించి న్నిరం దండక మండలాలు ధరించాడు. పొడ అయిన నారచారలు నుదటి చంకన యిరికించుకున్నాడు. వానప్రస్థా జనంబుజం వాదికి వేసుకున్నాడు. పావుకోళ్ళు ధరించాడు. చూపులు నేలకు అంటించాడు. ముసుముందుకు సాగిపోవటం ప్రారంభించాడు.

అతని కనురెప్పల వంక ఉద్విగ్నంగా ఉత్సుకతతో చూస్తున్న కైకసి హతాశురాలు అయింది. అతని ప్రతి కదలికనూ కనురెప్పల కదలికను కూడ నిశితంగా పరిశీలిస్తోందామె. కనీసం ఒక్కసారి అయిన కనుకొలకులనినించి తన వంక చూపుని గుడిస్తాడని అత్యంతాసక్తితో ఎదురుచూచింది. కాని అలాంటిది జరుగకపోయేసరికి హతాశురాలు అయింది.

అతని నేత్రాలు అర్థనిమిలితాలయినాయి. ఆలోచనా ముద్రాంకితాలయినాయి. చూపులు నేలకువాలాయి. అతడు కైకసి ప్రేమనించి అల్లనల్లన సాగిపోయినాడు.

కాని చూపు మరల్చింది కాదు.

కైకసి విషణ్ణావిషాదమూర్తి అయిపోయింది. ఆమెనేత్రులు అశ్రుతప్తాలయినాయి. కన్నీరు చెంపల మీది కిజారి చారికలు కట్టినాయి.

అలాగే నేలమీదకి ఒరిగి పోయిందామె.

ఈ మహాపురుషుడు కన్నెత్తి అయినా తన వంకచూడలేదేమి ఈ కవితా సాఫల్యాన్ని తాను పొందగలదా? ఈ పురుషుని వల్ల తాను తల్లి అయే అవకాశానికి నోచుకోగలదా! ఇలా ఆలోచిస్తుంటే యూపులు లిప్తల్లా గడచిపోయినాయి.

ప్రొద్దు పశ్చిమానికి జారిపోయింది. ఆకలీ దాహమూ అన్నీ మరచి అలానే పడిపోయి ఉంది కైకసి. శరీరం మీదికి తెలివిరాలేదు. తాను అక్కడనించి కదలిపోకే అతడు తన స్పష్టి వలయమించి దాటిపోగలర్న భయం ఆమెను ఆవరించింది.

ఉషస్సంధ్యలో కలిగిన ఆశాపూర్ణమయిన ఆలోచనలన్నీ యిప్పుడు నిరర్థకాలయినట్లుగా అన్పించినాయి.

తిరిగి సాయంత్ర సంధ్య అయింది.

ముందుగా మునికాంతలు ఏటి తేటనీటి కోసం ఆ వంకకు వచ్చినారు. కాని వారెవరూ ఆమె గురించి అంతగా పట్టించుకొనలేదు. దండనలో యిటువంటి రాక్షసమయాలు వారికి అలవాటు. అందునించి వారు అలాంటి వికంటి కొనచూపులతో అయినాచూడరు.

వారంతా పోయాక పొద్దు పశ్చిమాద్రిని క్రుంగే సమయానికి తిరిగివచ్చి కాన్పపిత వేదికలలోకి మెత్తగా చొచ్చుకుపోతున్న అడుగుల సవ్వడి అతనిది. దానిని గుర్తించిందామె.

తిరిగి ఆశలు చిగురించినాయి.

ఈ మారు అయినా ఆ మహర్షి తనవంక చూడకపోడు అన్న ఆశలు చెలరేగినాయి. ఆశాపూర్ణంగా లేచి జానువుల మీద అంజలిఘటించి కూర్చొంది. ముని చంద్రుడు ఆమె ప్రక్కనించే పయనించాడు. కాని రెప్ప ఎత్తి అయినా చూడ లేదు. అలాసాగిపోయినాడు సెలయేటి వంక.

తిరిగి సంధ్యా వందనము తపస్సమాధీపూర్తిఅయింది. అందాకా నిండు కన్నులతో, నిండు మనసుతో, ప్రేమ నిండిన అంతర్యంతో ఆలానదా నిద్రల మీద అనిజలి ఘటించి కూర్చుందామె. తపస్వితపస్సు చాలించినాడు నేరుగా నదీ తీరం వెంట ఎటో వెళ్ళిపోయినాడు.

నిరాశోప హతురాలయిన కైకసి ఆతని అనుసరించాలకుంది. కాని అలా చేస్తే తపస్వితానుసించి శపిస్తాడేమోనని భయపడిందామె తన అదృష్టం పండే వరకూ అలా ఎదురుచూడటం తప్ప చేయగలిగింది ఏమీలేదని మనసుని దిటవు పరుచుకుంది.

ఆతని పవిత్ర చరణ పద్మాలు సోకినచోటు విడిచిపోయేందుకయితే మనసు రాలేదు ఆ దునించి అలానే ఉండిపోయింది. చాల ప్రొద్దు పోయిన తరువాత అడవి కొమ్మల మీదనించి దిగివచ్చిన నరవానరు డొకడు తన వెంట తెచ్చిన ఫలాలను ఆమె వంక విసిరి పోయాడు. అయినా ఆమెకి అవితినాలని అని పించలేదు.

ఎదురుగా జలజల పారుతున్న సెలయేరులోని తేటనీటిని అ ఎదల నిండా పట్టి గ్రుక్క తడుపుకొనాలని అనిపించలేదు. అలసట శరీరాన్ని బాధిస్తున్నా కంటిరెప్పల మీదికి నిద్రబరువు దిగలేదు.

అలా శిలాశకలంతా సర్వప్రాణి ధర్మాలకూ వశురురాలయి పోయిపడి ఉందామె. గతిమాలనదానిలా పడిఉంది. శరీరంలో యౌవనం తాలూకు శక్తి సంపన్నత ఉంది. మనసులో జాతి లక్షణమయిన కృతనిచ్చియమూ ధైర్యమూ ఉన్నాయి. కాని వాటన్నిటినీ మరచిపోయిందామె.

ఆ మహా పురుషుడు తనకు కైసేత అందించమన్నా అలాగే పడి ఉండిపోయి ప్రొద్దుప్రొద్దుకు రెండు మార్లుచూస్తే చాలదా అనుకుంది,

ఆతని దర్శనమే అద్భుతవరం.

ఆ తేజోమూర్తి ఎన్నటికయినా ఈ దాసురాల వంక కనురెప్ప ఎత్తిచూడ గలిగితే బ్రతుకు పున్నతమవుతుంది. తన ఆశయం ఆతని భర్తగా పొందాలని,

అతనివల్ల క్షేత్రవతి కావాలి అని. అది తండ్రి కిచ్చిన వాగ్దానం జాతిపట్ల తన కర్తవ్యం.

ఇదంతా ఒకనాడు. ఇపుడు ముగ్గులోకి దిగాక తాను వివశ అయిపోయింది. అతని పద రజస్సుసోకినా చాలనుకొంటోంది. అతని నిత్యం దర్శిస్తు బ్రతుకంతా ఆ యిసుకతిన్నెల మీద పరచాలనుకొంటోంది. ప్రాణి లక్షణాలయిన దాహము, ఆహారము ? స్త్రీ అనే వాటిని విసర్జించి అతని దర్శనంకోసమే ఎదురుచూస్తోంది.

కైకసికి ఆరేయి అంతా అలాగే గడచిపోయింది. దుఃఖంతో ముఖమంతా వాచిపోయింది. కన్నులనిండి కారిన అశ్రుకణాలు చెంపలమీద చారలుగా చారికలు కట్టినాయి.

ఇది విన్న వివశురాలు అయిందామె.

ఆరేయి అంతా ఎప్పుడు వేగుచుక్క మీ దర్శన మిస్తుందా అని ఎదురుచూడ సాగింది. చివరకు ఆ సుబమూహూర్తం ఆసన్నమయింది. ఆ దేప్పలు అలసటతో బరువెక్కినాయికాని వాలిపోలేదు. శరీరం అవిశ్రాంతక్షతివల్ల సోలిపోతున్నట్లు అయిందికాని తూలిపోలేదు.

అదిగో వేగుచుక్క పొడిచింది. తిరిగి ఆశలు పొటమరించినాయి. మనసాకారంలో అరుణకాంతి తోచింది. అంతర్లోకంలో ఆశల హరివిల్లులు మెరిసానాయి.

అదుగో అడుగులసవ్వడి! అదే సవ్వడి పవిత్ర పాదపద్మాలకు భారవహాలుగా ఉన్నపావుకోళ్ళపైనత వేదికలలోకి చొచ్చుకుపోతున్న చిరుమెత్తని అడుగుల సవ్వడి.

చివాలున లేచి జానువులపై అంజలి ఘటించి కూర్చుందామె. అతనివంక రెప్పవేయక చూచింది. రాగస్పృహలోభాలపట్ల నిర్దయుడయిన ఆ మౌనికమతఅయినా కనుమరల్పలేదు. అలాగే సాగిపోయినాడు. యథావిధిగా ప్రాతఃసంధార్యకర్త కాలస్వ కాలంగా ముగించి తపస్సమాధిలోకి వెళ్ళిపోయినాడు.

మధ్యాహ్నవేళకు తపసు చాలించిన మండలంలోని జలధారలతో గుక్క తడుపుకుని కాలువెళ్ళి పోయినాడు. జానువులపై అంజలి ఘటించి కూర్చున్న కైకసి కదలాడలేదు. రెప్పవేయలేదు. పెదవిప్పసూలేదు. స్థాణువులా అలా ఉడిగి పోయింది,

కొన్ని దినాలు అలా గడచినాయి. కైకసి శరీరాన్ని ఆశ్రయించిన మన సంపద యాపత్తూ నిరాహారంవల్ల నిద్రవల్లా, జలధారలను విసర్జించటంవల్ల త్వరగా

హరించుకుపోయింది. ఆమె సుఖదుఃఖాలకు ఆనంద విషాదాలకు అతీతమయిన స్థితికి వెళ్ళిపోయింది.

అలా జానువులపై అంజలి ఘటించి కూర్చోవటం. వారు తలలు వూపని మౌనంగా ధ్యానించటం ఒక్కటే ఆమె జీవితమయింది. ప్రతి ప్రొద్దూ మౌనివస్తూనే ఉన్నాడు. తపస్సు చేస్తున్నాడు. తిరిగి వెళ్ళిపోయినాడు. సూర్యుడు తన విధిని నిర్వహించినత నియమంతో అతడలా తన విధిని నిర్వహిస్తున్నాడు.

ఒక ప్రాణి తనకంటి కొనచూపులకోసం ప్రాణులనుక్షీణంగాపెట్టి అలా నిరీక్షిస్తోందని అతడికి తెలుసో. తెలియదోకాని ఎన్నడు కళ్ళెత్తి అయినా చూడలేదు.

అప్పటికి కొన్నిదినాలు గడిచాయి. ఆ తరువాతకూడ అలాగే నిద్రాహారాలు దేహకాంతిలేకుండా మరికొన్ని దుర్దినాలు కైకసి పరంకా గడిచి వేళ్ళిపోనాడు. ఆమె మాత్రం పానుపులమీద ఘటించిన అంజలి రవంతఅయినా సడలిలచలేదు.

ఆపై మరికొన్ని దుర్దినాలు నడిచాక కైకసి శరీరశక్తులన్ని వర్ణమయినాయి. అహంకారం క్రమ్మిన ఆశల సందోహం జఠరాగ్ని చెలరేగగా దానిలోపడి దహించుకుపోయింది. ఉత్తశల్యావశిష్టమయిన శరీరంమాత్రం విభమ మిగిలిందామెకు

అయినా జానువులమీద అంకలి సడలించలేదు. అలాగే కూర్చొని కాలాన్ని ఎదిరిస్తోంది. అతని కడగంటి చూపులకై అర్థిస్తూ దివా రాత్రులు గడపివేస్తోంది.

కడకు ఆమెకు కూర్చునే శక్తికూడ మృగ్యమయింది. ప్రాతస్స మీరాలు రవంత విపరులుగావిస్తే ఊగిసలాడసాగింది. గట్టికాలుల రెపరెపలకు తూలిపోతోంది. కాని అలాగే కూర్చుంది.

ఒక మధ్యాహ్నం తపస్సమాధి చాలించి తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు విశ్రవస్సు గాలివిసురుగా వీస్తోంది. అతడు అలవాటయిన విద్యాలయాలు తన పేటిత లలోకి అభ్యచూస్తు నడుస్తున్నాడు. అప్పటికి కైకసి జానువులనీద అంజలి ఘటించి కూర్చుని ఉంది కాని శరీరంమీద స్పృహలేదు.

అతడు ఉసరయ రాగానే విసురుగాలికి రాలిపడుతున్న ఎండుటాకులా అతని పాదాలమీద వాలిపోయిందామె. ఆమె చెంపలు అతని పాముకోళ్ళను బందెడినాయి. ఆమె నాశికాగ్రం అతని పాదాలను ష్టాన్ని కౌగలించుకుంది, అళురగణాలు అతని చరణ సరోజాలకు అతుక్కుపోయినాయి కొళ్ళపారాలు విసుదు గాలికి నేచి పాదాల చుట్టూ అతుకున్నాయి. ఇవి పెట్టిన అంజలి అతని జానువులను తాకి అలా దారి పడిపోయింది.

కరుణాసింధువు అయిన మౌని అలా నిలిచిపోయినాడు. అర్ధ నిమీలిత మయిన ధ్యానబద్రను చాలించి అల్లన రెప్పలు విప్పార్చి ఆదీనురాలి వంకచూచి నాడు. "ఎవరీ అభాగ్య" అని చింతాసముద్రుడు అయి అల్లనరెప్పలు అరమొగిచి అంర్లోకాలను సందర్శించినాడు.

చిరుదరహాసంతో కనులు విప్పాడు.

తన కమండలులో ఉన్నతపోజలాన్ని ఆమె ముఖం మీద బలికించాడు. రవంత దాహం ఆమె పెదవులకు అందించాడు. ఆమె దగ్గర కూర్చొని సపర్యలు చేశాడు. తుదకామె కనులు విప్పింది.

ఎదురుగా ఆరాధించిన మహాపురుషుడు తనకు ఉపచర్యలు చేస్తూ కన్పించి నాడు. ఆమె పరిభ్రమణమూ, ఆశ్చర్యమూ, విజృంభణ ముప్పదిగొనరెప్పలు టప టపలాడించింది. అతని పాదాలకు నుదురు తాకించింది. పాదాల ధూళి శిరస్సున ధరించి కాలు కూర్చుంది.

"మహాపురుషుడా! జరిగినదేమిటని వరుణ సముద్రుడవయిన నీవు నాకు సపర్యలు చేశావా? ఎంత అపరాధం చేశాను. ఈనాడు నీ పాదపద్మాల ధూళిసోకి నా బ్రతుకు పావనమయింది, దీనురాలని దయతలచినావా? నీ పదసేవలో నా బ్రతుకుని పండించుకునే మహాభాగ్యం నాకు ప్రసిద్ధించినావా?" అని అడిగింది కైకసి. ఆమె కంఠస్వరం హీనంగా ఉంది. కనులు ఆర్ద్రంగా ఉన్నాయి.

తీవ్రవర్షాఘాతం తాకిచినించి తాదుకొంటున్న ప్రకృతిలా ఆమె ముఖం ఆనందాన్ని సంతరించుకొనసాగింది. మౌని ఆమె ముఖ ముద్రను చాల గంభీర మయిన శైలిలో పరిశీలించాడు ఆమె మనోతాలను చదివాడు. చిరుదరహాసం చిలచించాడు.

"యావ్వనీ! నాకీ దుర్దశ ఏమిటి? చూస్తే అసురకాంతలాగున్నావు మీకు శారీరకమన సుఖభోగాలపై ఆసక్తి అధికంగాఉంటుందని నేను విన్నాను. కాని నీవు అలాంటివి విసర్జించి యిలా శల్యావశిష్టపు అయినావు. శిలాశకలంలా చైతన్య స్ఫూర్తినించి కొరనడినావు. ఇదంతా జరిగింటంటే అందుకు తాను శ్రీకరమయి నాకు సందేహమేదో ఉన్నదనే నాకు అన్పిస్తోంది. చెప్పు నీవు ఎవరు? ఎకశ్రీద నించి ఈ ప్రాంతాలకు వచ్చావు? ఎందుకు వచ్చావు?" అని సంకుచితమయిన మధురమందస్వరాన ప్రశ్నల వర్షం కురిపించినాడు విశ్రవసు.

ఆ మౌని మౌన ధ్యానం వీడి తనలు పలతరించగానే హర్షాతిదేవంతో వికశిత వకుళంలా పులకించిది కైకసి.

అతని పాదాలను హస్తపల్లవాలతో మరొక్కమారు స్పృశించింది ఆమె. హీనమయిన కంఠస్వరాన తన స్థితిని వేదించు మరిది.

ఓయి కులపతీ! ఈ నిర్జనారణ్యంలో నా దుస్థితి నించి నన్ను కాపాడిన నాధుడవు నీవు. నేను అసరగణాల ఆడపడుచును. నన్ను ఆసహించుకోకయ్యా! నీవు మహిమాన్వితుడయిన తపస్విని. నీ ప్రశాంత జీవనమూ, క్రమం తప్పని కార్యమగ్నతా నన్ను ఆకర్షించినాయి. తేజోరూపుడవయిన నీవంటి వాని నీడలో ప్రశాంతమయిన జీవనం కొనసాగించాలని అభిలషించాను నేను.

కొన్ని దినాలుగా నీ మార్గం వెంట కైమోడ్చి నిలచాను కాని నీ పవిత్ర నేత్రాలు నావంక చూడయినాలేదు. పీ కలదోయినించి జాలువారే కటాక్షవీక్షణలు నాకు దక్కనయినాలేదయ్యా!

తపస్వీ! నీవు నన్ను స్పృశించిన ఈ క్షణాన కాలం నిలిచిపోయినట్లే అనిసించిందినాకు. అవునయ్యా! ఎన్ని యుగాలుగానో ఎన్ని జన్మలుగానో నీ కోసమే నేను వేచివున్నాననిపించింది. నీ పాద రజన్సు అనుని తనకూ శిరస్సున ధరించే అదృష్టాన్నించి నన్ను దూరం చేయకు. నీ సేవతో నా జన్మ తరించిపోనివ్వు. ముని వాటికలో ముని కన్యగా నాకు ఆశ్రయమివ్వు. నీవు నియమించిన దారివెంట ఈ బ్రతుకంతా పయనిస్తాను" అన్నదామె నిరాహారమూ నిర్నిద్రల వల్ల రానురాను కంఠ స్వరం మరింత హీనాతి హీనమయి పోయింది. అతని ఆజ్ఞకోసం నిలువెల్లా ఆశామూర్తి అయిపోయి ఎదురు చూడసాగిందామె.

మౌని ఆమె మాటలు విని రవంత కనులు అరమెరిచి ఆలోచించినాడు. అతని మనో పటలంమీద రాక్షసీయమయిన ఆచార వ్యవహారాలు, అలవాట్లు ఆలోచనలు అన్న ప్రత్యక్షమయినాయి అందుకతడు అబ్బురపడి పోయినాడు.

వారి మనోగతాలకు ఈమె మాటలు విభిన్నంగా ఉన్నాయి. దండకాటనిలో యిటువంటి రాక్షస మాయలు అనేకం జరుగుతుంటాయి, కాని ఈమె అలాంటిదిలా లేదు. కొన్ని దినాలుగా నిరాహారంగా నిర్నిద్రంగా తన కంటిచూపులకోసం ఎదురు చూడటం తా నెరుగును. అందునుంచి ఆమె చెప్పేమాటలు అసత్యవాదన మనిపించ లేదు. యథార్థమనిపించాయి.

కాని ముని కాంతలు భావశబలలు, సుకుమారలు అయివుంటారు. వారిమధ్య ఈమె ఎలా మసలుకొగలదో! రక్షోగణాలకు అతి సహజమయిన తామసప్రవృత్తిని చూపటం ప్రారంభిస్తే ముని కాంతలు తట్టుకోలేరు. భయపడిపోతారు. అందువల్ల తపోనిష్ఠకు భగ్నమవుతుండి కూడ. అటువంటి దుస్థితిని కోరి ఎందుకు వరించాలి?

అలాగని నిర్లక్ష్యంచేసి తనదారిన తాను వెళ్ళిపోతే ఈమె ఏమవుతుంతో! ఇలాగే నిరీక్షణలో నిద్రాహారాలు వదలిపెట్టి విగతజీని అయిపోతే అందుకు బాధ్యత తనదే అవుతుంది.

విశ్వశ్రేయో మార్గాన్ని ఆశించి అన్వేషించే తపో మార్గంలో పయనించే వాడుతాను. ఆమెను నిర్లక్ష్యం చేయబడిన నిర్దోషి అయితే తన వ్రతము భగ్నమవుతుంది.

ఆ సురగణాలు మనసు మార్చుకోవాలని తపోధనులు ఆశిస్తారు. కాని వుర జించాలని కాదు. ఒకవేళ అటువంటి శిక్షకు అర్హులయిన వారుంటే అందుకు వెను కాడరు మౌనులు. కాని ఈమె అంతట ఉద్దండురాలుకాదు. అమాయకురాలు.

మునిమీద ఆకర్షణ పెంచుకున్న కన్య! అందునించి ఆశ్రయ మిచ్చేందుకే కృతనిశ్చయుడయినాడు విశ్రవసు. "భాగ్యరాలినీ ! మెచ్చాను. నీవు నా మనసుకు ఒప్పించినావు. కాని కఠినతరమయిన ఆశ్రమ నియమాలను నీవు అలవరచుకోవాలి. నీ అతీక్షణమయిన తమో వృత్తిని విడనాడి సాత్త్వికు రాలవు కావాలి. అలా చేయగలిగితే నీ అభ్యర్థన నెరవేరుతుంది.

ఈ ప్రకృతి అంతా అందరి సొత్తు. ఎవరయినా ఎక్కడయినా ఉండవచ్చు. అటవికాలయిన సంపదలను సమంగా పంచుకోవచ్చు. కాని మన వల్ల మరొకరికి వ్యథ కలుగరాదు. అది ఒక్కటే నీవు పాటించవలసిన సామాజిక నియమం. దుఃఖ హేతువులయిన కామనాలన్నింటికీ నీవు దూరంగా ఉండగలవా !

యమ నియమాలను అలవరుచుకోగలవా! నీవల్ల మరొకరికీ అపకారం జరగక పోవటం మొదటి దశ. ఉపకారం జరిగేలాగ చూసుకోవటం రెండవదశ. ఈ రెండు దశలను నీవు సాధించగలనని వాగ్దానం చెయ్యి. అప్పుడు ముని వాటికలో నివశించేందుకు నాకు అర్హతలభిస్తుంది. ఆటు వెనుక మునికాంతలతో పాటుగా త్యాగమయమయిన జీవితం గడిపేందుకు అడ్డుచెప్పే అవకాశంనాకు కాదు. మరెవరికీలేదు" అంటూ ఆమెను హెచ్చరించినాడు విశ్రవసు. రక్షోగణాలు ఏవో ఘాయలు పన్నుతుంటారు.

తెలిసితెలిసి మునులు వాటిలో తగుల్కొంటారు. ఎంత విచిత్రం ప్రకృతిలో మాయను దర్శించి దాన్ని జయించ గలిగినవారు మౌనులు. కేవలం రాక్షస మాయలో చిక్కుతారు.

దానికి కారణం కరుణదృష్టి భూతదయ, తాత్త్వికమయిన ఆలోచనలచే బలత్వమది. సర్వప్రాణుల మీద నిలిచే సమదృష్టి అవి కారణాలుగా వారు చిక్కుడి పోతారు.

విశ్రవసు ఆమెకు ఆశ్రమ జీవనం ప్రసాదించినాడు. హర్షపుల కాలంముకు రాలు మొలకెత్తగా నమోవాకాలు చెల్లించుకుంది కైకసి.

"మహా పురుషుడా! నీవు స్పృశించిన పవిత్ర క్షణాన్నే నాకు ఆశ్రమ వాసానికి కావలసిన అర్హతలన్నీ సంప్రాప్తమయినాయి. అయినా నీ పవిత్ర పాదాల సాక్షిగా ప్రమాణం చేస్తున్నాడు. నీ పవిత్ర పాదసేవ తప్పనాకు మరొక ప్రవృత్తి అక్కరలేదు. కన్నులున్నందుకు నిన్ను చూస్తాను. మనసు ఉన్నందుకు నీ గురించి ఆలోచిస్తాడు. కరచరణాలున్నందుకు నా పాదసేవ చేసుకుంటాను.

మహా పురుషుడా! నా తనువు ఉన్నందుకు అది కూడా కుసుమంగా నీ పాదాల చెంత అర్పించుకుంటాను.

"అంతకు మించి మరెన్నడు దేనినీ నేను కోరను" అన్నదామె.

"మదవతీ! యిది ప్రలోభం కాదు! ప్రేరణ! విధి ప్రేరణ! యిప్పుడు నీకు భీషణుడైనా రావణ కుమారుడు జన్మించాడు! ఇంతటితో జరుగవలసినదంతా పూర్తి అయ్యిందని అనుకోవద్దు! నీ గర్భవాసాన మరొకబిడ్డ కలిగేలా అనుగ్రహిస్తాను!" అన్నాడు మహర్షి!

అతని కోరికను కాదనలేక పోయింది!

ప్రకృతి యిచ్చిన పిలుపుకు వారు ప్రతిస్పందించారు !!

శరీరాలను సమంగా పంచుకొన్నారు!

ఋతుచక్రాలు దొర్లిపోతున్నాయి!

క్రమంగా ఆమెకు కుంభకర్ణుడు, శూర్పణఖ జన్మించారు. ఆ పైన బ్రహ్మ తేజస్సుతో తండ్రి లక్షణాలను పునికి పుచ్చుకొని సౌమ్య, సౌజన్య మూర్తి అయిన విభీషణుడు పుట్టాడు!

బాల రావణుడు బహు గడుసువాడైనాడు!

అతని అగడాలకు కుంభకర్ణుడు, శూర్పణఖ తోడైనారు!

విభీషణుడు ఒక్కడే తండ్రితో కలిసి తిరిగేవాడు!

ఆయిదు సంవత్సరాలు రాగానే యథావిధిగా ఉపనయనం చేయించాడు విశ్రవసు.

అధ్యయనం మొదలైంది.

మంత్ర శాస్త్రాలు వల్లించేవాడు!

విశ్రవసు మరొక భార్య పేరు హాళవిళ!

ఆమె యక్షకామిని! ఆమె కుమారుడు కుబేరుడు. అతని నివాసం లంకా నగరం. ఒకనాడు తండ్రిని, తల్లులను చూడ వచ్చాడు. కుబేరుడు సంపద లన్నింటికీ అధినేత పుంగణాలకు సైతం అసూయ కలిగించే సంపదలన్నింటికీ అతడే అధినేత. ప్రపంచంలోని ఎన్నో అద్భుత వస్తువులను అతడు సేకరించాడు!

అతడు కళాశీలి!

రావటమే పుష్పక విమానంలో ఎక్కి వచ్చాడు!

విశ్రవసు ఆశ్రమంలో దిగింది పుష్పకం. ఎంతో అద్భుతమైన వ్యోమగామి అది!

దానిని చూచి తల్లులందరూ ముచ్చట పడి పోయారు!

హాళవిళ బిడ్డను ఎంతగానో పొగిడింది!

"నాయనా, కుబేరా; యక్ష గణాలన్నీ నీ పాలనలో సుఖంగా వున్నాయి కదా?! నీ సకల సంపదల సుస్థిరమై వున్నాయి కదా?! తండ్రీ! బ్రహ్మావర్తము, హిమావర్తము, ఆర్యావర్తము, వింధ్యకు దక్షిణ తీరము లోకాలన్నీ నిన్ను ప్రశంసిస్తున్నాయట! పదునాలుగు లోకాల్లో నీ అంతటి సంపన్నుడు లేనే లేడని చెప్పుకొంటున్నారట! అంటూ తన సంతుష్టిని అంతు తనయుని మీద వర్షింపచేసింది తల్లి.

తల్లి పాదాలను తాకి, శ్రేయస్సు ప్రశ్నించాడు కుబేరుడు.

ఆమెకు యిలా బదులు చెప్పాడు!

"తల్లీ! నీ పాదాలను తాకిన పుణ్య ఫలమే కదా యిదంతా! యక్షులంతా కుశలమే! లంకా నగరంలో అపూర్వమైన కోటలున్నాయి! అభేద్యమైన చోటున సముద్ర మధ్యంలో మాయమేయంగా నిర్మించిన మహానగరం తల్లీ! అది! అక్కడ

వున్నంతకాలం యక్షులు అజేయులు. అక్కడ లేని అందచంగాలు అమరావతిలో అయినా వుండవు తల్లీ !

వున్నంతకాలం యక్షులు అజేయులు. అక్కడ లేని అందచందాలు అమరావతిలో అయినా వుండవు తల్లీ !

యిదిగో యీ పుష్పక విమానం వుంది నాకు !

దీనిమీద ఎందరు అధిరోహించిన మరొక్కరికి చోటు మిగిలిపోయి వుంటుంది సాంకేతిగా అద్భుతమైన యీ పుష్పకం సాధించాను నేను. యిది నా దగ్గర వున్నంతకాలం నా ఐశ్వర్యగర్వాన్ని కన్నెత్తి చూడగలవారు లేరు.

అమ్మా ! అన్నీ నీవు యిక్కడ వుంది, అడిగి తెలుసుకోవాలా ! నా వెంట లంకా నగరానికి వచ్చి, ఆ ముచ్చట తీర్చరాదా !" అని అడిగాడు కుబేరుడు ప్రేమగా.

తల్లి ఎంతో వాత్సల్యంతో అతని వంక చూచింది. !

ప్రేమ పొంగారగా బిడ్డ శిరస్సునముద్దాడింది !

చుబుకాన్ని పుణికి అంది "నాయనా కుబేరా ! నీవు అన్నది చాలు ! రమ్మని అన్నదే పదివేలు ! యీ కడుపున కాచిన బిడ్డ ఉద్ధతుడై మూడు లోకాలుకు మొనగాడైనాడని అన్నది వినటమే చాలు ! నీ తండ్రి అసాధారణ తపస్వి !

వారు మౌనులలో పెలలేని, తులలేని తేజోమయులు !

వారిని విడిచిన క్షణం, అది నా మృత్యువు నిరీక్షణం !" అన్న దామె !

యీ మాటలు విన్న కైకసి తల్లిగా తాను ఆశించవలసిందేమిటో అర్థం చేసుకొంది !

"కడుపున పుట్టిన బిడ్డ ఉద్ధతుడై మూడు లోకాలలో మొనగాడైనాడని అన్నది వినటమే చాలు నాకు అన్నది కదా హాళవిళ" ఆ మాటలు విన్న తరువాత కైకసి అంతర్లోకాలు అల్లకల్లోలితంగా అయినాయి !

ఆలోచనలు సుడిపెట్టి చెలరేగినాయి !

సవితి బిడ్డ ఎంత గొప్పవాడైనాడు !

మూడు లోకాలకే ఉద్ధతుడైనాడా ?! అపురూప వస్తువులతో లంకా నగరాన్ని నింపేసాడా?! పుష్పకాన్ని ఎక్కి విహారించేందుకు అతడు చేసిన పుణ్యమేమి ?!

తన నగర మంతటి మహత్తరమైన నగరం ఎక్కడా లేదనిపించాడు కీర్తి మంతుడు అయినాడు !

నా బిడ్డ దశగ్రీవుడు అంతటివాడు ఎప్పుడు కాగలడో ?! అని ఆశా పూర్ణంగా ఆలోచించ సాగిందామె !

కుబేరుడు తండ్రి పాదాలకు మ్రొక్కి వెళ్ళిపోయెందుకు వీరి అనుమతిని అర్థించాడు ?

విశ్రవసు కుబేరుని ఆశీర్వదించాడు !

"నాయనా ; నీవు సంపన్నుడవు ! మహనీయుడవు అయినావు ! మంచి వాడవు అయినావు ! శీల సంపద కలిగిన వారికి సిరి సంపదలు ! వర్ధిల్లుతాయి ! సంపదలు సాధించటం గొప్ప కాదు! వాటిని నిలుపుకొనేందుకు అర్హుడవు కావటమే గొప్ప !" అని అన్నాడాయన !

"నాన్నగారు ! మీరు యిలా ఎందుకు అంటున్నారు ?!" అని ప్రశించాడు కుబేరుడు !

విశ్రవసు మందస్మితం చేసాడు !

వ్రేలెత్తి పుష్పక విమానం వంకకు చూపించాడు !

కుబేరుడు ఆ వంకకు మరల చూచాడు !

దానిమీద అధివసించి కూర్చొన్నాడు దశకంఠుడు !

అతని ప్రక్కనే ఆశీనుడైనాడు కుంభకర్ణుడు !

వారికి అభిముఖంగా ఆ పుష్పకం తమ సొంతయే అయినట్లు ఆశీనురాలై కూర్చొని వుంది శూర్పణఖ !

కొన్ని ప్రాణులకు ఆహారం దొరికితే చాలు. కొన్ని ప్రాణులకు మరికొన్ని పక్షులు కావాలి. కొన్ని ప్రాణులకు దండకమండలాలు తృప్తి నిస్తే మరికొన్ని ప్రాణులకు దండనాధిపత్యం కావాల్సివస్తుంది. కామినీలన్నీ ప్రకృతి సృష్టించే మాయలు. వాటికి ఎంతదూరం కాగలిగితే మానవుడు యథార్థానికి అంత దగ్గర కాగలుగుతాడు. అదే జ్ఞానసంపద !

తమోగుణ సంపన్నులయిన రక్షోగణాలలో పుట్టి పెరిగిన ఈ వనిత సాధు జీవనాన్ని ఆకాంక్షిస్తున్నానని అర్థించింది. ఇతః పూర్వం ఎందరు రాక్షసులు బ్రహ్మ వరాలను పొందలేదు. తిరిగి తామసులు కాలేదు. అయినా పరాలివ్వక

బ్రహ్మ అయినా తప్పించుకొనలేడు. నియమం కలిగిన వానికి ఫలితం అనివార్యంగా దక్కుతుంది. ఈమె ఆశించిన శాంతి జీవనాన్ని పొందేందుకు నిద్రాహారాలను మాని జీర్ణ శరీర అయింది.

అందునుంచి ఆమెకు ఆశయసిద్ధి కలిగించటం నా కర్తవ్యమని భావించాను. మీ సోదరిగా భావించండి. జాగ్రత్తగా ప్రవర్తించండి" అని హెచ్చరించి వెళ్ళిపోయినాడు విశ్రవసు.

ఆమె జీర్ణ శరీర అయి వుండటాన్ని గమనించిన వారికి కొంత నమ్మిక కలిగింది. మరికొంత సంశయం మిగిలిపోయింది. అనుమానాస్పదమయిన చూపులతో వారు కదలలేదు, మెదలలేదు. "మీ అందరికీ నా నమోవాలు. మహర్షి పాదాలచెంత సాధుజీవనం అర్థించి నేను వచ్చాను. అది నాకు సంప్రాప్తమయింది. కులపతి కృపాకటాక్షం తప్ప నాకు ఎటువంటి కామినీలు లేవు. నేను అసురగణాలయింట అదపడుచును. నాగలోకం నించి వొచ్చాను. నా తండ్రి పేరు సుమాలి. నా పేరు కైకసి. దయతో నన్ను స్వీకరించండి" అంటూ అర్థించింది ఆమె.

మునికాంతలంతా ఒకరి ముఖాలు ఒకరి చూచుకున్నారు. వారి మనోగతాలు ఎలావున్నా అది కులపతి ఆదేశం కావటంనించి అందరూ ఖొదల దాల్చినారు,

# 3

దండకావనిలో శ్లేష్ఠ ప్రశాంత సుందరమూ సుప్రసిద్ధమూ అయిన మునివాటికలలో పేరుపడ్డది విశ్రవసు ఆశ్రమం. ఆశ్రమానికి కులపతి అయిన ఆ మహనీయుడు సాక్షాత్తు బ్రహ్మ కుమారుడు అతని వద్దకు ఎందరో సుప్రసిద్ధులయిన మునులు వచ్చిపోతుంటారు. అతని తపస్సాధన అమోఘమయినది. నిరాఘాటమయినది.

కులపతి బహుకాలంగా అక్కడే ఉంటూ వచ్చాడు. అతడు అమితమయిన తపోబల సంపన్నుడు కావటంనించి రక్షోగణాల వారెవరూ ఆ వంకకు తేరిచూడనయినా లేదు. శత్రువు ప్రబలుడు. అతనిని నిరోధించేందుకు ఎవరయినా సంసిద్ధులయి వుంటారు. కాని విధిశాన కొందరు శత్రువులు అనుకూలురవుతారు. అనుకూల శత్రుత్వ మనేది ఎంత చిత్రమయినదో అంత ప్రమాదకరమయినది. అటువంటి స్థితి యిప్పుడా ఆశ్రమానికి సంప్రాప్తమయింది.

కైకసి నిజంగానే విశ్రవసుని ప్రేమించింది. తాను క్షేత్రపతి అయితే అంతటి తపోసంపన్నుడు, తేజశ్శాలి అయిన వ్యక్తివల్లనే కావాలని కలలుకంది. తన ఊహలూ తండ్రి ప్రబోధమూ ఒకటే అయినాయి. అతి ప్రయత్నంమీద ఆమె ఆశ్రమవాశాన్ని చేరుకుంది. కులపతి కృపను సంపాదించుకుంది.

కాని క్షేత్రపతి అయాక పుట్టే సంకీర్ణ మహాపురుషుడు అసుర పక్షపాతి అయి తన తండ్రికి జరిగిన అవమానానికి ప్రతీకారం చేయాలన్నది ఆమె అభిలాష. అంత ర్గతమయిన ఈ కోరికను ఆమె ఎన్నడూ ఎవరి దగ్గరా బయట పెట్టలేదు.

విశ్రవసు మీద తనకున్న ప్రేమానురాగాలను మాత్రమే ప్రదర్శించి ఊరు కుంది దాంతో ఆశ్రమవాసుల మధ్య ఆమెకు మంచి స్థానం దొరికింది. భవిష్యతులో జరుగనున్న పరిణామం ఎవరూ ఊహించరానిది. అలా ఆమె మునివాటికకు అను కూల శత్రువు. విశ్రవసు యితఃపూర్వమే వివాహితుడు.

మునికాంత అయిన దేవవర్ణి, యక్షకన్య అయిన హాలచిళ, మాలిని అతని అర్ధాంగులు. వారివల్ల అతడు సంతానవంతుడు కూడ అయినాడు. వారు పెద్దవారై తమ శక్తిసంపన్న నిరూపించుమని తలకొక దిక్కు పోయినారు. మునికాంతలయిన అతని అర్ధాంగులు పుత్రులతో కలిసి వెళ్ళిపోలేదు. అతని చెంతనే ఆశ్రయముం టున్నారు. గంగాతీరంలో సుప్రసిద్ధుడయిన ముని భరద్వాజుడు. ఆ వనితకు తావ అయిన దేవవర్ణి ప్రథమ భార్య.

ఆమెకు అగ్నిశిఖలాంటి బిడ్డ పుట్టాడు. తండ్రిపేరు కలిసివచ్చేలా అతనికి వైశ్రవసుడు అని నామకరణం చేసింది తల్లి అంత కీకారణ్యాలలో ఎక్కడో ఘోరమయిన తపస్సు చేసుకుంటున్నాడు. తండ్రివలెనే ఇహలోక వాసనలను వొదిలిపెట్టాడు.

రెండవ అర్ధాంగి అయిన హాలచిళ యక్షకాంత. అందాలరాసి. ఆమెకు అమిత శక్తిసంపన్నుడు, ధనాధ్యక్షుడు అయిన కుబేరుడు జన్మించాడు. తల్లి ఆశీస్సులతో మహాదేవుని కటాక్ష వీక్షణాలతో అతడు అనేకులమీద యుద్ధాలు చేసి జయించాడు, ఇప్పుడు దక్షిణపుకొన అయిన లంకాపురాన్ని నిర్మించి తన పాలనం కొనసాగిస్తు న్నాడు. అతడు జయించిన ప్రభువులు యిచ్చిన అశేష సంపదలతో లంకానగరిని పరిఖామయం కావించి వైభవోపేతుడయి తులతూగుతున్నాడు. అది సముద్ర మధ్యంలో శత్రువులకు అజేయమై నిలబడింది. ఎవ్వరూ చొరరానిది. దాని వైభవాన్ని వర్ణిం

చేందుకు ఆదిశేషువు దిగి రావాలి. అక్కడ ఆకాశాన్నంటే హార్మ్యాలున్నాయి. ముల్లోకాలమీది యుద్ధాలలో ఆరితేరిన ప్రముఖ యోధులెందరో ఉన్నారు. యక్షులా నగరిలో ఆవాసముంటున్నారు.

ఆది కర్తవ్యంగా భావించి వచ్చినా మౌనిపట్ల, అతని తేజోమయమయిన జీవితం పట్ల ఆకర్షితురాలయింది. కొంతకాలం స్వాతిక జీవనం సాగించాక అతని నియమబద్ధమయిన జీవితంలోని మహనీయత ఏమిటో బాగా బోధపడింది.

ఇప్పుడు కర్తవ్యాల సంగతి అలా ఉంచి తండ్రి తిరిగి రమ్మని కోరినా వెళ్ళలేదు తాను. ఈ తేజోమయమయిన ఆశ్రమ జీవితంలో అంత తృప్తి లభించింది తనకు. ఈ జీవితం తనతోటి ఆసాంతమయిందాకా తనది కావాలి.

అంటే మౌని యిస్తానన్న వరాన్ని స్వీకరించాలి. అయినా వెంటనే తన మనోగతాన్ని వివరించలేకపోయిందామె.

"మహాపురుషుడా! నీ నీడలో చేరిపోయాక నియమితమయిన బ్రతుకు విలువ ఏమిటో అవగతమయింది. ఇంక యిప్పుడు నేనేమి కోరగలను. ఈ ఆశ్రమానికి వచ్చాక ఆశించినదానికి అధికంగానే పొందగలిగాను. ఇలాగే ఈ బ్రతుకు కడదాక మీ నీడలో బ్రతకనివ్వండి చాలు" అన్నదామె.

ఈ సమాధానంతో మౌని మరింతగా సందిట్టుడయినాడు. ఆమె పట్ల అతని దయాబుద్ధి మరింత అయింది.

"అలా కాదు సుందరీ! ఈ ఆశ్రమ జీవితంలో నీవు యిమిడి పోయావు ఆశ్రమవాస ధర్మాలేమిటో తెలియదా! ఈ ప్రకృతి ఏ ఒక్కరి సొత్తుకాదు. అర్హత కలిగినవారు ఎవరయినా ఆశ్రమంలో ఉండేందుకు ఎవరూ అడ్డు చెప్పరాదు. విశ్రవసు నయిన నేను ఈ ఆశ్రమానికి కులపతిని. అర్హత ఉన్నంతకాలం నిన్ను కాదనలేను. ఇది నీకు స్థిరపనమే! ఆ పైన నీ పట్ల ఆహ్యాజమయిన సదాకాంక్షతో నేను వరమివ్వదలచాను. కోరుకో!" అంటూ తన అనుగ్రహాన్ని ప్రదర్శించాడు యోగి.

కైకేసి మనః కేదారంలో మలయసమీరాలు సోకినట్లుగా అయినాయి. అతడు విద్యా వాచస్పతి. అమోఘవచస్వి. అపూర్వ వర్చస్సు అంకటి మహనీయుడు తనంతతానుగా మెచ్చి వరప్రదానం చేస్తాననగానే ఆమె అంతర్యం ఆనంద అర్ణవ న్నుయంది.

సంతోషణతరంగిణి అయింది. మనోమయంలోకం ఉప్పొంగిన కెరటాలతో నిండిన జలసింధువు అయింది.

"అమోఘవచస్వీ! నీవు నా ఆత్మను జాగృతం చేశావు. అంతర్యంలో భిక్ష వేసినావు. మనఃపటలంమీద ముద్ర చెరగకుండా చేసావు, ఆత్మ ఐన అంతరంగమైనా మనసైనా నశ్వరమైన ఈ తనువు పైనా అన్నీ నీకు అంకితమైనవి, అంతర్లోకాలు నీ స్పర్శతో ఏనాడో పులకించినవి. నాకు మిగిలి ఉన్నదీ ఇక ఈ తనువుకూడ నీది కావాలి అని కదా!

అర్థమయింది యిహి పురుషుడా! నీవు నావాడవుకావాలి. నేను నీ సామర్థ్యాన్ని కావాలి. అదే నా బ్రతుకు పరమార్థం. అదే నా జీవితానికి విహితమయిన అపూర్వ సంపద!

అదే నేను కోరుకొనే వరం!

నీనించి నేను క్షేత్రవతిని కావాలి" అన్నదామె వివరంగా, ఆమెక్కమాటలు అమోఘ వచస్వి అయిన మహర్షిపట్ల వాస్తవానికి విద్యుదాఘతాన వడటివే కావలసింది. కాని శూన్యాకాశంలో మెరిసే తటిల్లతలు రవి బింబాన్ని సోకలేవు. రవి కిరణాల బిందు నిర్వీర్యమవుతాయి. అందువిటచి మహర్షికలగుండుపడలేదు.

అలలు నిలిచిపోయిన సముద్రుడులాగున అతడు రవంతసేపు రెప్పలు అరమొగిచి నిశ్శబ్దడయినాడు. అంభారుడయినాడు. అతని మనఃప్రపంచ పుటావర్తాలలో చెలరేగుతున్న సంకులమేమిటో తెలియని కైకసి కల వరవడిపోయింది. రెప్పలు విప్పారమౌని ఏమి చెప్తాడోనని కలగుండె పడింది.

అప్పటికి పశ్చిమాన అరుణకాంతి సముద్రంలా పరుచుకొంటుంది. రవి బింబం దిగజారుతోంది. బాలకమీరాలు పరుగులెడుతున్నాయి. అరణ్య వృక్షాలమీద పక్షికులంలో కలకలం చెలరేగింది. సందడిస్తున్నాయి అవి.

కొన్ని లిప్తలు గడిచాక అల్లన అరమొగిన రెప్పలు విప్ప ఆమెవంక కాంక్షా పూర్ణంగా చూచినాడు విశ్రవసు.

"తథాస్తు దేవీ!" అన్నాడు స్థిరమయిన స్వరాన.

"ధన్యురాలను" అతని పాదాలను అల్లుకుంది కైకసి. తన చరకాప ధర్మాలపై సోకిన ఆమె శిరస్సున పాణిపల్లవాలనుంచి ఆశీర్వదించినాడు మౌని. అతని స్పర్శ కైకసికి దివ్యానుభూతి అయింది.

"మగువతో! నీవు అభిలషించినట్లుగా నానించి నీవు సంతానవతివి కాగలవు ఈ సెలయేరు సాక్షిగా, ఆ పర్వతాల సాక్షిగా, ఆకశాన పశ్చిమాన కలిగించుతున్న రవిబింబం సాక్షిగా నా శరీరాన్ని నీకు పంచియిస్తున్నాను. అంటూ ఆమె నగ్న హస్తాలతో తన పవిత్రపాణిపల్లవాంనుంచాడు మౌని.

"ఓయీ! మహాపురుషుడా! ఈ పవిత్ర క్షణాన ఏడుజన్మలు పులకించినాయి. నీనించి క్షేత్రవతిని కావటం ఒక్కటే నా బ్రతుకుకు చరమలక్ష్యం. నా శరీరాన్ని మనసును ఆత్మను నీ పరం చేస్తున్నాను. ముక్తి ప్రసాదించు" అంటూ ఆతని బాహువులలో ఇమిడిపోయింది కైకసి,

వారి ఆత్మలు సమైక్యంగా మారినాయ.

వారి మనసులు ముద్దాడుకున్నాయి.

వారి శరీరాలు స్వర్గానుభూతితో తల్లాసమయనావి. యత్రికరణశుద్ధిగా ఆ ఇరువురు ఒకటఅయినారు.

కాలం నిలిచిపోయింది. స్త్రీ పురిసయోశోద్భవమయస సృష్టిహేతుడు అప్రతిహతంగా కాలంతోపాటు కదలిపోయింది.

× × × ×

కైకసికి తొమ్మిదినెలలు నిండినాయి. పదవనెల నడుస్తోంది. విశ్రవము ఆశ్రమంలోని మునికాంత లందరూ "మగబిడ్డదేవుడతాడ"ని కోడిగోల చేయటం ప్రారంభించారు.

తన కడుపు చీల్చుకుపుట్టే ఆ పసిప్రాణికోసం ఎంతో ఆతృతగా ఎదురు చూస్తోంది కైకసి. అతడు తనకు ప్రాణమిచ్చిన వ్యక్తి ప్రబోదించిన తల్లిడొక్కలో దాచి తన్నినప్పుడు ఆమె ప్రాణాలు అన్నుపడుతున్నావి. దేదెంతబలశాలి? అని అబ్బురపడిపోయింది.

"అవునులే! నుహా మేధావి అయినా తండ్రి రచించిన అద్భుతమయిన వ్యూహమిది. నా మగవాడు తేజస్సంపన్నుడు అప్పుడు తపో సంపన్నుడు. పుట్ట వలసినవాడు తప్పక నంకీర్ణ మహా పురుషుడే అయి పుంటాడు.

ఆతడు రక్షోబలగాలకు ఏలిక అవుతాడు నా తండ్రి హిమావర్తంలో బ్రహ్మావర్తంలో పొందిన అవమానాలకు తప్పక ప్రతీకారం తీర్చుతాడు" అని కలలు కంటోందామె.

డొక్కలో అతడు వాచి తన్నినపుడెల్లా అనుకొంటోంది." తప్పక వీడు మహా బలశాలి అవుతాడు" అని. ఆ బిడ్డ తన మాయగూడు వదలి ఒడిలోకి వచ్చే మధురక్షణాలి కోసం ఎదురు చూచింది.

ఆ సుముహూర్తమూ ఆసన్నమయింది.

"ప్రేయసీ! కైకసీ! నీవు నిగ్రహంతో ఉండాలి. నేనా నిత్యవృత్తికై సెలయేటి తీరానికి పోతున్నాను. ఈ ప్రొద్దు సంధ్యా సమయంకాగా నేనీ బిడ్డనీ ఒడిలోకి వచ్చేస్తాడు ధైర్యంగా ఉండు" అని చెప్పి నిత్యవృత్తికై వెళ్ళి పోయి నాడు విశ్రవసు.

ఆ మధురక్షణాలు దగ్గరపడుతున్నాయనగా కైకసి ప్రసవావ్యవస్థ ప్రారంభ మయింది. కడుపులోని శిశువు మహత్తరంగా ఆర్భాటం చేయసాగాడు వెలుపలకు రావాలని. తల్లి తల్లడిల్లి పోవటం అతడెరుగడు. పయనమయినాడు.

సరిగా సంధ్యా సమయమయింది.

అది దివారాత్రాల సరిహద్దు సమయం. నిశాసంచారానికై జంబూకాలు నిదురలేచి ఊళలు వేసేవేళ అయింది. వాయసాలన్నీ గూటికి చేరిపోతూ కావు కావు మంటున్నాయి.

పశ్చిమాకాశాన రవి బింబం రక్తవర్షం కురిపించి కృషించి కృంగిపోయి నాడు. తూర్పు ఓక్కన రాత్రిప్రొద్దు నీలి కల్హారం రెక్కవిప్పినట్టుగా కటిల వర్ణాన్ని రచిస్తోంది.

ఆ సమయాన అట్టహాసంగా శిరోదయమయింది శిశువుకు. తల్లి గర్భం లోంచి ఈ లోకాన్ని తొలిసారి తొంగిచూచిన ఆ శిశువు కొకొ మన్నాడు.

అతని భీకరమయిన కంఠ ధ్వనికి మృగరాజులు భయపడి గర్జించటం మరచి నాయి. ఖెఖులు గాండ్రించటం విడిచి ఎత్తిన పంజాలు దింపు కున్నాయి.

దిక్కుల వెంట ఆకసంలో చుక్కలు జల్లున పడిపడుతున్నాయేమో అని పించింది. కెవ్వున అరచి స్పృహ కోల్పోయింది కైకసి ధాన్యముద్రలో ఏవో దుశ్శకునాలను ధర్శించినాడు మహర్షి.

ఆ పూటకు అంతట తపోనిష్ఠను చాలించి తిరోభవుడయినాడు. మునివాటిక తారసిల్లగానే అతనికి శిశు రోదన ధ్వని కర్ణ పుటాలను ఛేదించసాగింది.

"ఈ రావమెక్కడిది?" అని అడిగాడు కనిపించిన వారికి "కైకసికి మగ శిశువు ఉదయించినాడు. పుట్టినది తదాదిగా పది కంఠాల పెట్టున బెగ్గురుమని దుర సిల్లు తున్నాడు.

ఈ బ్రతుకు అతనికంత దుఃఖభాజనమని అనిపించింది కాబోలు. ఒకటే రావం" అని చెప్పాడు ఛాత్రుడు.

ఈ సృష్టిలో ఏ క్రియా నిష్కారణంగా జరగదు. ఏ శిశువూ నిర్హేతుకంగా ఉదయించదు. పది కంఠాల పెట్టున బెగ్గురుమని దురసిల్లుతున్న ఆ శిశువును దశగ్రీవుడని పిలవండి" అని చెప్పేసి తన పర్ణశాలలోనికి వెళ్ళాడు మౌని.

వ్యాఘ్రాజినం మీద ధ్యానముద్రాంచితుడయి ఆ రాత్రిరంతా గడిచిపోయింది. ఆ మహా తపస్సంపన్నుని మనః ప్రపంచపుటావర్తంతో భవితవ్యం పిడికలకలా ప్రత్యక్ష మయింది.

"విధి సంకల్పం అనుల్లంఘనీయం కదా !" అని సంభావించి సమాధాన పడిపోయినాడు విశ్రవసు. ఆ పట్టున సప్త దివారాత్రాలు అప్రతిహతంగా రోదించాడు శిశువు. మునికాంతలందరూ అతని ఆగడానికి కలగుండు పడిపోయినారు. అతని శోకంభరించరానిదిగా ఐంది. వింటున్న వారిలో అశాంతిని రేకెత్తించింది.

ఐనా శిశువుని దక్కించుకోవాలి కనుక శిశువులకు సాధ్యం కానంత భీకరంగా తెరచిన అతని నోటిలో మధు బిందువులు సేకరించి తెచ్చిపోసారు. వారిచ్చిన సుకుమారమయిన ఆహారం అతనికి చాలలేదు చాల విపరీతమయిన దోరణిలో పుట్ట తేనె అంతటినీ గుటుక్కుమనిపించేశాడు.

అతడు సప్త దివా రాత్రులు నిర్విరామంగా చేసిన రోదనధ్వని తల్లులయిన దేవకర్ణి, హాలబిళి, మాలినులకు భయాన్ని రేకెత్తించింది. అంతేకాదు ప్రశాంత మయిన ఆశ్రమంలో జరిగే కలాపాలను వృక్ష ఛాయలలోనికి చిరిప్పవేయక తిలకించే హరిణశాబకాలు అన్నీ భయకంపనంతో పరుగులంకించుకొన్నాయి. వృక్షాలు సైతం తలలు ఊగించటం మరచినాయి. కొండలమీదినించి బండలు దొర్లి క్రిందికి పడినాయి.

అతటి ఉద్దండమయిన రావాన్ని వినిపించిన దశగ్రీవుడు ఒక్క తల్లికి మాత్రం సంతోషకారనుడయినాడు. పురిటింటి శిశువుగానే అతడు సాగించిన ఆగడాలు మాతృమూర్తిఅయిన ఒక్క కైకసికి మాత్రమే ఆనందం కలిగించినాయి.

"అవును మరి ! తాతగారి సూచనమేరకు ప్రాదుర్భవించిన సంకీర్ణ మహా పురుషుడితడు. సాక్షాత్తు పులస్త్యునికి మనుమడు. మహాతేజశ్శాలి, ఓజశ్శాలి, తపోశక్తి సంపన్నుడు అయిన విశ్రవసుకు తనూభవుడు. అటువంటివాని కింతటి

శక్తిసంపన్నత సమకూరటంలో అబ్బురమేమున్నది ?" అని సంభావించిందామె. ముద్దుమురిపెంగా బిడ్డను ఓ దార్చాలని ప్రయత్నించింది.

అతనిపై ఎటువంటి ప్రయత్నాలు కొనసాగలేదు. తాను ఇష్టపడిన విధంగా సప్త దినా రాత్రులు నిర్విరామ రోదనం తరువాతనే అతడు నోరుమూశాడు. ఆ నోరు మూయటం కూడ ఒక విచిత్ర సమస్య అయింది.

ఘోరంగా నిద్రపోటం. లేచినప్పుడు విపరీతమయిన ఆహారాన్ని స్వాహా చేయటం అతని కార్యక్రమమయింది.

ఈ విపరీతాలను భరించలేక ఆశ్రమ వాసులంతా కులపతి అయిన విశ్రవసు దగ్గర మొరపెట్టుకున్నారు. అతడు వారి వంక చూచి మందహాసం చేశాడు.

"అతడు శక్తిశాలి. అమేయబలపరాక్రమాలు అతని సొత్తు అవుతాయి. మీరు విచారించి చేయగలిగినది ఏమీలేదు. తగిన కాలం వొచ్చిందాకా తలపించటమే కర్తవ్యం" అన్నాడు.

నారందరూ కులపతి మాటను గౌరవించి అతని అగడాలను సహించేందుకు అలవాట్లు పడిపోయినారు.

కన్నబిడ్డ ముచ్చటలు చెప్పేందుకు విశ్రవసు దగ్గరచేరింది కైకసి. అతని విపరీత చర్యలను ప్రస్తావించింది.

"మహా పురుషుడా ! నిన్ను నేను విశ్వసించాను. నీ చరణారవిందాల మీద నా అన్న సమస్తాన్ని సమర్పించుకున్నాను. ఈ ఆశ్రమ వాసానికి నాబిడ్డ అయోగ్యుడు అని భావిస్తే అతనిని ఆయినా పరిత్యజిస్తాను మీరు నాకు కావాలి. నాకు కావాలి. నాకు ఈ జీవితం కావాలి. అందుకోసం ఏమయినా చేస్తాను" అని ప్రాధేయపడిందామె. విశ్రవసు ఆమె కందొయిని తేరి చూచినాడు.

"రాక్షసీ ! ఓ నా ప్రేయసీ ! తన వాడయిన పురుషుని కోసం బిడ్డను పరిత్యజించటం సృష్టి ధర్మం కాదు. ఐనా నాపట్ల నీకున్న అవ్యాజమయిన ప్రేమ కారణంగా అనా అంటున్నావు. కాని అందుకు నేను అంగీకరించను. నీ బిడ్డ అమిత శక్తిశాలి. అతడు ఈ జంబూద్వీపంలో మహత్తరమయిన చరిత్రను సృష్టించగలిగినవాడు అవుతాడు. ఇలా జరగటం బ్రహ్మ సంకల్పం ఏదీ ఏమయినా నానించి క్షేత్రవతి కావాలన్నపీ కామనలు నెరవేరు తున్నాయి కదా !" అంటూ ఆమెను స్పృశించాడు మహర్షి పెరగుపాటున పడిపోయింది రక్షోకాంత అయినకైకసి!

"మహాపురుషా ! మీకు నా శరీరంపై ఇంత ప్రతీకమా ?" అని ఆశ్చర్య విస్ఫారితనేత్రాలతో అడిగింది.

అందుకు మహర్షి మందస్మితం చేశాడు. కాని పట్టిన చేయి మరివిడిచిపెట్టనే కాదు.

"మదవతీ ! ఇది ప్రలోభంకాదు. విధిప్రేరణ. ఇప్పుడు నీకు భీషణుడయిన కుమారుడు జన్మించాడు. ఇంతటితో జరుగవలసింది అంతా పూర్తి అయినట్లు కాదు. నీగర్భవాసాన ఆశానికి సోదరుడు భాషరాతలేని విభీషణుడయిన వాడు మరొకడు జన్మించాలి. అతడు సోదరుడు ఈ దశగ్రీవుని వెంటతగిలి ఉండాలి. అప్పుడు విధి నిర్దేశం పూర్తికాగలదు" అన్నాడు మహర్షి.

అతని అభిప్రాయాన్ని బొదలదాల్చింది కైకసి. తిరిగి అతనితో స్త్రీ పుంపయోగోద్భవమయిన ప్రకృతి నిర్దేశాన్ని సమంగా పంచుకుంది. ఋతువులు చక్రవతుగా దోర్లినాయి.

వరుసగా ఆమెకు కుంభకర్ణుడు, శూర్పనఖ, జన్మించారు. ఆపైన బ్రహ్మ తేజంతో విశ్రవసు లక్షణాలన్నింటినీ పుణికి పుచ్చుకున్న సౌమ్యమూర్తి అయిన కుమారుడు జన్మించాడు. అతనికి విభీషణుడని నామకరణం జరిపించాడు మహర్షి.

బాల రావణుడు బహు గడుసు వాడయినాడు. అతనికితోడు కుంభకర్ణుడు శూర్పనఖలు తోడయినారు. విభీషణుడు ఒకడే తండ్రి తగులాటలో చిక్కిపోయినాడు.

బిడ్డలందరికి పంచవర్షాలు నిండగానే యథావిధిగా ఉపనయనాదికర్మలు జరిపించినాడు విశ్రవసు. మంత్రశాస్త్రాలు పఠింపచేశాడు.

ఒకనాడు హాలవిళతమాభవుడయిన కుబేరుడు లంకా నగరంనుండి తండ్రిపీ, తల్లులనూ చూడవచ్చాడు. అతడు సంపద లన్నింటికీ అధినేత. సురగణాలకుసైతం అసూయకలిగించే అద్భుతమయిన వస్తుపంచయమంతా సేకరించిన కళాశీలి అతడ్ను వస్తువస్తూ పుష్పక విమానం ఎక్కివచ్చాడు.

విశ్రవసు ఆశ్రమంలో దిగింది పుష్పకం. అద్భుతమయిన వ్యోమగామి అది. అటువంటిది ముల్లోకాలలోనూ మరొక్కటి లేనేలేదు. దానిని చూచి తల్లులంతా ముచ్చటపడిపోయినారు.

హాలవిళ ఎంతగానో బిడ్డను పొగడింది. "నాయనా కుబేరా! యక్షగణాలన్నీ నీ పాలవలో సుఖంగా ఉన్నాయికదా! నీ సకల సంపదలు సుస్థిరమయి వున్నాయి

కదా! తండ్రీ! బ్రహ్మావర్తము, ఆర్యావర్తము, వింధ్యకు దక్షిణతీరము నిన్ను ప్రశంసున్నాయట. ముల్లోకాలలో నీ అంతటి సంపన్నుడు లేనేలేడని చెప్పుకొంటున్నారట" అంటూ సంతుష్టురాలయినట్లు అడుగుతుంది తల్లి. అందుకు సముచిత రీతిన సమాధానమిన్నాడు కుబేరుడు.

"తల్లీ! చరణ సరోజాలను తాకిన పుణ్యఫలమేకదా ఇదంతాను. అంతా క్షేమమే! యక్షులంతా సుఖంగా ఉన్నారు. లంకానగరంలో అపూర్వమయిన కోటలు ఉన్నాయి. అభేద్యమయిన చోటున సముద్రమధ్యంలో మాయామేయనగా నిర్మించిన నగరమది.

అక్కడ ఉన్నంతకాలం యక్షులందరూ అజేయులు. తన నగరంలో లేని అందచందాలు అమరావతిలో అయినా వుండవు. ఇదిగో ఈ పుష్పక విమానం ఉందినాకు.

దీనిమీద ఎందరు అధిరోహించినా మరొక్కరికి చోటు మిగిలి ఉంటుంది. సాంకేతికంగా అద్భుతమయిన ఈ పుష్పకం సాధించాను నేను. ఇది నా దగ్గర ఉన్నంతకాలం నా ఐశ్వర్యగర్వాన్ని ఛేదించగలవారు ఎవరూ లేరు. అన్నీ నీవు యిక్కడ ఉండి అడిగి తెలుసుకోవాలా? నా వెంట లంకా నగరానికి వచ్చి ఆవాసముండరాదా!" అని అడినాడు కుబేరుడు ప్రేమగా! తల్లి ఎంతో వాత్సలంగాచూచింది బిడ్డను శిరసున ముద్దాడింది చూచుకొని పులకించింది.

"నాయనా! కుబేరా! నీవన్నదిచాలు తండ్రీ! కడుపున పుట్టినడ్డ ఉద్దతుడయి మూడులోకాలకు మొనగాడయినాడన్నది వినటమేచాలునాకు నీ తండ్రి అసాధారణ తపస్వి, వారు తేజోమూర్తి. వారిని విడిచిన మరుక్షణం మృత్యువుతో సమానం నాకు" అన్నదామె.

ఈ మాటలు విన్న కైకసికి తల్లిని తాను ఆశించవలసింది ఏమిటని తెలియవచ్చింది.

"కడుపున పుట్టిన బిడ్డ ఉద్దతుడయి మూడులోకాలలో మొనగాడయినారన్నదివినటయే చాలునాకు" అన్న దీహాలబిళ. ఆ మాటలు విన్నతరువాత కైకసి అంతఃస్సాగరం అల్లకల్లోలితమయినది. ఆలోచనలు చెలరేగినాయి.

"సవతి బిడ్డ ఎంత గొప్పవారయినాడు మూడులోకాలలో ఉరెద్దతుడయినాడు, పుష్పకం సంపాదించాడు. తన నగరమంతట మహత్తరమయిన నగరం

కాదనిపించాడు. కీర్తిమంతుడు అయినాడు. నా బిడ్డ దశగ్రీవుడు అంతటివాడు ఎప్పుడవుతాడో" అని ఆశాపూర్ణంగా ఆలోచించసాగిందామె.

కుబేరుడు తండ్రి పాదాలకు మ్రొక్కి వెళ్ళిపోయేందుకు వారి అనుమతి అడిగాడు. విశ్రవసుకు చేర్చుకొని ఆశీర్వదించాడు. "నాయనా! నీవు వృద్ధుడవే అయినా సన్మార్గదర్శివి. మంచిశీల సంపన్నుడవు. సంపదలు సాధించటం గొప్పకాదు. వాటిని నిలుపుకోవటం కష్టసాధ్యమయినపని అన్నాడాయన.

"తండ్రీ! మీరిలా ఎందుకు అంటున్నారు" అనిఅడిగాడు కుబేరుడు. విశ్రవసు మందస్మితం చేశాడు. వ్రేలెత్తి పుష్పకంవంకకు చూపించినాడు. కుబేరుడావంకకు మరల చూచినాడు.

దానిమీద అధివసించి కూర్చున్నాడు దశకంఠుడు. అతని ప్రక్కన ఆసీనుడయినాడు కుంభకర్ణుడు వారికి అధికంగా ఆ పుష్పకం తమ స్వంతమే అయినట్లు ఆశీనురాగాలు అనుకూర్చుని ఉంది. శూర్పనఖ. విభీషణుడు మాత్రం రథచక్రాల ప్రక్కనే నిలిచి బేలగా చూస్తున్నాడు.

"అన్నలూ! అది మన స్వంత వస్తువుకాదు. దాన్ని అధిరోహించటం అనుచితం" అంటున్నాడు. అందుకు దశగ్రీవ, కుంభకర్ణ, శూర్పనఖలు వికటంగా నవ్వారు.

"పిరికి గుండెకు అన్నీ అనుమానాలే!" అన్నాడు దశగ్రీవుడను మాటతో తిరిగి ముగ్గురూ విరగబడి నవ్వారు. ఈ దృశ్యాన్ని చూచి కుబేరుడుకు పిత్తుడైనాడు.

"దశగ్రీవా! పుష్పకంనించిదిగు" అన్నాడు ఆజ్ఞగా.

"నేను దిగను" అన్నాడు దశగ్రీవుడు.

"అన్నగా ఆజ్ఞాపిస్తున్నాను దిగు" అన్నాడు కుబేరుడు మళ్ళా.

"అన్ననయినా నీ ఆజ్ఞ నేను పాటించను" అన్నాడు దశగ్రీవుడు. ఆ మాటలకు విభీషణుడయితే భయపడ్డాడుకాని కుంభకర్ణ శూర్పనఖలు హర్షధ్వానాలు చేశారు.

"పుష్పకంనాది" అన్నాడు కుభేరుడు.

"ఈ నాటికి నీది అయితే ఇదే మరొకనాటికి నాది అవుతుంది" యీ దివ్యవ పుష్పకంమీదినించి దిగిపోయినాడు దశగ్రీవుడు. అతనిని అనుసరించారు కుంభకర్ణుడు, శూర్పనఖలు.

కైకసి ఈ దశగ్రీవుని కౌగిలించుకుంది, "అవన్నీ నీవు భక్తితో సాధించు కోవాలి నాయనా!" అంది.

# 4

దశగ్రీవుడు తండ్రి పర్యవేక్షణలో వేదవిద్యావిదుడయినాడు. వ్యక్తిమంతుడయినాడు. అతని నేత్రాలనుండు తేజోమయమయిన జీవితమార్గం పరచినాడు విశ్రవసు.

అచిరకాలంతో వేదాలన్నింటినీ ఆపాశనంపట్టిన దశగ్రీవునితడని చెప్పాడు విశ్రసను." నాయనా! వేదవిజ్ఞానమనేది వృథాగా కంఠస్థం చేసేందుకు మాత్రమే కాదు. వేదవిహితమయిన మార్గంలో నీవు జీవించాలన్న అభిలాషతో అన్నీ బోధించాను. ఇంకనీవు తపోమార్గాన్ని స్వీకరించాలి" అని బోధించినాడు తండ్రి.

దశగ్రీవుడు తల ఊగించి తండ్రి దగ్గర శలవు పుచ్చుకున్నాడు. తల్లి దగ్గరకు వచ్చాడు. "మాతృమూర్తి! మహత్తరమయిన ఆశయసాధన కోసం నీవు నన్ను కన్నాననని చెప్పావు అటువంటి ఆశయాలను సాధించేందుకు నేను బయలుదేరుతున్నాను. అనుమతి యివ్వు" అని అర్థించాడు. తల్లి అతని శిరస్సున చేయిపుంచి ఆశీర్వదించింది.

తాను ఇంతకాలం సాధు జీవనంలోని శ్రమనంతా ఓర్చి కనిపెంచిన కన్నకుమారుడు విద్యాపారంగతుడు అయినాడు. ఈ సంకీర్ణ మహాపురుషుడు సాధించవలసినది ఎంతోఉన్నా ఆ మార్గాన్ని నిర్దేశించవలసినవాడు తన తండ్రి అయిన సుమాలి.

అతని ప్రబోధం లేనిదో లక్ష్యసాధనకోసం బయలుదేరుతున్న బిడ్డ తన దారిని గుర్తించలేడు. అతనికి తన తండ్రి ద్వారా హితవాక్కులు చెప్పించాలని సంభావించింది తల్లి.

"నాయనా! నీవు కారణజన్ముడవన్నమాట యథార్థమే! అందుకు ఠవంత అయినా సంశయమనేదిలేదు. కాని ముందుగా నీవు మీతాతగారయిన సుమాలిని దర్శించాలి. వారి ఆశీస్సులు స్వీకరించాలి. నీవు నిర్వర్తించవలసిన కర్తవ్యమేమిటో మీ తాతగారే నీకు బోధిస్తారు. వారు బహుకాలానికి పూర్వం దేవగణాలమీదింఛి

అవమానించబడి నాగలోకంలో తలదాచుకుంటున్నారు. ఈ అజ్ఞాతవాసం అసాంతం కావాలంటే మిగిలి ఉన్న ఆశాకిరణానివి నీవు ఒక్కడవే! కనుక తక్షణమే బయలు దేరి వారి ఆశీస్సులు పొందిరావాలి" అన్నదామె.

అందుకు దశగ్రీవుడు తల ఊగించినాడు. తన తాతగారిపట్ల అపచారంచేసిన దేవగణాలమీదకు పితుడయినాడు. ఉన్నపాటున బయలుదేరి తాతగారిని దర్శించాడు. కుంభకర్ణుడు తోడుగా వస్తున్న దశగ్రీవుని చూచి సుమాలికి వాత్సల్యం లేకెత్తింది.

అతడు ఎదులేగి దశగ్రీవుని అక్కున చేర్చుకున్నాడు. అతని శరీర దార్ఢ్యతను చూచి ఉప్పొంగిపోయినాడు. విద్యావ్యాసంగాలలో మనుమడు సాధించిన ప్రగతికి అచ్చెరువుపడిపోయినాడు. పిన్నతనంలోనే అతడు ప్రదర్శిస్తున్న చైతన్య స్ఫూర్తిని గుర్తించి సంతుష్టుడయినాడు.

"తాతా! నిన్ను అవమానించిన దేవగణాలకు గుణపాఠం నేర్పుతాను. నీకు జరిగిన అవమానానికి ప్రతీకారం అప్పగిస్తాను. మాతామహా! అనుజ్ఞయివ్వండి" అని అర్థించాడు దశగ్రీవుడు. అతని వాక్ప్రాగల్భ్యానికి ఉప్పొంగిపోయినాడు. తాతగారయిన సుమాలి. తనకు జరిగిన అవమాన భారాన్ని మరొకమారు తలపోతకు తెచ్చుకుని దురపిల్లినాడు తన మనుమడు ప్రతీకారం తీర్చనున్నందుకు ముచ్చట పడిపోయినాడు.

"నాయనా ! దశకంఠా ! ఒక మహత్తరమయిన ఆశయాన్ని సాధించటం కోసమే నీ తల్లి విశ్రవసువల్ల క్షేత్రవతి అయింది. నీ అంతటి శక్తిశాల అయిన కుంభకర్ణుడు నీకుతోడున్నాడు ఇది నీకెంతో ఆనందదాయకమయిన సమయం.

నీవు సురగణాల సునిర్ధూమధామం చేయవలసిందే! అందుకోసమే సంకీర్ణ మహా పురుషుడవయిన నీవు పుట్టాలని కలలుకన్నాను. కాని మహత్తరమయిన ఈ ఆశయాన్ని సాధించేందుకు నా కిప్పుడున్న శక్తి సంపత్తులు చాలవు.

సురలు వారి పక్షపాతులయిన మౌనులు తపో బల సంపన్నులు. అది వారిని రక్షాకవచంలా కపాడుతోంది. నీవు కూడ తపోసంపన్నుడవు కావాలి. శక్తి సంపాద్యమయిన అనేక వరాలను నీవు సాధించాలి. ముందుగా అసురగణాలను అన్నింటినీ సమీకరించి వారికి నీవు పాలకుడవు కావాలి. అంతేకాదు మీరంతా ఆవాస ముండేందుకు దుర్భేద్యమయిన ఒక నగరం నిర్మించుకోవాలి. ఆయుధశక్తి

ధనబలమూ, భృత్యవర్గము నీకు కావాలి. అవన్నీ ఏర్పరచుకున్న తరువాతనే నీవు సురగణాలపై ప్రతీకారం తీర్చుకోగలుగుతావు" అన్నాడు సుమాలి.

తాతగారి వ్యూహరచన ఏమిటో వేదవిదుడయిన దశగ్రీవుడు గ్రహించాడు. తాతగారి అనుమతి తీసుకుని తల్లిదగ్గరకు తిరిగి వచ్చాడు.

"అమ్మా! నేను తపస్సు చేసుకునేందుకు పోతున్నాను. నాకు అనుమతి ప్రసాదించు" అన్నాడు పాదాలను తాకి.

"నాయనా! నీవు చేయదలుచుకున్న పని ఏదయినా వెంటనే చెయ్యి ఏకాగ్రత సాధించు. ప్రారంభించిన దాన్ని ప్రాణాలుపోతున్నా లెక్క-చేయకుండా ముగించు" అని ఆశీర్వదించిందామె.

కుంభకర్ణుడు కూడ తల్లి పాదాలమీద వ్రాలాడు. "అమ్మా! నేను కూడ తపస్సుచేసి శక్తులు సాధిస్తాను" అన్నాడు.

తల్లి అతవి శిరస్సున చేయి వుంచింది. "కుంభకర్ణా! నీవు ఎల్లవేళలా అన్న మాట వినుకోవా. అన్నకు అండదండాలుగా ఉండటమే నీ కర్తవ్యం. ఇద్దరూనూ తండ్రి అయిన విశ్రవసు ఆశీస్సులు అందుకుని వెళ్ళండి'' అన్నదామె.

దశగ్రీవ కుంభకర్ణులు తండ్రి ఆశీస్సుల కోసం వెళ్ళారు.

"తపోశక్తి అనేది కోరికలాంటిది. దానిని సద్వినియోగం చేయగలిగితే మీరు ధన్యజీవులవుతారు. దశగ్రీవా! ఉన్నంతమయిన లక్ష్యాలు సాధించాలంటే ఉన్నతోన్నతమయిన కృషి ఉండాలి. సాధించిన వేద విద్యనయినా, తపోశక్తినయినా నీవు సద్వినియోగం చేయగలగాలి. అప్పుడే లోకం నిన్ను హర్షిస్తుంది నీవు పుణ్య పురుషుడవు అవుతావు'' అంటూ హెచ్చరికలు చెప్పి వీడ్కోలు యిచ్చినాడు విశ్రవసు.

ఏకాగ్ర చిత్తంతో అరణ్యాల వెంట తపస్సు ప్రారంభించాడు దశగ్రీవుడు.

ఋతువులు వర్షాలు దాటిపోతున్నాయి.

దశగ్రీవ కుంభకర్ణులు తపోనిష్టాగరిష్ఠులయినారు. వారి, తపోజ్వాలలు గగన తలాన్ని తాకుతోంది. ఆ వేళకి హిమనగంపై తుషారబిందువులు కరిగిరావటం ప్రారంభించినాయి. అనన్య సామాన్యమయిన ఏకాగ్ర నిష్ఠతో తపసు ప్రారంభించినాడు దశగ్రీవుడు. రానురానుతో పోసీయుహూలమ కఠినంతరం చేరాడు. ఉవ్వెత్తున

లేచి కడలితరంగాలు నిలిచిపోన్నాయి. పెళఫెళమంటూ ఆర్భాటంగా బయలుదేరు తున్న మేఘగర్జనలు మౌనం దాల్చుతున్నాయి.

పచ్చనిచెట్లు భస్మరాసులుగా మారుతున్నాయి. అట్టిస్థితిలో ఘోరాతిఘోర మయిన తపసు సాగించాడు దశగ్రీవుడు. మనుమని తపసుకు మెచ్చి బ్రహ్మ దిగిరాక తప్పలేదు. దశకంఠుడు హర్షాతిరేకంతో పులకిత గాత్రుడయినాడు.

"దశగ్రీవా! చాలించు నీ తపస్సు. నీకామితమేమి మనుమడా" అని ప్రశ్నించాడు. ప్రత్యక్షపడిన పద్మసంభవుడు.

"నా తండ్రిని అవమానించిన దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నెర కింపురుష గణాలలో ఎవ్వరిచేత నాకు మరణం లేకుండా వరం ప్రసాదించు" అన్నాడు దశగ్రీవుడు తాత ఆశయాలను మనసులో మరొక్కమారు మననంచేసుకుని.

వేదమాతకు విభుడఐన బ్రహ్మతథాస్తు పలికినాడు,

ఎవ్వరిచేత మరణంలేని దశగ్రీవుడు వరగర్వితుడయినాడు. సోదరుడఐన కుంభకర్ణుని చూడవచ్చినాడు. అతడప్పటికే తపసు చాలించి నిద్రాయోగాన్నివరంగా పొందాడు. సోదరుతిరువురూ మహాబలశాలురు. అమె యశక్తిసంపన్నులు ఐనారు. అర్భటులతో ఆశ్రమునికి తిరిగి వచ్చారు.

"అమ్మా! దేవయక్ష గ్యధర్వకిన్నెర కిరిపురు పురుషులలో ఎవ్వరిచేత మరణం లేకుండా వరం పొందాను. ఇది దరక్షోగణాలను సమీకరించి యుద్ధసన్నద్ధుడ నవుతాను అన్నాడు.

తల్లి రవంత అలోచించింది.

"దశగ్రీవా! మరి నరవానరుల సంగతి–?" అని అడిగింది. అందుకు అతడు పరిహాసప్రాయంగా నవ్వాడు.

దేవత నన్నేమి చేయలేనప్పుడు మానవుల మంచి అలోచించటం వృథా ! ఇంక వానరులా!? తల్లీ! అర్ధమానవులయిన అ కోతి మూకలు నన్నేమి చేయగలవు. అనుజ్ఞఇవ్వు! నా తాతకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుతాను" అన్నాడు ఉద్ధతమూర్తిఅయి తల్లి తనయునిచూచి గర్వించింది.

"అందుకు నా తండ్రి అనుమతి కావాలికదా! అసాధుమూర్తి అయినను హర్షించి నాకు అనుమతి ఇస్తారో లేదో నీవు రక్షోకగణాలను ముందుగా సమీకరించు, పాలకుడైనవాడే యుద్ధం చేసేందుకు అర్హుడవుతాడు" అనిచెప్పిందామె.

దశగ్రీవుడు, కుంభకర్ణుడు దుర్యోధనులయినారు. శూర్పణఖ విభీషణుడు వారికి తోడుగా నిలిచారు. ఖరదూషణాది రాక్షసులందరినీ సమీకరించారు. పెద్దవాహిని అయింది సేన.

వారందరికి తిరుగులేని పాలకుడయినాడు దశగ్రీవుడు. సుమాలి మంత్రి అయినాడు.

ఈ రాక్షస పౌరులందరికీ ఒక నగరం పదిలమైనచోటును ఏర్పాటు చేయాలని తలపోశాడు దశగ్రీవుడు. తన సవతి సోదరుడైన కుబేరుని లంకానగరం అతనిదృష్టి పథాన నిలిచింది. తనవారందరినీ వెంటబెట్టుకుని లంకానగరంమీదగానే చేరాడు. చాల ఘోరమైన యుద్ధం జరిగింది.

జగజ్జేత, ఐశ్వర్యాలన్నింటికి అధిపతి అయిన కుబేరుడు ఓడిపోయాడు. పుష్పక విమానంతోసహా లంకానగరం దశగ్రీవుని కైవసమైంది. కుబేరుడు పరేతరాట్టుని ఆశ్రయించాడు.

అతడు కుబేరుని సేనాధిపత్యంలోని మరొక ప్రదేశానికి ప్రభువుగా ప్రకటించాడు. యక్షగణాలన్నీ వలస వెళ్ళినాయి, రాక్షస గణాలు లంకలో చేరినాయి. దశగ్రీవుడు ఆ నగరాన్ని మరింత పటిష్ఠం చేశాడు. ఈగఅయినా చేరరాని ఏర్పాటు చేశాడు. దుర్గాలను మరింత ఉన్నతం చేశాడు. ప్రాకారాలను మరింత సువిశాలంగా మార్చాడు.

దేవిడీలకు బంగారు తాపడం చేయించాడు. కోటలు సువర్ణ కాంతులతో ధగధగాయమానంగా చేశాడు. ఇంక సురగణాలపై దైత్రయాత్రకు పూర్వరంగం సిద్ధమైంది. లంకానగరంలో కోలాహలం ప్రారంభమైంది. వేదంవినదించే లంకానగరంలో ఎప్పుడు ఎక్కడ విన్నా యుద్ధ వార్తలే వినవస్తున్నాయి. సాధుజీవనాన్ని ఆశించే పెద్దలు కొందరు "వేదాన్ని చదవటంకాదు. దాన్ని ఆచరించగలిగినవారే తేజోవంతులవుతారు. లంకానగరంలో వేదంవినిపిస్తుంది. కాని వేదవిహితమైన మార్గం కనుపించదు" అనటం ప్రారంభించారు.

కాని లంకాధినేతయయి వారిటవేమీసరకు చేయలేదు.

యథావిధిగా శివపూజలూ ఆపి పూర్తికానిచ్చి యుద్ధోన్మాదంతో రక్షోగణాన్ని బయలుదేర దీశాడు. అతనిదగ్గర వజ్రజిహ్వుడు, విద్యుజ్జిహ్వల్వుడు, విద్యున్మాలి,

సుమాలివంటి మేధావులు, యుద్ధ విద్యావిశారదులు నరమాంసభక్షకులు అనేకు లున్నారు. వీరంతా అతని అనుచరవర్గంగా వెన్నంటి పోయినారు.

ముందుగా అమరావతిమీదకు పోయినాడు లంకేశుడు. అతని ఔద్ధత్యం ముందు తలదించుకున్నాడు దేవేంద్రుడు. పరాభూతుడైనాడు. రాక్షస సేనలు అమర పురిని ఆక్రమించుకున్నాయి. కల్పవృక్షాన్ని కామధేనావును కొల్లగొట్టాయి. అమరు లందరిని నానాహింసలూ పెట్టాయి. పుష్పకంమీద విహరిస్తూ తన వారందరినీ ప్రోత్సాహపరిచాడు లంకేశుడు. మదవతులయిన సుందరీమణులను చెరపెట్టాడు.

తిరిగి వొస్తూ ఉండగా ఒక యక్షుకుడు ఎదురైనాడు. అతని పేరు మయుడు. అతడు రావణుని ఔద్ధత్యం విని తన కుమారుని అతనికి సమర్పించు కోవాలని బయలుదేరాడు. పుష్పకంలోవస్తు లంకాపతికి వారిరువురూ ఎదులైనారు.

తండ్రి చాటున తలదించుకుని అనుసరిస్తు కన్పించింది కుమారి. ఆమె పేరు మండోదరి. ఆయువతి అపూర్వ సౌందర్యం రావణుని అత్యంతమూ ఆకర్షించింది. అతడు దిగ్భ్రాంతుడై రెప్పవేయటం మరచిపోయిండు, వారినిధరియు వచ్చిదర్పాంగా నిలిచాడు.

"యక్షుడా నీ పేరేమి?" అని అడిగాడు.

"ఓయీ! దశగ్రీవా! నన్ను మయుడంటారు. ఈ పుష్పకాన్ని మాతాతగార యిన మయుదే నిర్మించినాడు. నేను యక్షుడను. ఈ జవ్వనిని నీఅర్ధాంగిని చేయాలని వెంటతీసుకొచ్చాను. ఈమెను స్వీకరించు. జామాతనించి నేను జన్మఅంతా చరితార్థు డను అవుతాను. ఈమె వినయశీలి. వివేకవవతి. స్వీకరించు" అన్నాడు.

అప్పటికప్పుడు లంకేశుడు మండోదరని తన అర్ధాంగిగా స్వీకరించాడు. తనతో పాటుగా పుష్పక విమానంమీద ఎక్కించుకొని దుర్లమమై ఎవరికీ ప్రవేశా ర్హంకాని లంకానగం తీసుకొనివచ్చాడు.

అతనికి రవంత అయినా విశ్రాంతిలేదు. ఆ విశ్రాంతంతా పోరాటానికే అవుతున్నాయి. కొద్దికాలం తరువాత అష్టదిక్పాలకుల మీదికి యుద్ధానికి బయలు దేరాడు. అందరినీ సులభంగానే ఓడించాడు కాని యమపురిపై దండయాత్ర అసాధ్య మయింది. దాన్ని సాధించాలని ఎన్నో మాయోపాయాలు పన్ని అక్కడకు చేరు కున్నాడు. యమధర్మరాజు మీద యుద్ధం చేశాడు. దక్షిణాధిపతి అయిన నియతి

అతని ఔద్ధత్యాన్ని ఉల్లంగిచాడు. తీవ్రంగా వదురున్నాడు. వారి పోయి ఘోరమైంది యుద్ధ కాలంలో ముల్లోకాలచు కలగండ్లు పరిచినాయి.

పెద్దలందరూ వారి పరిధిచేరారు. రావణుడు తిరోముడయినాడు. గగనతలాన మబ్బు పరదాలదాటున రాయంచలా పయనిస్తోంది పుష్పకం. నీలినీలి గగనతలం మీద చెక్కినట్లు మెరుస్తున్నాయి. తారకలు మలయసమీరం మందమందంగా వీస్తోంది

లంకేశుని మనసు మదనపరితాపంతో విగిపోసాగింది గంధమాదనపర్వతాల దాపుకు వచ్చిన అతనికి ఒక అపురూపసౌందర్య విలాసిని ఎదురు అయింది.

"సుందరీ ఎవరు నీవు" అని అడినాడు రావణుడు.

"నా పేరు రంభ" అన్నది ఆమె.

"ఊడుపులు చూస్తుంటే అలానే అని పిస్తోందిలే! నీ పేరు అదే అయివుం టుంది. నేను నిన్ను కామిందాను. రా పుష్పకంలోకి" అంటూ కొడిగం ప్రాలంభిం చాడు దశగ్రీవురు.

"నీవు అమిత స్వంపన్నుదవు అయినా బలశాలివి అయినా స్త్రీ జాతి యావత్తూ నీకు సాగిలి మొక్కుతుంది అనుకోకు" అయినా ఒక వదుసన నీకు మేనత్త నవుతాను. లేదా అవ్వ నవుతాను. నాతో పరాచికం ఎందుకు నీ దారిన నీవు పో!" అన్నది రంభ.

అందుకు దశగ్రీవుడు రవంతయినా చలించలేదు. ఏదయినా ఒక ఆలోచన మస్తిష్కంలోకి రావాలేకాని అది కార్యరూపం ధరించనిదే అతనికి శాంతి లేదు.

"దేవ కాంతలకు వావివరుస లేమిటి. నేను కూడ మీ అధిపతి అయిన యింద్రుణ్ణి చితకదన్ని అమృతం తాగివచ్చాను. ఇంక నా దగ్గర ఈబాలా ఎందుకు. రా!" అన్నాడు. అతడు పట్టినపట్టు విడునకుండా రంభ తప్పుకు పోవాలని చూచింది దశగ్రీవుడామె మార్గాన్ని తన బాహులతో నిరోదించాడు. అతడివాసిద్దై నిరీక్షిస్తూ పుష్పకం అలానే నిలిచిపోయింది.

· ఓయి గడసరీ! నీవు దేవేంద్రుని జయించవచ్చు. అమరపురిని ఆక్రమించి వచ్చు అమృతం త్రాగవచ్చు. కాని ఆడదాన్ని బలవంతంగా నీదాన్ని చేసుకోలేవు" అని వాదించిందామె.

తాను జయించలేనివారుకాని, సాధించలేనివికాని ఉన్నాయంటే దశకంఠునికి పంతం పెరిగిపోతుంది. అట్టువంటి దానిని తప్పక హరించాలన్న ఆరాటమొదల వుతుంది,

నేను దేవనాధుని జయించగలను. అమరపురిని నిర్ధూమధామంచేయించగలను అమృతాన్ని అపహరించగలను. అంతేకాదు. నీవంటి అతివలను బలాత్కారంగా అయినా సరే అనుభవించగలను" ఆమె కొప్పుపట్టి పుష్పకంలోని ఈడ్చాడు. లంకాధినాధుడు. ఉడుపులమీద చేయివేశాడు. ఆమె ఘనజానాలను మర్దించాడు. పీన స్థానాలను పీడించాడు. కామ కళాకోవిదుడయి అనుభవించి వొదులేశాడు.

పౌరుషంమూర్తీభవించినట్లుగా అయింది. సురవేశ్య అయిన రంభ "ఓరీ" వివేకశూన్యుడా! స్త్రీని బలత్కారించటం జాతితనమనుకున్నావా! అది ఆనందమను కున్నావా! మరొకమారు యిలా ఎవరినయినా బలాత్కరించి అనుభవించాలని ప్రయత్నించావో తల పగిలి చస్తావు" అంటూ శపించి వెళ్ళిపోయిందామె.

"బలాత్కరించ వలసిన అవసరం నాకేమిటి! నీవు తప్ప నన్ను కాదనే ధైర్యం కలిగిన స్త్రీ ముల్లోకాలలో ఎక్కడుంది"అంటూ దంభవచనాలు పలుకుతూ వికటాట్టహాసం చేశాడు దరాస్యుడు.

లంకానగరం చేరుకున్న తరువాత అతనికి దుర్వార్త వినిపించింది. అతని తల్లియైన కైకసి యిసకతో శివలింగాన్ని సృష్టించి పూజాదికాలు నిర్వహిస్తు ఉండగా కార్తవీర్యార్జుని వల్ల అది కరిగిపోయింది.

ఈ వార్త వింటూనే ఉద్ధతుడయి సహస్రబాహువుల కార్తవీర్యార్జునుని మీదికి దండుపోయినాడు దశగ్రీవుడు కార్తవీర్యుడు అమేయశక్తిశాలి. అతడు లంకాధీశుణ్ణి ఓడించాడు అంతేకాక పులికూనను బోనులో బంధించినట్లుగా చెరసాలలో బంధిం చాడు. లంకానగరం తల్లడిల్లిపోయింది.

ఈ వార్తలు కిష్కింధకు తెలిసాయి. అది నరవానరుల రాజ్యం. కిష్కింధా పురి పాలకుడు వాలి. అతడు అమిత బలశాలి. లంకాదీశుడు బంధితుడయినాడన్న వార్త విశ్రవస ద్వారా అతనిని చేరింది. అతని సోదరుడు సుగ్రీవుడు, తార, రుమ వాళ్ళ అర్ధాంగులు. వాలి యోచించాడు.

ఒకప్పుడు లంకాధీరుడు బలోన్మత్తుడై తనను ఎత్తుకుపోవాలని చూచాడు. అప్పుడు తాను సముద్రతీరాన సూర్యునికి అర్ఘ్యమిస్తున్నాడు. ఆ సమయాన తనను అపహరించుకుపోవాలని లంకాధీశుడు తన బాహులతో పట్టుకున్నాడు.

తాను ఆ బాహువులను చంకలో యిరికించుకుని సప్తసముద్రాలకు సూర్యునికి అర్ఘ్యమివ్వటం పూర్తి అయింతరువాత ఒదిలిపెట్టాడు. అంసముఖుడికి నరవానరుల శక్తిసంపన్నులు ఏమిటో తెలిసివచ్చింది. తనతో విరోధంమాని సఖుడైనాడు.

మైత్రికి ప్రాణం పెట్టేవారు నరవానరులు.

యోధులయిన వారిద్దరూ కలిసివుంటే వారు తమమీదికి రారన్న లంకాధీశుని రాజనీతికి కట్టుపడ్డాడు తాను యిప్పుడు తన మిత్రుడు కార్తవీర్యార్జునుని చేతిలో బద్ధుడైనాడు. అతనిని విడిపించటం మిత్రుడుగా తాము చేయవలసిన పని కార్తవీర్యార్జునునికి తన శక్తి ఏమిటో తెలుసు.

కార్తవీర్యార్జునుడు శివార్చనాశీలి. వాలిని సగౌరవంగా ఆహ్వానించి ఉచితాసనమిచ్చి సత్కరించాడు.

"నిత్య సత్యశీలీ! వాలీ! నీవు పూరకరావు. వచ్చినపని ఏమిటి? నీకు మేలు చేయగలిగితే నేను ధన్యుడను" అన్నాడు కార్తవీర్యార్జునుడు వాలి మందహాసం చేశాడు.

"మీ చెరసాలలో ఉన్న మా బుడుతని విడిపించుకుపోవాలని వచ్చాను" అన్నాడు వాలి.

"బుడతడా! ఎవరా అదృష్టహీనుడు. నేను చరసాలలో బంధించినానంటే నా పట్ల ఏదో అపచారం చేసిఉంటాడు. నీ పెరుగుదువు కదా! ఈ ముల్లోకాలను తృటిలో జయించగల శక్తిసంపదలు నాకున్నాయి. నీకుఉన్నాయి. కాని మనమిరువురమూ అందుకు పూనుకొనలేదు. విధాత మనకు శక్తినిచ్చింది ఆత్మరక్షణకే కాని అన్యులకు భక్షించేందుకు కాదు.

వానర శ్రేష్ఠా! ఇంతకూ ఆ బుడుతడు ఎవరో చెప్పలేదేమిటని" అచి అడిగాడు కార్తవీర్యార్జునుడు.

వాలి మందహాసం చేశాడు మళ్ళీ!" ఓయీ మిత్రుడా! కార్తవీర్యార్జునా! అతడు రక్షోగణాలకు అధినాయకుడు. లంకాల రాధీరుడు. ముల్లోకాలను జయించిన వాడేకాని కాస్త మొరటు మనిసి. ఓ సారి నా వంకకు వస్తే బాగా బుద్ధి చెప్పాను. ఇప్పుడు నా వంకకు వద్చాడా. ఏది ఏమైనా అతడు నా సఖుడు. అందునించి విడిపించుకుపోవాలని వచ్చాను." అన్నాడు వాలి.

సాధుమూర్తిపై దైవచింతనా తత్పరుడు అయినా కార్తవీర్యార్జునుడు కింవత్తు అయినా యోచించలేదు. భటులను పిలిచి వేగమే వెళ్ళి లంకాధీశుడు ఏ చెరసాలలో బంధితుడై ఉన్నాడో చూచి సజీవుడై వుంటే వెంటబెట్టుకురండి" అని ఆజ్ఞాపించాడు. అలాగే అని వెళ్ళారు భటులు.

మరి కొద్దిసేపటి తరువాత బంధితుడైన దశగ్రీవుడు వారి ఎదుట నిలిచాడు. వాలి అతడిని బంధవిముక్తి కలిగించి తన వెంటపెట్టుకుని పోయినాడు.

ఆ తరువాత లంకాధీరుడు కొంతకాలం యుద్ధాల ప్రసక్తి తీసుకురాలేదు. అప్పటికే అతడు తోడ్కొని వచ్చిన అప్సరఃకాంతలనేకమంది ఉన్నారు. బంధితులైన దేవగణాలవారున్నారు ఎందరో సురశ్రేష్ఠులు అతని పల్యంకిక పట్టేందుకు సంసిద్ధులై వున్నారు. మండోదరి సరేసరి!

అందునించి అతడు నగరు విడిచి వెళ్ళలేదు. ఎప్పుడైనా పుష్పకంమీద విహారం ఒక్కటే అతని ఆసక్తి.

అయితే తనశంకసమాననంతా అతడిని కూర్చుండనీయలేదు. సురపక్షపాతులైన మునుల యజ్ఞయాగాదులను విధ్వంసం చేయమని ఆదేశించాడు. మునికాంతలను చెరపట్టండి. మునివాటికలతో భోగరాజకుండా విధ్వంసం చేయండి. సిద్ధాంతపరమైన ఈ పోరాటంలో దయాదాక్షిణ్యాలను విడిచి విచక్షణారహితంగా ప్రవర్తించండి అని ఆదేశించాడు. లక్షలాది రక్షోవీరులు దేశాలమీదికి పోయారు.

దండకలో గౌతమీతరం వరకూ విస్తరిల్లిన తపాశ్శ్రమ రక్షణకై సరిహద్దు వీరులుగా ఖరదూషణాదులను ఎంపికచేశాను. వారు నవ పంచసంఖ్యలో ఉన్నారు. ఉద్దండులు.

సరిహద్దు వీరులుగా పదునాల్గురు ఖరదూషణాదులు వెడుతూవుంరు శూర్పణఖ అన్నగారి పాదాల మీద వాలింది.

"అన్నా! అన్నెంపున్నెం ఎరుగని నా భర్తను పొట్టనపెట్టుకున్నావు యతీల మీది యుద్ధంలో నా భర్తను కాపాడమని వరమడిగితే యుద్ధరంగానికి రాకపోతే వధించను అన్నావు. కాని అతడు మహావీరుడు. యుద్ధరంగానికి వచ్చాడు. వధించావు. నేను అనాథను అయినాను. నా గతి ఏమిటి ?" అని ఎలుగెత్తి ఏడ్చిందామె. ముల్లోకాలను తల్లడింప చేయగల రావణుడు సోదరి శోకభారాన్ని సహించలేక పోయినాడు.

"సోదరీ ! కన్నీరు తుడుచుకో ! నీవు కన్నీరు పెట్టుకుంటే నేను చూడలేను. నా మాతృమూర్తి గర్భ నాపాన జన్మించిన సోదరులు అయితే మరికొందరున్నారు. కాని సోదరీమణివి నీవు ఒక్కగా నొక్కరితవు. అందునించి నాకు

ప్రియాతిప్రియమైన దానవు. నీ వాంఛిత మేమిటో చెప్పు. ఈ నేర్పుతాను" అన్నాడు.

"అలనాడు నా భర్తను వేధించేనాడు నా మీద నీ కెంత దయలేదేమి సోదరా!" అని అడిగింది శూర్పనఖ. దశగ్రీవుడు ఖిన్నుడయినాడు. తలవొంచాడు.

"సోదరీ! అది రాజధర్మం, వీరధర్మం. రాజ దర్మాన్ని నిర్వర్తించటంలో స్వపర విచక్షణడిండరాదని వేదాలు చెబుతున్నాయి. ఈ లంకా నగరంలో ఎక్కడ విన్నా వీరఘోషలే విన్పిస్తాయి కదా ! నీవు వినలేదా!" అన్నాడు అతడు బుద్ధి చెబుతూ.

శూర్పనఖ తామసంగా చూచింది అతని వంక.

అన్నా ! పర భార్యలను అపహరించమని వేదాలు చెబుతున్నాయా! దేవ వేశ్యలను బలాత్కరించమని వేదాలు చెబుతున్నాయా ! నీవు మునికుమారుడవు అయివుండి మునివాటకలను ధ్వంసం చేయిస్తున్నావు. అలాచేయమని వేదాలు చెప్తున్నాయా !

వేదాలు వల్లించటం మీరు. వాట్టిని ఆచరించటం వేరు. వేద విహితమయిన మార్గాన్ని నీవు విడచిపెట్టావు. సంకీర్ణ మహా పురుషుడవు అయినా రక్షోమార్గాన్ని స్వీకరించావు. నా భర్తను చంపావు అన్నదామె విధిరింపుగా !

దశగ్రీవునికి ఈ మాటలు కంటిక ప్రాయాలయినాయి. సోదరిని వధించా లంటే చేతులురావు. ఆమె భర్తను వధించి, ఆమెను వధించి తాను రక్షోగణాల దృష్టిలో కూడ దోషిగా నిలువతాడు.

"అమ్మ! నీ వాంఛిత మేమిటి ?" అని అడిగాడు కృపాదృష్టితో, శూర నఖ సోదరుని వైఖరి మారినందుకు సంతసపడింది.

"అన్నగారూ ! ఈ లంకానగరంలో నేనుండలేను. సరిహద్దు ప్రాంతాలకు రక్షణ దళంగా పోతున్న ఖరదూషణాదుల వెంటపోతాను. ఎప్పుడయినా చూడాలని అనిపిస్తే లంకానగరం వస్తాను. నీ మీదనాను కోపంలేదులే ! రాక్షసగణాలను అధ్యక్షుడవు కాబట్టి వారి మార్గాన్ని విడిచిపెట్టి రక్షోమార్గాన్ని స్వీకరించావు. అరి షడ వర్గాలకు కామలను రక్షణ కల్పించావు. నీ మార్గానేను స్వీకరించాను. ఆదే అనుసరిస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది శూర్పనఖ.

దశగ్రీవుడు ఆ రాక్షసి అవతలకు పోయినందుకు మహాయిగా నిట్టూర్చాడు ఇప్పుడాతని జీవితం ప్రవాహ వేగాన్ని తగ్గించుకుంది. ప్రవాహాలు తొలిదశలో పర్వతాగ్రాల మీదినించి తరలివచ్చే సమయాన విజృంభమాణంగా ఉంటాయి. మైదానం మీదికి వచ్చిన నవవధువుల్లా నెమ్మదితనం అలవర్చుకుంటాయి.

అలా అయింది దశగ్రీవుని స్థితి. ముల్లోకాలను జయించాడు. అష్టదిక్పాలకులను బంధించాడు. అమృతం రుచి చూచాడు. ముల్లోకాలలో లంకానగరం పేరు వ్యాపింపచేశాడు. తాత అయిన సుమాలి మనస్తాపాన్ని కొంత తీర్చాడు అతనిలో ప్రవహించే మునిరక్తం వేదనాదం విన్నప్పుడల్లా పులకిస్తుంది. తల్లి ఆశయం నెరవేర్చాడు.

ఇంక సాధించవలసిన దేమున్నది అని భావించాడు. అతడు తన జీవితం పట్ల సాధించిన దానిపట్ల సంతుష్టుడయినాడు. ఒకటి రెండు పరాజయాలు తప్ప అతనికి ముల్లోకాలలో ఎదురులేదని పించుకున్నాడు.

ఒకరోజు తాత అయిన సుమాలి మనుమని చూడవచ్చాడు.

"మాతామహా వందనాలు! మన రక్షోగణాలలో ఒక సంకీర్ణ మహా పురుషుడు ప్రాదుర్భవించాలని నీవు ఆశించావు. నేను పుట్టును నీ హృదయతాపంచల్లారిందా!" అని అడిగాడు లంకాపతి. తాత అయిన సుమాలి శిస్సురని నట్టూర్చాడు.

"లేదు రామనుమడా! నా హృదయతాపం చల్లారలేదు. నీవు ఉద్దడుడవు అయినావు కాని వామనస్తాపంతీర లేదు" అన్నాడు. దశగ్రీవుడు పెరగునపడినాడు.

"తాతా! యిది ఏమిటి? దేవేంద్రుని అమరాధివాసమయిన అవరపురిని కొల్లగొట్టాను. దేవేంద్రుడు పారిపోయాడు. అమృతం త్రాగాను. సురకాంతలను చెరబట్టి నా పాదాలు పట్టించాను. అష్టదిక్పాలకులను లంకానగరంలో బంధించాను. అసురగణాలను ముల్లోకాలలో జేజేలు పలికించాను. నీకు జరిగిన అవమానానికి ఈ ప్రతీకారం చాలదా?" అని అడిగాడు విభ్రాంతమయిన కంఠస్వరాన.

తాత అయిన సుమాలి తల అడ్డంగా ఊగించాడు.

"ఓరీ పెర్రిమనుమడా! ఈ పనులన్నీ నేనూ చేశాను. సురలందరినీ జయించాను. కాని నన్ను అవమానించినవాడు విష్ణువు. అతడు ఎక్కడుండో యోగీశ్వరులకు కూడ తెలియదు. పాల సముద్రంలో పాపశయ్య మీద పవళించి ఉంటాడంటారు. కన్పించడు. విన్పించడు.

అతనింతవరకూ పరాజయమనేది లేదు. పేరులోనే ఉందికదా! విష్ణువు అంటే జయించేవాడని అర్థం. అతడే అందరి నాదరిియిస్తాడు. అతడిని ఎవరు జయించలేరు. అతడే కదా నన్ను నాగలోకానికి తరిమికొట్టిన ధీశాలి. వాని గురించి నువ్వు రవత అయినా ఆలోచించావా! వానని జయించనిదే నీవు నాకన్న అధికుడవు కాలేవు" అన్నాడు సుమాలి.

దశముఖుని కన్నులు జీరవారినాయి.

"ఎవరా విష్ణువు" అన్నాడు ఆవేశంగా తాతఅయిన సుమాలి చిత్రంగా నవ్వాడు అది పరిహాసం.

"తెలిసింది చెప్పానుకదా! అంతా నాకు తెలుసు. మిగిలింది నీవు తెలుసుకోవాలి" అన్నాడు. మమరొకమారు నిట్టూర్చి అక్కడనించి వెళ్ళిపోయినాడు. దశముఖుని కడుపు ఎలాంటి తీవ్రమయింది.

ఆ క్షణంనించి విష్ణువు అనే సుర గణాధిపతికై అన్వేషణ ప్రారంభించాడు. అసురగణాలు మునివాటికలను ధ్వంసం చేస్తున్నాయి. ఇంకా సేనలు బల్లోకాలను గగ్గోలు పరచినాయి.

ఒకనాడు పుష్పకంమీద ఎక్కి విహరిస్తున్నాడు లంకానాధుడు. పోతూపోతూ అదే ఆగిపోయింది. లంకాపతి పెరను పడ్డాడు. పుష్పకం దిగివచ్చాడు. అక్కడ నంది కన్పించాడు.

ఏమోయి లంకాపతి! ఇది పరమేష్టి ఆ వాసమయిన కైలాసగిరి అని తెలియదా! వింత పెంవరివినీవు. వాసుదేవుని అధిక్షేపించి పోతున్నావుకదా!" అన్నాడు

"వానరముఖంలా ఉన్న నా ముఖానికి అంత పేసి మాటలెందుకులే! నేను శివభక్తులలో శ్రేష్టుడను. అగ్రగణ్యుడను" అన్నాడు లంకాపతి.

"ఓ రావణా! నన్ను మర్కట ముఖకంటావా? ఒకప్పటికిఆ మర్కటపై వాకకానిన్ను విధిస్తాయి" అనిపించాడు ప్రమథుడు. అయినా లంకానాధుడు చలించలేదు.

"నీ మాటల లెక్కఏమిటి. కైలాసనాథుడే నమక్షానికి రానిస్తాను చూడు" అంటూ కైలాసగిరిని పెకలించటం ప్రారంభించాడు దశగ్రీవుడు. మహాదేవుడు మందహాసంచేసి కైలాసగిరిని బొటన వ్రేలితో అదిమి వుంచాడు. దశగ్రీవుని

బాహువులు కైలాసగిరి క్రింద చిక్కినాడు. దశగ్రీవుడు పుట్టిన తదాది సప్తదివారాతులు దురపిల్లినట్లుగా గూర్చి ఆరావం ప్రారంభించాడు.

జటాకటాహ ధగధగ్గల్లలాటపెట్టపావకా అంటూస్తోత్రం చేయటం ప్రారంభించాడు. పరమ శివుడు దయాంత రంగుడు భక్తజన మందారుడు. ఓంకారమూర్తి

ఎక్కడదీ రావం? ఎవరీ రావణుడు అంటూ కైలాసం దిగివచ్చినాడాయన. లంకాధీశుడు కన్పించాడు. కిరణాలు మోడ్చి పార్వతీ సమేతుడైన పరమేశ్వరుని విభూతిని సందర్శించి పులకిత పాత్రుడయినాడు.

తన్మయుడై గంగాపతిని స్తోత్రం చేశాడు. కరుణా సముద్రుడైన రుద్రదేవుడు శాంతుడయినాడు.

"నీవా రావణుడవు! అర్థించదలచిన దేమిటో విన్నవించుకో" అన్నాడు పరౌతరాట్టు.

"శంకరా! నాకు అజేయమయిన చంద్రహాసాన్ని, బహుశమయిన ఆయుర్దాయాన్ని ప్రసాదించు" అంటూ అంజలి ఘటించినాడు రావణుడు.

భవానీపతి మందహాసంచేసి ఆతని వరాలను అనుగ్రహించి అంతర్హితుడయిపోయినాడు.

పరమ శివునికి పరమభక్తుడైన లంకాధీశునికి సంఘటనవల్ల ఒక విధంగా మేలూ. ఒకవిధంగా కీడూ జరిగినాయి. ప్రమధనాధుని వరాలు అతనికి ఆయుర్దాయుని అధికంచేసాయి. ప్రముఖులలో ప్రథముడయిన నందీశ్వరుని శాపంవల్ల ముప్పు వాటిల్లే ప్రమాదం ఏర్పడింది.

ఉద్దండుడయిన రావణుడు వరాన్ని బలంగా స్వీకరించాడు. పరౌతరాట్టు వరమివ్వగా అతని సేవకుని మాదట సరుకు చేయవలసిన అగత్యమేమిటి? అని సంభావించాడు.

అతడు విష్ణుమూర్తికై అన్వేషణ ప్రారంభించినాడు.

ముల్లోకాలలో గాలించాడు. అందం వహించాడు. మునులను దుయపట్టాడు. తెనిస్తే వారివల్ల అతని ఆచూకీ తెలియాలంటే నావారిని హింసించినందునయి నాకు పితుడయి విష్ణువు దిగిరావాలి, వారు మొరపెట్టుకోగా ఫిని ఫారిని అద్భుకునేంధ్రుళ్ళ వచ్చి తనను ప్రతిఘటించాలి.

ఇలా ఆలోచించి రావణుడు ముల్లోకాలను అల్లకల్లోలం చేయడం ప్రారంభించాడు. విష్ణురూపం, విష్ణునామం ఎక్కడ కన్పించినా అక్కడ దురాగతం చేశాడు. జంబూద్వీపంలో ఏ మనిషినీ, ఏ అడవినీ, ఏ కొండనూ, ఏ చెట్టునూ, ఏ పుట్టనూ వదిలిపెట్టకుండా శోధించాడు

అతనికా లక్ష్యం నెరవేరలేదు.

కాని అతని అగడాలకు తల్లడిల్లిపోతున్న జనాలసంఖ్య అధికమైంది· అతని అసురగణాలు నిరంతరులయి బనివాటంలలో చేస్తున్నవి చేష్టితాలను లోకం భరించలేకపోయింది.

మునిశ్రేష్ఠులంతా కాందిశీకులయినారు యాగం నిలిచిపోయింది. వేదనిహితమయిన కర్మలు జరుగుతున్న తావు నెల్లా రక్తం చారికలు కట్టింది.

ఇంక ఈ స్థితిని భరించలేకపోయినారు వాడు. ఎలాగయినా రావణుని ఆగడాలను అరికట్టాలని ప్రయత్నాలను ప్రారంభించారు. సిద్ధాశ్రమంలో ఆవాసముంటున్నగాని రాశితనూభవుడయిన బ్రహ్మర్షి విశ్వామిత్రునకు ఈ సంగతులన్నీ తెలిశాయి. తన ప్రాంతాలలో తాటకఅనని రాదరిఆయిన అసురకాంత విజృంభించింది

సిద్ధాశ్రమం మీద మరీచను బాహులు దాడి చేస్తున్నారు. విశ్వామిత్రుడు సహాయంకోసం ఎదురుచూడసాగాడు. సంకీర్ణ మహాపురుషుడయిన లంకాధిపుని వధించగల వీరుడు ఎక్కడున్నాడా అని అన్వేషించసాగాడు.

ముందుగా దండకలో రాక్షసుల ఆగడాలు నశించాలి. మునుల శాంతిజీవనం పునరుద్ధరించబడాలి. ఆ తరువాత రావణవధ అనివార్యం. ఇది ఎలా జరగాలి అని ఆలోచిస్తూ ఉండగా కోసలదేశం ధీరుడయిన దశరథుడు అతని దృష్టిపథంలోకి వచ్చాడు; విశ్వామిత్రుడు అయోధ్యగురించి ఆలోచించసాగాడు.

# 5

శ్వేతచత్రాన్ని ధరించి సరయూ తీరదేశాలను ఏలుతున్న మహారాజు దశరథుడు అతడు సిద్ధుండుడు. అనేక యుద్ధాలలో దేవతలకుసైతం చేయూత అందించిన ధీశాలి!

కావి యిప్పుడు ముదిమి ఆతని ముఖంలోంచి తొంగిచూస్తోంది. శౌర్య విక్రమాలను ఆలవాలమయిన ఆతని ఫాలం ఇప్పుడు ముడుతలు పడుతోంది.

ఆతని అగ్ర భార్య కౌసల్య. కోసల దేశాధీశుడు కోశల దేశపు ఆడపడునే అగ్ర భార్యగా స్వీకరించాడు.

సుమిత్ర మలి భార్య!

మూడవ భార్య ముద్దుల రాణి కేకయ రాజపుత్రి కైకేయి. అయోధ్యలో ముగ్గురు భార్యల సయోధ్యను పొందిన మహారాజు దశరధునికి బిడ్డలు లేరు. కలుగుతారన్న ఆశ కూడ అసాంత మవుతోంది.

మహారాజు ఆలోచనమున పడిపోయినాడు "నా తదుపరి ఈ సూర్యవంశ సింహాసనానికి వారసు లెవరు? పుత్రులు లేనివారికి సద్గతులు లేవని చెప్తారు. నేటికిట్టి దుస్థితి కోసల రాజ్యానికి సంప్రాప్తి మయింది. ఇంకేమిటిదారి?"

మంత్రులలో సుమంతుడు మంచి బుద్ధిశాలి!

ఆతడు తపో సంపద్నుడూ, సకల శాస్త్ర వరిష్ఠుడు ఐన వశిష్ఠునితో మంత్రాలోచనం సాగించాడు.

మహారాజు అశ్వమేధమూ పుత్ర కామిష్టి చేయాలి. అవి సఫలమయేందుకు అస్ఖలిత బ్రహ్మచారీ, మహిమాన్వితుడు అయిన ఋత్విక్కు కావాలి ఆతనిని తీసుకురావటం అంతట ఆయేపని కాదనుకుంటాను" అన్నారు వశిష్ఠులు శూన్యంలోకి చూస్తూ.

సుమంత్రుడు రవంత యోచించినాడు. "భాగధేయా! అటువంటి మచ్చ ఎరుగని మహనీయులు ఈ భూమండలంమీద ఎవరయినా ఉన్నారా" అని అడిగాడు.

వశిష్ఠులవారు తల ఊగించి ఉస్సురని నిట్టూర్చినారు.

"లేకేమి? అన్నారు. కాని వారిని తోడ్కొని వచ్చేందుకు మనకున్న శక్తి చాలదనుకుంటాను" అంటూ సంశయమున పడిపోయినారు.

"సెలవియ్యండి మహాత్మా! ఆతడు ఎటువంటివాడయినా, ఎక్కడ ఉన్నా వేవేగ తోడ్కొని వచ్చేందుకు వేగుల్ని పంపుతాను" అంటూ అర్థించాడు సుమంత్రుడు.

వశిష్ఠుడు సంశయాస్పదంగా ఆతని వంక చూచినారు. ఒక చిరుదరహాసం వారి పెదవులమీదికి వచ్చినట్లే భావించాడు సుమంత్రుడు.

"సుమంత్రా! అంతటి మహనీయు డొక్కడే కలడు. అతని పేరు ఋష్య శృంగుడు. కాకులు దూరని కారడవులలో చీమలు దూరని చిట్టడవులలో నాగరక లోకాలను విస్తారమయిన దూరదేశాలలో ఉంటున్నాడు. అతని రప్పించ గలిగితే ఈ అశ్వమేధమూ, పుత్ర కామేష్టి సఫల మవుతాయి" అంటూనే నిర్గమించారు వశిష్టులు.

మంత్రశీలి అయిన సుమంత్రుడు మంత్రాంగం సాగించాడు. ఋష్యశృంగుని అనుపాములు వొలవ తీసినాడు

కదిలించుకు రావాలన్న ప్రయత్నమంతా వృథా అయింది.

అతనిని ఎలా ఒప్పించ గలడు?

అనాచ్ఛాదిత మయిన నగ్న శరీరంతో ఉన్న అవధూత అతడు.

రాజ్యం కావాలా రత్నసింహాసనం కావాలా అని అడిగితే ఆ రాతిముక్కలు నా కెందుకన్నాడు. భోగ కాంతలు కావాలా అడిగితే నెగడు మంటలున్నాయి లెమ్మన్నాడు.

ఈ సృష్టిలోని సకల సంపదలూ మూటకట్టి యిచ్చినా వాటిని వామపాదంతో స్పృశించడు. సృష్టిలోని అందాలన్నింటినీ రాసిపోసినా అవతటకు నెట్టేస్తాడు.

అంతటి జటిలుడు. విరాగి!!

సుమంత్రుడు ఆలోచించి కొందరు చురుకుమీరిన నట్టువరాంగ్రను అతని మీదికి ప్రయోగించాడు భోగకాంతలు ప్రాణాలు అరచేత ఉంచుకుని అతని దగ్గరకు పయనమయినారు.

"అతడు కనువిప్పిచూస్తే కారడవులే తగలబడతాయి. పెదవి కదిపితే పిడుగులయినా నిలిచిపోతాయి. పిట్టంత మానవ ప్రాణులం. అందునా ఆడుశారము మన గతి ఏమిటో" అనుకుంటూ అతనిని చేరవచ్చారు.

ఋష్యశృంగుడు ఇహలోకవాసన లెరుగనివాడు. తన్మయ దైవభావనా బలం గల సంస్కా "ఎవరు మీరు?" అని అడిగాడు.

"దూర దూర దేశాల నించి వొచ్చాం" అని చెప్పారు నట్టువ రాణులు.

"ఏమిటి పని?" అన్నాడతడు.

"నీతో నెయ్యం చెయ్యాలని" వారు అతనిని చుట్టు ముట్టారు. ఆ తన్మయ భావుకుడు వారి నెయ్యాన్ని స్వీకరించాడు. తాను తపమాచరించేవేళ హారిణిళా

బికాలు అమాయకంగా చుట్టుముట్టినప్పుడు ఎలా స్నేహభావంతో చూచేవాడో అలాగే చూనాడు.

దూర దేశాలనించి వచ్చిన వారి గురించి ఆశక్తిగా ప్రశ్నలు వేసాడు. వారు పిండివంటకాలను తెచ్చియిస్తే యివేమి కందమూలాలు? కుడుములు యిస్తే యివేమి ఫలాలు? అని అడగటం ప్రారంభించాడు. అతడు నాగరిక మయిన లోకం ఎరుగడు.

నట్టువ రాణులు అతనిపై మన్మథ బాణాలు విసరాలని తమ వక్ష స్సంపదను ప్రదర్శిస్తే "ఇవి కుచ ఫలాలు కదూ!" అని మరో లోకం మనిషిలా ప్రశ్నించాడు.

ఆ గడుసు కత్తెలు ఏవో కారణాలు చెప్పి నెయ్యం ఎరగా పెట్టి అతనిని ఆఘూరాటవినించి కదలించారు.

చారులనించి యీ వార్తను అందుకున్న సుమంత్రుడు ఋష్యశృంగుని కోసం బ్రహ్మాండమయిన ఏర్పాట్లు చేయించాడు. దారిపొడవు నా పచ్చిక పరి పించాడు, తన్మయభావుకుడయిన మహర్షికి సూర్యరశ్మి సోకకుండా అభ్యంతరాలను ఏర్పాటు చేయించాడు.

ముగ్గురు భార్యతో వశిష్ఠునితో ఎదురేగి మహర్షికి స్వాగతం పలికాడు దశ రథ మహారాజు ఋష్యశృంగుడు ఋత్వక్కుగా అశ్వమేధం ప్రారంభించారు.

ఋష్యశృంగునికి రాజభోజనాలు అమరినాయి. ప్రారంభంలో అతడు రవంత అబ్బురపడిపోయినాడు కాని అంతలో నాగరిక లోకపు జీవన రీతులకు యిమిడిపోయినాడు.

అశ్వమేధం ముందుగా పరిసమాప్తమయింది. పుత్రకామేష్ఠి ఆరంభ మయింది. దశరథ మహారాజు నిష్ఠాగరిష్ఠుడయి యాగం నిర్వహించాడు. భూమి మీద దర్భలుపరపించి భూశయనం చేశాడు శ్వేత ఛత్రధారి అయిన మహారాజు.

పుత్రికామేష్ఠి పూర్ణాహుతి అయింది. అంతగనుక ప్రపంచవాసన లెరుగని ఋష్య శృంగుని పవిత్ర పాణిపల్లవాలలో పూర్ణాహుతి అగ్ని దేవునికి అర్పించ బడింది. అగ్ని దేవుడు అను గ్రహించాడు.

అతనివల్ల అపురూపమయిన పాయస పాత్ర మహారాజుకు సంప్రాప్తమ యింది. దాన్ని ముగ్గురికి పంచి యివ్వాలి మహారాజు. వశిష్ఠునితో సమంత్రునితో సంప్రదించాడు.

అతడు కోసల రాజ్య ప్రభువు. అతని అగ్రభార్య కౌసల కోసల దేశపు వారింటి ఆడపడుచు. అందునించి ఆమెకు సంప్రాప్తమయిన పాయస పాత్రలోంచి సగభాగాన్ని తీసి యిచ్చాడు మహారాజు.

పాయస పాత్రలోని సమార్ధాన్ని పంచుకుంది అగ్రభార్య కౌసల్య. మిగిలిన సమార్ధాన్ని రెండు భాగాలు చేశారు. సుమిత్రకు ఒక భాగం యిచ్చారు. మిగిలిన దాన్ని రెండు భాగాలుచేసి ఒక భాగం సుమిత్రకూ మిగిలిన భాగం కైకేయికి యిచ్చారు.

మొత్తం పాయస పాత్రలోని పవిత్ర పదార్థంలో కోసల రాజ్యపు ఆడపడుచు అయిన కౌసల్యకు సగం దక్కింది.

ఆమె గర్భవాసాన రాముడు జన్మించాడు.

అర్ధభాగాన్ని రెండు సమార్ధాలు చేయగా ఒక భాగం అనగా మొత్తంలో నాలుగో వంతు సుమిత్రకు దక్కింది. నాలుగోవంతును రెండు అర్ధభాగాలు చేయగా ఎనిమిదోవంతు కైకేయికీ, అంత భాగమే తిరిగి సుమిత్రకూ దక్కాయి

సుమిత్రకు లక్షణుడూ శత్రుఘ్నుడు జన్మించారు. కైకేయి తనూభవుడే భరతుడు.

రాముడు శక్తివంతమయిన యాగఫలంలో అర్ధభాగానికి ప్రతిఫలం. లక్ష్మణుడు యాగఫలంలో నాగుగవ వంతు ప్రతిఫలం. భరత శత్రుఘ్నులు ఒక్కొక్కరు ఎనిమిదోవంతు ప్రతిఫలం.

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అల్లారు ముద్దుగా పెరిగారు. ముగ్గురు తల్లుల ముద్దు బిడ్డలయినారు. అయోధ్యా నగరమే కాదు మొత్తం కోసల రాజ్యం పండుగ చేసుకుంది. మునులంతా వచ్చి బిడ్డలను ఆశీర్వదించారు

సంయమీంద్రుల ఆశీస్సుల బలంతో వారంతా పెరిగి పెద్దవారు అవుతున్నారు సకల విద్యా పారంగతులు అవుతున్నారు.

రాముడు విలువిద్యా విశారదుడు అయినాడు.

దశరథునికి ముగ్గురు తల్లులకు కన్నుల పండుగ అతడే! అతడు సుగుణోద్దాముడు. నీలమేఘశ్యాముడు. అతనివి రాజీవలోచనాలు రాజోచితమయిన లక్షణాలను సంతరించుకున్నాడు. ఎగుబుజాలు దీర్ఘతరాలయిన బాహువులు జానువులను దాటుతున్నాయి. సువిశాల సుందరతర నేత్రాలు ఎల్లవేళలా ప్రశాంత సదనాలవలె కన్పిస్తాయి. ప్రసన్నతా భావంతో తరళిస్తాయి.

అతడు కన్న తండ్రి దశరథునికే కాదు అయోధ్యలోని వారందరికీ ఆశాదీపమయినాడు. కన్నతల్లులకే కాదు కోసల రాజ్యానికే మణిదీపమయినాడు.

ఎంతటి ప్రసన్నత!

అలలు నిలిచిపోయిన సముద్రంలా ఎంతటి గంభీరత.

విలువిద్యలో ఉద్దండుడయినాడు రాముడు. అతడు సువ్వున బాణం కొట్టినాడంటే అజ్ఞానమంతటి తిమిరవారాసి అయినా ఉత్తుంగతరంగాలు తురంగలించి అల్లకల్లోలమయిపోవలసిందే! కనురెప్ప కదిపినాడంటే సోదర శ్రేణిలో ఉద్యస్ఫూర్తినింపార వలసిందే!

తమ్ములంటే వల్లెమాలిన అభిమానం. ఆత్మ తన శరీరాన్ని ఎలా చూచుకుంటుందో రాముడు తన సోదరులను అంతగా చూచుకుంటాడు. తమ్ముల శరీరం తన చైతన్యానికి కారణమయిన ఆత్మకు ఎలా చూచుకుంటుందో అలా రాముని చూచుకుంటాడు. లక్ష్మణునికి మరా వల్లమాలిన అభిమానం.

తండ్రికి రాముడే ఊపిరి!

సోదరులకు రాముడే సర్వస్వం!

అయోధ్యవాసులకు రాముడే అపురూపం!

కోసల రాజ్యానికి రాముడే ఆశాదీపం!

యావత్తు జంబూ ద్వీపంలోని మునిగణ శ్రేణికి రాముడే కోర్కెలు తీర్చగల అభయముద్ర!

మునులకు కోర్కెలేముంటాయి? వారు నిస్సంగులు. అరణ్యాలలో నిర్జనావాసాలలో ముక్కు మూసుకుని తపోలోకమే తమ లోకంగా బ్రతికేయగలవిరక్తులు. వారి అభిషితం లోక కల్యాణమే!

వారి కోరిక కూడ అదే! లోక కల్యాణం! వేద విహితమయిన మార్గంలో సృష్టియావత్తు శాంతిదవనం, తేజోమయదవనం సాగించాలన్నదివారి అభిమతం.

అందుకు రాముడు చేయగలపని ఒకటున్నది.

అసుర శ్రేణిలోన కల్యాణానికి కంటక ప్రాయమై ప్రవర్తిల్లుతోంది. వారు బలవంతులు. అసురశ్రేణి బలసంపన్నత ధార్మిక జీవనం నించి వొచ్చినది కాదు నియతమయిన ఆలోచనా రీతినించి సముత విన్నమయినదికాదు. అది కేవలం మొండితనం వల్ల వచ్చినదే!

మొండివాడు దయ్యం కన్నా బలవంతుడు అన్నట్లువారు నిజంగా దేవతలను జఇస్తున్నారు. వారి అర్ధాంగులను రపహరిస్తున్నారు. మునిజన వాటికలను విధ్వంసంనేస్తున్నారు. యాగధర్మాన్ని ఎదుర్కొంటున్నారు.

అటువంటి ఒక యాగాన్ని సంకల్పించాడు గాధినందనుడు. అతడు జన్మతః రాజే అయినా తపోసంపన్నుడుయి బ్రహర్షి ఐనాడు. ముల్లోకాలను తశ్శక్తిచేత చేత పపించిపోయేలా చేశాడు.

బ్రహ్మనే ఎదిర్చి ప్రతి సృష్టిచే యుగలధీరాలి. అంతటి శక్తిశాని ఐన గాధేయుడు విశ్రవనికి పరమమిత్రుడు. అందుకే అతడు విశ్వామిత్ర మహర్షిగా లోకంచేత కొనియాడబడినాడు. తన పేరు సార్ధకమయేలా విశ్వానికి విహితం చేయాలని సంకల్పించినాడు గాధిసూతి.

వేదమార్గాన్ని సకల మానవాళికి అమగమ్యమయిన మార్చాలని మునిజనులు చేస్తున్న ప్రయత్నాలకు విఘాతం కల్పిస్తున్నారు అసురగణాలు. ప్రజా జీవితం శాస్త్ర సంబద్ధం అయేలా చూడాలని మునులు ప్రయత్నిస్తూ ఉంటే, అలాకాకుండా చేయాలని ప్రయత్నిస్తున్నారు అసరులు అసురగణాల అధినాయకుడు లంకా ధీరుడయిన రావణుడు.

మునిజనులనూ అసురలనూ సయోధ్య మృగ్యమయిందికాక జీవితం ధానంలో సిద్ధాంత పరమయిన అగడ్తలు అధికాధికనుయినాయి. అసురులు మునులను శాలి విరోధులుగా గుర్తించి ఎక్కడికక్కడ యుద్ధాలను సృష్టిస్తున్నారు.

విధ్వంసకాండను నిత్య కృత్యంగా స్వీకరించారు.

ఇదంతా చూచి గాధి తనూభవునికి మనోవిహతమయింది. ఎలాగయినా ఈ దుండగాలను అది కట్టాలన్న ఆలోచన ప్రానంభమయింది. కాని వారిని నిరోధించగల మొనగాడు ఎవరు ?

అతని చూపులు కోసల రాజ్యం మీదికి పరివర్తనమయినాయి. అయోద్యను పాలించే ధశరధ మహారాజు ముద్దుబిడ్డ అట !

కౌసల్యా మాతతనూ భవుదట !

రాముడట !

పసివయసునే రణరంగ భీముడయినాట !

నల్లనివాడట !

పద్మ నేత్రాలు తరళించే పదునైన వయసుకు వస్తున్నాడు! ఆపావడు కోసల రాజ్య ప్రజలకే కాక యావత్తు జంబూద్వీపంలోని మునిజనపాళికి కంటికి పాపడయి నాడట!

ఓహో! ఈ వయసుననే ఎంత కీర్తనాయిడయినాడా బాలుడు!

అతడే విశ్వామిత్రుని దృష్టి వలయంలో నిలిచినాడు.

రవంత తపోశక్తి ఆతనికి కానుకగాయిస్తే తప్పక రాకాసి మూకలను నిరోధించగలడని సంభావించినాడు అనుకున్నదే మితడవు ఆతనికి—

హుటాహుటిన బయలుదేరినాడు. గంగమదాటి. సరయూ తీరసైకత శ్రేణులను నిర్గమించి అయోధ్యాన శరంతకాలు పెట్టాడు గాధిరాజ సుతుడ ఐన విశ్వామిత్రుడు.

"దశరథా! ధన్యుడవు అయినావు. నల్లనివాడయి నారాయణుడు నాణ్యమయినవాడు. పసివాడయినా పదుగురికి ఆశా కిరణమయిన వాడు. బిడ్డవల్ల నీవు బహుర్రొద్ద సేరు సంపాదించి నావు కదయ్యా! ఇదే నా ఆశీస్సులు స్వీకరించు" అన్నాడు రాచనగరులోనికి నేరుగా ప్రవేశించి.

దశరథుడు తృప్తి మానసుడయినాడు. తపోగరిష్ఠత వల్లయే మనియమ సాధనవల్ల పవిత్రమయిన గాధేయుని పాదాటను పూర్ణ కుంభాలను ఎదురెత్తి స్వాగతం పలికినాడు ఆతనిపై పేలాలు పూవులు చల్లించి అర్చించినాడు.

"మునిశేఖరా! ఈ నాడు నేను సంతుష్టుడనయినాను. తపోసాధనతో శక్తి సంపన్నుడవు. బ్రహ్మసృష్టికే ప్రతిగా విశ్వామిత్ర సృష్టి సలిపిన మష్యయుడవు. నీ పాదస్పర్శతో ఈ నగరమూ, నా నగరూ పవిత్రమయినాయి. నా బ్రతుకు పునీతమయింది. మీరాక ఒక్కటే నాకు వేయి వరాలు అందించినట్లు! స్వామీ! తమ రాకకు కారణమేమి?" అని వినయవినమితంగా అంజలి బద్ధుడయి అడిగాడు దశరథుడు.

అందుకు గాధేయుడు నలువంక చూచినాడు.

"తండ్రి వెనుక నిలిచి కన్పించాడు రాముడు. ఓహో ఏమి ఈ రూపము? ఏమి ఈ ప్రసన్నతాలావము! ఏమి ఈతని స్ఫూర్తి మంతమయిన రూపము! రాముడు నిజంగా లోక కల్యాణకాముడే! ఇట్టి విగుణుణటన్న సుబుద్ధి, పరిపూర్ణ పురుషుని కోసమే కదా! ఇంతకాలం అన్వేషించినాను. ఇప్పటికి నామనోగతాలు

పంట కొచ్చినాయి. ఎంతటి అదృష్ట పూర్వమయిన బాలుడు నా కనుపించినాడు. ఇంక నా పనులు సఫలమవుతాయి అని సంభాషించినాడు విశ్వామిత్రుడు.

"దశరథా ! కార్యార్థిని అయివచ్చానయ్యా ! దండకలో సిద్ధాశ్రమముండిన్నది నీ వెరుగుదువు కదా ! అది మునిజనులు ఆ వాసముంటున్న పవిత్రభూమి. అక్కడ నేను మహత్తరమయి నకామనలతో యజ్ఞం సంకల్పించినాను.

కాని దానికి అసురశ్రేణి ఆటంకాలను కల్పిస్తోంది. యాగ రక్షణార్థమై ఒక వీరుడు నాతో రావాలి. అతడు రాముడేకావాలి" అంటూ మనోవాంఛను వివరించాడు విశ్వామిత్రుడు.

ఆ మాట వింటూనే ఉలికిపడినాడు దశరథుడు.

రాముని వంక ప్రేమగా చూచుకున్నాడు.

"గాధినందనా ! రాము డెందుకయ్యా ! సకల సైన్యాని వహింతో నేనే స్వయంగా వచ్చి యాగ సంరక్షణం చేయనా !

మీ సేవ లోకరించటం కన్నా కోరదగినది నా కేమున్నదంటూ తాను కదలి వెళ్ళేందుకు సమాయత్తమయినాడు రాజు.

గాధేయుడు మనసులో లోపలే మందహాసం చేసుకున్నాడు. దశరథా ! నీవు గతము. రాముడు వర్తమానం. భవితవ్యం కూడ రామునిదే ! నీ కెందుకీ ప్రయాస" అని సంభావించాడు.

"దశరథా! నీ కెందుకీ ప్రయాస. రాముడు నాతో రావాలి. అది నా అభిమతం. నీవు కాదనకు. కల్యాణకారకుడయిన రాముడు కారడవికి నాతో పాటుగా రావాలి" అన్నాడు దృఢంగా.

దశరథుడు ఏమీ తోచక విశ్వామిత్రుని మీది చూపులు వశిష్ఠుని మీదికి మరల్చినాడు.

కులగురువు ఏన వశిష్ఠుడు గాధిసూతి మనోగతాలను చదువ గలిగిన ధీశాలి. అందునించి భవితవ్యాన్ని ఊహించినాడు. ఈ నిర్గమనం లోక కల్యాణకారాకు డయిన రామునికి కూడ కల్యాణ కారణమవుతుందని నిశ్చయించాడు. అతని ముఖంలో అనుకూల ధోరణుల్ను అవగతం చేసుకున్న దశరథుడు నిస్సహాయు డయ్యినాడు.

పది దినాలు పుత్ర వియోగం అని వార్యం అని నిశ్చయించుకున్నాడు. విశ్వామిత్రుని పాదాలంటి "నా రాముడు మీ వెనువెంటరాగలడు. మీదే భారం" అన్నాడు.

"కల్యాణమస్తు" అన్నాడు విశ్వామిత్రుడు.

తండ్రికి తల్లులకు మ్రొక్కి బయలుదేరాడు రాముడు. కారడవికి విశ్వామిత్రుని వెంట నడిచేందుకు సంసిద్ధుడు అయినాడు. అందరికీ వీడ్కోలు చెప్పాడు.

పట్టుపోంబట్టు వస్త్రాలు ధరించాడు. విల్లుధరించాడు. ధనుస్సు బావున చెక్కుకున్నాడు. ఖడ్గాన్ని మొలనూలు ఆధారంగా చెక్కుకున్నాడు. జింక చర్మంతో తయారుచేసిన యజ్ఞోపవీతాన్ని చక్కదిద్దుకున్నాడు.

ప్రియ సోదరుడు లక్షణుడు వెంటరా విశ్వామిత్రుని అడుగులో అడుగు కలిపి నడువసాగాడు. సరయూతీర సైకత వేదికల మీది నించి వారి అడుగులు గంగాసలిలధారల వైపుగా తిరోగమించినాయి.

గంగాసరయూసంగమ స్థలంలో శివాశ్రమాన్ని సందర్శించి మునుల ఆశీస్సులందుకున్నాడు కల్యాణరాముడు. సంగమస్నానాలు పూర్తి చేసుకుని గంగను తరించాడు ముగ్గురూ.

అదిలగాయతు ఘోరారణ్యమే !

ఆ ఘోరాడివిలో ఇతఃపూర్వం రెండు నగరాలుండేవి. మాలద, కరోశ దేశాలు అవి. అవి రెండు ఇప్పుడు శిథిలమై నిర్జనంగా మారిపోయినాయి. అలా మార్చివేసిన మహమ్మారి పేరు తాటకి. వేయి మత్తగజాలు రూపెత్తినట్లుండే నరమాంస భక్షకురాలు తాటకి.

దాని రూపం అతి భయంకరం అడవులు అతిక్రూరం. దాని పొలసువ పారినంత మేర పిట్టపీచు మసదు. పులులయినా తాండ్రించవు. సింహాలయినా గర్జించవు.

నరమాంసాన్ని అశనంగా స్వీకరించే అనాగరిక అసురగణాల స్త్రీమూర్తి తాటకి.

దాని అరుపు వినిపించిన ప్రథమ పర్వారం రాముడు జిలుమన్నాడు విశ్వామిత్రుని వంక విస్మయంగా చూచాడు.

కామరూపిణి అయిన ఈ అసురకాంతను నన్ను భక్షించగలదు. ఇది శాస్త్ర విరుద్ధమైన జీవితంలో లోక కంటకురాలుగా మారింది. దీన్ని నీవు వధించాలి.

వింటకి నారిబిగించు. బాణాన్ని సంధించు" అని హెచ్చరించినాడు. కాని రాముడు రవంత కన్ను మెగిచాడు.

దారికి అడ్డుగా కూర్చున్న తాటక అప్పట కొసుడిగా లలా లేచి యుద్దసన్నద్ధు రాలు అయింది. ముగ్గురు మనుషులు దొరికారు.

అందు నా మాంసంమీద దానికి అభిరుచి ఎక్కువ. అందునించి పెను తుపానులా విరుచుకు పడింది. కడలి కెరటంలా విజృంభించి సాగింది అందుకు. రాముని మీదికి హస్తాలను చాచి అనేక ప్రయోగాలను ప్రారంభించింది.

రాముడు రవంత సంశయించినాడు.

"మౌనీ! దీనిరూపం అతిభయంకరంగా ఉంది. పన్నులు పనుగు దంతాలవలె ఉన్నాయి. కన్నులు అగ్ని సరస్సున వికసించిన వజ్రాల్లాగున ఉన్నాయి. చన్నులు కొండశిఖరాల్లా ఉన్నాయి. ఐనా అడుదానిమీద బాణం ఎలా ప్రయోగించను" అని సంశయాన్ని మునిముందు పందాడు బాలరాముడు.

"రామా! లోకకంటకి ఇది నరమాంస భక్షకి. రెండు నగరాలు దీనికి ఫల హారంగా అరగింపు ఐనాయి. లోకకల్యాణం కోరిన వాడవు ఐతే అడుది అని సందేహించకు. అంత మొందించు. కోదండపాణివికా!" అని ఉద్బోధించినాడు విశ్వామిత్రుడు. లక్ష్మణుడు సంసిద్ధుడైనాడు.

రాముడు కోదండరాముడైనాడు. దాని భాహువులను ఉద్యమ స్ఫూర్తితో ఖండించాడు. పెనువెంటనే లక్ష్మణుడు మొదటిసారిగా ఆడదానివి అనగా తాటక ముక్కుచెవులు ఖండించాడు. అపునాది సడలిన కొండలా, మొదలు నరికిన మహా కొండలా పెరిగిపోనారంభించింది.

రామబాణం కడసారిగా తాటక గుండెల్ని బ్రద్దలు కొడుతూ దూసుకు పోయింది. అది ఉస్సురని నిట్టూర్చి నేలకూలిపోయింది. దాని నిట్టూర్పులో వేయి శిరస్సుల ఆదిశేషుల బుసలు విన్పించినాయి.

ఇతఃపూర్వమే గంగాతారంలో తాను రామునికిచ్చిన బలి అతిబలవిద్యలు సఫలమవుయని సద్వినియోగ మవుతాయని విశ్వసించాడు విశ్వామిత్రుడు.

ఆతనికి మెచ్చుకోలుగా మరికొన్ని మహాస్త్రాలకుసంబంధించిన రహస్యాలను అక్కడికి ప్రబోధించి అభినందించి ఆశీస్సులందించినాడు తమ్ముడు.

"ఈ రాముని విక్రమస్ఫూర్తి ఒక ఆడదాని వధతో ఆరంభం కావలసిఉందీ కాబోలు. విధివ్రాత అలాఉందికాబోలు అవక్రవిక్రముడైన రాముని పరాక్రమధథ అసురకాంతులను అడ్డు తొలగించటంతో ప్రారంభమైంది. మునివచనం దాటరానిదీ మునిమాట వింటానని తండ్రికి మాటయిచ్చాను. తండ్రిమాటకూడ దాటరానిది. ఎండుమాటల మధ్య రాముడు కేవలం ఒకే తూలిక మాత్రమే అవుతాడు" అని ఆలోచిస్తూ ఎత్తిన కోదండాన్ని సందించాడు రాముడు.

మౌని మరింత పురోగమనం సాగించాడు.

అసురకాంత ఐన తాటక సంహారాన్ని స్మరిస్తూ మౌని వెంటనడిచాడు బాల రాముడు. లక్ష్మణుడు అన్నివిధాలా అన్నను వెన్నంటి నడువసాగాడు.

క్రమంగా వారు సుప్రసిద్ధమయిన చారిత్రవస్థలం సిద్ధాశ్రమాన్ని చేరుకు న్నారు. అక్కడి వశాసులందరికి అశంకిరణంలా కన్పించాడు రాముడు. అయోధ్యా నగరవాసి ఐన అతడు అసురకాంత ఐన తాటకను వధించినాడట. అందుకు మెచ్చి బల, అతిబల అన అతనికి ధారపోశాడట! అని వారంతా అబ్బురంగా చెపకున్నారు. అతడు రాక్షసులను అవలీలగా తునిమివేయగల బలశాలి అనీ వేదవిహిత కర్మల మీద అత్యంత ఆసక్తి కలవాడనీ, మునిజన సంరక్షణ అతడు కర్తవ్యంగా స్వీకరించి నాడనీ విన్నతరువాత వారి ప్రాణాలు కుదుట పడినాయి.

రావణుని ప్రేరణతో విజృంభించిన అసురుల వర్గాలను అతడు నిగ్రహించ గలడని విన్నప్పుడు వారికి ముక్తికాంత దర్శనమిచ్చినంతగా ఆనందమైంది.

సంకల్ప ధోరణుడైన రాముని వారు అవతార పురుషునిగా భావించారు. ఒక సాధ్వి తనవాడైన పురుషుని తనకోసం ప్రాదుర్భవించిన అవతార పురుషుడుగానే భావిస్తుంది. ప్రాణదాత ఐన రాజుని నా విష్ణుః పృథివపతిః అని ప్రశంసిస్తారు. సమయోచితంనోపాయం చేసినవారిని దైవమే ఈ రూపానవచ్చి ఆదుకున్నాడని సంతృప్తులవుతారు ఆర్తులు.

అటువంటి పనివాడైనా పసగలవాడు. చిరుతవయసున ఉన్నా విచక్షణాశీలి. ఒకటన్నర దశాబ్దమైనా వయసునిండని రాముడు తాటకను వధించినాడంటే అందులో అబ్బురమేమి ఉన్నదనుకోవాలి. అతడు మౌనులందరికీ అవతారపురుషు డయినాడంటే అసంగతమెలా అవుతుంది. అతడు అవతారపురుషుడే కాకుంటే తన దృష్టిపథానికి వచ్చేవాడుకాదు. అని సంభావించినాడు విశ్వామిత్రుడు.

యింక యాగం ప్రారంభించాడు. మౌనులంతా దీక్షాకంకణాబద్ధులైనారు. యానం నిర్విఘ్నంగా కొనసాగుతోంది. రామలక్ష్మణులు విల్లునమ్ములు ధరించి యాగసంరక్షణార్థం తిరుగాడుతున్నారు. వారి బాహువులు యజ్ఞవేదికనించి దిగంతాల వరకూ ప్రత్యక్షిస్తున్నాయి. పంచదివరాత్రులు యజ్ఞం నిర్విఘ్నంగానే కొనసాగింది. మరొక్క ప్రొద్దుజరిగి ఆహుతి అయిపోతుంది. అందాకా ఎటువంటి మాయలు కన్పించలేదు.

అసలు ఈ ప్రాంతాలలో అసురగణాల సంచారం ఉన్నదా లేదా అని సంశయం కలిగేంత ప్రశాంతంగా దినాలు గడచిపోయినాయి. మునులు హర్షించారు.

కాని విశ్వామిత్రుడు రామచంద్రుని హెచ్చరించాడు. సూర్యకుల సంభావితుడయిన దాశరథా! రాక్షసి మాయలు అమానుష్యంగా ఉంటాయి. వారి వ్యూహ రచనాధురీగా ఆ రావణుని నిర్దేశకత్వంలోంచి వచ్చినది. అందునించి నీవు కడు జాగ్రత్తతో మసలుకోవాలి" అని హెచ్చరించాడు.

రామలక్ష్మణులు ఋషివాక్కులు వృథాకావని ఎదురు చూచారు. మీరు నాడు అనగా పూర్ణమికి నాడు ఆశ్రమానికి అల్లంత దూరంలో రెండు కారుమేఘాలు కన్పించినాయి.

ఆ మబ్బుతునకల పేర్లు మారీచ సుబాహులు. మారీచుడు రావణుని మంత్రి వర్గంలోనివాడు. లంకాధినేతకు అత్యంత అంతరంగికుడు అమిత శక్తిశాలి. మీరు మిక్కిలి అతడు తపోమూర్తి. అతని వెంట అసురగణాలున్నాయి.

వారిని చుడగానే అన్నదమ్ములు లిరువురూ కనుసైగలతో హెచ్చరించుకుని విల్లులు ఎక్కుపెట్టారు. రాముడు వారందరికి అధినేత అయన మారీచుని ముందుగా గుర్తించాడు అతడు తన నిశాచర గణాలతో యజ్ఞ విఘ్నులయిన పనులు చేయించటం ప్రారంభించారు. పటాటో పం ఫెళ ఫేళరావాలు చేశారు.

కుండలతో రక్తం తెచ్చి యజ్ఞవేదికలమీద గ్రుమరించారు. మాసం ఖండాలు ముని వాటిక అంతా విరజిమ్మారు. యజ్ఞ కుండంలోకి అగ్నిని చల్లార్చేందుకు ప్రయత్నించారు. ఇదంతా వేదవిహిత మయిన యజ్ఞ కర్మానుసమయించాలని మౌనుల కార్యకలాపాలకు అవరోధం కల్పించాలి అని.

అయితే రాముడు ఎక్కుపెట్టిన ప్రథమాస్త్రన్ని ప్రయోగించాడు అది నేరుగా దూసుకుపెళ్ళి తపస్విలి, మంత్రి అయిన మారీచుని వక్షస్సులో నాటింది. అతడు సముద్ర తీరానికి వెళ్ళి స్పృహ కేకుండా పడిపోయినాడు.

ఈమారు అగ్నేయాస్త్రం ఎక్కుపెట్టాడు రాముడు అందాకా అన్నగారి ఆజ్ఞల్ని పాలిస్తున్న సుబాహుడు మారీచుని వ్యసనంతా కుపితుడయి విజృంభించాడు. అగ్నిశిలీముఖం వెళ్ళి అతని గుండెలలో నాటింది. దాంతో అతడు భూమిపైపడి రామబాణం కలిగించిన వ్యధను అనుభవిస్తూ విలవిలతన్నుకున్నాడు. అతని అసుర గణాలు అనాయకమై కలగుండు పడినాయి.

ఈమారు వారందరికి ఒకే అస్త్రం ప్రయోగించాడు. వాయువ్యాస్త్రం వ్యాఘాతానికి బలిఅయినారు రక్కసులు.

రాముడు విజేతఅయి విల్లుదింపాడు.

యజ్ఞం పూర్ణమయింది. అగ్నినించి అంతర్యామి వరకూ అందరికి హవిస్సులుచెల్లించి తృప్తగాలేచారు మౌనులు, అందాకా మౌనదీక్షాబద్ధుడైన విశ్వామిత్రుడు కూడ యజ్ఞవాటికనించి ముని వాటికకు వచ్చాడు.

రామలక్ష్మణులకు సిద్ధాశ్రమంలోని వారంతా జేజేలు పలినారు. వారిసామర్థ్యము సద్బుద్ధి చూచి సంతృప్తుడయినాడు విశ్వామిత్రుడు ముల్లోకాలలోని మౌనులందరికి పీడగా పరిఢవిల్లుతున్న అసురగణాలు ఈతనివల్ల మర్దించబడతాయి

రావణుని పేచవిదుడైనా రాక్షస రక్షణకోసం అసురగణ ప్రవృత్తిని స్వీకరించాడు. అతడు పరాక్రమశాలి అయినా లక్ష్యాలు లోకకల్యాణ కారకమయినవికావు.

దాశరథి చిన్నవాడైనా బుద్ధిశాలి. వింతపరాక్రమశాలి ఐనాడు అతిశీలవంతుడు కూడఅయినాడు. అందునించి ఈ ఇరువురిలో ఇతడే విజేతకాగలడు" అని దృఢ నిశ్చయుడయినాడు. అందువించి యజ్ఞం పూర్తి అయినా రామునికీ వీడ్కోలు చెప్పలేదు.

# 6

జానకీ స్వయంవరానికి మునులంతా పయనమవుతున్నారు. విశ్వామిత్రుడు కూడ మిథిలానగరం వెళ్ళేందుకు సంసిద్ధుడయినాడు.

ముని గణాధ్యక్షుడయిన గాంధేయుని పయనం నిర్హేతుకమయినది కాదు.

అతని సంకల్పాలు అమోఘమయినవి

రాజర్షి ఐన జనకరాజు మిథిలానగరానికి ఏలిక. గౌతమ మహర్షి తమ భవుడయిన శతానందుడు రాజగురువు. జనకుడు జంభూద్వీపంలోని రాజులందరిలో తాత్త్వికుడు యశోవిరాలుడు. జానకి స్వయంవరమంటే భూమాతకే నిండయిన పండుగ! ఆ పండుగ చూచేందుకు వారంతా కన్నులంతింత చేసుకుని ప్రయాణానికి సమాయత్తులయినారు.

"రామా! ఈ వేడుకకు చూచేందుకు నీవు మా వెంట ఉండాలి" అన్నాడు విశ్వామిత్రుడు. మౌని వచనాలను అనుసరిస్తానని తండ్రి కిచ్చిన వాగ్దానాన్ని స్మరితదాడు. దాశరధి.

"నేను మీ వెంటనే ఉంటాను" అని మాట యిచ్చాడు. ఆనందోత్సాహల మయింది. గాధేయుని అధినేతృత్వంలో మునిజనిపాళి అంతా ప్రయాణమయింది. ముందుగా తాము ఆవాసముంటున్న సిద్ధాశ్రమానికి వివినయ వినమ్రులయికై వారం తిరిగారు. తమకు అంతకాలం ఆశ్రయమిన్నిన సిద్ధాశ్రమానికి ప్రదక్షిణలు చేసి మ్రొక్కులు చెల్లించారు.

ఒక సమూహం మిదిలానగరంవైపు బయలు దేరించి. ఆ సమూహం పేరు తపోశక్తి. ఆటవీ మార్గమున పురోగమిస్తోంది.

వారికి అధినేతృత్వాన్ని నిర్వహించే విశ్వామిత్రుడు సుదీర్ఘమయిన జీవతానుభవంకల ధీశాలి. అమితమైన పట్టుదలతో అసాధ్యమైన వాటి నెన్నింటినో తన దృఢదీక్షతో స్థిరచిత్తంతో సుసాధ్యమని నిరూపించిన ప్రజ్ఞాపాటవాలు కలిగినవాడు. అతనికి అనుకూల ప్రజ్ఞకాదు. ప్రతికూలప్రజ్ఞ అతని జీవితమంతా పోరాటలే!

ఎవరో ఒక శక్తిశాలి అయిన వారిని ఎదిరించటం. అసాధ్యమయిందానిని సుసాధ్యం చేస్తానని పంతం పూనటం, ఆ ఎదురొక్కలుకు నిలిచి పోరాడటంమే అతని జీవిత కథ!

గాధేయుని అనుభవాలే దృహత్తర మయిన చరిత్ర.

విస్తారమయిన అతని జీవితానుభవాలు ఎవరిసయినా వెలుగుదారి చూపుతాయి. అవన్నీ వింటూ మార్గాయాసం మరచిపోయినారు మౌనులు. రామలక్ష్మణులు గాధేయుని పట్ల అత్యంతా సక్తులయినారు. దారినడచి వారంతా ఓ నదీ తీరానికి వచ్చారు.

జనావాసాలు చేరువవుతున్నకొద్దీ అసురుల సంచలనం వెనుకపడుతోంది. విశ్వామిత్రుని మనోమయ ప్రపంచంలో అసురగణాల ఆట కట్టించాలన్న సంకల్పం

చలియమౌదోంది. సంకీర్ణ మహాపురుషుడయిన రావణుని ఎదుర్కొగలిగిన శక్తి శాలి, స్థిరసంకల్పుడు, ముని జన రక్షణ దీక్షాపరుడు ఐనవాడు రాముడొక్కడే! అతనికి అస్త్ర సంచయమంతా యిప్పటికే యిచ్చేశాడు తాను. బల అతిబల విద్యా రహస్యాలను అందించాడు.

ఇంక చేయవలసింది అతని లక్ష్యం వైపుగా పురోగమింప చేయటమే! అందుకు ప్రథమ సోపానం వివాహం. అందుకే మిథిలా నగర సందర్శనం ఏర్పాటు చేశాడు తాను. జనకుడు రాజర్షి కావటం వలన అతనితో బంధుత్వమూ, అతని ఆశీస్సులూ రాముని సంపూర్ణమ పురుషునిగా రూపొందిస్తాయి.

దాశరథపురుషోత్తముడయితే అంతకన్న కావలసింది ఏమీలేదు. మునిజనుల ఆశయం సిద్ధించినట్టే.

"గురుదేవా! మీ సంకల్పాలు అమోఘమైనవి అని నా తండ్రి చెప్పగా విన్నాను. మీ ఆదేశం మేరకు మిదిలకు పయనమైనాను.

ఇప్పుడు మనం మిథిలకు వెలుతున్న కారణమేమిటి?" అని అడిగాడు. కోదండపాణి లక్షణుడు అన్నగారి సంశయని వృత్తికై గా చెప్పేమాటలను శ్రద్ధా శువు ఆలకించసాగాడు.

"నాయనా! కౌసల్యా తనయా! నీవు వయసున చిన్నవాడైనా వీరుడవు. సిద్ధాశ్రమంలోని యాగాన్ని సంరక్షించేందుకు ఒక మిష కల్పించి నిన్ను తోడ్కొని వచ్చాను. నేను కావాలనుకుంటే నీ తండ్రి ఐనా రాగలడు. నా తపోబలంతో నా యాగాన్ని నేను అయినా రక్షించుకోగలను. కాదనుకుంటే మిథిలా నగరాధీశుడైన జనకమహారాజు స్వయంగావచ్చి యాగసంరక్షణార్థం నిలువగలడు. ఇవన్నీ కాదని నిన్ను చిన్నవాడవని ఐనా చూడకుండా ఎందుకు తీసుకువచ్చానో తెలుసా!

నీవు పురుషోత్తముడవు కావాలి. అసురగణాలు సురపక్షపాత్రులైన మౌనుల వట్ల సలుపుతున్న దురాగతాలను నీవు ఎదుర్కోవాలి. అందుకు నీకు సకలమైన శస్త్రాస్త్ర సంపత్తి సమకూరాలి. ఉన్నతమైన లక్ష్యసాధనకు అచంచలమైన కృత నిశ్చయం కావాలి తండ్రీ! ఒకప్పుడు నీ తండ్రిలాగా ఒక మహారాజు బిడ్డను నేను. ఈనాడు బ్రహ్మర్షిని కాగలిగినానంటే అందు నేను చేసిన పోరాటం చెల్లించిన మూల్యం వెలకానిది.

మహాత్కార్యాలను చేయగలిగేందుకు మహత్తరమైన ప్రయత్నం కావాలి అన్న సందేశానికి నిర్వచనమే కదా నా ఈ సుదీర్ఘమైన జీవితం, నీవుకూడ మహా

పురుషుడవు అయేందుకు, మహత్కార్యాలు చేసేందుకు నియమితుడవు కావాలని మునిజనపాల మనసార కోరుతోంది.

అందుకు తన అండదండలను, తపోశక్తి సాధనలయిన అద్భుత శాస్త్రాస్త్ర సంపదలను నాకు అందిస్తోంది. ఆ ప్రయత్నంలో ఒక భాగమే మిథిలా ప్రయాణం అనివచించినాడు విశ్వామిత్రుడు.

ఆతని మాటలు దాశరథిలో చిత్రమైన ఆశలని రేకేత్తించింది. "ఏమిటో? ఈమునిజనపాళి తనమీద ఆశలు పెంచుకుందా? తమ అమూల్య తపోశ్శక్తి సాధనాలయిన శస్త్రాస్త్ర సంపదను యావత్తూ తనకు అర్పించాలను కొంటుందా? ఏమిటా చిత్రం వీరంతా అలా ఎందుకు అనుకుంటున్నారు.

రాక్షసులను చంపేందుకు మహావీరులుండగా తననే ఎందుకు ఎంపికచేసిన డు మహర్షి. ఇంతకూ తనచరిత్రను ఆదర్శంగా తీసుకోమనికదా మహర్షి చెప్తున్నాడు. ఏమిటా చరిత్ర అన్న సంశయం కలిగింది కోదండపాణికి.

"మునీంద్రా! ఆదర్శమూర్తులైన మీ బృహత్కథను వినాలని, ఆసక్తిగా ఉంది. మీ వంటి పూతచరిత్రల కథమ విని దాన్ని ఆదర్శంగా తీసుకోవటం కన్నా నాకు కావలసినదేముంది.

పవిత్రమైన మా పూర్వక కథనువినే అదృష్టం నాకు కలిగించండి" అని అడిగాడు రామచంద్రుడు. ఆతని సౌమ్యస్వభావం మునీంద్రుడికి ఎంతో ఆసక్తి కలిగించింది.

తమను కాపాడే సంరక్షకునిగా, తమ ప్రతినిధిగా స్వీకరించాలని ఎంపిక చేసిన బాలరాముని వద్ద అర్హతలన్నీ కన్పిస్తున్నాయి. అసుర గణాధ్యక్షుడైన రావణుడు బ్రహ్మవక్తితూ, దక్షిణాపథము అనేము దు లోకాలలో అల్లకల్లోలం రేకెత్తించాడు.

మునివాటికలు ధ్వంసంచేసి మునులకు నిలువనీడలేకుండా చేశాడు. యజ్ఞ యాగాలు ఆగిపోతున్నాయి. ఆతనిమీద ప్రయోగించేందుకు వారంచరికి సంపూర్ణత మూర్తీభవింలన ఒక మహాపురుషుడు కావలసినచ్చాడు.

అటువంటి ఉద్ధతుడయిన రావణుని ఎదిరించాలంటే, ముల్లోకాలను జయించిన రావణుని ఓడించాలంటే ఆ పురుషునికి ఎంతటి వీర్యసంపద కావాలి.

అతడు వేదవిధాలందు అచంచలమైన విశ్వాసంకలిగినవాడై అయివుండాలి. మునిజనగణ రక్షణకై దీక్షవహించినవాడు కావాలి.

ధర్మరక్షణకై అనగా సాంఘిక కట్టుబాట్లను కాపాడేందుకై సోదరులను భార్యను, చివరకు దన ప్రాణాలను అయినా లెక్క-చేయని ధీశాలి కావాలి. సత్స ర్యంధత, వ్రతదీక్ష. వీరత్వమూ, సాహసమూ ఇవన్నీ కావాలి.

అటువంటి లక్షణాలన్నీ ప్రోగుపోసినట్లున్న రాముడే రాముడు రామో విగ్రహవాన్‌ధర్మః! అటువంటి రాముడు కర్తవ్యదీక్ష బద్ధుడు అయేందుకు తాను మునుఃపక్షాన ప్రతినిధి అయినాడు. అదే మహత్తరమైన వరంగా భావించాడు గాధిసుతి.

“రామా! ఈనాడు రాక్షసులచేత అవమానించబడుతున్న ఈ బ్రహ్మర్షిని అయేందుకు పూర్వగాధ ఎంత జటిలమైనదో విను. అంత శ్రమించి సాధించిన బ్రహ్మర్షిత్వం అసురగణాలవల్ల ఎలా అవమానింపబడుతున్నదో నీవు చూచావు. అంత కష్టసాధ్యమయిన దాన్ని సాధించుకుని ఇలా అసురగణాలచేత అవమానించ బడుతున్నామంటే అదెంత బాధాకరమో అర్థంచేసుకో!

అప్పుడు ఈయన జనవాళిపట్ల నా కర్తవ్యమేమిటో నిర్ణయించుకో! మేము సాధించిన ఈ బ్రహ్మర్షిత్వం ఒక్కొక్క నిశాచరుని దగ్గర కొరకానిది అవుతోంది. ఎందుకో తెలుసా!

వేదవిహితమైన తేజోమార్గాన జీవించే సాంఘికులం మనం అందుకు భిన్నమయినవారు అసురులు.

ఇది సిద్ధాంత పోరాటమే అయినా వారు దుందుడుకుగా మనమీందికివస్తున్నారు. వారిని నీవు నిగ్రహించగలిగితే వేదమార్గం సమాజంలో సుప్రతిష్ఠతమవుతుంది.

అందుకోసమే, నీకు కృతనిశ్చయం కలగటం కోసమే ఈనాడు అసురా చేత అవమానించబడిన బ్రహ్మర్షి తావన్ని నేను ఎంత శ్రమకోర్చి సాధించానో నీవు తెలుసుకోవాలి” అంటూ తన కథను చెప్పటం ప్రారంభించాడు గాధితిసూతి. ఆ మహర్షి చరిత్ర అంతా ఆతని వచోవిభవం వల్ల రామలక్ష్మణుల వలననే తంద్రి బిందు ప్రత్యక్షమవుతోంది.

వారు వింటున్నట్లుకాక ఆ దృశ్యాలను చూస్తున్నట్లుగా అనిపించసాగింది.

× × ×

కోశా నదీతీరానకు శనాభుడి రాటధాని కౌశాంచి. ఆతడు ఆత్మసంయదునల కలిగిన మస్సురాజు. కోపతాపాలకు వశుడు కాబేడు. తన సంతానమయిన అర్థ

పిల్లలందరూ వాయువుచేత ప్రేమించబడ్డారు. తిరస్కరించి శపించబడ్డారు. కుశనాభుడు ఎంతో సంయమనాన్ని ప్రదర్శించి వారికి వేరే పెళ్ళి చేసాడు.

కౌశాంబికి వారసుడయిన మగబిడ్డ అతనికి కలుగలేదు. అతనికే విషయం ఎంతో బాధాకరమయింది. ముని లందరిని సమావేశపరచి సంతానప్రాప్తికై మార్గం చూపించమని వేడుకున్నాడు అందుకు వారు ఆలోచించి "రాజా! మేము చెప్పిన క్రతువును నీవు నిర్వహించగలగిలే పుత్రవంతుడవు అవుతావు" అని చెప్పారు

దాంతో కుశనాభునికి వడలిపోయిన ఆశలు చిగురించినాయి. అత్యంత దీక్ష కంకణ బద్ధుడయి యజ్ఞం నిర్వహించాడు. నిలుమలు ప్రవచించినట్లుగా అతనికి సంతానం కలిగింది. అతనికి గాధి అని పేరుపెట్టి తన తరువాత రాజును చేశాడు కౌశాంబి.

ఇప్పుడు కౌశాంబిని పాలించే రాజు గాధి. అతని తనూభవుడు కౌశికుడు. అతడే విశ్వామిత్రుడయినాడు. కౌశికుడు ఉద్ధతుడు అయి రాజ్యపాలన చేశాడు. అతని ఆత్మవిశ్వాసం అచంచలమయినది. అతని సంకల్పాలు కొలంవలె అప్రతిహతమయినవి. ఆతని మనో సింధువులో జనించే ఆలోచనా తరంగాలుఎవరూ ఆపరానివి. అని వార్యమయినవి.

ఎంత పరాక్రమవంతుడో అంత పట్టుదలకలిగిన రాజు గాధేయుడు ఓటమి పట్ల రవంత అయినా ఓరిమ వహించగలిగినవాడు కాదు.

అతడు అమిత స్పందనాశాలి, చైతన్య ప్రవాహం వంటివాడు. అనుకున్నది సాధించటంలో అతని సాటి మరొక్కరులేరు.

క్షత్రియుడయిన కౌశికుడు మృగయా వినోదం కోసం ఒకసారి అరణ్యానికు వెళ్ళాడు. మానవ జీవితంలో క్షణాలనే పొంచి ఉన్న మిన్నాగుల వంటివి. లేదా ఏ క్షణంలో ఐనా ఎక్కడయినా రాలిపడనున్న ఉల్కల వంటివి

అటువంటి క్షణాల ఒకటి ఎదురయింది కౌశికునికి. అదృష్టమో దురదృష్టమో తెలియదుకాని బ్రహ్మర్షి ఐన వశిష్ఠుని ఆశ్రయంలో ఒకరే యుగడుపవలిసి వచ్చింది.

అంత దికున మౌనుల శక్తి సంపన్నత మీద కౌశికునికి ఒక అవగాహన ఉన్నట్లు కన్పించదు. ఈ బడుగు ఆడంబరంగా సైనిక పటాలంతో కదలి వచ్చిన తన కేమి మర్యాదలు చేయగలడు లెమ్మని భావించాడు కౌశికుడు. మహర్షి పాదాలకు

సాంప్రదాయాన్ని అనుసరించి మొక్కనయితే మొక్కాడు. కాని తన పూర్వులంతా వారిలో ఏ శక్తిని చూచి అలా మ్రొక్కారో గ్రహించలేక పోయినాడు.

బ్రహ్మర్షి ఐన వశిష్ఠ కులపతి ప్రభువును ఆశీర్వదించి అతని వినయ సంపత్తిని అభినందించాడు. ఆ విధ్యం స్వీకరించమని అర్ధించాడు కౌశికుడు మనసులో నవ్వుకున్నాడు.

ఈ బడుగు ప్రాణి ఒక రాజు సైన్యానికి ఆతిధ్యమివ్వగలడా! ధర్భ కర్రలూ, కృష్ణాజినాలూ తప్ప ఈతని దగ్గర ఏమున్నాయి అనుకున్నాడు. ఈ పర్ణశాలలో రాజ భోజనం అమర్చగలడా?

"మహర్షీ! నీవు ఎక్కడ శ్రమించగలవు. అసంఖ్యాకమయిన సైనిక బలాన్ని సమీకరించుకుని వచ్చిన రాజును నేను. వారందరికీ ఆతిధ్యమివ్వటం మాటలు కాదు. నా దారి నేను చూచు కుంటాను" అన్నాడు. అందుకు వశిష్ఠుడు అంగీకరించలేదు.

"కౌశికా! మీరెందరున్నా నేను ఆతిధ్యమివ్వగలను. భగవద్దత్తమయిన అను సరించి మీకు ఆతిధ్యమిస్తాను. అతిధి స్వయం విష్ణుః అనికదా ఆర్యోక్తి. అది కాక నా విష్ణు పృధివీపతిః అని కూడ శాస్త్రులు చెప్పుతున్నారు. ఏ విధంగా చూచినా నీవు విష్ణు స్వరూపుడవు. అందునించి నిన్ను అర్చించి కృతార్థుడను అవుతాను" అన్నాడు

ఆతని ఆత్మధృతి నిండారిన మాటలు విన్న కౌశికుడు ఆశ్చెరువు పడిపోయి నాడు. తన అనుమానాన్ని నివారించుకునేందుకు అలాగే అని అంగీకరించాడు.

ఆ హోమధెనువు గొప్ప తనం ఏమిటో తెలిసుకోవాలని కూడ అభిలషించి నాడు గాధి సూతి.

ఆతని అనుమానాలు ఎందుపూర్తి అయిం తరువాత పటాపంచలు అయి నాయి. మొత్తం సేనకు అనూహ్యమయిన విందు భోజనం యిచ్చాడు వశిష్ఠుడు. అంతేకాక అడిగిన వారికి అడిగిన కానుకలు ఇచ్చాడు. ఒక మహారాజు మాత్రమే చేయగలిగిననదంతా సునాయాసంగా చేసేశాడు.

అంతటి ఉద్ధతిని ప్రదర్శించిన వశిష్ఠుడు కౌశికునిలో అసూయ రగిలించాడు. అసూయ అనేది అగ్ని తుల్యమయినది. అది గాధేయుని మనసును మండించ సాగింది.

"ఔరా! ఏమి ఈ బడుగు తపస్వి కౌద్ధత్యము. దర్భకర్రలు కృష్ణాజినాలు మాత్రమే నా ఆస్థి అని చెప్పుకోగలిగిన ఈతడు ఒక మహారాజు చేయగలిగినంత చేశాడు, నాకు రాజ్యముండి, పుష్కలమయిన సంపదలతో నిండిన కోశా గాద ముండి యింతకన్నా నేను అధికంగా చేయగలిగినదేమున్నది.

ఈ హోమధేనువు ఒక్కటి ఉండిన చాలదని" అని సంభావించినాడు కౌశాంబ ప్రభువు.

సుప్రభాతాన ముని దగ్గర శలవు తీసుకునే సమయాన అర్థంవుగా అడిగాడు."

"బ్రహ్మర్షీ! రాజ్యంలోని అపురూపమయిన నీ సంపదలు రాజుకే చెందాలి. ఒక్క రాజు తప్ప ఎవరూ అమరించలేవి అపురూప హోమధేనువు నీ కెందుకు ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే నీకు దీనితో పనేమున్నది, ఇది మా వంటి రాజుల దగ్గర ఉండాలి. మీ మునివాటికకు అవుసరమయిన దంతా మేము సమకూర్చు తున్నాముకదా! దీన్ని సంకోచించక నాకు ఇచ్చివెయ్యి" అని అడిగ డు.

అందుకు వశిష్టుడు అంగీకరించ లేదు. "రాజా! ఈ హోమధేనువు అతడు విత్రమయినది. పూజనీయమయినది. సాధారణ మయిన సామాజికులు స్వార్థ చింతనతో ఉంటారు. అందునించి యిది అటువంటి వారిదగ్గర ఉండరాదు. విస్వం గుల మయిన మావంటి వారి దగ్గర ఉండవలసిందే! అందునించి దీన్ని పొందాలనే తలపు విడిచిపెట్టి యధావిధిగా వచ్చిన దారిన తిరిగిపో!" అన్నాడు ఖండితంగా.

అది రాజాజ్ఞ ధిక్కరించినట్లుగా అని పించింది కౌశికునికి. తన బల పరా క్రమాలను అవమానించినట్లుగా అని పించింది. పంతం మరింత అయింది.

"వశిష్ఠా దీన్ని నేను తీసుకు వెళ్ళదలచాను. అందుకు నీవు అంగీకరిస్తే మంచినాడవు అవుతావు. లేద నా చేతిలో పరాభూతుడవు అవుతావు" అన్నాటు. తన అధిక్యతను ప్రదర్శిస్తూ.

వశిష్టుడు నవ్వి ఉరుకున్నాడు. అవునన లేదు. కాదనలేదు. తన కృత్యా లలో తల్లీనుడు అయినాడు. పట్టినపట్టు విడువటం ఎరుగని కౌశికుడు మండి పడ్డాడు. రాజుగా తాను ఒక బడుతా పసిముందు పరాభూతుడయి తల వొంచవలసి రావటం తక్కువ తనమే అని భావించాడు.

తన పరివారాన్ని పిలచి హోమధేనువును వశీకరించుకోమని అనుమతి యిచ్చాడు గోవు సాధు జంతువు. అది వారిచేతులలో అమాయకంగా బందీ అయి పోయింది. వారుచేసిన అవమానానికి పెట్టిన హింసకు తలఒంచి ఊరుకుంది.

ఈ విషయం మునివాటికలో కులపతి అయిన వశిష్ఠునికి తెలిసింది. అతడు హోమధేనువును ప్రార్థించాడు. "ఓ శక్తి స్వరూపిణీ! నిన్ను నీవు రక్షించుకో! తపోబల సంపన్నుడను అయినప్పటికీ పాలకుడయిన వాని మీద వాయివిడిచి నేను శపించరాదు. రాజు తనకు ప్రజలనించివచ్చే సంపదలతో కొంత భాగాన్ని మునివాటికలకు ఆశ్రమ నిర్వహణలకూ యివ్వటం అనూచానంగా వస్తున్న ఆచారం. అందునించి అతనిపట్ల నేను కృతజ్ఞతా నిర్దుడను. నిన్ను నువ్వే రక్షించుకోవాలి" అని ప్రార్థించాడు.

అతని అనుజ్ఞ అయిన తరువాత ప్రదాయిని అయిన గోమాత ఒక్క క్షణ అయినా జాగుచేయలేదు గిట్టలను నేలకు తాటించింది. తోక కదలించింది. కొమ్ములు ఊచింది. దాని అంగాంగాలనించి అపారమయిన సేనా వాహినులు ప్రాదుర్భవించినాయి.

దాన్ని శక్తి సంపన్నత ముందు కౌశాంబి పాలకుడయిన కౌశికుడూ అతని సైన్యశక్తి మొత్తం డీల్లపడినాయి. అతడు తలదింపుకుని వెళ్ళిపోయాడు.

కాని అధికాధికమయిన పంతం పట్టే స్వభావం కలిగినవాడు కావటం నించి ఊరకుండ లేకపోయినారు. తన మంత్రులను రాజ గురువులనూ సంప్రదించాడు

బ్రహ్మర్షి అయిన విశ్వామిత్రుడు తపోబల సంపన్నుడు. తప శక్తి ముందు ఈ సృష్టిలో శక్తులన్నీ తలలు దించుతాయి. అందునిచి చాయగలికంగా రవంత అయినాలేదని విన్నవించారు వారు.

రాజు అయిన విశ్వామిత్రుడు దీర్ఘంగా ఆలోచించాడు. ఇంతకన్నా శక్తివంతమయిన బ్రహ్మర్షి పదవి ఒకటి ఉండగా ఈ రాజపదవితో సంతృప్తి పడిఉండిపోవటం కేవలం తన అసమర్థత అని భావించాడు.

ఎలాగయినా దీన్ని సాధించాలి. తన కోరికను తిరస్కరించి కూడ తన ఆధిక్యత మని రూపించుకున్న వశిష్ఠుని కన్నా మహత్తరమయిన శక్తుల్ని సాధించాల అని నిర్ణయించుకున్నాడు.

అలా నిర్ణయించుకున్న తక్షణమే తన రాజ పదవిని తృణ ప్రాయంగా విడిచి వేశాడు శృంగోత్తుంగమయిన హిమగిరులకుపోయి విస్ఫంగుడయి తపస్సు చేశాడు.

దయాంతరంగుడయిన మహాదేవుని ప్రసన్నం చేసుకున్నాడు. పరమశివుడు ప్రసన్నుడయి అద్భుతమయిన ఆయుధాలెన్నింటినో యిచ్చాడు. కౌశికుడు విజయా కాంక్షతో వశిష్ఠుని మీదికి తిరిగి దండయాత్ర సాగించాడు.

తాను సాధించిన అపూర్వమయిన ఆయుధాలన్నింటిని అతని మీద ప్రయోగించాడు. కాని మహర్షి చేతిలోవి బ్రహ్మ దండం అతని ఆయుధ శక్తులన్నింటినీ సమయించింది. తిరిగి మరొక్కమారు పరాభూతడయినాడు కౌశికుడు.

కాని అతని పట్టుదల మాత్రం రవంత ఐనా సడలలేదు. అప్పటికి సాదించిన రాజర్షి పదవి తృప్తిని ఇవ్వలేదు. తిరిగి బ్రహ్మ గూర్చి తపస్సు ప్రారంభించాడు.

ఏండ్లు పూండ్లు గతించినాయి. తపస్సుదు ఉగ్రతరం చేశాడు. గాధేయుడు, అతడు రాజర్షి అయి బ్రహ్మర్షి అయేందుకు ముందుగా ఒక అగ్నిపరిక్ష ఎదురఇంది. తన తపోశక్తి యావత్తూవ్యయ పరచాల్సిన సంఘటన సంప్రాప్తమయింది.

ఐనా గాధేయుడు వెనుకంజ వేయలేదు.

త్రిశంకుడనే మహారాజు అనేక యజ్ఞయాగాలను నిర్వహించిన కర్మిష్ఠి. అతడు బొండితో స్వర్గానికి పోవాలన్న ఒక విచిత్రమయిన అసాధ్యమయిన కోరికతో కొట్టుమిట్టాడు తున్నాడు. విశిష్ఠుడఇన బ్రహర్షి వద్దకు వెళ్ళి" ఆరా ! నాకోరిక తీరేది" ఎలా అని అడిగాడు.

వశిష్టుడు "అది దుస్సాధ్యమయిన కోరిక. విపరీతమయిన ఆలోచన" అని చెప్పాడు. ఐనా అతని మనోగతాన్ని మరల్చుకోలేదు. వశిష్టుని తనూభవులను అర్థిస్తే వారు అవహేళన చేశారు.

తపోశక్తి సంపన్నుడయిన త్రిరంకుడు వారిని శపించాడు. వారిచేత మళ్ళి శపించబడినాడు. యింతఐనా అతని కోరిక నెరవేరనే లేదు. తృప్తకలుగలేదు.

ఒకప్పుడు మహా క్షామం సంప్రాప్తమైంది. ఆ క్షామంలో జానపదులే కాక, వనవాసులు కూడి భుక్తికై కటకటపడిపోయినారు. అట్టి స్థితిలో గాధేయుని కుటుంబాన్ని ఆదుకున్నాడు త్రిశశకుడు. ఇప్పుడాతని దగ్గరకు వెళ్ళినాడు.

"గాధినందనా ! నీవూ నావంటి క్షత్రియుడవే ! నేను బొందితో స్వర్గానికి పోవాలన్నకా మనతో కొట్టుమిట్టాడు తున్నాడు.

వశిష్టుడు, అతని పుత్రులు నాకోరికను మన్నించకపోగా అవమానించారు. వారు చేయని పని మీరుచేయలేదా ! అని అర్థించాడు త్రిశంకుడు.

గాధి సూతికి ఇది మంచి అవకాశమైంది. తనను కూడ అవమానించాడు వశిష్ఠుడు. అతనిపై ప్రతీకారం తీర్చు కుందుకు ఇది మంచి అవకాశం. తన తపో శక్తి సమస్తాన్నీ పణంగా పెట్టినాడు కౌశికుడు.

త్రిశంకుని చేత అద్భుతమైన క్రతువులు చేయించి అతని అమరపురికి పయనం కట్టించాడు. సజీవుడై అమరన తిరిగివొస్తున్న త్రిశంకుని త్రిప్పికొట్టాడు దేవేంద్రుడు. అప్పుడు మధ్యేమార్గంలో మరొక అమరావతిని నిర్మించాడు కౌశికుడు, తన మాట నిలుపుకునేందుకు ప్రతి సృష్టిచేశాడు.

అతడు ఎంత అద్భుతమైనవాడో! అమరావతినే కాక దేవేంద్రుణ్ణి దేవతలను, ఆకాశాన్ని, నక్షత్రశ్రేణిని, నభోమండలంలోని అద్భుతాలను అన్నింటిని త్రిశంకుని చట్టూ సృష్టినిచాడు. అపర బ్రహ్మ అయి విజృంభించాడు.

అతని విశ్వామిత్ర సృష్టికి లోకం పెరగుపడింది. తపోశక్తి యావత్తూ అలా వ్యయమైపోయింది. ఐనా ఆడిన మాటనిలుపు కున్నాడు విశ్వామిత్రుడు. ఆ తరువాయి బుద్ధిశాలి ఐన బృహస్పతి బ్రహ్మ తదితరుల హితవాక్కులను ఆలించి మళ్ళీ హిమనరానికి వెళ్ళిపోయినారు. అనన్యమయిన తపస్సుచేసి సఫలీకృతుడయినాడు.

తుదకు మహా పురుషులంతా దిగివచ్చి "నీవు బ్రహ్మర్షివి ఐనావు" అని యోగ్యతా పత్రాన్నియిచ్చేశారు. కౌశికుని అంతర్యం ఆనంద ముతదాకిని అయి పోయింది అతడు వశిష్టుని దర్శించాడు. సంయమి ఐన వశిష్ఠుడు "బ్రహ్మర్షీ! స్వాగతం" అంటూ కౌశికుని సత్కరించాడు. అలా తన పంతాన్ని నెగ్గించుకున్నాడు; కౌశికుడు.

పట్టుదల ఉండి క్రియాశీలత ఉన్నవారు సాధించలేనిది ఏమీలేదని గాధేయుని జీవితచరిత్ర లోకానికి ఒక సందేశాన్ని అందించింది. అతడు ఆదర్శ పురుషుడైనాడు.

× × ×

ఈ చరిత్రను కనులారచూచినంత గాఢమైన ఏకాగ్రనిష్ఠత విన్నారు రామలక్ష్మణులు.

"నాయనా! నీవు క్షత్రియుడవు. లోకపాలనం చేయవలసినవాడవు. సురపక్షపాతులైన మునులు అసురగణాల నించి పీడితులవుతున్నారు. వారిని రక్షించేందుకు నీవు కృత నిశ్చయుడవు కావాలి. ఇది ముని జనులందరి అభిహిత" మని బోధించాడు కౌశికుడు.

"ఆర్యా! నా తండ్రి మీ ఆజ్ఞను పాలించమని నాకు అనతి యిచ్చినారు వీరి ఆదేశాన్ని అనుసరించి నేను మునిగణాలను సంరక్షించే బాధ్యతను స్వీకరిస్తు న్నాను. మీలాగే దృఢనిశ్చయుఁడను అయి అభివాంఛితాన్ని సాధించేందుకు నా సర్వ స్వాన్ని పణంగా బడ్డుతాను. తుదకు నా ప్రాణాలను ఐనా పణంగాపెట్టి ముని జన హితైషిని అయి మీ ఆశీస్సులు అందుకుంటాము" అంటూ వాగ్దానం చేశాడు సహృదయారాముడయిన రాముడు.

ఈ మాట విన్నతరువాత లక్ష్మణునికి ఒక సందేహం కలిగింది ఆతడు ఆదిశేషువు అపరావతారమే!

"అన్నగారూ! మీ రన్నమాటలు నామనసుకు నచ్చినాయి. కాని ఒక సందే హం ఇంకా నన్ను వెన్నాడుతోంది. రాక్షసులు మనకెట్టి అపకారం చేయలేదు. వారిని వధించాలన్న తలంపు అకారణం అవుతోందికదా! ధైర్యంలేక వారిని వధించా లన్న ఆలోచన మీకు కలగటం, అందుకు కృతనిశ్చయులం కానటం, వాగ్దానా లివ్వటం ఏమిటి? మీరు రాకసి మూకతో అకారణ వైరానికి దిగుతున్నారని అని పిస్తోంది. నాకు" అన్నాడు లక్ష్మణుడు.

అందుకు రాముడు రవంత అయినా మనసుమార్చుకోలేదు.

"సోదరా! సాధావృత్తి నివ్యావృత్తిగా స్వీకరించిననాడు మౌనులు. అటు వంటి సాధుజీవనులు ఏమి చేశారని అసురులు వారిని హింసిస్తున్నారు. ఇది అన్యాయంకదా! దురాగతాలను ఎదుర్కొని అరికట్టలేనివారు క్షత్రియ ధర్మాన్ని నిర్వర్తించలేదు

ఈ ప్రపంచంలో అందరికన్నా నీవు నాకు ప్రియతముడవు ధర్మరక్షణ కోసం అవుసరమయితే నేను నిన్నయినా విడిచిపెడతాను. అన్నాడు రాముడు. రామో విగ్రహవాన్ ధర్మః అనీ సంభావించినాడు సోదరుడయిన లక్ష్మణుడు.

వారు అడవిదారులవెంట మరింత పురోగమించినారు. గంగనుదాటి మైదానాల మీదుగా మిథిలానగరం దాపులకు వచ్చినారు. అవన్నీ విశ్వామిత్ర మహర్షికయితే పరిచితమయిన ప్రదేశాలే! ఆతడు త్రిలోకగామి. బ్రహ్మావర్తంలో అయినా, హిమా వర్తంలో అయినా దక్షిణా వర్తంలో అయినా ఆతనికి తెలియని చోటులేదు. మహర్షిని మన్నించవాడులేడు. కాని రామలక్షణుల కవి అపరచిత ప్రాంతాలు ఆ ప్రాంతాల చారిత్రక విశేషాలను వివరిస్తూ మార్గాయాసాన్ని మరిచిపోయేలా చేశాడు కౌశికుడు.

మిథిలానగరం మరింత చేరువ అయిందనగా వారు గౌతముని ఆశ్రమం ప్రవేశించారు. గౌతముడు అతి పవిత్రుడు తపశ్శాలి. నిస్సంగుడు. సకల సద్గుణాలు ప్రోవుపడిన మహాపురుషుడు.

ఎన్ని విధాల చూచినా ఆతని అర్ధాంగి అహల్య చరిత్ర క్లిష్టతరమైనది. రాముని పాదాలను తాకటంనించి ఆమె పవిత్రురాలు అయిందనుకోవాలి. రాముడు మిథిలానగరానికి చేరువన ఉన్న ఆ వనం పాడుపడిందో అర్థంకాక విస్తుపోయినాడు. ఫలవృక్షాలు, పుందీవలు దోహద క్రియలు లేకవడలినాయి. పొదరిండ్లు రూపుదిద్దే వారు లేక చీకిరి బాకిరిగా ఐనాయి. పర్ణశాల శిథిలాలయంలా తన్పించింది.

"మహనీయుడైన గౌతముని ఆశ్రమానికి ఈ దుస్థితి ఏమిటి ఎందుకిలా అయింది?" అంటూ అడిగాడు రాముడు కౌశికుడు గౌతముని గురించి చెప్ప దలచినాడు.

"రామా! శ్యామా! ఉద్దామా! తపోశక్తినించి గౌతముడు మహనీయుడు. ఉన్నతమైన మానవీయతను సాధించినవాడు. ఐనప్పటికి ఆవడు అర్ధాంగివల్లి ఆశ్రమాన్ని యిలా దుస్థితిలో వదలివేయవలసిన వాడైనాడు.

గౌతముని భార్య అమూల్య! అందాల సుందరి ఆమె సౌందర్యం ములో కాలను ఆకర్షించింది. అంతేకాదు, భార్యా రూపవతీ శత్రుః అర్యవాక్కు మందల్లి అయినా గౌతముని యందుకూడ యథార్థమే అయింది.

ఆతడు నిత్యకర్మాలయందు అనుష్ఠాత అయివున్న సమయాన ఇంద్రుడు అహల్యకు చేరవచినాడు. సుందరీ,నీ శరీరసౌందర్యం నా మనసుని ఆకర్షించింది. నీతోకలియవచ్చాను. స్త్రీ పుపయోగసంభవమయిన ఈ సృష్టితాలోక్యన్ని నీశరీంలో నన్ను అన్వేషించుకోనివ్వు" అని అడిగాడు.

అహల్య అభ్యంతర పడింది అంటారు. కానిఆమె దిగివచ్చిన దేవేంద్రునికి లొంగిపోయింది. పవిత్రుడయిన మహర్షి వారి శరీరనుగమాన్ని సందర్శించినాడు. "ఇంద్రుడా! దుర్గుణశీల సాంద్రుడా! నీవు చేసిన పనివల్ల వైవాహిక నియమాలు భగ్నమైనాయి. తద్వారా నీవు సమాజానికి వెళ్ళి బోటుపొడిచినావు. నీవు యిటు వంటి నీచకార్యం చేసినందుకు ఫలతాన్ని అనుభవించాలి" అంటూ ఉరిమినాడు మహర్షి.

ఇంద్రుడు తప్పు చేసినవాడు కావటంనించి వడవడ వడకిపోయినాడు. నేల చూపులతో ముఖం దింపుకున్నాడు. గౌతముని కోపానికి గురిఅయి ఆతడు

విఫలుడయినాడు. స్త్రీ పురుషయోగంలో పురుషునికి వీర్య సంచతకారణాలైన ఫలాలు ఊడి నేలను పడినాయి. అతడు పుంస్త్వాన్ని కోల్పడినాడు.

అతడు తన అర్ధాంగి ఐనా అహల్యను చూచాడు గౌతముడు పవిత్రుడైచే అతని చూపులను నిలువలేకపోయింది అహల్య "తప్పిదం చేసినాను" అని ఒప్పుకుంది.

"అక్రమసంచారిణీ! భార్య అనే శబ్దానికి అర్థాన్ని నీవు కాలద్రోశావు. ఆ విధంగా కుటుంబవ్యవస్థకు చేటుతెచ్చినావు. అందుతే నీవు శిలాసదృశంగా పడి వుండిపో!" అనిశపించి తాను హిమాసానువులకు తరలిపోయినాడు" అంటూ శిలాస దృశ్యంగా పడిఉన్న అహల్యను చూపించాడు కౌశికుడు.

ఆమె రామ పదధూళి సోకగానే తన శిలాసదృశ్యమని స్థితిని విరిచి పెట్టింది. "రామా! నీ పవిత్ర చరణకంజాతాల స్పర్శతో నేను పులకితగాత్రినైనాను. ఇది నాకు పునర్జన్మంలా అనిపిస్తోంది.

వీరుడా! నీవు మిథిల వైపుగా పయనించు. అనిద నా బిడ్డ.... కాదు.... కాదు జనకుని బిడ్డ వైదేహిని వివాహమాడు అంతకన్నా ఆనందకరమయిన క్షణాలు నాకు లేవు. నాతనూ భవుడయిన శతానందుడు నీకు అండగా నిలుస్తాడు. వెళ్ళిరా నాయనా!" అన్నది అహల్య.

విశ్వామిత్రుడు అలలు నిలిచిపోయిన సముద్రంలా గంభీరుడయి చూచినాడు. "ఊః జానకి జనకుని హలక్రియలో లభించింది. ఆ మహారాజు యాగార్థమై అహల్యంగా ఉన్నభూమిని హలంతో దున్నినాడు. అందుకే ఈ అహల్యకు వైదేహి అంటే అంతప్రేమ" అనుకున్నాడు

# 7

మిథిలానగరం రాజధానిగా విదేహను పాలిందుతున్న జనకమహాజ నిమ్మి, దేహరాతుల వంశ పరంపరలోనివాడు. అతని పురోహితుడయిన అహల్యా తన యుడు తోడుగా విశ్వామిత్రుని ఎదురొన్నాడు. వారికి ఉన్నత మయిన విడిది ఏర్పాటు చేయబడినది.

అప్పటికే పై దేహి స్వయంవరానికి రావలసిన వారంతా వచ్చేశారు. జనక సోదరుడు సాంకాస్య పురానికి రాజు. వీరిద్దరూ హ్రస్వరోముని సంతానం. జనకునికి జానికి ఊర్మిళలు సంతానం. అతనిసోదరుడయిన కుశధ్వజుడుకి మాండవి, శృతకీర్తి అని యిద్దరు సంతానం. వీరందరూ మిథిలలో సమీకృతులయినారు.

ఇతఃపూర్వమే భూమిజాత అయిన సీతను పెళ్ళాడాలని ఉవ్విళ్ళూరుతున్న ఉద్దండు లందరూ ఆశతో ఎదురు చూస్తున్నారు. స్వయవరంలో జానకిని ఎవరు గెలుచుకుంటారో! ఆమె అందచందాల గురించి శీలసంపత్తి గురించి కథలున్నాయి. ఆమె పేరు ఎక్కడ ఉచ్చరించబడుతుందో అక్కడ కలకలముంది.

అందరూ ఎదురు చూచే ఆ సుముహూర్తం ఆసన్నమయింది. జనక మహారాజు నిర్ణయించినట్లుగా శివధనుస్సు ఎత్తినవారే జానకిని దక్కించుకుంటారు. అది చాల ప్రాచీన మయిన ధనస్సు.

దక్షయజ్ఞం విధ్వంసం చేయటానికి అవతరించిన శివుడు ఆధనువుతో యుద్ధం చేశాడని చెప్పుకుంటారు. పవిత్రమైన ఆ విల్లు బృహత్తరమైనదికూడ. దాన్ని ఎక్కు పెట్టాలన్న ఉబలాటం ఎందరికో ఉన్నప్పటికి ఎక్కు పెట్టగలిగిన వారు ఎవరూ లేదు.

ఎవరైతే ఆ ధనస్సును ఎక్కుపెట్టగలరో వారికే తన బిడ్డనిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు ప్రభువు. ఆయన స్వయంగా గొప్ప ధీశాలి. పరాక్రమశాలి. ఇతఃపూర్వం ఆ విల్లు ఎక్కుపెట్టాలని కొందరు ప్రయత్నించారు. విఫలురయినారు. ఐతే జానకీ పతి కావాలన్ని తమకంతో వారంతా విల్లు ఎక్కుపెట్టే ప్రయతం మాలేసి మిథిలానగరం మీద ముట్టడి చేశారు.

బహుదీర్ఘకాలం కొనసాగిన ఆ ముట్టడిలో జనకుడు విజేత ఐనాడు. అందు నించి ఆతడు కొందరు రాజులను లొంగదీసుకున్నాడు. వీరిలో ఒకడైన సాంకాశ్య పురాధీసుణ్ణి రాజ పదవి నించి తొలగించి వేశాడు.

తన సోదరుయిన కుశధ్వజుడిన ఆ పదవిలో నిలిపాడు. అందు నించి స్వయంవరం ప్రకటించే వరకూ తిరిగి ఎవరూ ఆ ధనస్సును గురించి ఆలోచించ లేకపోయినారు. ఇప్పటికి ఆ సమయం ఆసన్నమయింది కావటం గురించి అందరూ వచ్చి చేరారు.

అద్భుతమయిన ధనుస్సు తరలించుకు వచ్చారు.

దానిని చూడగానే కొందరు రాజులు ఆశలు వొదులుకుని తిరిగి వెళ్ళిపోయినారు. కొంత ప్రయత్నం చేసి కొందరు వెళ్ళిపోయినారు. పట్టుదలగా ప్రయత్నించినవారు పరాభూతులయినారు

అందరి వొంతూ అయాక రాముని వొంతు వచ్చింది.

గురుదేవుడైన గంధేయుని పాదాలను మొక్కి అతని ఆశీస్సులు పొందాడు దాశరథి.

"రామా! మునిజనగణ పక్షపాతివి అయిన నీవు వైదేహిని చేపట్టాలి, ఆమె ఆమె అందాల ప్రోవు, సుగుణారాసి కారణజన్మురాలు కానిదే జనకునియింట చేరదు. వైదేహిని నీవు చేపట్టాలి. రాజరుషి అయిన జనకుని ఆశీస్సులతో నీవు కల్యాణమూర్తివి కావాలి" అంటూ ఆశీర్వదించాడు కౌశికుడు.

కౌసల్యా తనయుడు శివధనుస్సును సమీపించినాడు. ఆ మండపాన్ని చేరవస్తున్న రాముడు ఓరగాచూచిన జానకి దృష్టిలో బిందు'పతనమెరుగని బాలమేఘంలా పడిపోయినాడు.

ఓహూ ఎవరీ నీలిమేఘశ్యాముడు. వార్నిధుల మీదినించి విహాయస వీధుల్లో ఎగసివచ్చిన శలవణ జలదంలా ఉన్నాడు" అనికొని భావించింది. వైదేహి ఆమె ఆతని ఆకృతిని చూచి పులకితగాత్ర అయింది. ఒకొక్క అడుగువేస్తూ శివధనుస్సుసాయవచ్చాడు దాశరధి, ఆతని ప్రశాంత సుందరమయినవే త్రాంచలాలలో లేరు పరాక్రమాలతాలూకు ఎఱ్ఱజీరలు తారాడినాయి

శివధనుస్సుకు మొక్కి అవలీలగా వామహస్తాన ఎట్టిఎత్తాడు. సభ నిర్భ్రాంతి నుయిన అగిపోయింది. అందరి జూపులూ ఆ పురుషోత్తముని మీదనే నిలిచిపోయి, రాజులందరూ బంగరు గద్దెలమీద దారులుతీరి కూర్చున్నారు. రెప్పలు వేయటం మరచినారు. దారశధి నూనూగు మీసాల విసూత్న యౌవనుడు.

ధనుస్సువొంచి అల్లెత్రాటివి బిగించాడు. ఆ కర్ణాంతమూలాగి ఒకతీరి ధనుష్టంకారంచేశాడు. పిడుగులు పడుతున్నట్లు మ్రోతలు విన్పించినాయి. సభాస్థలి దద్దరిల్లిపోయింది.

రెండవసారి విల్లునుఆకర్ణాంతమూ లాగిధనుష్టంవారం చేయాలని ప్రయత్నిస్తూ ఉండగా పెళ్ళమని విరిగింది. రాజుల గుండెలు గుభిల్లుమన్నాయి. జనకమహారాజు ప్రశంసాపూర్వకంగా కౌసల్యా తనూభవుని వంక చూచినాడు.

సీత ఓరచూపులు సారించింది.

నీలినీల జలదంలా గంభీరుడై, విస్ఫారే కుసుమంలా నవనవోన్మేషుడయి కన్పించే రాముని కనులార చూచుకుంది వైదేహి. సభ అంతా హర్షధ్వానాలు మార్మోగినాయి.

రాముడు విజేతఐనాడు. గాధినందనుడు హర్షపులకిత గాత్రుడైనాడు వరుని మెడలో పూలమాలవేసేందుకు నెమ్మదిగా అడుగు కదల్చింది.

ఆమె సౌందర్య విలసత! వికసిత పద్మమున పద్మని ఫాలభాగంమీద తీర్చిన కస్తూరి అగ్నితేజంతో విరాజిల్లుతోంది. కనులునాలికల్హారాలను తలపింపచేస్తున్నాయి.

పాణిపల్లవాలలో సుమమాలను గ్రుచ్చిపట్టిందామె. ఆమె వక్షమ్ము కానున్న వరుని సమీపించు తూందటంనించి రవంత భావోద్విగ్నంగా ఎగసిఎగసి పడుతోం వుంది.

వైదేహి ఊరువులు అరటి స్తంభాలవలె ఉన్నాయి. చరణ మంజీరాలు, మొలనూలు చేస్తున్నాయి.

అల్లవల్లన నల్లనవచ్చి విజేతఐయిన కోదండరాముని మెడలో పూదండను ఆహరించింది జానకి. ఆ సుమమాలతోపాటు పాటుగా తన మనసునుకూడ అర్పించు చుంది అంర్లోకంలో అతని రూపు ముద్రించుకుంది.

ఆ ముచ్చటను స్మరిస్తూ ఎటువారు అటుపయనమైనారు. వచ్చిన రాజులంతా తిరోన్ముఖులుకాగా మునిరాజు ఐన విశ్వామిత్రుడు రామలక్ష్మణులతోపాటుగా మిథిలా నగరంలో నిలిచిపోయినాడు. విదేహరాజ్యంలో పండుగలు జరుపుకున్నారు.

మరునాడు పెద్దలంతా పెండ్లిమాటలకు సమాయత్తులైనారు! ముందుగా కోసల రాజ్యానికి ఈ వార్త నివేదించేందుకు రాయబారిని పంపించారు. రాణులతోనూ అట్టహాసంగా తరలివచ్చాడు దశరథుడు. అప్పటికి యీ దాడిలో అయోధ్యానగరంలో లేకపోవటంనించి అతనికి వార్త పంపించారు.

యుధాజిత్తు భరతుని మేనమామ. కేకయి రాజపుత్రుడు ఆడడు వివాహ సంబరానికి విచ్చేశాడు. వారు బలవంతులైన రాజులు వీరి అండదండలు దశరథునికి కొండంత బలము.

రావలసినవారంతా వచ్చేవేళకు జనకుడు కల్యాణం నిర్విఘ్నంగాకొనసాగేం దుకు సంకల్పించిన యజ్ఞం పరిసమాప్తమైంది. ఇంక నీ తారాబల కల్యాణవేడుకలు ప్రారంభమైనాయి.

వైదేహి ఎంతపవిత్రురాలో అంత మేధావిని ఎంతటి సౌందర్య విలసితమైన శరీరం కలదో అందటి అనురాగమూర్తి. జనకుని రెండవకుమార్తె అయిన ఊర్మిలను లక్ష్మణుని కివ్వాలని నిర్ణయించారు.

అతని సోదరుడైన కుశధ్వజునికి యిరువురు కుమార్తెలున్నారు. మాండవిని భరతునికి, శృతకీర్తిని శతఘ్నునికీ యిచ్చి వివాహాలు జరిపించాలని నిశ్చయించుకున్నారు.

జనకదశరధులు బహుకాలంనించి మిత్రులు. జనకుని పక్షాన సోదరుడైన కుశధ్వజుడు, పురోహితుడైన గౌతమనందనుడు శతానందుడు మొదలైన పెద్దలంతా ఉన్నారు. దశరధుని పక్షాన వశిష్టుడు, విశ్వామిత్రుడు, మంత్రిఐన సుమంత్రుడు. యుధాజిత్తు మొదలైన వారంతా ఉన్నారు.

జనకమహారాజు పురోహితుడైన శతానందునికి రాముడంటే అపారమైన వాత్సల్యం ఏర్పడింది. కారణం తనతల్లి ఐన అహల్య శిలాసదృశంగా ఆశ్రమంలో రాముడామెకు చైతన్యస్ఫూర్తిని అందించాడు.తల్లి తనదుస్థితినించి బయట పడేందుకు విచ్చేసిన పవిత్రమూర్తి రాముడు.

అతనికేకాదు మిధిలా నగరపాలకులకూ, వారి అంతరంగికులకూ. ప్రజలకూ రాముడు ఆరాధ్యుడైనాడు. చిరుతవయసులూ విశ్వామిత్ర మహర్షి అంతటివానికి అనుంగు శిష్యుడు కావటం అందుకు ఒకకారణం.

మరో కారణం అతడు తాటకను వధించాడు. మారీచ సుబాహు లలో ఒకరిని వధించాడు. మరొకరిని సముద్రతీరాన పడిపోయేలాగున కొట్టారు. చిన్నవయసున ఇన్నిసాధించిన దాశరధి నా వాత్సల్యానురాగాలు కలుగకుండా ఎలా ఉంటాయి. అందునించి అందరి మధ్యా అతడొక్కడే పురుషోత్తమునివలె వెలుగొందుతున్నాడు.

కల్యాణ వేడుకలను మిధిలానగరమంతా కదలి వచ్చింది. ప్రజలు పండుగలు చేసుకొన్నారు. నగరమంతటా అలంకరించారు. కల్యాణ రామునితోపాటు కల్యాణ కంకణాలను ధరించింది జానకి. వైదేహి పాణిపల్లవాలతో సంగ్రహించిన మంచి ముత్యాలు పద్మరాగాలవలె అరుణించి తమయితరళించినాయి. రాముని నీలివపుషం మీదుగా జాలువారుతున్నప్పుడు శ్యామలమై ఇంద్రనీలాలవలె కనుపించినాయి. ఆ ముత్యాలు చూచేందుకు మిధిలానగరవాసులకు రెండేసి కన్నులు చాలలేదు.

దాశరధి సీతాసమేతుడై పెద్దలందరికి మ్రొక్కాడు. లక్ష్మణుడు ఊర్మిళ మాండవి భరతులు, శతకీర్తి శతృఘ్నులు అన్నను అనుసరించి పెద్దలందరికి మొక్కారు.

రాముని తనివితీరా కౌగలించుకున్నాడు దశరధుడు. "నాయినా విశ్వామిత్రుని వెంట నిన్ను పంపేందుకు మొదట సంశయించినాను. ఆ మహర్షి సంకల్పాలు కల్యాణ కారకాలయినావి. నేనిప్పుడు తెలుసుకున్నాను.

క్షత్రియ ధర్మమయిన పరాక్రమంలో నీవు సాటి రాజులందరిలోనూ వన్నె తెచ్చుకునావు. అంతేకాక మునిజన హితైషివి అని పేరు తెచ్చుకున్నావు. ఇప్పుడు కళ్యాణమూర్తివి అయినావు. నిను కన్నందుకు నేను చరితార్థుడనయినాను" అన్నాడు.

పెండ్లి ముచ్చట్లు పూర్తి అయాక వైదేహితో తిరుగు పయన మయినాడు రాముడు! అయోధ్య వాసులంతా అనుసరించారు సోదరులంతా భార్యలతో అన్నను వెన్నంటి ఇయలు దేరినారు.

మిధిల అయోధ్య మధ్య మూడు దివారాత్రుల ప్రయాణం మార్గమధ్యలో వారికి పెనుగాలి ఎదురయింది. దశరధుడు కంపితుడయినాడు. వశిష్ఠుడు కళవెళ పడినాడు. సుమంత్రుడు దిక్కుతోచనివాడయినాడు. తెలియని చీకటి కోణాలనించి విషమయస వీధుల్లోకి దూసుకువచ్చే ఉల్కలా, రెండుమబ్బులు రాసుకున్నప్పుడు ఫెళఫెళార్భాటంతో భూమికి రాలే పిడుగులా ఉరికి వచ్చినాడు భార్గవుడు. ఒకచేత వైష్ణవ ధనుస్సు. మరొకచేత పరశవు ధరించాడు.

కాషాయాంబరధారి అయి కదలి వచ్చినాడు.

అతని నేత్రాలు చంద్ర నిప్పులు చెరుగు చున్నాయి. ముఖంలో కన్పించే ఉద్యస్ఫూర్తి పరేతరాట్టు విలయ నృత్యం చేస్తున్నట్లుగా అవ్పిస్తోంది. అతడు మహా వేవునికి మరొక్క రూపంలా ఉన్నాడు.

పరశురాముని చూచి యావన్మంది భయకంపితులయినారు. శిరసులు హోంచి అతని పాదాలముందు మ్రొక్కారు.

అతని చరిత్ర ఉజ్వలమయినది. ఆకృతి స్ఫూర్తివంతమయినది జమదగ్ని మహర్షితమాభవుడతడు. రేణుకాదేవి అతని మాతృమూర్తి. తల్లి అజ్ఞమేరకు తల్లిని వధించేందుకు సంసిద్ధుడయినవాడతడు. ఒక క్షత్రియుడు జమదగ్నిని పరిమార్చి నాడు.

దానితో పరశురాముడు కుపితుడైనాడు క్షత్రియ వంశాలను అంతమొందిం చేందుకు కంకణబద్ధుడైనాడు తన పితృదేవతలకు క్షత్రియ రక్తంతో తర్పణలు యిస్తానని ప్రతీన తీసుకున్నాడు. రాజ లోకంమీద విరుచుకునిపడి బ్రహ్మతేజంలో వారందరిని పరిమార్చినాడు.

మహాదేవుని మెప్పించి అనేక వరాలు కానుకలుగా పొందాటు భార్గవాస్త్రాన్ని సంపాదించి తిరుగులేని పరాక్రమశాలిఅయినాడు.

అతడు విచ్చేసినాడని వినగానే దశరధునికి నిగ్రహం అదఃపతనమైంది. ముచ్చెమటలు పోసినాయి.

"భార్గవా! నీవు పురుషుడవు. భూమిమీది రాజులందరిని వధించి నీ పితృ దేవతలకు క్షత్రియరక్తంతో తర్పణలు అందించిన వాడవు. నీకుసాటి ఎవరున్నారు. నా రాముడు బాలుడు. ఆతనిపట్ల నీవుదృష్టి వహించవలసిన వాడవు. మునిజన పక్షపాతి ఐన శాచర వినాశకరుడైన రామునిపట్ల నీవు దయామృతాన్ని వర్షించాలి. అతడిప్పుడే తన వధువును కరగ్రహనచేసి తీసుకు వస్తున్నాడు.

క్షత్రియులమీద నా కక్ష చల్లారకపోతే నన్ను వధించు" అంటూ మోకరిల్లి నాడు. అయోధ్యాపతిఐన దశరధమహారాజు.

భార్గవుడు భగ్గుమన్నాడు. అతని నేత్రాలలో అగ్నితేజం విరాజిల్లుదోంది. భృకుటిలో రవితేజం విస్ఫోటమవుతోంది.

దశరథా! అడ్డుతప్పుకో ఆబాలరాముని నేను చూడాలి రాముడను నేను బ్రతికి ఉండగా మరొక్క క్షత్రియుడు రాముడనే పేరు ధరించినాడా! ఎంతసాహసి అతడు.

ఈ సృష్టిలో ఇద్దరు సూర్యులు ఉండటానికి వీలులేదు. అలాగే ఈ భూమండ లంలో ఇద్దరు రాములు. ఈ క్షణమే అతడో నేనో ఒకరు తేలిపోవాలిలే! అడ్డు తప్పుకో అంటూ అధిక్కృతంచేసి పురోగమించినాడు భార్గవుడు.

రాముడు చిరునవ్వు చిందులాడగా ప్రశాంతవదనంతో ముని పాదాలకు మ్రొక్కినాడు.

భార్గవరామునికి అయోధ్యరాముని ప్రణామాలు అన్నాడు.

"అరె! నా చెలువా! ఎంత తెలపరివిరా నీవు. రాముడనిని చెప్పుకొంటు న్నావుగా! దశరధుని తెగువధారివి ఎలా అయినావు. నా పేరు మార్చుకో ! లేదా

నేను "నిన్ను పరిమార్చుతాను" అంటూ భార్గవుడు రాముడు రవంత అయినా చలించలేరు.

మహాపురుషా! రాజగురువు అయిన వశిష్టుని సాక్షిగా నా వీరవిద్యాగురువు ఐన విశ్వామిత్ర మహర్షి పాదాల సాక్షిగా నేను నామీద ఈ కినుక ఎందుకయ్యా!" అన్నాడు పురాంతమైన స్వరాన.

భార్గవుడు అపహాసం చేశాడు.

"బాలకుడా! నీవా మునిజన సంరక్షకుడవు. వీరుడయిన రాముడవు నీవా! ఎంతవాచాలత్వాన్ని ప్రదర్శించినావు రా డింభకా! నీవు అంతటి శక్తిశాలివి కానక్కరలేదు.

ఈ విష్ణు ధనుస్సును ఎక్కుపెట్టుచాలు "అపుడు భార్గవ ముని నిరోషకాషాయితమైన నేత్రాలతో రాముడు పరశురాముని ముందు మోకరిల్లినాడు.

"మహా పురుషా ! తమ అనుజ్ఞ ఐతే ఈ విష్ణు ధనస్సును నా స్వంత కోదండాన్ని ఎక్కుపెట్టినట్లులా ఎక్కుపెడతాను ఈ విష్ణు ధనుస్సు నా స్వంత ధనుస్సులా ధరిస్తాను" అన్నాడు రాముడు భార్గవుడు శీఘ్రంగా చూచాడు.

"బాలకుడా! నీవు ఎక్కుపెట్టేందు కవిదేహంలో కన్పించిన శివ ధనుస్సు కాదు. కాలగతిలో జీర్ణించిన దాన్ని ఎక్కుపెట్టటం అంత ఘనమైన విద్యకాదు. ఈ ప్రయత్నంలోనవు విఫలుడవు అయినావా నీ పేరు మార్చుకోవాలి" అన్నాడు పరశురాముడు

"మహాపురుషా! మీ అనుజ్ఞ ఐతే మునిజనుల ఆశీస్సులు నాకుఉంటే నాకు పరాజయమే లేదు" అంటూ చేయిచాచాడు రాముడు పరశురాముడు విష్ణుధనుస్సును అందించాడు.

ఆతడు తపోశాలి. మునిజనులు ఇంతకాలంగా సాధుజీవనం చేస్తూ యిప్పుడు. నిశాచరగణానించి పడుతున్న బాధలు చూచాడు. తిరిగి తాను నిరాచర సంహారానికి సమాయత్తమైతే వారంతా పరౌతరాట్టుకు అతిధులుగా వెళ్ళిపోతారు. కాని తన తపో నియమాలు భగ్నమవుతాయి.

అలాంటి సమయంలో ఈ రాముడు మునిజన పాళిని సంరంక్షించేదుకు కంకణ బద్ధుడైనాడని తెలిసింది. అతనికి అండగా విశ్వామిత్ర మహర్షి నిలిచినాడన్న వార్తలు విన్పించినాయి.

అందుకే అతని సంకల్పదీక్షను, ధైర్యాన్ని, శక్తిని, పరాక్రమాన్ని పరీక్షించాలని వచ్చాడు పరశురాముడు. తన దగ్గర ఉన్న ఆయుధ శక్తినంతటినీ రాముడు అర్హుడైతే అతనికి ధారపోయాలని సంకల్పించి మరీ వచ్చాడు.

విష్ణు ధనుస్సును తను ఇతఃపూర్వమే ధరించిన వానివలె రాముడు అవలీలగా ఎక్కుపెట్టాడు. అదిచూచి హర్షపులకిత గాత్రుడైనాడు భార్గవరాముడు.

తన పేరు ధరించిన అయోధ్యరాముడు సకల సద్గుణగుణాభిరాముడేకాక రణరంగభీముడు సరిఅయిన వీరుడు అన్న విశ్వాసం కలిగింది. తన దగ్గర ఉన్న అస్త్రాలన్నింటిని వెనువెంటనే అతనికి ధారపోశాడు పరశురాముడు. కోదండరాముని ఆశీర్వదించి తన తపో చర్యలు కొనసాగించుకుందుకు వెళ్ళిపోయినాడు.

దశరథుడు హాయిగా నిట్టూర్చాడు. అయోధ్యవాసులంతా రాముని అభినందించారు. సీతమ్మను చూడవచ్చారు. అయోధ్యను చేరిన వెంటనే యుధాజిత్తు భరతుని వెంటపెట్టుకుని కౌశయ రాజ్యం చేరుకున్నాడు. అతని వెంట శతృఘ్నుడు కూడ వెళ్ళిపోయినాడు.

కౌసల్యా తనయుడూ, సుమిత్రా తనయుడు తండ్రికి అండగానిలిచి అయోధ్య వాసులను అలరించినారు.

# 8

వృద్ధమూర్తి ఐన దశరథుడిప్పుడు సంతుష్టజీవనుడైనాడు. తాను ప్రాణాధికంగా ప్రేమించే రాముడు మునిజనుల నించి ఆశీస్సులనూ ఆయుధ సంపత్తిని దక్కించుకున్నాడు. అపుడు ఏ సౌందర్యవతి, సుగుణశీల ఐన సీతను స్వయంవరంలో చేజిక్కించుకున్నాడు. అయోధ్య వాసులంతా రాముని గురించి, అతని ఔన్నత్యం గురించి గొప్పగా చెప్పుకుంటున్నారు.

ఒకనాడు సుమాలి తనను జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకొనేందుకు తన బిడ్డ ఐన కైకసిని వ్యూహంలో పణంగాబెట్టాడు ఫలితాంశంగా రావణుడనే సంకీర్ణ మహా పురుషుడు ప్రాదుర్భవించాడు సురగణాలను, సురగణ పక్షపాతులైన మునులనూ వెన్నంటి హింసిస్తున్నాడు.

ఇప్పుడు మునులంతా తమ ఆత్మరక్షణకై ఆలోచనలో పడిపోయినారు. ఆ సంకీర్ణ మహా పురుషుడనించి తమను కాపాడే పురుషోత్తముని కోసం ఎదురు చూచారు.

అతడు రాముడేకాబోలు! లేకుంటే రుష్యశృంగుడంతటివాడు కదలి వచ్చి అశ్వమేధము పుత్రికామేష్టి పూర్తిచేయించేవాడా! తన బిడ్డ ఐన శాంతను వివాహం చేసుకునేవాడా! విశ్వామిత్రునంతటివాను స్వయంగా వచ్చి అనేకమైన ఆయుధాలను యిచ్చిందికాక జనకుని యించి బిడ్డను రామునికి యిచ్చేలా కథ జరిపిస్తాడా! మును లంతా రాముని ఆశ్రయించినారు.

రావణుడనే సంకీర్ణ మహా పురుషుడు ప్రేరేపించిన రాక్షసులు విజృంభిం చారు. వారి బారినించి తమను రక్షించే పురుషోత్తముడు రాముడే అని వారంతా భావించారు. ఈ కర్తవ్య నిర్వహణతో రాముడు పురుషోత్తముడవు తున్నాడన్న ఆనందం దశరథుని ఒకవంక ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

మరొకవంక ఈ కర్తవ్య పాలనలో మునులు అతనికి ఎంతటి అగ్ని పరీక్షలు పెడతారో తలుచుకుంటే మనసు అగ్నిగుండంలా మండుతోంది. మొన్న టికిమొన్న భార్గవ రాముడేమిచేసాడు రాక్షసుల బారినించి మునులకు కాపాడగలిగిన పురుషోత్తముడు రాముడే ఐతే అతనికి తన భార్గవాస్త్రాన్ని, విష్ణు ధనుస్సును ఇవ్వాలని భార్గవ రాముడు వచ్చాడు.

వచ్చివాడు ఊరికే యిచ్చిపోలేదు. పన్నెండు సంవత్సరాల రామునికి అగ్ని పరీక్ష పెట్టాడు. యింకా ఎందరో మునిపుంగవులు ఎన్నో ఆయుధాలను ఇవ్వవచ్చు. కాని ఎన్ని కఠిన తరమైన పరీక్షలకు గురిచేస్తారో కదా!

ఒకవంక ఆనందమూ మరొక దుఃఖము సమ్మిశ్రితమైన విచిత్ర భావనా జగత్తులో విహరించే దశరథునికి తన వృద్ధాప్యల జ్ఞాపకం వచ్చింది. భరతుడు అయోధ్యలోలేడు. రాముని యౌవరాజ్య పట్టాభిషిక్తుని చేయటానికిది సరిఅయిన సమయం అయోధ్య వాసుల మనోగతాలు రాముని ఆశ్రయించినాయి.

రాముడనే శ్యామమూర్తి నీలకల్హారమైతే అయోధ్య వాసులందరి మనో వాంఛలు భృంగాలవలె దానిచుట్టూ పరిభ్రమణ చేస్తున్నాయి. రాముడెంతటి అదృష్టశాలి!

వశిష్ట మహర్షిని సంప్రదించినాడు దశరథుడు. వెంటనే సుమంత్రుని వామ దేవుని రావించినాడు. సత్వరమే సభను సమాయత్తం చేయమన్నాడు.

రాముడు యౌవరాజ్య పట్టాభిషిక్తుడయేందుకు పూర్వరంగమైన సభ అడం బరంగా సంసిద్ధమైంది. అయోధ్య వాసులందరికీ అదొక పండుగలా అనిపించింది. ఈ నిర్ణాయన సమాలోచనంతో పాల్గొనేందుకు మహనీయులెందరో వచ్చారు. అయోధ్యానగరంలో స్త్రీలు పురుషులు బాలురు అంతావచ్చారు.

వశిష్టుడు రామలక్ష్మణులను రావించిచాడు. కొలికి పూసలేని దండకు రామ లక్ష్మణులరాకతో కొలికి పూస అమరించినట్లు ఐంది.

నిండు తనం వచ్చేసింది. రామదర్శనార్థమై వేచి ఉన్న ప్రజలు విశ్వాత్మల విలీనమయేందుకు విరాళితో ఎదురుచూస్తున్న ఆత్మల జాతులవలె ప్రకాశిస్తున్నారు.

విశ్వాత్మ కదలి వచ్చింది. వినీలవపుషి ఐన రాముడు అల్లన వచ్చి తన ఆసనింమీద కూర్చున్నాడు లక్ష్మణుడు ఛత్రాన్ని ధరించి రామునికి వింజామరం వీస్తున్నాడు. అన్నగారంటే ఆతభక్తి! శ్వేతఛత్రం అమరించిన సింహాసనం మీద ఆశీనుడైనాడు.

ఒక వంక వశిష్టుడు ఆధీనుడైనాడు. మరొకవంక సుమంత్రుడు వామ దేవుడు ఉన్నారు. వివిధ సామంతులతో సభ దేవేంద్రుని సభలా వైభవోపేతంగా కన్పిస్తోంది.

ప్రజలు ఆ సభలో చర్చనీయాంశంగా రానున్న రాముని యౌరాజ్య పట్టా భిషేకం గురించి ముచ్చటించుకుంటున్నారు. ముందుగా వశిష్టుడు లేచి నిలిచాడు. సభను ఒక్కతూరికలయ చూచినాడు.

“అధికారులకూ అయోధ్యానగర వాసులందరికీ అభివాదాలు. మన మంతా రామునికి అభిమానులం. అతని వినయసంపత్త, శీలి సంపదా. పరాక్రమమూ పెద్దలదరినీ అలరించింది అతని సౌభ్రాతృత్వము స్నేహ పాత్రతా పిన్న లందరినీ ఆకర్షించింది. తన్య వ్యక్తిత్వం వింది రాముడు అందరికీ ఆరాధనీయుడైనాడు

అటువంటి రాముడు యౌరాజ్య పట్టాభిక్తుడు అయేందుకు ఎవరికయినా అభ్యంతరమేమి ఉంటుంది. కోసల రాజ్య అధినేత అయిన దశరథునికి యిటు వంటి సంకల్పం కలిగటం మనందరికీ సంతోషదాయకమైన సంగతి. వారి మనో వాంఛను మీ అందకీ ఎరుకపరచాలనే ఈ సమావేశం ఏర్పాటు చేయబడింది” అని ఆ సమావేశం అంతర్యాన్ని ప్రవచించినాడు వశిష్టుడు.

వెంటనే దశరథుడు వృద్ధాప్యభారంతో వాలిపోతున్న కనురెప్పలను అల్లన పైకెత్తి అందరినీ కలయచూచినారు. సభలోని వారంతా తన పలుకుల కోసం ఆశక్తిగా ఎదురుచూడటం గమనించాడు. హృదయం ఆనంద తరంగితే అయింది.

రాముడు ముగ్గురు తల్లులకే కాదు, ముగ్గురు సోదరులకే కాదు, అధికారులకే కాదు, అఖిల ప్రజాలోకానికి ఆరాధనీయుడైనాడు. ముని జనులు అతనిని ఆశీర్వదించి ఆయుధాలిచ్చి అస్త్రశస్త్రాలన్నింటినీ అందించినారు. స్వయంగా ఉన్నత శ్రేణి శీలసంపద కలిగిన రాముడు మునులందరి తోడ్పాటుతో తిరుగులేనినాయ కలక్షణాలను సంతరించుకున్నాడు. ప్రజా రాముడైనాడు.

అతనిపేరు వింటేనే ప్రజలతో ఆనందం వెల్లివిరుస్తోంది, ఇంక అతనికి యువరాజ్య పట్టాభిషేకమంటే వారి ఆనందానికి అవధులే లేకుండా పోయినాయి.

ఈస్థితి దశరథుని అలరించింది. సంతోషంవల్ల కంఠస్వరం గాద్గదికమయి పోయింది.

అయోధ్యా వాసులారా! బహుకాలంగా నాశక్తిమేరకు మిమ్ములను పాలించాను వృద్ధాప్యంపైకొనుదాకా నిశ్చింతగానే ఉడిపోయినాను. నా అదృష్టంవండి విశ్వామిత్ర మహర్షి వశిష్టమహర్షి, ఋష్యశృంగునివంటి మహనీయులదయా దృష్టి నామీద నిలిచింది వారిమీద మా రఘువీరులకున్న భక్తి ప్రపత్తాలు సాక్షిగా రాముడు రాజ్య పాలనకు అర్హుడని నేను ఆలోచించాను.

మీ మనసు నేనెరుగునా. నా ఆలోచనలను అనుసరించి రాముడు రాజు అయే మధుర లక్షణాల కోసం మీరు ఎదురు చూస్తున్నారు. మీ మనోవాంఛను వెంటనే క్రియారూపంగా మార్చాలని నాకు అనిపించింది. అందుకే ఈ సమావేశం ఏర్పాటు చేయించాను! భరతుడు అయోధ్యానగరం లేడు కేకయరాజు తమాభవుడు భరతుని మేనమామ ఐన యుధాజిత్తు కూడ ఈ సభలో లేరు.

వారందరికి రాముని మీద పరిపూర్ణ విశ్వాసముంది. భరతునికి రాముడంటే బహిప్రాణం. అందునించి మన నిర్ణయాలను వారు హర్షిస్తారనీ విశ్వాసంముంది.

రాముని యౌవరాజ్యపట్టాభిషిక్తుని చేసేందుకు వెంటనే సుముహూర్తం నిర్ణయించాలని నేను అనుకుంటున్నాను. ఈ అందరూ అందుకు అనుమతి విస్తారని నా విశ్వాసం. మనసుకు నచ్చినమగనితో మగువ జీవితం సుఖించినట్లుగా కోసల రాజ్యము రాముని ఏలుబడిరో రామణీయతను సంతరించుకుంటు నేను ఆశిస్తున్నాను అంటూ ముగించాడు దశరథుడు.

ఆ మాటలు వింటూనే సభికులంతా హర్షధ్వానాలు చేశారు. దశరధుని నిర్ణ యాన్ని ప్రశంసిస్తూ చేతులు ఊగించినారు. సభలోని పెద్దలంతా ఆశీస్సుల వర్షం కురిపించారు.

మంత్రి సుమంత్రుడు వారి హర్షాతిరేకాన్ని చూచి వివశుడైనాడు. సభికు లారా! దశరధుని ఏలుబడిలో కోసల రాజ్యలక్ష్మి సుభద్రమై వర్ధిల్లింది. రాజు వయో వృద్ధులయినందున వారసులకు రాజ్యం అప్పగించాలన్న తలంపుకు వచ్చినారు.

రాముడు ఒక్క కోసలరాజ్యానికే కాదు. యావత్తు భారత సాంప్రదాయానికే వారసుడు. మునిజన మనోవాంఛలకు ఆశాదీపం వారి రక్షణకై కంకణం ధరించిన దీక్షాదక్షుడు రాముడు. ఆతని సజ్జనపాళి ఆశీర్వచనాలున్నాయి. ఇందరిని తన పరాక్రమంతో ఆకర్షించి అలరించిన రాముడు రాజు కావటం కన్నా ఎవరినయినా కోరదగినది మరొకటేమున్నది.

అందునుంచి దశరథ మహారాజు సముచిత మయిన నిర్ణయం చేశారు. దానిని మీరంతా మర్షోదిరేకాన్ని ప్రదర్శించినారు. యింకా రాజకీయ యంత్రాలగమంతా ఉంది.

మంత్రి రాజకీయ యంత్రాంగానికి బాధ్యత వహించవలసినవాడు. అందు నించి వారందరి ప్రతినిధిగా వాగ్దానం చేస్తున్నాను.

రాముడు రాజు అయితే ప్రభుత్వంలో బాధ్యతాయుతమైన పదవులలో ఉన్న వారంతా సహకరిస్తారనీ, రాముడు అందరినీ యిష్టుడు అనే నేను ప్రకటిస్తున్నాను.

రాముడు పాలకుడైన మరుక్షణం మన కోసలరాజు వినూత్న వధువులా మధురానుభూతులకు లోను కాగలదు. దుష్టులయినవారు ఆ సుముహూర్తాన్ని ఎంత త్వరగా నిర్ణయిస్తే అంత మంచిది.

ఆ సుముహూర్తమే మన అంతరి అభిహితాలను పండించే మంచి ముహూర్తత కాగలదు" అని ప్రసంగించివాడు సుమంత్రుడు.

ఒక వేగుచుక్క కన్పిస్తే సమస్త జీవులూ ఆ వంకకు చూచి రెప్పవేయటం మరచినట్లు సభాసదులంతా రామచంద్రుని కల్యాణమూర్తి వంకచూస్తూ రెప్పవేయ టం మరచిపోయినారు.

రాముడు రవంత సిగ్గుపడి తలను అవనతంచేశాడు. సుందర సునిరాల నేత్రాలు ప్రశాంత సదవాలవలె అయినాయి. లక్ష్మణుడు సూర్యోదయమాచ్చే దర్శించి ఉల్లసించిపడగఎత్తిఆడుతున్న ఆదిశేష లాగున ఐనాడు.

"అన్నగారూ! మీ మధురవాగ్దాన అమృతోపమానమైనది. దానికి జనులంతా ఆశాపూర్ణమైన అంతరంగాలతో ఎదురు చూస్తున్నారు.

తనివితీరని మీ మధుర విభవాన్ని అందుకోవాలని నేనుకూడ ఎదురుజూస్తు న్నాను. వారి కోరికలకు మీ అంగీకారాన్ని తెలియచేయండి" అని ప్రార్థించాడు సౌమిత్రి.

రాముడు రవంత చిరునవ్వు నవ్వాడు.

అల్లన లేచివచ్చి ముందుగా తండ్రికి పాదాభివందనం చేశాడు. ఆతని ప్రక్కన చేరి ఆపైన గురువులకూ, తెరమాటున ఉన్న మౌనులకూ, ఎదుటఉన్న అఖిలజన పాళికి అభివాదంచేశాడు.

ప్రియతములైన అయోధ్యవాసులారా! అభిమానులారా! అందరికీ అయోధ్య రాముడనైన నేను ప్రెుక్కుతున్నాను.

మునిజనుల ఆశలన్నింటినీ నా జీవిత ఆశయాలుగా మలుచుకున్నాను. సర్వ జనులు ఈ బ్రతుకు కొనసాగించాలనుకున్నారు.

మీరందరు నాపైని యింతవాత్సల్యం పెంచుకున్నందు పూర్ణమధుధారలో నిండారస భాండంలా అయింది నా మనసు.

ఈ కృతార్థత నా అర్హతనించి నేను గెలుచుకున్నదికాదు. మీ దృష్టివల్ల నాకు నాకు దక్కిన వరం. ఎంతటి మహత్తరమైన వరాన్ని పొందిన నేను అదృష్ట రాలని, శ్రావణమేఘాలు నీలిజలధిపై కూడ వర్షించినట్లు మీరు నామీద ప్రేమామృ తాన్ని వర్షించారు.

మీ ఆదరాన్ని చిరకాలం దక్కించుకోవటానికి అర్హత సంపాదించుకోగలం దుకు నేను చేయగలిగిన దంతా చేస్తాను.

నేను ధర్మానికి బద్ధుడను. ధర్మం సూచించిన మార్గంలో నా కర్తవ్యాన్ని నిర్ణయించుకుంటాను. కర్తవ్యంగా భావించిన దాన్ని సాధించేందుకు నా రాజ్యాన్ని, నా భార్యను, నా సోదరులను, చివరకు నా ప్రాణాన్ని ఆయినా విడిచి పెడతాను.

ధర్మ రక్షణకై దీక్షా బద్ధుడైన కృతకృత్యుడను అయేందుకు ఎంతో మనో ధృతికావాలి. అది నాకు లభించేందుకు మీ ఆశీస్సులతోపాటుగా అండదండలుకూడ లభించాలి. రాముడు ధర్మవిగ్రహుడు. కర్తవ్యపాలనతో ఆత్మ నిగ్రహుడు అన్న మాటను దక్కించుకునేందుకు నేను దివారాత్రులు సంసిద్ధడయి వుంటాను.

ధర్మమే నా జీవితాన్ని నడిపిపిపగల జీవధార! అలా అని మీ అందరిముందు మా యిక్ష్వాకు వంశవీరులందరిమీద ప్రమాణంచేసి చెప్తున్నాను" అన్నాడు రాముడు.

ప్రజలు హర్షాతిరేకంతో తన్మయులయినారు. రామోవిగ్రహవాన్ ధర్మః అని ప్రశంచారు. హిమాచలం ప్రకాశించినట్టుగా, వేదాలు స్వరయుక్తమయి పరిఢవిల్లినట్లుగా, వాగ్దేవి వీణధండాన్ని ధరించటంతో మరింతమూర్తిమంతురాలయినట్లుగా, మహాదేవుడు జటాజూటంలో గంగను ధరించి అంతకు అంతగొప్ప వాడయినట్లుగా, విష్ణువు ఆదిశేషువుని శయ్యగాపొంది యోగేశ్వరేశ్వరుడయినటుగా — ఈ రాముడు ధర్మంవల్ల పురుషోత్తముడయినాడు అని ప్రశంసించినారు అయోధ్య వాసులయినే నాగరికులు అందరు!

ముక్త కంఠంతో అయోధ్య వాసులందించిన ఆశీస్సులను అందుకున్నాడు పురుషోత్తముడయిన రాముడు. పెద్దలందరికీ పేరుపేరున మ్రొక్కాడు సంతోషకరమయిన ఈ వార్తను తన వారందరికీ చెప్పుకోవాలని ఉత్సాహపడిపోయినాడు

తండ్రి అయిన దశరథ మహారాజు దాశరథిని తన కౌగిలలో గ్రుచ్చిఎత్తుడు. తాను ప్రాణాధికంగా ప్రేమించే రాముడు యోవరాజ్య పట్టాభిషిక్తుడు అయేందుకు ప్రజలు చూపిన ఉత్సాహం ఆయన హృదయాన్ని సంతోషతరంగితం చేస్తోంది. ఎంతో కాలంగా తాను ఆశించిన ఆశలు, కన్న కలలు సఫలీకృతమవుతున్నాయి. సుదీర్ఘమయిన తన జీవితం ఎంతో సఫలమయిందనే చెప్పుకోవాలి.

తాను కృతార్థుడయినాడు. చరితార్థుడైనాడు.

రాముని తన కౌగిలిలో గ్రుచ్చి ఎత్తాడు దశరథుడు. రాజుగా తానుసుదీర్ఘమైన అనుభవం కలిగినవాడు. తండ్రిగా తాను అపారమైన ప్రేమను పెంచుకున్నవాడు.

చిన్నవాడైన రాముడు రాజు కాబోతున్నాడు అందుసుంచి అతనికి హితవచనాలు చెప్పాలనిపించింది దశరథునికి తాను చూపిన మార్గంలో తనయుడు పయనించాలని ఆశించాడాయన రాముని తనప్రక్కనే కూర్చుండమని నియమించాడు.

"రామా! రాజుగా నేను సంవత్సరాలు పరిపాలనం కొనసాగించినాను. ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్నాను.

ఆనాటికీ అనుభవాలే అపురూపమైన సంపదలై నాకు మిగిలినాయి. తండ్రినించి రాజ్యంతోపాటు అతని సుగుణాలు, అనుభవాలు అన్నీ బిడ్డకు వారసత్వంగా లభించి తీరవలసిందే కదా!

అందుకే చెప్తున్నాను విను.

నీవు యువరాజ్య పట్టాభిషిక్తుడవు అవుతున్నావు. మరొకనాటికి ఆ రామ పట్టాభిషేకుకుండ అనివార్యం. రాజు అంటే రక్షకుడు. రాగద్వేషాలకు అతీతంగా నీవు రాజ్యపాలన కొనసాగించాలి.

నీ రాజ్యంలో ధర్మధేనువు నాలుగు పాదాలమీద నిలచి ఉండాలి. ధర్మాన్ని రక్షించటంలో నీవు అన్నింటినీ త్యాగం చేయటానికి ఎల్లవేళలా సంసిద్ధుడవు అయి వుండాలి. నిన్ను నమ్ముకుని ప్రజలు నిశ్చింతగా తమ వృత్తులు నిర్వహించుకుంటూ వుంటారు. అందునించి వారు సురక్షితులై వుండేందుకు నీవు అప్రమత్తంగా ఉండాలి.

రాజులు చారచక్షువులు. చారగణాల ద్వారా ఎప్పటికప్పుడు ప్రక్క రాజుల వారి కదలికల్ని పరిశీలించుకోవాలి. రాజ్యంలో ప్రజలు నీ పాలననుగురించి ఎలా తలపోస్తున్నారో ఎప్పటికప్పుడు చారచక్షువుల ద్వారా తెలుసుకుంటూ ఉండాలి.

అవసరమైనప్పుడు నీ ప్రజల్ని కాపాడుకోవటానికి, వారి దృష్టిలో నీవు ధర్మమూర్తిగా నిలబడటానికి నీవు నీ సర్వస్వాన్ని అంటే రాజ్యాన్ని అర్ధాంగిని అన్ని సుఖాల్ని ఒదులుకోవాలి.

ప్రజలంచి నీకునచ్చే ఆదాయంలో ఆరోవంతు ముని వాటికల్ని సంరక్షించేందుకు వ్యయ పరచాలి. మునులు అరణ్యాలలో ఉన్నవారు ఈ సమాజికుల మీద అమోఘమయిన ప్రభావాన్ని కలిగి ఉంటారు అందునించి వారి ఆలోచనలు అభిప్రాయాలు జనుల ప్రవర్తనలో ప్రతి ఫలిస్తాయి. మునులు నీకు అనుకూలంగా ఉంటే నీ సింహాసనం మీద భద్రమూర్తివి ఐనావు ఉండగలుగుతావు.

దేవతల ప్రీతికోసం నీవు యజ్ఞ క్రతువులను నిర్వహిస్తూ ఉండాలి. మునులు చేసే యజ్ఞాలను రక్షిస్తూ ఉండాలి. రాజ్యపాలనలో మంత్రులు ప్రముఖ పాత్ర నిర్వహిస్తారు. వారు ఉద్యోగులకు ప్రజలను నీ కన్నా సన్నిహితంగా ఉంటారు.

అందునించి నీ మంత్రులు నా ప్రజలకు ప్రతినిధులు అనుకో! వారి ఆలోచనలను నీవు చాల జాగ్రత్తగా విని అవగతం చేసుకోవాలి. వారి అవగతం చేసుకోవాలి. వారి అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకునేందుకు ప్రయత్నించుకోవాలి.

ధర్మదీక్షలేని వారిని, రాజ భక్తిలేని వారిని ఎన్నడు రాజకీయ ఉద్యోగులుగా నియమించకూడదు. అడవులన్నీ రాజుల చేత రక్షించబడుతాయి. వృక్ష సందను రక్షించు కొనలేకపోతు ఆ రాజ్యంలో క్షామం ఏర్పడుతుంది.

ఈ సమాజంలో ఎవరివల్ల అయినా వంచితులయిన వారు, దుర్బలులునేరుగా రాజుకు తన బాధల్ని గురించి చెప్పుకునేందుకు వీలు కల్పించాలి. ఏ వృత్తిలో ఉన్నవారు ఆ వృత్తిలోనే ఉండే విధంగా వారిని సంరక్షిస్తూ ఉండాలి. వృత్తుల మధ్య సంకీర్ణ తమాజాన్ని అస్తవ్యస్తంచేసి వేస్తుంది. అందునించి రాజు వృత్తి ధర్మాలను కాపాడాలి.

నీ పాలనలో ఆశ్రమత్రయంకడు జాగరూకతతో రక్షించబడాలి. బ్రహ్మ సర్వమూర్తిగార్హస్పత్యమూ, వానప్రస్థము సక్రమమైన మార్గంలో సంరక్షించబడితే జనజీవితం సంక్షుభితంకాకుండా ఉంటుంది

బాలురూ, గర్భిణీస్త్రీలూ అకాల మరణం పాలుకాకుండా కాపాడాలి. సత్య సంధతను పాటించుకోవాలి. నీ ప్రవర్తనను అనుసరించి రాజోద్యానులూ ప్రజలూ నడుచుకుంటారు. యథారాజా తథాప్రజా! అన్నది ఆరోక్తికదా!

అందునించి నీ ప్రవర్తనలో సత్యదీక్ష ప్రతిఫలించాలి. కోశాగారం ఎప్పుడు నిండుగా ఉండాలి. అలాగని ప్రజలను పీడించి వారినించి అక్రమంగా సంపదలను దండుకోకూడదు.

ప్రజలు సుభిక్షంగా ఉంటే కొరాగారం నిండుగా ఉంటుంది. రాజు ధర్మ పరాక్రమ రాలిత్వమూ కలిగిఉంటే కలిగిఉంటే ప్రచారం జనమయిన పరిపాలన సమకూర్చ గలుగుతాడు.

నీ సైనికులు ఎల్లవేళలా నీ యందు అపారమైన విశ్వాసం కలిగి ఉండాలి వారు నీ కోసం తమ ప్రాణాలు బలియిచ్చేందుకు సంసిద్ధులయి ఉంటారు కాబట్టి వారి కుటుంబాలు నీ చేత సంరక్షించబడాలి.

గురుకులాలు ప్రజలలో అజ్ఞాన తిమిరాన్ని తొలగించి జ్ఞాన జ్యోతిని వెలిగిస్తాయి. అంతేకాదు. గురుకులాలు ప్రజలలో రాజభక్తిని ప్రబోధిస్తాయి. అందు నించి అది ఎప్పుడూ రాజు రక్షణలో ఉండాలి. కోశాగారంనించి గురుకులానికి అవసరమయిన నిధులు అందుతూ ఉండాలి.

ముఖ్యంగా మరొక్కమాట! రాజు అయినవాడు వేదవిహితమైయిన తేజో మార్గం సమాజంలో నెలకొనేలా చూచుకోవాలి, వేద విధ్వంసకులైన అసుర గణాలనించినీ ప్రజలను నువ్వు కాపాడుకోవాలి. అందుకు దీక్షా కంకణం ధరించాలి" అని బోధించాడు దశరథుడు.

రాముడు శ్రద్ధాళువు అయి తండ్రి ప్రబోధాలన్నీ విన్నాడు. ఆ మాటల సారాంశాన్ని మనసులో ముద్రించుకున్నాడు.

ఆ నాటికి సభా కార్యక్రమాలు ఆ సొంతమయినాయి. వెనువెంటనే పుర జనులంతా తిరోన్ముఖులైనారు. నగరమంతా ఈ వార్తపాకి పోయింది పండుగలా అయిపోయింది. అప్పటికప్పుడు నగరాన్ని సర్వాలంకారశోభితం చేయటం ప్రారంభించినారు.

మరునాడే సర్వజన మనోభిరాముడైన రామునికి పట్టాభిషేకం జరుగనుంది యువరాజుగా !

మంత్రులంతా యంత్రాంగాన్ని అందుకు సమాయత్తపరచాలని బయలుదేరి వెళ్ళిపోయినారు. వశిష్ఠుడు విశిష్ఠుడైన మహర్షి. అతడు మరునాడు జరుగనున్న పుణ్య కార్యక్రమం జరిపేందుకు వేద విదులతో చర్చలు ప్రారంభించినాడు.

దశరధుని పట్టరానంత ఆనందంగా ఉంది. రఘు వంశకుల తిలకులయిన తన పూర్వ రాజులు దిలీపుని వంటివారంతా ఆవసంని తమ హర్షాతిరేకాన్ని అభి వ్యక్తం చేస్తున్నట్లుగా అతనికి అని పిస్తూంది. అతని అమితానంద వివశుడైయి అగ్రభార్య ఐన కౌసల్య దగ్గరకు బయలుదేరినాడు. అడుగులు ఆనందంతో తడబడుతున్నాయి

కౌసల్యాందేవి అప్పటికే రాముని మిత్రగణాలనించి సభలోని వార్తలన్నీ అందుకుంది. బహుకాలం ఆమె కడుపుపండింది కాదు. ఎట్టకేలకు ముని జన హితైషి, ప్రజలందరినే ప్రియతముడు ఐన ఈ రాముడు తన గర్భవాసాన జన్మించాడు

అద్భుతమయిన అతని వినయసంపత్తి, మాతృమూర్తులపై అతను చూపించే ప్రేమ ఆమెను ఎప్పటికప్పుడు ఆచ్చెరువు కొలుపుతూ వుంటాయి. అతడు విశిష్టుడు.

ఒకసారి చూచినవారు అతనిమూర్తి మత్వాన్ని ప్రేమిస్తారు. ఒకసారి మాటాడినవారు అతని మధుర వాగ్ధాడను అభిమానిస్తారు. ఒకసారి రామబాణం తగిలిన వారు హతారువులవుతారు. లేదా ఆ శక్తిస్మరిస్తూ రామనామాన్ని జపిస్తూ జాగులవుతారు. చిరుతప్రాయాలోనే యిన్ని లలక్షణాలను సంతరించుకున్నవాడు రాముడు. సుగుణాలకు ఆ రాముడతడు

తన గర్భవాసాన జన్మించిన ఆ చిరుత ఈనాడింతగా ప్రజల ఆధారానికి పాత్రుడయినాడని విన్నప్పుడు కౌసల్య పేరు కదిలింది. ఆమె మనః కేదారంలో వాత్సల్య పూర్ణమయిన ఆలోచనా వీచి నేరు తరంగలించ సాగినాయి.

ఈ మధురవార్త చెప్పేందుకు భర్త వొస్తున్నాడని వినగానే ఆమెకు పరమానందమైంది. వడివడిగా భర్తకు ఎదురేగి తోడ్కొని వచ్చి ఉచితాసన మిచ్చింది.

"కౌసల్యా! నీ తనయుడు యువరాజ్య పట్టాభిక్తుడు కావాలని అయోధ్య వాసులంతా ఏక గ్రీవంగా నిర్ణయించినారు. ఈ వార్త నీకు ఎంత ఆనందాన్ని అందించగలదో నేను ఊహించగలడు, కాని రాజుగా కర్తవ్య పాలన చేయటం కష్టతరమయిన బాధ్యత. దాన్ని మన బిడ్డ నిర్వహించగలడు.

కాని రాముడు సత్యవ్రతుడు. ధర్మ నిరతుడు. అటువంటివానికి రాజ్య పాలన బృహత్తరమైన బాధ్యత మాత్రమే అవుతుంది. కానివు రచనులు మనోగతాలను తీర్చటం రాజుగా నా విధి. అధికాక నేను వృద్ధుడనయినాను కదా! బహుకాలం ఈ భుజస్కందాలపై వహించిన రాజ్యభారాన్ని రవంత దింపుకోవాలనినా అభిలాష అందుకోనమే ఇలా జరగాలని మనఃపూర్వకంగా ఆశించాను.

మన రాముడు మునులకు ఎంత ప్రియతముడో పురజనులకూ అంత ప్రియ దర్శనుడు. ఈ శుభ పరిణామం యింత త్వరగా రావటం నాకెంతో ఆనందాన్ని యిస్తోంది" అన్నాడు దశరథుడు. ఆతడు ఆనందాతిరేకంలో ఉక్కిరిబిక్కిరి అవుతా మరింక మాట్లాడలేకపోవటాన్ని గమనించింది అగ్రభార్య కౌసల్య.

భర్త మాటః ఈ సంతోష వార్త వినటంతో ఆమెకు బ్రతుకు పండినంతగా ఆనందమయింది. తన జీవితంలో ఎంతకన్నా మధురమయిన వార్త మరొక్కటి వినలేదు.

మన రాముడు ఇంతవాడయివాడన్న వార్త మీనించి వినగలిగినందుకు నేనెంతగానో గర్విస్తున్నాను. అతడు పుణ్యశీలుడు. అందునిచి శుభ పరంపరలు అతనిని వెన్నాడు తున్నాయి. నేనిప్పుడే దేవీ పూజ ప్రారంభిస్తాను. యౌవ రాజ్య పట్టాభిషిక్తుడయిన రాముడు తిరిగి నా కంటపడినప్పుడే వ్రతాన్ని చాలిస్తాను.

ఈరాత్రికి అతడు కూడ నియమబద్ధుడయి వుండాలి. దర్భశయ్యపై శయనించాలి. మీరు తీసుకున్నా ఈ నిర్ణయం నా పూర్వజన్మల పుణ్యఫలమే! అతడంటే సుమిత్రకు కైకేయికి అపారమయిన వాత్సల్యం. అందునించి వారికి ఈ వార్తను సత్వరమే అందచేయండి" అని పార్ధించి భర్తను వారి దగ్గరకు పంపింది కౌసల్య.

తాను దేవీ పూజలో వ్రతబద్ధురాలు అయింది.

దశరధుడు సుమిత్రకు ఈ వార్త అందించాడు. ఆమె ఆనందాతిరేకంతో వివశురాలయింది రాముని గుణగణాలను నోరార ప్రశంసించింది. అతడు మహా పురుషుడేకాడు. పురుషోత్తముడేకాదు, అవతార పురుషుడు అని కూడ అంది.

ఇంక అక్కడనించి బయలుదేరినాడు దశరధుడు.

ఈనాడు రాణివాసమంతా సంతోషకరమయిన ఈ వార్తలే చెప్పుకుంటూ కోలాహలంగా ఉంది. కైకేయి ఈ వార్త చెప్పేందుకు ఉత్సాహంతో ఆ ప్రసాదానికి వచ్చాడు రాజు.

ఆమె కేకయ రాజపుత్రి! పౌరుషంలో చెప్పాలంటే యుధాజిత్తు సోదరి అందంలో రాయంచ!

ఆ అందచందాలకు ముగ్ధుడయినాడు దశరధుడు. అయోధ్య నగరాన్ని శ్వేత ఛత్రఛాయల్లో పాలించే మహారాజుకు ముద్దుల భార్య కైకేయి. భరతుడు ఆమె తనూభావుడు. ప్రస్తుతం తాతగారి యింట ఉన్నాడు. అతనికి అయోధ్యవాసులందరి కోరిక పై రాముడు యౌరాజ్య పట్టాభిషిక్తుడు కానున్నాడన్న వార్త తెలియదు. అతని కేమిటి అప్పటికింకా కైకేయినే తెలియదు.

ఆమె నగరంలో ఏదో కోలాహలం ప్రారంభంకావటాన్ని గమనించింది. అందు గురించిన వార్తలింకా తనదాకా రాలేదేమిటా అని ఎదురు తెన్నులు చూస్తోందామె. శయ్యపై మేనువాల్చింది. మేనినిగారింపులు మెరుపుతీగలా తరళాయి. తమవుతున్నాయి. ఆలోచనల తొరవంత రెప్పలు మొగిడ్చింది కైకేయి.

అప్పటికి ఒక వృద్ధనారి ఆ పరిసరాలకు వచ్చింది. దాని రూపమే ఒక విడ్డూరం. కైకేయి పరిచారిక! పేరు మంథర!

కేకయ రాజ్యం నించి రాణి వాసానికి అరణంగా పంపిన పరిచారికలలోని కీర్తి మంథర! అందునించి మంథర ఆలోచనలన్నీ మాతృపక్షం. పుట్టినింటి ప్రయోజనాలను పక్షపాత దృష్టితో కాపాడుకుందుకు కైకేయి ఏమరపాటి పడవచ్చు. అలాంటప్పుడు వారిని హెచ్చరించటానికే అరణంగా వచ్చే పరిచారకలుంటారు.

వారు పుట్టింది పెరిగింది కేకయ రాజ్యంలో! కాపురం చెయ్యవచ్చిన కాంత అయోధ్య రాజ్య శ్రేయస్సు పట్ల అంకితమయిన భావంతో ఆలోచిస్తే ఆలోచించవచ్చు. కాని పరిచారికలకు అలాంటి అవసరం లేదు. వారు రాజ్యంలో తమ రాణి

ప్రధాన వ్యక్తి కావాలని ఆలోచిస్తారు. కేకయ రాజపుత్రి తనూభవుడు రాజు అయి నాడంటే కేకయులందరికీ గర్వకారణం.

ఆ వృద్ధ వనిత వంగిపోయి నడుము, ముడుతలపడిన శరీరం, నేడో రేపో కాటికి పోవలసిన శరీరాన్ని భారంగా యీడ్చుకొచ్చిందామె. గూనితనం వల్ల మందకొడిగా సాగుతున్న నడకను మరింత త్వరితం చేయాలని ప్రయత్నిస్తోంది.

పడుతూ లేస్తూ వస్తున్న మంధరను చూచింది కైకేయి. బయారంగా శయ్య మీద వాల్చిన శరీరాన్ని రవంత కదిల్చిందామె.

"అయ్యో! అవతల కొంపలంటుకుపోతూ వుంటే నువ్వు యిక్కడ నింపాదిగా కూర్చున్నావా! పిచ్చితల్లీ! ఎంత అమాయకురాలివమ్మా నువ్వు!" అని హెచ్చరించిందామె.

చివాలున లేచికూర్చుంది కైకేయి.

"ఏమి జరిగింది?" అని అడిగిందామె.

"ఇంకా ఏమి జరిగిందని అడుగుతున్నావు తల్లీ! అంతా అయిపోయింది. నీవు దాసివవు కాబోతున్నావు. యింత కాలం మహారాజు నీ కోసం ప్రాణాలయినా యిస్తాడని అనుకుంటున్నావు. కాని అందంతా వంచన నీ స్థితి ఏమిటో నువ్వు గ్రహించలేకుండా ఉన్నావు. ఇకనైనా కన్నువిప్పి లోకం వంక చూడవమ్మా!" అన్నది మంధర ఎంతో ప్రేమగా!

"అసలేంజరిగింది? నేనుదాసివను కావటమేమిటి?" అని అడిగింది కైకేయి అదుర్దాగా! మంధర ఏప్పుడు తన వ్యక్తిగతమైన పక్షంతో మాట్లాడుతుంది. తనకున్న గౌరవం రాణివాసంలో మరింత కావాలని ఆమె ఆకాంక్ష.

మంధర తన కుహితైషి. శ్రేయఃకామి. అయినప్పటికీ యిప్పుడామె మాటలు విడ్డురంగానే ఉన్నాయి.

... అవునమ్మా! రాముడు రాజుఅయితే నీ సవతి కౌసల్యాదేవికి నీవు దాసివవు అవుతావు. ఆమె రాజమాత అవుతుంది. నీ పుత్రుడు నీసవతికుమారునికి ఛత్రం పడుతూ చామరం వీస్తూ చాకిరీచేయవలసి వస్తుంది." అంటు ఇంకఏవో చెప్పాలని ప్రయత్నించింది మందర! కాని కైకేయి అవేమీ పట్టించుకోలేదు.

ఎంత చల్లని వార్త చెప్పావు మంధరా! రాముడు యువరాజ్య పట్టాభిక్తుడు, కానున్నాడా! ఈ హారం అందుకో! నిజానికినకు యింతకన్నా మంచి బహుమానం

యివ్వాలి. భరతుడు నాబిడ్డఅ అయినా రాముడిని అంతకన్నా మిన్నగానే చూచు కున్నాను. అతని సుగుణసంపత్తి సకలజనులకు ఆకర్షయమయినది. ఆమోద యోగ్యమయినది.

అంతమాత్రానికి నీవు యింతగా కంగారు పడిపోనటంబాగాలేదు. నీవు చెప్పి నది శుభవార్తే కాని దుర్వార్త కాదు. మా అక్కగారైన కౌసల్యాదేవి సంగతి నాకు తెలియదా! ఆమెసౌజన్యమూర్తి.

నన్ను సోదరిగా మన్నిస్తుందేకాని బానిసగా చూడదు. అంతేకాక అయోధ్య వాసులందరి అభిప్రాయాలు మన్నించదగినవేకాని తిరస్కరించేందుకు మనకు అర్హత లేదు" అన్నది కైకేయి.

కుబ్జఅయిన మంథరముడుతలు పడిన ముఖంలో అపసుస్మరేఖ గోచరించింది నోటికి చేయి అడ్డుపెట్టుకుందామె.

"పిచ్చిదానా! నన్ను అదపంగా నీకిచ్చి పంపే సమయాన యుధాజిత్తు ఎంతగానో చెప్పారు. నీవు అశుంశుభం తెలియని అమాయకురాలవు. పసిపాప వంటిదానవు. దుర్జనులకు ఈ లోకం అంతా చెడ్డగానే కన్పిస్తుంది. మంచివారికి ఈ లోకం అంతా మంచిగానే కన్పిస్తుంది.

నిన్ను చూస్తుంటే నాకు ఎంతజాలిగా ఉన్నదనుకున్నావు. నీవు ఉండగా బహుమానాలు నా కెందుకు నేను ఒక్క ప్రశ్నవేస్తాను సమాధానం యివ్వు.

ఇప్పటికీ వార్త నగరమంతా ప్రాకిపోయింది. పండుగలు చేసుకుంటున్నారు. పిసినారి అయిన నీ సవతి కౌసల్య భూరిదానాలు వ్రతాలు నిర్వహిస్తోంది. అమాయకు రాలా! యింతఆయినా ఈ సంగతి నేను చెప్పిచిదాకా నీకు తెలియదు.

కౌసల్యకు చెప్పిన నీ భర్త నా కెందుకు చెప్పలేదో ఆలోచించు" ఈ నిర్ణయం తీసుతీసుకునేముందుగా నీకు చెప్పవలసిన అవసరం ఉన్నదో లేదో ఆలోచించు. కనీసం భరతుని రానించకపోవటంలోని అంతర్యమేమిటో అవగతం చేసుకో! నీ భర్తకు నీవు ప్రియతమురాలవన్న గర్వంతో ముసలివాడయినా మనను కుదులుపరచుకున్నావు.

అతడు ప్రదర్శించే ప్రేమంతా నటన అయివుండకపోతే ఈ విషయాన్ని నీతో ముందుగా ఎందుకు చర్చించడు.

అసలు వారి అంతర్య మేటిటో చెప్పాను విను.

నీవు వీరంతా నీవారను కుంటునావు. రాముడు నీ బిడ్డ అనుకుంటున్నావు. ముగ్గురు భార్యలలోనూ రాజుకు నీవు ముద్దుల భార్య అనుకొంటున్నావు. కౌసల్య నిన్ను సోదరిలా సమాదరిస్తుంది అనుకుంటున్నావు.

వారిలో ఏ ఒక్కరైనా ముందుగా నీకు ఈ నిర్ణయం గురించి చెప్పలేదంటే వారంతా నిన్ను కించపరచారనే కదా అర్థం! అంతేకాదు! వారంతా నీవు స్వార్థపరురాలవు అని అనుమానిస్తున్నారు. ముందుగా నీతో చెప్తే నీవు అభ్యంతరాలు చెప్పి భరతుని పిలిపిస్తావని శంకించారు.

అందుకే నీకు చెప్పలేదు. ఇప్పుడయినా దశరథుడు నేరుగా వచ్చి నీకు చెప్పలేదు. అందరూ నిన్ను ఆదరిస్తున్నారనీ, నీపట్ల బాధ్యతగా గౌరవంగా ప్రవర్తిస్తున్నారనీ అంధ విశ్వాసంలో ఉన్నావు.

భ్రాంతిజనితమైన ఆనందంలో ఉన్నావు. దాన్నించి నీవు బయటపడాలి. బ్రతికినంతకాలం చినభ్రాంతిలో ఉండి వంచితురాలవు కావటం నేను భరించలేను.

ఇలా అవుతూవుంటే చూస్తూ ఊరుకునేందుకు నీ పుట్టింటివారు నన్ను ఇక్కడకు పంపలేదు" అన్న మందర.

ఆ మాటలకు చెవిఒగ్గిన తరువాత కైకేయి ఆలోచించసాగింది. తాను ఇంత మంచి మనసుతో ఉన్నా భర్త ముందుగా తన కీ విషయం చెప్పక పోవటం దారుణమనిపించింది. తన మంచితనాన్ని ఆధారం చేసుకుని వారంతా తనను వంచిస్తున్నారవి అనిపించసాగింది

భరతుడు రాజు కాలేకపోవచ్చు. కాని తాను ప్రాణాధికంగా ప్రేమించే సోదరుడయిన రాముడు రాజు అవుతాడన్న వార్త వినేందుకు కయినా అనర్హురా! అనుకుంది.

తాను కాక తన బిడ్డకూ ఇలా అవమానితుడయినాడని ఆలోచించగానే ఆమెకు ఉక్రోషం వచ్చింది.

కైకేయి అలా ఆలోచిస్తోందని గ్రహించగానే మందర తన మాటలను మరింతగా కొనసాగింది. "అమ్మా! నీ పుట్టింటివారి ఉప్పుపులుసు తిన్న విశ్వాసం నాలో ఇంకా నశించలేదు. మీరరంతా వెర్రిబాగుల తల్లులు. ప్రపంచంలోని కపటం మీకు అర్థం కాదు. మీరు నిష్కపటులు. అందునించి అందరూ మంచివారుగా ఉంటారని మీరు అనుకుంటారు.

నీ భరతుడు రాజు కాకుండా ఉండేందుకు జరుగుతున్న కుట్ర. అందులో ప్రధానపాత్రధారి దశరథుడు. అతను నీ మీద ఒలికించే ప్రేమ స్వార్థం కోసమే! అవసరమయినప్పుడు దాన్ని అవతల ఉంచగలవాడు రాజు.

రెండవ పాత్రధారి నీ సవతి కౌసల్య! చిన్న భార్య రాజు చేతిలో చిన్న చూపుకు గురి అయిందని అయోధ్యవాసులంతా ఫక్కుమని నవ్వేలా చేసింది. ఇది నీకు కాకున్న నీ పుట్టినింటివారయినా కేకయులకు ఎంత తలవొంపులో బాగా ఆలోచించు.

వారెంత బలవంతులో ప్రతిష్టకలవారో స్మరించు ఒక్కసారి మూడవపాత్ర ధారి నీవు పుత్రుడుగా ప్రేమించేరాముడు. అతడయినా నీ దగ్గరకువచ్చి" అమ్మా! నేను యువరాజ పట్టాభిషిక్తుడను అవుతున్నాను. ఈ ఆనందంలో పాలుపంచుకునేందుకు భరతుణ్ణి పిలిపించాలి" అని చెప్పాడా!

నీ బిడ్డ ఈ ఆనందంలో పాటించుకొనటానికయినా అనర్హుడని అనుకుంటున్నావా! తల్లీ నీవిలా ఊరుకుంటే జరిగే అవమానం నీకుకాదు. ఆనందమే.

ఒక ఆడది తన మూలంగా తన పుట్టినింటివారు అప్రతిష్టపాలు అవుతున్నారని విన్నప్పుడు ఎంతగా బాధపడుతుందో అంతగా బాధ పడింది కైకేయి.

ఒకవేళరాజు నిష్కపట అయితే ముందుగా తన కెందుకు చెప్పలేదు భరతుడు రాజు కాకపోయినా రాముడు రాజు అయే ఆనందంలో సాలుపందుకునే అవకాశం తన ఎందుకు యివ్వలేదు. ఇదంతా అవమానం కాకమరేమిటి?

ఇదంతా కుట్రకాకపోతే భరతుడు కేకయరాజ్యంలో ఉండగా హఠాత్తుగా ఈ నిర్ణయమెందుకు తీసుకున్నాడు దశరథుడు. అతడు అభ్యంతర పెడతాడని వీరు అనుమానించారు. తల్లీబిడ్డలనేకాక తద్వారా మొత్తం తన పుట్టినింటివారందరినీ అవమానంపాలు చేసిన రాజుక్షంతవ్యుడుకాడు.

అక్కకన్నా అధికంగా ప్రేమించిన కౌసల్యనించి తన కెలాంటి వంచన ఎదురు కావటం దురాగతం. బిడ్డను చూచుకున్నట్లు చూచుకుంటున్న రాముడయినా అమ్మాయిలా జరుగుతోంది అని తనతో అనకపోవటం అవమానం

ఇది జరిగాక ముఖ్యంగా తన పుట్టినింటవారికి అవమానం జరిగాక ప్రాణాలకయినా తెగించాలి. ప్రాణాలయినా తియ్యాలి. ఏది ఎలా జరిగినా అవమానం జరగకుండా బుదిశ్శాలి అని ఆలోచించింది కేకయక్షత్రియ కాంత అయిన కైకేయి,

అప్పటికామె నేత్రాలు అరుణాంచితమైనాయి. వల్లవాధరాలు వగడాలలాగున అయినాయి. ముఖం రాజీవమయింది. చెక్కిళ్ళు పద్మరాగ ప్రభలను ఎలార్చినాయి.

"అయినా మరిప్పుడు చేయవలసిందేమిట మందరా!" అలిగి కోపంతో ప్రశ్నించింది కైకేయి. ఆమె కంఠస్వరం ఉండవలసిందిపోయి కఠిన మయి పోయింది మందర ఆమె సరియైన స్థితికి వచ్చిందని గ్రహించింది.

"ఓహా తల్లీ !"ఏంచేయమంటామని నన్ను అడుగుతున్నావా! యింత వెర్రి బాగుల తల్లివికాబట్టే అందరూ అలా నాటకమాడగలుగుతున్నారు కాపురం చెయ్య వచ్చిన ఆడపడుచు ఏ అవమానాన్ని అయినా భరించవచ్చు కాని పుట్టింటివారికి జరిగిన అవమానం మాత్రం క్షమించరాదు.

ఆ బిడ్డను కన్న తల్లిదండ్రుల జన్మ వృథా అవుతుంది. ఆ జాతి ఆడపడుచు అందరికి తలవంపు అవుతుంది.

అందునించి ఈ ఆమనానికి నువ్వు తగిన ప్రతీకారం తప్పక చెయ్యాలి" అని చెప్పింది మంధర.

ఎలా చేయటం—? "అని అడిగింది కైకేయి.

అది కూడనేనే చెప్పాలా వెర్రిదానా! నీవు యింతకాలం అమృతమనుకుని కాలకూటవిషాన్ని త్రాగావు. పూలదండ అనుకుని పామును ధరించావు. అందు నించి బాగా జాగ్రత్తపడాలి. రాముడు రాజు అయేందుకే కదా నీ పుట్టినింటివారికి యింత అపకారం చేశాడు రాజు—?

అది కాకుండా చెయ్యాలినువ్వు. ఏ పని జరగకుండా చేయగలిగిననాడు నీవు కేకయిల పక్షాన విజేతవు అవుతావు.

నీకు జ్ఞాపకం లేదా! రాజు గతంలో నీకు రెండు వరాలిచ్చాడు. యుద్ధ రంగంలో రథంశాల ఊడిపోతూ వుండగా నీవు ఆ ఆపదనించి రాజును కాపాడావు. అప్పుడు రాజు నిన్ను రెండు వరాలు కోరుకొమ్మన్నాడనీ, అవుసరమయినప్పుడు అవి అడుగుతానని నీవు అన్నావనీ ఒకసారి మురిపెంగానాకు చెప్పుకొన్నావు. అది జ్ఞాపకం ఉందా!

ఇప్పుడు రెండు వరాలు అడుగు.

ఒంటి భరతుడు రాజు కేవటం! శతృశేషం మిగులరాదు. కాబట్టి రాముడు పధ్నాలుగేళ్ళ వనవాస జీవితం గడపాలన్నది రెండవ వరంగా అడుగు. దాంతో

కేకయులకు జరిగిన అవమానం తీరిపోతుంది. వారుచేసిన కుట్రకు కేకయరాజ పుత్రి సరి అయిన సమాధానం యిచ్చిందని లోకం గొప్పగా చెప్పుకొంటుంది.

ఒకవేళ, వృద్ధరాజు నిన్ను బులిపించేందుకు అంతా అయాక యిక్కడకు వచ్చినారావచ్చు. ఈలాగా నీవు కృతనిశ్చయురాలవై పోరాటానికి సిద్ధపడాలి. నీకు దక్కవలసినవి కూడ పోరాటం చెయ్యలేనివే దక్కవు. అది ఈ లోకరీతి" అంటూ ప్రోత్సాహపరచింది మంథర. అందుకు సంసిద్ధురాలయింది కైకేయి.

మాసిన చీరకట్టుకుంది. ముడిచివ కురులను జార్చుకుంది. అలతికారాలను అవతలకు విసరికొట్టింది. కంటికొక కడివెడుగా నిలుపిస్తూ అలకపాన్పు ఎక్కింది.

దశరథుడు కైకేయి మందిరానికి వచ్చాడు. పంచారికను పలుకరించి అడిగి రాణివారు అలక గృహంలో ఉన్నారన్న వార్త తెలిసింది. తడబడుతున్న అడుగులతో వృద్ధారాజు కోపగృహాన్ని చేరుకున్నాడు. తెగిన పూదండలా, మేఘలనించి నేల మీదకు రాలిపడిపోయిన తటిల్లతలా అలక పాన్పు మీద కన్పించింది కైకేయి.

"ప్రేయసీ! రాముడు రాజు కానున్నాడన్న వార్త విని నీవు ఆనందంగా ఎదుర వస్తావనుకున్నాను. అయోధ్యా నగరమంతా ఈనాడు పండుగ జరుపుకుంటూ ఉంటే నీ వెంముకిలా ఉన్నావు. నీవు కంటతడి పెడితే నాకు ప్రపంచమంతా అంధకారమవుతుందని నీకు తెలియదా ?" అంటూ ఆమెను అనునయించాడు దశరథుడు. కైకేయి అంతర్యంలో లేచిన అగ్నిహోత్రం ఈ అనునయ వాక్యాలతో రవ్వంత అయినా ఉపశమించలేదు.

చూపెత్తిన శోకంలా, మోడుకట్టిన దుఃఖంలా మారిపోయిన దామె. ముఖం ఏడ్చి ఏడ్చి ఉండటం నించి అలసటగా కన్పించింది. కాటుకరేఖలు చెక్కిళ్ళ మీదికి చెదరినాయి.

"ఎందుకీ నటన!" అన్నదామె కఠినంగా.

"ప్రేయసీ! నీవు దుఃఖంవల్ల ఉద్విగ్నురాలవు అయివున్నావు నన్ను క్షమించు. నీ పాదాల మీద ప్రమాణం చేస్తున్నాను నేను ఎటువంటి నటనా చేయలేదు. నీకు కావలసిందేమిటో అడుగు ముల్లోకాలలో ఎక్కడ ఉన్నా దాన్ని సాధించి తీసుకువస్తాను. అంతేకాని నన్ను శంకించి యిలా ప్రాణంతీయను" అన్నాడు దశరథుడు.

"మీరు నాకేమీ క్రొత్తవరాలు యివ్వనక్కరలేదు. ఇచ్చిన వరాలను వాగ్దానాలని భావించి నిలుపుకుంటేచాలు" అన్నది కైకేయి.

అవును ప్రేయసీ! ఒకప్పుడునాకు నేను రెండు వరాలిచ్చాను. రఘు వంశ వారు లంటే ఏమిటి అనుకుంటున్నావు. ఆడితప్పని వంశం మీది నువ్వు ఏది కోరినాయిచ్చేస్తాను. ప్రాణమయినాయిస్తాను అన్నాడు దశరథుడు ఆమెను తాకి ఓదార్చతూ!

ఈ భేషజాలకేమి! తీరా చెప్పం తరువాత మాట మార్చుకుంటారు. మగ వారి మాయది యిలాగే ఉంటాయి. ఇంతకాలం నన్ను వెర్రిబాగులదాన్ని చేసి వేసారు. మీ ప్రేమంతా నిజమే అని గ్రుడ్డిగా నమ్మాను నేను; నా సౌందర్య మంతా వృద్ధమూర్తి అయిన మీ ముందు శయ్యలా పరిచాను.

అర్ధతకు మించిన అనుభవాలు మీకు దక్కినాయి. నాకు మాత్రం పశ్చాత్తాపమూ పరితాపమూ మిగిలినాయి. ఇక అయినా అన్నమాట నిలుపుకుంటారని ఎలానమ్మాను" అన్నదామె రోదన స్వరంతో బొగిలి బొగిలి ఏడ్చింది.

తన ప్రేయసి, అమర సుఖాలందించిన అపురూప రూపసి అలా బొగిలి ఏడ్వటం చూడలేకపోయినాడు వృద్ధరాజు.

ప్రియురాలా! నీవు పరితపించవలసిన అగత్యంలేదు. అన్నామాట నిలుపుకుంటాను. నీ నించినేమ అందుకున్న అమర సుఖాలకు ప్రతిఫలంగా నీవు ఆశించింది ఏదయినాయిస్తాను

ఇది ఆడి తప్పని రఘువంశవారు లందరి మీద ఆన. సూర్యచంద్రుల మీద ఆన! శృంగార అధిష్ఠాతలయిన రతిమన్మథులమీద ఆన! నీ పచ్చని పాదాల మీద ఆన! నీ కంటికి అంటి ఉన్న కాటుకరేఖల మీద ఆన! నీ కస్తూరి తిలకంమీద ఆన! అడుగుకావలసింది ఏమిటో అన్నాడు దశరథుడు కృతనిశ్చయుడయి.

అతిలోక సౌందర్యవతి అయిన కైకేయి లేచికూర్చుంది.

"మనోహరుడా! నీవు ఆడితప్పనివాడవని నాకు తెలుసు. నాకు రెండు వరాలుకావాలి. ఒకటి నా తనూభవుడైన భరతుడు కోసల వాశిక సింహాసనాధినేత కావాలి. మణి మకుటధారి కావాలి.

రెండవది నీవు ప్రేమించే రాముడు పదులాలుగేండ్లు మౌన ప్రస్థానం చెయ్యాలి. నారచీరలు ధరించి అడవులు పట్టిపోవాలి. ఈ రెండు వరాలు చాలు నాకు" అన్నదామె.

వృద్ధుడయిన రాజు అది వింటూనే "ఎంతపని చేశావు ఓసి రాక్షసి" అంటూ ఆతాళుడయినాడు.

# 9

జగన్మోహనమయిన తన ఆకృతి విశేషాన్ని ఎరగాపెట్టి దశరధుని వశం కావించుకుంది కేకయ రాజపుత్రి! దశరధుడు మూర్ఛాగతుడు కావటంతో రవంత విచలితురాలు అయింది.

తాను ఏమయినా పొరపాటుగా ప్రవర్తించినానేమో అన్న విచికిత్సతో మనసు బాధాపరితప్తమయింది ఆమె హృదయం రవంత కలగుండు పడిపోయింది.

కాని మందర చెప్పిన మాటలు మళ్ళీ జ్ఞాపకం వచ్చినాయి. తన పుట్టినింటి వారయిన కేకయులు అపమానితలు అవుతూవుంటే చూచి సహించటం భరించటం ఎలా! పౌరుషం కలిగిన ఏ స్త్రీ అయినా అటువంటి దుస్థితిని ఎదుర్కొనకుండా ఉండలేదు

అందునించి పరిణామాలు ఎటువంటివి అయినా తట్టుకోవాలి. ఎదురొడ్డి నిలవాలి. ఫలితాంశాన్ని గురించి భయపడకూడదు.

పరిచారికలు వచ్చిరాజుకు ఉపచారాలు చేశారు. అతడు స్పృహవచ్చినప్పుడల్లా హారామా! హారామా! అంటున్నాడు. కైకేయిని తిట్టిపోస్తున్నాడు." రాక్షసీ! ఇంత కాలం జగన్మోహనమయిన నీ రూపాన్ని స్మరించి నీకు బానిసను అయినాను.

కాలనాగును సంభావించి కాపురంచేశాను. ఇప్పుడు కాటువేశావు. రాముడు లేనిదే దశరధుడు ఎక్కడుంటాడు నువ్వు తప్పక భర్తృ విహీనవు అవుతావు. కల్యాణగుణధాముడయిన రాముడు అడవికిపోతే అయోధ్య వాసులు నిన్ను క్షమిస్తారా ! పురాణమూర్తులయిన మా రఘువంశవారు లందరిమీద ప్రమాణం చేశాను.

లేకపోతే యిటువంటి కోరిక కోరినందుకు నీ నాలుక కత్తిరించిఉండనా ఇప్పుడేమి చేయాలి. హారామా! హారామా! అంటూ పడిపోతున్నాడు అయోధ్యాపతి! కైకేయి మరింతగా కృతనిశ్చయురాలు అయిపోయింది.

"నాకు యిచ్చిన వరాలు తీర్చేందుకు నీకు అంతగా బాధఅయితే నేను అడగను. రాఘవులంతా అడితప్పక జంబూద్వీపంలో గొప్పపేరు ప్రతిష్ఠలు సంపాదించినారు. వారికి వారసుడుగా వచ్చినావు నీవు. నీతో రఘువంశ ప్రతిష్ఠ ఆ పాంతమయితే. అలా జరగాలని రాసిపెట్టివుంటే నేను చేయగలిగినది ఏమున్నది. నీ మనోభి రాముడయిన రాఘవునికి పట్టంకట్టి నీవు నిర్చింతగా ఉండు. అడితప్పిన మగడు దొరికి నందుకు ప్రాయిశ్చిత్తంగా నేను సరయూ నదిలో మునిగిపోతాను.

లేదా నా రెండు వరాలు నాకు చెల్లించు" అని దృఢ స్వరాన ప్రశ్నించింది కేకయి రాజపుత్రి. దశరథుడు మళ్ళి స్పృహ విడిచి పడిపోయినాడు. ఉపచారాలు చేయగా రవంత తెలివి తెచ్చుకున్నాడు.

"ఓ నా ప్రాణ ఘాతకీ! ఎంతకు తెగించావు. నా ప్రాణాలకన్నా నీకు వారాలే అధికమయినవి అయితే నేనేం చేయను. రాముడు అయోధ్యను విడిచిపోతే నా శరీరాన్ని విడిచిపోతాయి నా ప్రాణాలు. అయోధ్య నా శరీరం. రాముడు నా ప్రాణం రాముడు అయోధ్యను విడచినాడంటే నా శరీరాన్ని ప్రాణాలు విడిచినాయని కదా అర్థం. అంతా జరగనలసి ఉంటే ఎవరు కాపాడగలరు?

× × × ×

ఆది గంగాతరంగిణులు జాలువారుతున్న సుందరదేశం. అప్పటికి రాముని రథం తమసాతీరాన్ని దాటి వచ్చింది. అప్పటికి కొసల రాజ్యం సరిహద్దులు వెనుక తట్టుపట్టినాయి.

గంగాతీరాన శృంగిబేరపురాన్ని పాలించే ఆటవిక రాజు గుహుడు. వేద శృతి. గోమతి నదులుదాటాక అతని రాజ్యం ఆరంభమయి గంగదాకా విస్తరించింది. అతడు నిషాదభూపతి.

దారి పొడవునా రాముని స్థితిని చూచి ప్రజలు గోలుగోలున దురిపిల్లుతున్నారు. రాముడు గంగదాటి దండకతో ప్రవేశించేందుకు వస్తున్నాడని ముందుగా తెలిసింది గుహుడు. అతడు తన్మయభక్తి భావకుడు. దశరథునికి సరిహద్దుల మీది రాజ్యం అతనిది.

అందునించి దాశరథిపట్ల సోదరభావం వహించాడు.

రామా! స్వాగతమయ్యా మా శృంగిబేరపురానికి వైదికమయిన జీవన మార్గాన్ని అనుసరించే వారందరికీ ఈ గంగ పవిత్రం. ఈ పవిత్ర గంగా తరం నీపాదాలు సోకటంతో మరింత పవిత్రమయింది. నా రాజ్యం నీరాకతో వైకుంఠమే అయింది" అంటూ వారికి స్వాగతం పలికినాడు నిషాదపతి గుహుడు.

రాముడు అతడడిగిన ప్రశ్నలన్నింటికి ఎంతో స్థిరబుద్ధి అయి సమాధాన మందించాడు.

"రామా! నీ వంటి మునిజన మనోభిరాముని కడగండ్లపాలు చేసిన కైకేయి నిజంగా రాక్షసి. ఆమెకు ముందు వెనుకలు ఆలోచించకుండా వరాలిచ్చినా మిత్రుడైన దశరధుడు పెద్ద తప్పిదం చేశాడు. అయినా పితృ వాక్యపాలనలో నీ అంతటి మహనీయుడు మరొక్కడు లేడు. భర్తను అనుగమించే పత్నిధర్మాన్ని నిరూపించటంలో ఈ వైదేహికి సాటి రాగల స్త్రీ మరొక్కరులేరు. నీ సోదరుడు లక్ష్మణుడు ప్రపంచంలోని సోదరులందరి ఆదర్శ పురుషుడయినాడు. మీరు ముగ్గురు ప్రపంచానికి ఆదర్శప్రాయులు. నీ రాకతో నాజన్మ చరితార్థమయింది.

రామా! ఈ శృంగి బేరపురం నీ రాజధానిగా చేసుకో! నా రాజ్యాన్ని ఏలుకో! నా ప్రజలందరూ వెంటరాగా నిన్ను నేను కొలుచుకుంటాను. నీ సేవలో బ్రతుకు పండించుకుంటాను. రామ నామమనే మహా సామ్రాజ్యంలో నేను అధిష్ఠాతనవుతాను. ఈ అడవి దారులవెంట మైథిలిని నడిపించకయ్యా!

రాజీవ దళ లవంటి చరణాలు చూచినావా ఎంతగా కందిపోతున్నాయో! మీ సేవలో తరించే భాగ్యం నాకు వరంగా యివ్వు" అంటూ రామ పాదపం కౌరుహాన్ని ఆశ్రయించినాడు గుహుడు.

రాముడు సోదరతుల్యుడయిన గుహుని శిరసు మూర్కొని సమాదరించినాడు. "సోదరా! నీ సాదువాదం నా హృదంతరాన్ని అలరించిన దయ్యేకా, అమ్మ మనోగతాన్ని తీర్చకతప్పదు. వనవాసం చెయ్యాలని కదా అమ్మ కైకేయి కోరిక. అందునించి నేను యిక్కడ ఉండేందుకు వీలుకాదు. నీవు నన్ను గంగనుదాటించు. నీ మేలు మరచిపోను" అన్నాడు రాఘవుడు. గుహుని కన్నులు చెమరించినాయి.

"ఓయీ! సకల సద్గుణధామా! నీవంటి మునిజనహితైషిని పూజిస్తే జన్మలే తరిస్తాయి. నీ పాలనలో బ్రతికే అదృష్టం లభిస్తే పితృదేవతలను సద్గతులు కలుగుతాయి. అంతటి పురుషోత్తముడవు నీవు. నిన్ను నదితరింపచేయటంతో నా జన్మ తరించినట్లు అవుతుంది. రావయ్యా! రామయ్యా!" అన్నాడు గుహుడు.

పురుషోత్తముడయిన రాముడు అతని అనుసరించినాడు. నిషాదగణాలు వారిని వెన్నంటినాయి.

నిషాదగణపతి ఐన గుహుడు నావను అందంగా అలంకరించాడు. రాముడు నావనుచేరే దారిపొడవునా అరచేతులు పరచి నిలిచినారు నిషాదగణాలు. రాఘవుని కాలు క్రింద పెట్టనీయలేదు.

రేవుకు చేరుకున్నారు సీతారామలక్ష్మణులు.

ముందుగా మైథిలి నావలో ఎక్కికూర్చుంది. రాజీవదళాలతో నావను అందంగా అలంకరించినాడు గుహుడు. సీత వెనుక రాముడు నావలో పాదం మోపేందుకు ఉద్యమించినాడు.

ఆతని పాదపంకేరుహాన్ని నావలో మోపనీయలేదు నిషాదపతి. శ్రీరామ పాదానికి దోయిలి అందించినాడు. రామ పాదం దోయిలిలోని నిలిచింది. ప్రియంభావుడై తన్మయ భక్తి పారవశ్యంతో కనురెప్పలు అరమొగిచినాడు గుహుడు.

"రామా రామా!" అన్న పవిత్రాక్షరాలు ఆతని పెదవుల వెంట పవిత్ర అక్షర స్రవంతిగా జాలువారింది.

రాఘవుడీ స్థితిని చూచి చిరు దరహాసం చేశాడు. "ఓయి సోదరు! నా పాదాలను నావలోడించనీయలేదేమి ? నీ కిట్టి విచిత్ర ప్రవృత్తి సంప్రాప్తమైనదేమి?" అని ప్రశ్నించాడు.

గుహుడు అవునని తల ఊగించినాడు. "దాశరథీ! అవునవును. ఇది విచిత్ర స్థితి. రామచంద్రా! నీ కాలు సోకి ఒకశిలాశకల స్త్రీ మూర్తిగా మారిపోయినదట! అలాగే నీ పాదరాజీవం సోకి తాను పడవకూడ ఆడదిగా మారిపోతుందేమో !" అన్నాడు గుహుడు.

అలనాడు గాధేయునితో పాటుగా మిథిలకుపోతూ వుండగా గౌతమ ఆశ్రమంలో అహల్య సంగతిని స్మరించినాడు రాఘవుడు. గుహుడు చమత్కరించినాడని అర్థం చేసుకున్నాడు. ఆతడు తన తండ్రికి నెచ్చెలికాడు. మేధావి రాజ్యపాలకుడు. ఆతడు చేసిన చమత్కారం చూచిన మైథిలి పకాలున నవ్వింది.

రాముడు నావలోకి వచ్చేశాడు. సీతారాములు నేత్ర పర్వంగా ఉన్న ప్రకృతి అందాలను చూస్తున్నారు. లక్షణస్వామి వారికి అల్లంతా దూరాన నిలిచి అంజలి బద్ధుడైనాడు. గంగానది మధ్యకు వచ్చింది నావ ! నిషాదుడైన గుహుడు తన బాహుబలంతో తెడ్డువేసి పడవను నడుపుతున్నాడు. రెప్పవేయక రాముని వంక చూస్తున్నాడు.

వైదేహి నదీ మధ్యానికి వచ్చాక నదీమతల్లికి తన మ్రొక్కులు చెల్లించుకుంది. "అమ్మా! మందాకినీ! శివగంగా! ఈ పదునాలుగేళ్ళ అరణ్యవాసాన్ని పూర్తి

కావించుకుని నా మనోహరుడు క్షేమంగా తిరిగి రావాలి. అలా జరిగితే నీకు నూరు సురాభాండాలను, మాంస ఖండాలను ఆహారంగా చెల్లిస్తాను. తిరిగి వచ్చే సమయాన నీ మ్రొక్కుబడి చెల్లించుకుంటాను తల్లీ! ఈ అరణ్యవాసంలో పురుషోత్తముడైన నా ప్రాణపతికి విజయ పరంపర చేకూర్చు" అని మ్రొక్కుకుంది మైథిలి.

వారు కను మరుగు అయాక తిరిగిపోయినాడు సుమంత్రుడు.

అవతలి తీరం చేరాక గుహుడు కన్నీటి పొరల మధ్యనించి నడచిపోతున్న సీతారామ లక్ష్మణులను తుదిసారిగా దర్శించాడు. ఇంక అక్కడ నించీ మైథిలిని ముందునడవనీయలేదు రాఘవుడు. లక్ష్మణుడు ముందు. వెనుక వైదేహి. ఆ వెనుక తాను.

వత్సకరూశ దేశాలను గమించారు. గంగాయమునల సంగమస్థలి అయిన ప్రయాగను చేరుకున్నారు. ఆ శ్రమవాసి అయిన భరద్వాజ మహర్షివారికి స్వాగతం పలికాడు.

స్వాగతం ఇచ్చి గౌరవించాడు.

రామా! నీ చరిత్ర విన్నానయ్యా! మునిజన హితైషివి నీవు. అరణ్య వాసం నేను అని వార్యం. అది విశ్వామిత్ర సంకల్పం. మునిజనులు వేద విహితమైన క్రతువుల్ని చేస్తున్నారు. వేద మార్గం నించి నిర్ణయించిన అసురులు వారికి ఆటంకాలు కల్పిస్తున్నారు. వారిని సంహరించి మునిజన హితాన్ని సమకూర్చటమే నీ యీ అరణ్యవాసానికి అర్థమవుతుంది, రవంత ఐనా బాధపడకు.

ఇక్కడకు రవంత దూరంలో శ్యామశాఖి అనే మహావట వృక్షం ఒకటున్నది. దానికి అవతల చిత్రకూట మనే పర్వతం ఉంది. అది నీ తపోవృత్తికీ, భూజాత ఐన సీత ప్రకృతి ఆరాధనకూ అనువయిన రమణీయ ప్రదేశం. వాల్మీకి మహర్షిని సందర్శన చేసుకుని వెళ్ళండి" అంటూ వీడ్కోలు చెప్పినాడు భరద్వాజుడు సౌమిత్రి ఆ వెనుక సీత వారికి రక్షగా రాఘవుడు నడుస్తున్నారు.

శ్యామశాఖిని చూచాకదానికి ప్రదక్షిణలు పూర్తి చేసింది మైథిలి.

"అమ్మా! మహాశాఖామయీ! మావనవాసం విజయోపేతమై రాఘవుని కీర్తి చతుర్దశభువనాలలో జగజ్జేయమానం కావాలని ఆశీర్వదించు. అలా జరిగితే నీకు వేట మాంసమూ సురాభాండాలు మ్రొక్కుగా చెల్లించుకుంటాను" అని మ్రొక్కింది వైదేహి.

దారిలో వాల్మీకిని సందర్శించినారు వారు.

"రామా ధన్యుడవు" అన్నారు వాల్మీకి.

"మహర్షి! మీ వంటి వారివల్లనే నేను చరితార్థుడను కావలసి ఉంది" అన్నాడు రాఘవుడు వాల్మీకికి ప్రణమిల్లి.

"తథాస్తు" అన్నారాయన.

"మైథిలీ! సుకుమారివి! ఈవన చారిత్వం సహించగలవా!" అని చిరునవ్వుతో వైదేహిని పలుకరించినారు వాల్మీకి మహర్షి.

"మహర్షి! మీరునాకు పితృతుల్యులై కన్పిస్తారు. మీ ఆశ్రమమే నాకు పుట్టినిల్లు అనిపిస్తోంది. సుభగమైన ఈ ప్రకృతి అందాలను వీక్షిస్తూ ఇక్కడే వుండి పోవాలని పిస్తోంది" అన్నదామె.

దానికీ "తథాస్తు" అన్నారు వాల్మీకి.

"వెళ్ళి రా తల్లీ" అన్నారు.

"వెళ్ళివస్తాను" అంటూ తిరిగి చూస్తూ పయనమైంది వైదేహి. వారు చిత్రకూట చేరుకున్నారు.

అక్కడి అందాలు అపురూపమైనవి. ఎత్తయిన గిరి శిఖరాలు. జలజల పారుతున్న సెలయేరులు. నా నా పక్షినంతతుల కలకూజితాలు! కొండకొన కొమ్మలను ముద్దాడుతున్న మబ్బు తునకలు. పొదరిళ్ళు పక్షిగూళ్ళు! మహావృక్షాల శాఖల కౌగిళ్ళ అందానికి అందంలాగ అమరిఉంది చిత్రకూటం.

"యిక్కడ ఎంతో బాగుంది. ఇక్కడే మన విడది" అంది వైదేహి.

ప్రకృతి అందాలన్నింటినీ పుణికి పుచ్చుకున్న భూమాత ముచ్చట పడపోయినందుకు ఆ కోరిక నెరవేర్చాలని సంకల్పించాడు రాముడు. ఎత్తయిన శిఖరాల మీద అక్కడ నివశించే ముని వాటికలను చేరువలో ఒక తటాకం ప్రక్కన స్థల నిర్ణయంచేశావు. అచ్చటి వృక్షరాసి దట్టమై గ్రీష్మాతపాన్నించి సైతం రక్షించ గలిగినవిగా ఉన్నాయి.

లక్షణుడు అందిమైయిన పర్ణశాల నిర్మించాడు. భరద్వాజ మహర్షిని సంస్మరిస్తూ ఆశ్రమవాసాన్ని ప్రారంభించినాడు రాఘవుడు.

× × ×

అయోధ్యలో మహారాజు స్థితి మరింత సంకట ప్రాయమైంది. అతడి విడిది యిప్పుడు కౌసల్యా గృహంలో! అహర్నిశలు స్మరించేది రామ మయమే! దివా రాత్రులు అనుభవించే దుఃఖం రామ వియోగమే!

ఒక్క దశరథుడేకాదు, ఒక్క కౌసల్యా గృహమే కాదు, ఒక్క అయోధ్యా నగరమే కాదు మొత్తం కోసల రాజ్య ప్రజలందరూ విషాదయోగంలో తల మునకలయినారు. కరడుకట్టిన చీకటి ప్రజావళి హృదంతరాలలో పేరుకుపోయింది. తల్లిపాలు త్రాగుతున్న బిడ్డలు ఉలికిపడుతున్నారు.

పాలు త్రాగేందుకు పొరుగుచేరిన లేగ దూడల్ని గోమాతలు కొమ్ములతో పోరాడుతున్నాయి యువతులంతా ప్రియులను విప్రలంభానికి వేరుచేసి వేధిస్తున్నారు. పచ్చని చివుళ్ళు వాడిపోతున్నాయి. ఎక్కడ చూచినా విషాదమే మూర్తీభవించినట్లుగా ఐంది కోసల రాజ్యం.

అటిస్థితిలో వెనుదిరిగి వెళ్ళేందుకు మొరాయిస్తున్న అశ్వాలను అదలించుతూ రథాన్ని తోలుకు వచ్చాడు మంత్రి సుమంత్రుడు.

నా రాముడెక్కడ అని అడిగింది కోసల రాజ్యం!

నా కోదండపాణి యేడి ? అని అడిగింది అయోధ్య!

మా ప్రియదర్శనుడేడి అని అడిగింది కౌసల్య !

నా ప్రాణప్రియుడు, ప్రియతనూభవుడేమయినాడు అని దురపిల్లినాడు మహారాజు దశరథుడు. అందరికీ ఒకే సమాధానం యిచ్చాడు మంత్రి సుమంత్రుడు.

"నిషాద ప్రభువు అయిన గుహుడు వారిని గంగ దాటించాడు. భరద్వాజుని, వాల్మీకిని సందర్శించి చిత్రకూటం మీద పర్ణశాల నిర్మించినారన్న వార్త తెలిసింది" అన్నాడతడు.

దశరథుడు అయ్యో అంటూ విరుచుకుపడి పోయినాడు. కౌసల్య సుమిత్రలు అతనికి ఉచితమయిన ఉపచారాలు చేసినారు- రాఘవ వియోగంనించి అతనిని ఓదర్చాలని ప్రయత్నించినారు.

కౌసల్య రాముడు పర్ణశాలలో ఉన్నారన్న వార్తవిని కడుపుశోకంతో శ్రీమూర్తి అయింది. రాముని వంటి ప్రశాంతమూర్తికి జన్మ యిచ్చిన ఆ తల్లికి హృదయభారంతో వివశత్వం కలిగింది. పేగు కదిలి కడుపులో అగ్నిహోత్రంలా చిందసాగింది.

"ఓయీ! అయోధ్యాపతీ! ఎంతపని చేసినావు. నా రాముని అడవిదారులు పట్టించినావు కదా! అడవులకు పొమ్మని అన్నందుకు నీ వాక్కు పడిపోలేదేమి ? ఒక స్త్రీకి మానసికంగా భానిసవయి, వృద్ధుడవయినా లాలసుడవయి ఈరాని వరాలు యిచ్చినందుకు నీ శరీరాంగాలు దహించుకు పోలేదేమి. తల్లికి కడుపు సోకం కలిగించే రాజు సజీవుడయి వుండటంకన్నా వైధవ్యాన్ని వరించటమే మేలుకదా! రానా! రాఘవుని బదులుగా నీవు అరణ్యాలుకుపోతే ఎంతో మేలు జరిగిఉండేది.

కన్నతల్లికి కడుపుమంట రేపినావు. చిచ్చు పెట్టావు నా కడుపులో! దుష్టుడా! యింతకింత అనుభవిస్తావు. నా ఉసురు ఊరకపోతుందా! నిన్ను దహించివేయదా! వృధాప్రలాపీ! "అంటూ కడుపు మంటతో వివశురాలై మగడని ఐనా చూడకుండా నిందించింది కౌసల్య.

మిత భాషిణీ, వ్రతశీల, పతిభక్తి పరాయణ ఐన కౌసల్య అలా దశరధుని అనరాని మాటలు అంటూఎంటే సుమిత్ర వింటూ విభ్రాంత అయిపోయింది.

అన్నాపడి ఊరుకున్నాడు దశరధుడు. "కౌసల్యా! సౌజన్యమూర్తివి ఐన నీ కింతకడుపు కోత కల్గించినందుకు నేనుపాపిని విన్నమాటలు అన్నా నాకు శిక్షనీవ చాలవు. నాకు పరౌతరాట్టు పిలువులు వినిపిస్తున్నాయి. రాముడు ప్రాణం. యిప్పుడు మీ ఎదురుగా కన్పించేది నిర్జీవమయిన శరీరం మాత్రమే! ఈ శరీరం చైతన్య రహితమై పోవటానికీ మరింతొసేపు పట్టదు" అనుకున్నాడు లోలోన.

తన కడుపు చిచ్చు రవంత ఉపశమించాక తిరిగి స్వస్థురాలయిపోయింది కౌసల్య. భర్తపాదాలను కన్నీటి ఊటలతో అభిషేకిస్తూ వలపోసిందామె.

దశరధుడు ఈ శోకవిషాద వాతావరణాన్ని భరించలేని దుర్బలుడు అయినాడు. పదేపదే మూర్ఛాగతుడు కావటం, వయసుకు మించిన విషాదాన్ని భరించవలసిరావటం అతని జీవధాతువులను కృంగదీయ సాగింది. తనకు తుది ఘడియలు సమీపించినాయని గుర్తించినాడతడు అర్ధరాత్రి కౌసల్యను తట్టిలేపాడు.

"కౌసల్యా! ఒకప్పుడు పితృభక్తి పరాయణుడైన శ్రవణ కుమారుని శబ్దవేది ఆధారంగా వధించాను నేను. అతని పితృదేవుడు నేను కూడ పుత్రశోకం ప్రాణం విడుస్తానని శాపం పెట్టాడు. అది యధార్ధమవుతోంది" అని చెప్పాడు. కౌసల్య సహృద్భావంతో భర్తను ఓదార్చింది.

మూడవ ఝాము ఆ ప్రాంతమవుతూవుండగా ఆమె శోకభారవల్ల, పరితాపం శరీరానికి కలిగించి నా అలసటవల్ల రవంత రెప్ప వాల్చిందామాతృమూర్తి. మరి కొంత సేపటికి తెల్లవారింది.

అప్పటికే పుత్ర శోకంతో అదృష్ట విహీనుడయిన ఆ తండ్రి విశతకపు డయినాడు. అతని ఉసురులు అసాంతమయినాయి. ప్రాణావసాన సమయంలో ఆతడు ఎవరికీ ఏమీ చెప్పలేదు. రామనామం స్మరించిఉంటాడు.

అయోధ్యాపతి విగతజీవుడైయినాడన్న వార్త రాణి వాసంలో పాక్కింది. వెనువెంటనే వచ్చాడు వశిష్ఠుడు. ఆమె గిన్నెలలో నూనె పదార్థాలను నింపి దశ రథుని శరీరాన్ని సుభద్రంచేశారు. జరుగసలసిన దానికి కర్త కేకయ రాజ్యంలో ఉన్నాడు. అక్కడికి వార్త వెళ్ళింది హుటాహుటిన బయలుదేరి వచ్చాడు భర తుడు వెంట శత్రుఘ్నుడున్నాడు.

అయోధ్యలో కాలుపెట్టినాక విషాదచ్ఛాయలు కన్పించినాయి. అతడు నేరుగా కైకేయి మందిరానికి వెళ్ళాడు. తనూభవుడు వచ్చాడనగానే కైకేయి ఆనందానికి మేరలేకపోయింది.

“అమ్మా! నగరంలోనూ, నగరిలోనూ యిలా విషాదచ్ఛాయలు అలముకుని కన్పించిన్నాయేమిటని” అని అడిగాడు భరతుడు.

తాను ఊహించిన దాని కన్నా అధికాధికమైన పరిణామాలు జరిగిపోయి వున్నాయి కావటంనించి కైకేయి రవంత కలవరపడిపోయింది. మహారాజ రాఘవుని నిర్గమనంవల్ల మనో వైకల్యం పొందుతాడని అనుకుంది కాని మరణిస్తాడని అనుకో లేదామె. అంతపనీ జరిగిపోయింది

“నాయనా! భరతా! నీవు యింతగా కంగారు పడవలసిన పనిలేదు. నిజ మాలోచిస్తే ఇది నీవు ఆనందించవలసిన మంచి సమయం. నీకు కాని నాకు కాని మీ తాతగారికి కాని మరే కేకయులకుకాని తెలియకుండా కొద్ది దినాలకు పూర్వం మహారాజు రామపట్టాభిషేకం నిర్ణయించినారు. ఇది కేకయులందకీ తలవొంపులని నేను భావించాను.

నీ తండ్రి గతంలో నా కిచ్చిన వరాలు అడ్డుపెట్టి అటువంటి దురంతం జరగ కుండా నిలువరించినాను. నీకు పట్టాభిషేకం జరగాలనీ, రాముడు పదునాలుగేళ్ళ అరణ్యవాసం చెయ్యాలనీ కోరాను. అందుకు సుగుణస్తోమడయిన రాముడు అంగీ

కరించి అరణ్యాలకు వెళ్ళినాడు. ఆ దిగులుతోనే తండ్రి మరణించినాడు మనిషి పుట్టినా చనిపోయినా క్రతు పూర్వకంగా క్రియాదికాలు జరిపించాలి. అందుకే నిన్ను పిలిపించారు.

కేకయుల ప్రతిష్ఠ యినుమడించేలా నీవు అభిషిక్తుడవు అయి ఈ కోసల రాజ్యాన్ని ఏలుకో" అని చెప్పింది కైకేయి మాతృవాత్సల్యంతో!

తండ్రి మరణించినాడనీ, తన ప్రియతముడైన సోదరుడు దేశం విడిచి వెళ్ళిపోయినాడనా వినగానే భరతుడు విచలతుడైనాడు. అటువంటి వార్తలను ఎంతో సహజంగా చెప్తున్న తల్లి మీద అతడికి రోత పుట్టింది.

"ఇంత పనిచేసింది నీవా! రాక్షసీ! రాముడంటే నా కెంత ప్రేమ గౌరవా లున్నాయూకా నీకు తెలియదా! రాఘవునికి నేనంటే ఎంత వాత్సల్యం. కొడుకు రాజు కావాలన్న ప్రలోభంతో యింతకు తెగించావు నీవు. కాని నాకన్నా రాముడే నిన్ను అధికంగా ప్రేమించాడు. గౌరవించాడు ఇది వాత్సల్యం కానేకాదు. రాక్షస ప్రేమ అంటారు దాన్ని!

నిన్ను ఖండించినా అన్నగారికీ జరిగిన అన్యాయానికి ప్రతీకారం చేస్తాను. అంటూ చర్రున ఖడ్గాన్ని దూశాడు భరతుడు. అది చూచి వశిష్ఠుడు వారించాడు. "మాతృహత్య మహా పాపం నాయనా! అందునా నీవు అభిషిక్తుడవుకావలసి ఉంది. నీ హస్తాలను రక్తసిక్తం కానివ్వకు" అని బోధించటంతో ఆగిపోయినాడు భరతుడు.

వారు కైకేయి మందిరాన్నించి కౌసల్యా మందిరానికి వస్తువుండగా కుబ్జ ఐన మంథర ఎదురువచ్చింది. కైకేయి యిచ్చిన అలంకారాలన్నింటినీ శరీరం నిండా దిగేసుకుని మరింత వికారంగా తయారయింది. తన పుట్టినింటి దేశపు వాడయిన భరతుడు ఆ చోటునించి తిరిగి వచ్చాడని పలకరించేందుకు అపేక్షతో ఎదురువచ్చింది.

శత్రుఘ్నుడు దాని కొప్పు పట్టుకున్నాడు. ఒక్క విషపు వాక్కుతో అంతటి అయోధ్య రాజ కుటుంబాన్ని ఛిన్నాభిన్నం చేసిన మంథర కొప్పు పట్టినందుకే బాధతో మూలిగింది.

ఎవరికైనా బాధలనేవి తమదాకా వచ్చినప్పుడే తెలుస్తాయి!

"దీని తలను ఖండించి జరిగిన దానికి ప్రాయచిత్తం చేస్తాను" అంటూ ఉద్యుక్తుడైనాడు దశరథి ఐన శత్రుఘ్నుడు. అంతలో కైకేయి పరుగున

వచ్చింది. "అది నా తండ్రి నా కిచ్చిన ఆస్తి. దాన్ని వధించే అధికారం మీ కెవరికీ లేదు" అంటూ అడ్డుకుంది.

"నాయనా స్త్రీ హత్య నేరం. దాన్ని వదలిపెట్టు. యింతకూ ముని జన హితైషి ఐన రాముడు అడవులకు వెళ్ళాలన్నది విధి నిర్ణయం అతడు చేయవలసిన మహాత్కార్యాలు కొన్ని ఉన్నాయి. అందునించి అలా జరిగింది. వీరంతా నిమిత్త కారణాలు" అన్నాడు వశిష్ఠుడు.

దాంతో పట్టినదాని కొప్పు విడిచిపెట్టాడు శత్రుఘ్నుడు. పాపిట అంతా పండి పోయిన ముసిల్ది మంధర ప్రాణాలు దక్కించుకుని కైకేయి మందిరానికి పారి పోయింది.

నేరుగా కౌసల్యాదేవి దగ్గరకు వచ్చాడు భరతుడు. "అమ్మా! అన్నకు అన్యాయం జరిగింది. అందుకు ప్రతిగా నన్ను వధించు" అన్నాడు.

"నాయనా! నీ తల్లి నా బిడ్డను పొట్టన పెట్టుకుని రాక్షసి అని పించుకుంది. ఇప్పుడు నిన్ను వధించి నేను రాక్షసిని కావాలనా నీ కోరిక! వెర్రివాడా! ఈ కోసల వాసులు కేకయులంతటి స్వార్థపరులుకాదు. నీ తల్లి చేసిన కుట్ర నీకు తెలియదని నన్ను నమ్మమంటున్నావు. నీ కళ్ళకు నేసంత వెర్రిబాగుల దానిలా కన్పిస్తున్నాను మీ తండ్రితో పాటే నేను చనిపోయాను అనుకోండి. నా రాముడితో పాటేనన్నూ మర్చిపోండి హాయిగా రాజ్య మేలుకొనండి" అంటూ మాతృశోకంలో రగిలిన మంట కారణంగా నిష్ఠూరాలాడింది కౌసల్య.

భరతడు విదగ్ధమానసుడైనాడు.

"అమ్మా! నాకు కైకేయి వేరు. నీవు వేరుకాదమ్మా! రాముడు నాకు ప్రాణ ధికుడైన సోదరుడు. ఎప్పటికైనా ఈ సింహాసనాన్ని నా అగ్రజుడే అధిష్ఠించాలి. అందాకా నేను సరయూ తీరాన పర్ణశాల వేసుకుని ముని వృత్తి అవలంబించి బ్రతుకుతాను" అన్నాడు భరతుడు.

దాంతో కౌసల్యకు అతని మీది అనుమానం నివృత్తి ఐంది. పుత్రశోకం వల్ల ఆమె ఆలోచనలు ప్రక్కదారి పట్టినాయికాని భరతుడంటే ఆమెకు రాముని మరొక రూపంలా కన్పిస్తాడు.

వశిష్ఠుడు కర్తవ్యం గుర్తుచేయగా భరతుడు కార్యబద్ధుడు ఐనాడు. తండ్రికి అంత్యక్రియలు పూర్తిచేశాడు. రాజులేని రాజ్యం మగుడు లేని భార్యవంటింది.

ఉప్పులేని కూర వంటిది. సూర్యకాంతి సోకని చంద్రుని వంటిది. బిడ్డలులేని యిల్లాలువంటిది.

అందునించి పెద్దలంతా పట్టుపట్టి భరతుని పట్టాభిక్తుని చేశారు. భరతుడు బాధ్యతలనైతే భొదల దాల్చినాడు. కాని అధికార లాంఛనాలన్నింటినీ పరిత్యజించినాడు. తిరిగి రాముని అయోధ్యా నగరానికి తీసుకురావాలన్న ప్రయత్నం ప్రారంభించాడు.

రాణువతోపాటు రాణివాసం కూడ అతనితో అడవులకు కదలింది. అయోధ్య వాసులంతా బయలుదేరారు తిరిగి భరతునివల్ల రామ దర్శనం లభిస్తున్నందుకు వారంతా పొంగిపోయినారు.

సుమంత్రుడు చెప్పిన గుర్తుల వెంటవారు పయనించి తమసా నదినిదాటి గంగా తీరాన శృంగిబేరపురాన్ని చేరుకున్నారు. అనంత సేనా వాహినితో తరలి వస్తున్న భరతుని చూచి బొమముడి వేసినాడు నిషాదపతి ఐన గుహుడు.

శ్రీ రామపాద రాజీవ స్పర్శతో అతనిలో అంకురించిన పులకాంకి తాలింకా క్రొత్తమాయలేదు. రామునిపట్ల ఏదైనా అపచార తలపెట్టినారా భరతుడు. మరి గంగను దాటలేదు.

కాని అతనికి వాస్తవాలు తెలిసివచ్చినాయి. రాముడు ప్రేమించిన భరతుడు విశ్వాస ఘాతకుడు కాదు రామునికి తన నయోధ్యనేరిగించి అయోధ్యకు తిరిగి రమ్మని పిలిచేందుకు బయలుదేరాడు. ఈ సంగతి తెలిసిన నిషాదవిభుడు సంతసించినాడు.

అతనికి అతని సైన్యానికి ఆతిధ్యమిచ్చినాడు. రామునంతటి పురుషోత్తమునికి జన్మ యిచ్చిన తల్లి కౌసల్య పాదాలకు మ్రొక్కాడు అతని అడవులకు పంపిన కైకేయి పచ్చని పాదాలకు చిరుపెచ్చని నుదురు తాకించాడు.

అందరికి అపూర్వమైన ఆతిధ్యమిచ్చి గంగాదాటించి అవతలకు దారిచూపించారు. భరతుని రాణువ గంగాతీరాన పురోగమించింది. వత్సకరూశ దేశాలను దాటి వెళ్ళింది.

గంగాయమున సంగమస్థలి ఐన ప్రయాగ చేరుకున్నారు. భరద్వాజ ముని ఆశ్రమంలో వారికి అపూర్వమైన ఆశ్రయం లభించింది ముని చంద్రుడు పసందైన విందు అందించాడు.

మొత్తం భరతుని సేనా వాహినికి అతడంత గొప్ప విందు అందించినాడంటే తరువాతి కాలంలో— ఎక్కడ ఘనమైన విందు జరిగినా దాన్ని "భరద్వాజ విందు" అని స్మరించేంత గొప్పగా చేశాడు. భరతుడు ముని పాదాలను ఆశ్రయించి తల్లి చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం అడిగాడు. భరద్వాజ ముని చిరు దరహాసం చేశాడు.

"భరతా! నీ తల్లి నోటివెంట అటువంటి మాటలు ఎందుకు వెలువడినాయన్నది ఎవరూ ఎవరికీ చెప్పరాని దేవరహస్యమే కాని రాఘవుని వనవాసం నిర్హేతుకమైనది మాత్రం కాదయ్యా! ఒకప్పుడు సుమాలి అనే అజేయుడైన మహావిరాట్ పురుషుడు ఆతనిని జయించాడు నాగలోకం వరకూ తరిమికొట్టాడు. ఆ అవమానానికి ప్రతీకారం చేయాలని బహుకాలం అజ్ఞాత వాసంచేస్తూ ఎదురు చూచాడు సుమాలి. అతని పుత్రిక కైకసి

ఆమె ద్వారా విశ్రవసు అనే మహా తపస్వి బీజాన్ని సంకరం చేయించాడు. అసురగణాల వనిత ఐన కైకసి సురపక్షపాతి ఐన విశ్రవసు బీదాన్ని ధరించి క్షేత్రవతి ఐంది. ఫలితాంశంగా సంకీర్ణ మహా పురుషుడు నరావణుడు ఉద్భవించాడు.

అతడు హిమావర్తము, బ్రహ్మావర్తము దక్షిణావర్తము అనే ముల్లోకాలను జయించాడు. ఇంకా విష్ణువు తన తాతగారిని అవమానించిన కోపం తీరక అతని కోసం అన్వేషిస్తున్నాడు. అందులో ఒక భాగంగా విష్ణుభక్తులయిన ముని జనులను హింసించటం ప్రారంభించాడు.

తన వారిని రక్షించుకునేందుకు విష్ణువు తనను ఎదిరించేందుకు వస్తాడని అతని ఆశ! ఆ సంకీర్ణ మహా పురుషుని ఆగడాలను అరికట్టే మార్గం కోసం అన్వేషించారు మునులు. అయోధ్య రాముడు అందుకు తగినవాడని నిర్ణయించారు గాధేయుడు, భార్గవుడు.

అతడు మునిజన పక్షపాత అయినాడు. మునులవల్ల ఆయుధ సంపత్తిని సమీకరించుకున్నాడు. యిప్పుడు మునివాటికలపై దాడిచేస్తున్న అసుర వీరులను సంహారిస్తూ అడవులలో ద్రిమ్మరుతున్నాడు. ఈ కార్యక్రమానికి ఉపసంహారం రావణ సంహారమే!

ఇదంతా పెద్దలు నియమించిన పథకం. ఈ పరిణామాలకు కారకులయి, వారంతా పావులు మాత్రమే! అందునించిది. ఎవరిమీద ద్వేషం పెంచుకోకు. పురుషోత్తముడైన రాముడు రావణవధ అనంతరం అయోధ్యకు రాగలడు. ఈ

లోగా నీవు చేయదగు ప్రయత్నాలను నీవు చెయ్యాలి" అంటూ ప్రవచించినాడు భరద్వాజుడు.

భరతుడు మునిజన హితైషి ఐన రాముడు కారణజన్ముడు దుస్తరమైన ఒక లక్ష్యాన్ని సాధించేందుకు అవతారమెత్తిన ధర్మ స్వరూపుడు అని గ్రహించాడు. తన తల్లి నిమిత్త మాత్రురాలు అనిపించింది.

అయోధ్యపాలకుల మీద మునిజన పాళి ఉంచిన విశ్వాసం తలచుకుని అతని కనులు చెమరించినాయి. అయినా అయోధ్య ప్రజల మనోగతాలను అనుసరించి రాముని తిరిగిరమ్మని అడిగేందుకు పురోగమించినాడు శ్యామశాభిని దాటి దండక లోని చిత్రకూటాన్ని చేరవచ్చాడు.

ఆ సమయాన రాముడు సీత కొండకొనకొమ్మన కూర్చుని ప్రకృతి అందాలను తిలకించి ఐద్దులు అవుతున్నారు లక్ష్మణుడు ముందుగా కదలితరంగాలవలె వస్తున్న రాణువను చూచినాడు.

రాముడు ముందుభాగాన భద్రగజాన్ని గుర్తించాడు సౌమిత్రి, వడివడిగా అన్నగారి దగ్గరకు పరుగులు తీసాడు.

"రామభద్రా! అదిగో మనభద్రగజం. అడవులకు వచ్చినా వెన్నాడుతున్నాడు భరతుడు. నాకు అనుమతియివ్వు, ఆ మూకనంతా తునుమాడి తిరిగి వస్తాను"అంటూ వీరాలాపంచేశాడు.

రాముడు పరకాయించి చూచాడు. రామునకు ముందుగా శ్వేతపతాకం విహాయస వీధుల్లో రెపరెపలాడుతోంది. అది శాంతిసందేశం దానిని గుర్తించినాడు రామచంద్రుడు.

"సోదరా! శాంతికాముకుడై వస్తున్నాడు భరతుడు" అన్నాడు సౌమిత్రితో. అంతలో అపార సేనావాహిని ఆ వెనుక రాణులు, ఆ వెనుక పౌరులు అందరూ వచ్చేశారు రామదర్శనంతో వారి కనులు చెమరించినాయి.

భరతుడు నేరుగావచ్చి రామపాదాలను సమాశ్రయించినాడు. "సోదరా ! నీ పట్ల నాతల్లి అపచారంచేసింది ఆమె రాక్షసి. మమ్ములను క్షమించు" అని ప్రార్థించినాడు భరతుడు. రాముడు అతనిని సముదాయించాడు.

"సోదరా! పరితాపంలో మాతృనిందకు పాల్పడుతున్నావు. అది తప్పుకాదా! అలా చేయకు" అన్నాడు. భరతుడు మరింత చిన్నదయినాడు. అత్తలందరూ మైథిలని చేరుముచ్చట సాగిస్తున్నారు.

"అన్నా! ఈ అరణ్యవాసం మీకు తగదు. అయోధ్యకురండి. మా అమ్మ వరాలు అడిగి రాజ్యం సంపాదించి నాకు యిచ్చింది. ఆ రాజ్యాన్ని నేను మీకు యిస్తున్నాను. తిరిగిరండి" అన్నాడు.

అందుకు రాముడు అంగీకరించలేదు. ధర్మమూర్తి అయిన నా తండ్రికి ముందుగా తర్పణలు యివ్వాలి" అంటూ లేచాడు. అందు గురించిన కార్యక్రమ మంతా ముగిశాక పెద్ద సభ తీర్చాడు భరతుడు.

"నా సోదరుడు అయిన రాముడు అయోధ్య పాలకుడుకావాలి. అది న్యాయం ఈ కోరికను సభాముఖంగా వెల్లడిస్తున్నాను. రాముడు లేకుండా నేను అయోధ్యలో కాలు పెట్టను" అని ప్రతిజ్ఞ చేశాడు భరతుడు.

పితృవాక్యపాలనకు కట్టుబడి ఉంటానని అందునించి తిరిగి అయోధ్య రావడ మన్న ప్రసక్తిలేదని తేల్చి చెప్పాడు రాఘవుడు.

భరతుని మంత్రిమండలిలో ఒక ప్రముఖుడు అతడు ప్రచండమయిన తస వాదాన్ని ప్రారంభించాడు.

"రామా! ఇవన్నీ పనికిమాలిన ధర్మాలు. మనిషి బ్రతికేది సుఖించటం కోసమేకదా! నీ తండ్రిలేనప్పుడు ఏ పితృవాక్యపాలన అన్నభ్రాంతి నా కెందు కయ్యా ఇప్పుడు నీవు తర్పణలు యిచ్చావుకదా! అవి నీ తండ్రికి అందుతాయా ! విజ్ఞుడవయిన నీవుకూడ అజ్ఞానంలో పడుతున్నావేమిటి?

మంత్రాలతో ఏ ఘనకార్యాలు సాధింగగలరు మీరు? నీవు యీ లోకంలో మంత్రాలు చదివి ఆ పితృదేవతలకు అందేలాగా చేయగలవా? ఎంత నిర్హేతుక మయిన ఆలోచన.

ఒకవేళ ఈ యజ్ఞకర్మాలు అంతశక్తివంతమయినవి అయితే నేనొక ప్రశ్న నిసురుతున్నాను. మీలో ఎవరయినా సమాధానం చెప్పవచ్చును.

ఈ లోకంలో పితృకర్మచేసి పరలోకంలో ఉన్న పితరులను తృప్తిపరచలేదు. అలా చేయగలమని ఎవరయినా నిరూపించగలిగితే నేను సంతోషిస్తాను. ఇక ఇక్కడ ఉన్న కుమారుడు పరాయి గ్రామంలో ఉన్న తండ్రికి మంత్రాలద్వారా ఈ ప్రయోగాన్ని ఎవరయినా సరే నిరూపించండి.

ప్రక్క గ్రామంలోని తండ్రికి మంత్రసాధనద్వారా అందించలేని పిండాలు పరలోకంలో ఉన్నవారికి ఎలా అందించగలరు. ఉన్నదో లేదో తెలియని పర లోకాన్ని హేతుబద్ధంకాని మీ ఆలోచనలన్నీ కట్టిపెట్టండి.

భరతుడు యిచ్చిన రాజ్యాన్ని హాయిగా ఏలుకో! నీవు శక్తిమంతుడవు. నీ శక్తిని వనవాసరాముడు అతని నాస్తిక వాక్ప్రవాహం ఆగిపోయిన తరువాత చిరుద హాసం చేశాడు అల్లన పెదవి విప్పాడు.

"ఓయీ మేధావీ! నీ మాటలు కొంత నిజాలు కాకపోవు. కాని ప్రకృతి ధర్మాలను నిర్దేశిస్తోంది. మానవుడు ధర్మాన్ని రక్షించాలి. ధర్మం మానవుణ్ణి రక్షిస్తుంది" అన్నాడు!

జాబాలిబాల ఎదురొక్కన్నాడు.

"రామా! ధర్మానికి రూపం ఎలాంటిదో నీవు నిర్వచించగలవా! ధర్మమనే భ్రాంతి నొకదాన్ని సృష్టించుకుని దారితప్పుతున్నావు" అన్నాడు రాముడు ధర్మదూషణమే చెవులు మూసుకున్నాడు.

"మేధావీ! ధర్మానికి రూపంలేదనీ ఎలా అనుకుంటావు. ఒక బిడ్డనుకని దాన్ని పోషిస్తుంది. అలా చేయటం ఎందుకు కన్నవెంటనే దాన్ని విసిరివేయరాదా!" అన్నాడు.

"అది మాతృప్రేమ" అన్నాడు జాబాలి.

"మాతృప్రేమకు రూపం ఏమిటో నీవు నిర్వచించగలవా! ఉన్నదో లేదో తెలియని మాతృప్రేమను నీవు ఎందుకు నిర్వచించావు. బ్రతుకు అంధకారం. ఆ అంధకారానించి బయటపడాలనే నేను ధర్మాన్ని ఆశ్రయించినాను" అన్నాడు దాశరథి. వింటున్న శ్రోతలు రాముని ప్రశంసించారు. జాబాలి సురిమాట్లాడలేదు. వశిష్ఠుడు కల్పించుకున్నాడు.

"రామా! ఎలాగయినా నిన్ను అయోధ్యకు రప్పించాలని అతడాలా వాదించాడు. నీ వింక ప్రసంగాన్ని చాలించు" అన్నాడు వశిష్ఠుడు. ఈ మారు రామునితో పాటుగా జాబాలకూడ మందహాసం చేశాడు.

"అన్నా! నీవు రానప్పుడు నీ పవిత్ర పాదుకలయినా నాకు యివ్వు. వీ ప్రతిగా వాటిని సింహాసనంమీద ప్రతిష్టించి నీ ప్రతినిధిగా మాత్రమే పాలన కొనసాగిస్తాను" అంటూ అంజలి ఘటించినాడు భరతుడు.

రామ పాదుకలను అందుకున్నాడు శిరసున ధరించారు. పరివారమంతా అతని వెంట బయలు దేరినారు. తల్లులందరికీ మ్రొక్కి వీడ్కోలు చెప్పాడు రాఘవుడు. అత్తలందరికీ మ్రొక్కి వీడ్కోలు యిచ్చింది మైథిలి. సౌమిత్రిని శిరసున

యాశీర్వదించింది సుమిత్ర. "నాయనా! భ్రాతృప్రేమకు నీ పేరు శాశ్వతమైన చిహ్నం కావాలి. ఓరిమిలా పౌరుషంలోనూ అన్న వొదినలపట్ల భక్తి ప్రపత్తులు వెల్లడించటంలో నీ అంతటివారు మరొక్కరు లేరని భారతేతిహాసాలలో లిఖించబడాలి.

పైదికాను యాయులయిన భావితరాల తమ్ములందరికీ నీ పాత్ర ఆదర్శప్రాయంకావాలి. నీ కోసం ఊర్మిళ అంతర్నేత్రాన్ని తెరచి ఎదురుచూస్తోంది. ఈ పదునాలుగేళ్ళు ముగించుకుని వచ్చిన తరువాత అయోధ్యవాసులంతా నిన్ను ఆరాధిస్తారు "అంటూ ఆశీర్వదించిందామె. సౌమిత్రి తల్లులందరి పేరుపేరున పాదాలంటి నమస్కరించాడు.

రామ పాదుకలతో భరతుని సేనావాహిని అంతా కదలిపోసాగింది. అయోధ్య నాగరికులంతా వెనుదిరిగి రాముని చూస్తూ వెడలిపోయినారు.

రాఘవుడు మైథిలి సౌమిత్ర మాత్రమే చిత్రకూటంలో మిగిలారు. చిత్రకూటంలో ఆవాసముంటున్న మునులందరికీ రాఘవుని గురించి వివరాలు తెలిసాయి. వశిష్టునివల్ల అతని వనవాసం తన అంతర్యం వారికి వెల్లడి అయింది.

వారంతా పొంగిపోయినారు.

కాని వారి ఆనందం మరింతకాలం నిలువ లేదు. రాఘవుడా చోటుకు వచ్చిన తదాది అసుర గణాల దాడులు అధికాధికంగా అయినాయి. మునులు తల్లడిల్లపోసాగారు. వారిని అసురగణాల బారినుంచి పరిరక్షించేదుకయి ఉద్యమించినాడు దాశరధి.

అతడు ఆల్లెతాటిని విల్లుకు బిగించి ధనుష్టంకారం సలిపినాడంటే అసురులు మందబుగా పారిపోయేవారు. అకర్ణాంతమూ విల్లువంచి బాణం ఎక్కుపెట్టినాడంటే నిశాచరులకు ముచ్చెమటలు దిగజారుతాయి.

సంధించిన బాణం వదిలినాడంటే రక్కసిమూకలు కిక్కురమనకుండా విగతప్రాణులయేవారు. అలా సాగుతున్న రాముని మీద దాడి ఆగలేదు. అనంతవాహినిలా అసురగణాలు వొస్తూనే ఉన్నాయి. కనుమూస్తూనే ఉన్నాయి. ముని జనులందరికీ రాఘవుడు వనవాసం రావడంతో పండుగదినాలు వచ్చినట్లుగా అయింది.

విచక్షణాశీలి అయిన వైదేహి రాఘవుని కార్యక్రమాన్ని అనుక్షణం పరిశీలిస్తూనే ఉంది. అతడు నిరంతరం రాక్షస సంహారం చేయుటం ఆమెకు ఆలోచనలు రేకెత్తించింది.

దివ్యమంగళరూపా. నీ అవక్ర పరాక్రమం ఒక్క రాక్షస సంహారానికే అన్నట్లు ఎత్తిన విల్లు దించకుండా కొనసాగిస్తున్నావు. నాకు ఒక సందేహం ప్రియతమా! రాక్షసులు మీపట్ల చేసిన అపకారం ఏమిటి?" అని అడిగింది వైదేహి.

రాముడు రవంతసేపు నిరుత్తరుడైనాడు. మైథిలిని రెప్పవేయకుండా చూచినాడు అవును నిజమే! తాను యిప్పటికి యిందరు రాక్షసులను సంహరించాడు వారెన్నడయినా తన ఊసు ఎత్తిన ఉదాహరణ లేదు. తానీపని ఎందుకు చేస్తున్నట్లు.

రాముడు ఆలోచనా మగ్నుడయి రెప్పలు అరమొగిచినాడు. రవ్వంతసేపు అయాక అల్లన రెప్పలు విప్పిచూచాడు.

"జానకి! నిజమే. అసురగణాలు నా ఊసెత్తలేదు. కాని వారి పట్ల నేను దారుణఖండల శస్త్రఖండాలను ప్రయోగిస్తున్నాను. కాని ఒక్కసంగతికూడ నీవు ఆలోచించాలి.

మునులు సాధుజీవనులు. రావణునికి వారేమి ఎగ్గు చూసినారని అతడు వారి మీదికి రక్కసిమూకల్ని పంపుతున్నాడు. రాజుగా కాకపోయినా ఒక సాంఘిక ప్రాణిగా బలహీనుల పట్ల జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించి నిలవటం నా బాధ్యత" అన్నాడు రాఘవుడు

వైదేహి ఆ సమాధానం విని సంతుష్ట కాలేదు.

ప్రియదర్శనా! మునులు బలహీనులని మీరనటం విడ్డూరంగా ఉంది. వారు తపోబలంవల్ల శక్తి సంపన్నులు. మీరు దారుణఖండల శస్త్ర ఖండాలతో సాధించగల దాన్ని వారు తమ శక్తి వల్ల సాధించగలరు. కాని వారి తపశ్శక్తి అసురగణ సంహారానికి వ్యయపరచకుండా ఉండేందుకు తూలికగా ప్రయోగింముకుంటున్నారు" అన్నదామె. వైదేహి వాగ్ధాటిరాముని ఆత్మగౌరవాన్ని శోధించసాగింది.

అతడు తిరిగి ఆలోచనామగ్నుడైనాడు.

భగవతీ! నీవన్నది యథార్థమే! మునిజనుల ఆశయసాధనకు తూలికయైనాడీ అయోధ్యరాముడు. మునిగణాలు సురపక్షపాతులు, వైదికమయిన ధర్మాని దక్షిణాపథంలో సాంఘిక జీవితంలో సమ్మిళితం చేయాలన్ని ఆశయసాధనకై వారు పోరాడుతున్నారు.

వైదిక ధర్మప్రతిష్ఠాపనలో సూర్యవంశ ప్రభువులు తూలికకావటమునేది మా పెద్దలు ఆర్జించిన ప్రతిష్ట. ఆ ప్రతిష్ఠమఖను మడింపచేయటంలోనే కూడ ఒక

తూలకను అవుతాను. ధర్మప్రతిష్ఠాపనలో సమిధను అవుతాను. ధర్మానిరతికై ఈ రాఘవుడు. తనసర్వస్వాన్ని ముదకు ధర్మపత్నిని అయినాబదులుకునేందుకు సంసిద్ధుడు అవుతాడని నీవెరుగుదువుకదా" అన్నాడు దృఢస్వరాన.

దాంతో వైదేహిమరింక మాట్లాడక ఊరుకుంది.

యథావిధిగా రాక్షస సంహారాన్ని కొంతకాలంపాటు కొనసాగించాడు దాశరధి ధరణజాత ఇంక అందుగురించి కిమ్మనలేదు.

కొంతకాలం పోయినతరువాత జనులంతా కట్టగట్టుకుని వారిఆశ్రమం దగ్గరకు వచ్చారు. వారికి కులపతి అయిన మౌని "రామా నీవుచేయవలసిన కార్యక్రమం చాలఉంది. అందునించి ఇక్కడే బహుకాలం ఉండేందుకు వీలుకాదు. నీతోపాటుగా మేమూతా రావాలనుకుంటున్నాము. మరికొంత దక్షిణానికిపోతే దట్టమయిన దండ కారణ్యం ప్రారంభమవుతుంది. నిశాచరగణాలు అప్రాంతాలలో విస్తారంగాఉంటాయి. నీవు అక్కడకు చేరవలసిన అవసరం ఉన్నది" అని పలికినాడు వారి కులపతి.

మునులంతా వెంటరాగా దట్టమయిన దండకావిని ప్రవేశించినాడు రాఘవుడు. ప్రథమంలో వారి నికృత రూపి రావణునికి సన్నిహితుడు అయిన విరాధుడు ఎదుర్కొన్నాడు.

అతడు పెద్దవృక్షంలా ఉన్నాడు. తలకాదు. వక్షస్థలి మధ్యభాగంలో వికృత నేత్రం విరాజిల్లుతుంది. అతడు సీతను ఎత్తుకున్నాడు. విడిపించబోతే రామలక్ష్మణుల ద్దరిని తన బహువులలో యిరికించుకున్నాడు

రామలక్ష్మణులు అప్పటికే చాలమంది అసురలను చంపారు. అందునించి వారికి రవంత అయినా భయమనిపించలేదు. అతని బాహువుల్ని శరీరంనించి వేరు చేశారు. అతడు మొదలునరికిన వృక్షంలా నేలకు ఒరిగిపోయినాడు.

ప్రాణం విడుస్తూ "రామా! రంభా వ్యామోహంలోపడి దేవేంద్రునివల్ల ఈ వికృతరూపం వచ్చిందినాకు. నీచేతిలో మరణించటం తృప్తిని కలిగిస్తోంది. నీవు పురుషోత్తముడవు. ఒక వీరునికి మరొక మహావీరుని చేతిలో మరణం సంప్రాప్తం కావటం అదృష్టమేకదా! నీవు మరికొంతముందుకుపోతే శరభంగుని ఆశ్రమం వస్తుంది. అతనికి కలసిన తరువాత కర్తవ్యం వైపుగా నీవు మరింత పురోగమించ గలుగుతావు" అని సందేశమిచ్చి ప్రాణలు వదిలాడు విరాధుడు. రాఘవుడు కృగాటవిలో మరింత ముందుకుసాగాడు.

# 10

పోనుపోను మార్గం మరింతగా దుర్గమైపోతుంది ముందు ప్రక్క లక్ష్మణుడు దారిచేసుకుందుకు పొదలు వృక్షశాఖల్ని చెలుగుతూ ముందునడుస్తున్నాడు. ఆ వెనుక సీత నడుస్తోంది. ఆమెకు సంరక్షణ భారాన్ని వహిస్తూ చివరగా నడుస్తున్నాడు రాఘవుడు.

వారు ముందుకు సాగిపోయినారు. దుర్గమమైన ఆ అరణ్య ప్రాంతంలో విస్తారమైన క్రూరమృగాల తాకిడుల మధ్య ఉంది శరభంగుని] ఆశ్రమం అతడు అపరిమితమన తపోశక్తి సంపన్నుడు. రామలక్ష్మణులు సీతతో కలసి ఆ ఆశ్రమ ప్రాంతాలకు చేరేవేళకు హిమావర్తరినించి విమానంలో వచ్చిన పుణ్య పురుషుడెవరో అతనితో ముచ్చటిస్తున్నాడు.

రాముని ఆగమనం తెలియగానే అతడు వెళ్ళిపోతానన్నాడు.

శరభంగుడు అతనికి వీడ్కోలు యిచ్చి రామునికి స్వాగతం పలికాడు. మధురఫలాలు నిర్మలోదకాలు యిచ్చి సేదదీర్చాడు అమృతో సమానమైన వాక్కులతో వారి నిస్ఫూర్తివంతులను చేశాడు.

రామా! జనావాసాలను విడిచి ఈ నిర్జనారణ్యాలలో తపస్సు చేసుకుంటున్న మునులము మేము. మా కష్ట సుఖాలను ఆలించిన వారింతవరకూ లేరు.

నీవు మునిజనహిత కాంక్షివి అయి ఇలా దుర్గమారణ్యలలో వనవాస జీవితంగడుపుతున్నావు. మా బ్రతుకుల్ని దుర్భరంచేసి మా క్రతువులను ఆటంకపరచుతున్న అసురులను వధిస్తున్నావు.

ఇంతటి త్యాగమయమైన జీవితం గడుపుతున్న నీవు ధన్యుడవు నీ ధర్మపత్ని ఐన భూజాత అదృష్టవంతురాలు. నీ సోదరుడు సౌమిత్రి చరితార్థుడు. నేను ఈ శరీరాన్ని విడిచిపెట్టాలని నిర్ణయించుకున్న ఈ తుదిఘడియలలోనే దర్శనం లభించటం అదృష్టమేనయ్యా! అంటూ అగ్ని వేదికను సమీపించినాడు శరభంగుడు

రాఘవుడు తన చర్యలకు చకచ్చకితుడైనాడు.

అగ్ని ప్రవేశం చేస్తూ చెప్పాడు శరభంగుడు.

"వినీలవ పుషా! ఈ ప్రాంతాలలో అసురులు, క్రూరమృగాలు అధికంగా ఉన్నట్లు నాకు తెలుసు. మరికొంత దక్షిణంగా పోతే సతీక్ష్ణుని ఆశ్రమం వస్తుంది.

అతని వల్ల నీకు మరికొన్ని సంగతులు తెలుస్తాయి. మరింత ముందుకుపో !" అంటూ అగ్నిప్రవేశం చేశాడు శరభంగుడు. అతని తపోతప్తమైన శరీరం యిప్పుడు అగ్ని తప్తమయి భస్మరాసిగా మారిపోవటం చూచాడు రాఘవుడు.

అక్కడనించి దక్షిణ దిక్కుగా బయలుదేరినారు. అక్కడక్కడ ఆసన మవుతున్న అప్రధానమైన ముని ఆశ్రమాలను సందర్శిస్తూ సుతీక్షణుని ఆశ్రమానికి ఆశ్రమానికి చేరుకున్నాడు. రామవుడు సతీసోదర సంయుక్తుడై యి వొస్తున్నాడన్ని వార్తవిని శిష్యసమేతుడై ఎదురువచ్చాడు సుతీక్షణుడు. మధురఫలాలు నిర్మలో దకాలు యిచ్చి స్వాగతం పలికాడు. రామభూమిసుతనుకొనియాడినాడు.

నాయనా! రామచంద్రా! ఈ క్రూరాటవిని జొరపడ్డ తొట్టతొలమలి రాజువు నీవు. ముని జనహిత కాంక్షతో నీవు చేస్తున్న వనయాత్రలలో కాలలోనూ విశిష్ట మైనది. యిప్పటికే ఎన్నో ఆశ్రమాలకు నిశాచర భయంలేకుండా సంరక్షించినావు.

ఇక్కడినించి ఇంకా ముందుకుపోతే అమిత భయంకరమైనది అందునేల ఆరు ఋతువులలోనూ చిత్తడి అయివుంటుంది. కొన్ని యోజనల పర్యంతంగా రవి కిరణం భూమిని తాకదు చాకిరిచాకిరిగా పొదలు పెరిగి మార్గాన్ని అవరోధం చేస్తాయి. ఎక్కడా కాలిబాట కన్పించదు. అడగుపెడితే అది పాతాళానికి పోతుందో ఫణిరాజుల ఫణాగ్రాలకు అనుతుందో తెలియదు.

పొదపొదలో చెబ్బులు పొంచి ఉంటాయి. కొమ్మలకు కొండ చిలువలు విస్తారంగా వ్రేలాడుతుంటాయి. ఈ భయంకరమైన అడవి ఎన్నియోజనాల వరకూ పరివ్యాప్తమయివుందో ఎవరికీ తెలియదు. ఇందులో ప్రవేశించినవారు యింత వరకూ ఎవరూ తిరిగి రాలేదు

నిశాచరులకిది క్రీడాస్థలమనుకోవాలి. కేవలం ఒక్క దండకాటవిలోనే కాక మొత్తం జంబూద్వీపంలో ఇంత భయంకరమైన కీకారణ్యం మరొక్కటిలేదు. అయినా ముక్తికాంతను పొందాలన్న ప్రలోభంతో త్యాగధనులయిన మునులు కొందరు ఈ అడవి లోపలకు వెళ్ళారు మృత్యుగహ్వారంలోకి ప్రవేశించిన వారి వలె తిరిగిరాలేదు.

వారేమయినారో తెలియదు. అసలు సజీవులయివున్నారో లేవో తెలియదు. ఇంతవరకు ఏ మహావీరుడూ ఈ అరణ్యంలోకి ప్రవేశించేందుకు సాహసించలేదు. ఎంత దుర్గమమో, ఎంత విస్తారమో, ఎంత భయంకరమో ఊహకైనా అందని ఈ గహన మార్గవెంట వెళ్ళిన మునులు ఏమయినారు? మునిజనులను రక్షించేందుకు

కంకణ బద్ధుడవయిన నీవు తప్ప ఈ భయంకరాటవిలోకి ఎవరూ వెళ్ళలేరు. లోపల ప్రవేశించిన వారిని సంరక్షించలేరు" అని చెప్పాడు సుతీక్షుడు.

అతడు వర్ణించిన మృత్యుగుహ లాంటి అడవి గురించి ఊహించిన భౌణా తకు భాయమైంది. కనీసం లోపలకుపోతే ఎటువంటి సమస్యలు ఎదురుఅవుతాయో కూడ అర్థంకాని ఆ ప్రదేశంలోకి రాఘవుడు వెళ్ళేందుకు ఉద్యమిస్తాడేమోనని భయ పడిందామె. ఆమె అనుకున్నతా ఐంది రాఘవుడందుకు సంసిద్ధుడైనాడు.

"మునీ! విశ్వకల్యాణ ఆకాంక్షతో తపస్సు చేస్తారు మునులు. వారికి చొర రానిచోటు అంటూ ఉండదు. ఎంతభయ కరమైన ప్రదేశాకైనా వారు పోతారు. అట్టివారి సమస్యలను సానుకూల పర్చటం. క్రూరమృగాల బారినించీ, అసుర గణాల ఆగడాలనించే వారిని రక్షించటం కన్నా పవిత్ర కర్తవ్యమేమి ఉన్నది.

ఎంత భయంకరమైన ప్రదేశమైనాసరే! ప్రవేశించాక ఎటువంటి సమస్యలు ఎదురుఅవుతాయో అర్థంకాకపోయినా సరే, తిరిగి వస్తానోరానో తెలియకపోయినా సరే నేను ఈ అడవిలోకి వెళ్ళితీరుతాను. దండకలో రాక్షసమాయల్ని అరికట్టి. మునులను రక్షించాలన్న నా సంకల్పాన్ని పరిపూర్తి చేసుకుంటాను.

ఒకవేళ అందుకోసం నా ప్రాణాలను బలిపెట్టవలవస్తే అందుకు సంసిద్ధుడను ఐవున్నాను. అనుజ్ఞయివ్వండి అంటూ అంజలి ఘటించాడు రాముడు ముని అతని ధర్మనిష్ఠకు అచ్చెరువు పడినాడు. అతడు పురుషోత్తముడే అన్న విశ్వాం బలపడింది.

అతనిని ఆశీర్వదించి పంపేశాడు సుతీక్షణుడు.

"మనోజరూపా! మీకు ఎట్టి అపకారం చేయని రాక్షసులను వధించేందుకు కంకణబద్ధులయినారు. దీని పర్యవసానంగా వారి ప్రధాన శత్రువు అవుతారు మీరు. ఆయన వర్ణించిన ఘోరాటవిలోకివెళ్ళి మనం తిరిగి రాగలమా ? మీ రెందుకింత సాహసానికి ఒడగడుతున్నారు" అని తిరిగింది వైదేహి.

రాఘవుడు సీత ప్రశ్నవిని చిరునవ్వు నవ్వినాడు.

"ప్రియమైథిలీ! పరాక్రమమనేది ప్రకాశించేది సాహసంవల్లనే కదా! ఈ ఘోరాటవిలో చెలరేగిన అసురులను దండించినందువల్ల వారందరి దృష్టి నా మీదికి రాగలదు వారందరికీ ఏకైక శత్రువును నేను అవుతాను.

అయినా సరే! కర్తవ్యంనించి నీ రాముడు ఒక్క అడుగుఅయినా వెనుకంజ వేయ్యడు. ఎవరూ చూడని ఈ భయంకర విపినాన్ని చూడగలగటం నా అదృష్టం

కదా! ధర్మాన్ని ప్రతిష్ఠాపన చేసేందుకు పురోగమించటం ఒక్కటే నాకు తెలుసు.

మరింక నన్ను నిరోధించకు. చెప్పానుకదా! ధర్మంకోసం ఈ లోకంలోని నా అన్న సర్వస్వాన్ని వొదులుకుంటాను. అధికాధికంగా ప్రేమించే నిన్నూ, ప్రాణసమంగా ప్రేమించే సౌమిత్రిని అందరినీ వొదులుకుంటాను ఒక ధర్మకోసం అన్ని బంధాలను విడిచిపెడతాను" అన్నాడు దాశరథి. వైదేహి మరింక మాట్లాడలేదు.

ఏంజరుగుతుందో, ఫలితాంశమేమిటో తెలియని ఆ ఘోరమైన అరణ్యంలోకి పురోభాగాన కాలుపెట్టాడు సౌమిత్రి.

ఆ వెనుక అడుగుమోపింది మైథిలి. వారికి రక్షగా వెనుకతట్టున ఉండి నడిపించాడు కోదండపాణి అయిన రాముడు.

వారు అతిభయంకరమయిన కీకారణ్యంలోకి మునిజన సంరక్షణ ధ్యేయంగా ప్రవేశించారు !!

× × × ×

నిండుగా ఒకదశాబ్దం గడిచాక దానిలోంచి తిరిగి బయటపడినాడు రామచంద్రుడు. వృక్షాల సముద్రంనించి ఒడ్డుపడ్డాడు. జలసంధుల మీదినించి లేచిపోతున్న శ్రావణమేఘంలా కనిపించాడతడు.

దండకలో అతిభయంకరమయిన ప్రాంతాలలో రాఘవుడు సతీసోదర సమేతుడై ఎట్లాగడిపాడో అది తెరచాటున నిలిచిపోయిన గాథ.

వారి జీవితతతి వింతసంఘర్షణల మధ్య నలిగిపోయిందో ఎవ్వరికీ తెలియదు. కొన్నికొన్ని ఆశ్రమాలలో కొన్నికొన్ని దివారాత్రులు గడిపారు.

కొన్నికొన్ని మునివాటికలలో కొన్నికొన్ని మాసాలు గడిపారు. ఆ ప్రాంతాల పరిస్థితులను అనుసరించి అసురగణాలు అక్కడ సృష్టించిన సమస్యలను అనుసరించి గడిపారువారు. ఆ సమస్యలను పరిష్కరించారు.

వారి మనసులలో భయాన్ని పారద్రోలారు. శాంతియుతమయిన వాతావరణాన్ని నెలకొల్పారు. ఫలితాంశంగా దాశరథి అసురులకు ప్రథమ శత్రువు, మునిజనులకు ప్రథమ మిత్రుడు అయినాడు

అలాంటిస్థితిలో పదిసంవత్సరాలు అజ్ఞాతంగా సంక్షుభితమయిన జీవితం గడిపారువారు. మొక్క మొలిచిన తరువాత అందరికీ అందంగా కన్పిస్తుంది. కాని భూమిలో నిక్షిప్తమయిన బీజం అంకురంగా ఆవిర్భవించటానికి అజ్ఞాతంగా భూమి లోపల ఎంతో పోరాటం చేస్తుంది

అలాగే యిప్పుడు కన్పించే రాముడు పురుషోత్తముడు. మునిజన రక్షకుడుగా అంకురించినాడు. ఈ స్థితిని పొందేందుకు వార్తలుకూడ అందని గహనాంతర సీమలలో ఎంతో పోరాటం సలిపి విజయుడయి తిరిగి వచ్చినాడు.

అతనికి ఎందరో అజ్ఞాతసుహృన్మణు ఎన్నెన్నో అద్భుతమైన ఆయుధాలను ఇచ్చి పంపినారు. కీటకం కోశంలో అజ్ఞాతంగా గడిపి సీతాకోకచిలుకగా ఆవిర్భవించి నట్లుగా రాఘవుడు పదిసంవత్సరాలు కోశస్థ జీవితంలాంటి అజ్ఞాత జీవితంగడిపి పురుషోత్తముడయి, శక్తిశాలిఅయి తిరిగి సుతీక్ష్ణుని ఆశ్రమ ప్రాంతాలకు తిరిగి వచ్చినాడు.

మునులంతా అతని అనుభవాలను అడిగి తెలుసుకున్నారు.

"నేను ఎక్కడ ఆశ్రమం నిర్మించుకోవాలి. అడవులకు వచ్చాక పదిసంవత్స రాలకు పైగా పోరాటాలమధ్య గడిపేశాను. అసురకణాలతో తన సంఘర్షణలమధ్య గడచింది.

ఒక అందమైన ప్రకృతి సదనంలో ఆశ్రమం నిర్మించుకుని విశ్రాంతిగా కాలం గడపదలిచాము" అన్నాడు రాముడు.

సిప్పలవనందావులలో వుంటున్న అగస్త్యమహర్షి మహిమాన్వితుడు. అతని దర్శించేతే మీకు ఉచితమైన స్థలాన్ని నిర్ణయించి చెప్పగలరు" అని వారు బదులు చెప్పారు

రాఘవుడు వెనువెంటనే పయనమయాడు. అతనికి తోడుగా కొందరు మునులుకూడ అనుసరించి వచ్చినారు. మాందకర్ణి పేరున ఉన్న అద్భుత తటాకం దాటి వచ్చాక అగస్త్యభ్రాత ఆశ్రమం కన్పించింది. అతగాని దురదృష్టమో అదృష్టమో తెలియదుకాని ఆ పేరు ఎవరికీ తెలియదు అగస్త్యభ్రాత అనిమాత్రమే తెలుసు, అతడు రాఘవుని సత్కరించినాడు.

అగస్త్యమహర్షి ఆశ్రమానికి దారి చూపించాడు.

దశరథాత్మజుడు వస్తున్నాడని వినగానే అగస్త్యుడు ఎదురేగినాడు శిష్యగణాల వల్ల పరివృతుడయి వచ్చినాడు అద్వితీయ మహిమాన్వితుడయిన అగస్త్యమహర్షి.

అతడు మునిగణాలలో అమితశక్తి సంపన్నుడు. అతని ఔన్నత్యాలను మహర్షులే కథలుగా చెప్పుకుంటారు. వాతాపియిల్వలు అనే రాక్షసులను తుదముట్టించిన ప్రజ్ఞాశాలి అతడు. మొత్తం వార్నిధుల జలరాసులన్నింటినీ పట్టిగ్రోలినాడన్నది అతని శక్తి సంపన్నతకు పరాకాష్ఠ.

ఒకసారి వింధ్యనగరం వియత్తాలని ఎదిగిపోతూ కమలబాంధవుని ఆగమన నిర్గమనాలకు అభ్యంతర పటలంలా అయిందట. అప్పుడాతరు వింధ్యమెరువులను అలాగే ఉండిపొమ్మని ఆదేశించినాడట. ప్రకృతి శక్తులను జయించగలిగిన ధీశాలి అన్న కథలు అగస్త్యుని గురించి ప్రచారమైనాయి.

అవన్నీ విన్నరాముడు మునిపాదాలకు అవనతుడయి మ్రొక్కినాడు అగస్త్యుడు కోదండపాణికి అద్భుతమైన తన ధనస్సును అందించాడు. ఎన్నో సాంకేతికమైన అస్త్రరహస్యాలను బోధించాడు.

"నాయనా! నిజానికి నీవు మిగిలిన కాలాన్ని నా ఆశ్రమంలో పూర్తిచేయ వలసిన వాడవు. కాని మాంసాహారివి. వైదేహి ప్రకృతి సౌందర్యాలను అపేక్షించే అతివ! అందువించి మీకు అనువు అయిన ప్రదేశం మరొకటి చెప్తాను.

అక్కడ రావణుని మూకలు ఉన్నాయి. ఐనా నీవు వారికి భయపడవలసిన ఆగత్యంలేదని నాకు తెలుసు. దానిపేరు పంచవటి.

నీవు పంచవటితో ఆశ్రమాన్ని నిర్మిస్తే లోకకల్యాణం జరుగుతుందని నా విశ్వాసం. వెళ్ళిరా!" అని వీడ్కోలు ఇచ్చాడు మహర్షి. అగస్త్యునికి మ్రొక్కులు చెల్లించి వీరు బయలు దేరారు.

అప్పటికి సేకరించుకున్న అద్భుత అస్త్రశస్త్ర రహస్యాలన్నింటినీ స్మరించి నాడు రాఘవుడు. ముల్లోకాలలో గగ్గోలు రేపుతున్న అసురగణాలన్నింటిని అధి నాయకుడైన దశగ్రీవుని మిత్రగణాలున్న ప్రదేశమది.

అందునిండి మరొకమారు సౌమిత్రిని హెచ్చరించి గౌతమీ తీర సుందర దేశానికి వచ్చినాడు రాఘవుడు. అక్కడి ప్రకృతి అందాలన్నింటిని చూచి ఆనంద వివశ అయింది వైదేహి. ఆమె మనసు ఉరకలు వేయసాగింది.

పంచవటిలో అందమైన ఒక ఆశ్రమాన్ని నిర్మించాడు సౌమిత్రి దానికి పూలతలు అల్లించాడు. ఆశ్రమం చుట్టూ ఒక అద్భుతమైన వనాన్ని పెంచాడు. వర్ణవర్ణాంచినమైన ఒక లోకాన్ని పర్ణశాలచుట్టూ సృష్టించాడు సౌమిత్రి.

అప్పటికి చలికాలం వచ్చేసింది. హోమధూమం హిమసమూహాలతో సమ్మోహితమవుతోంది. శరత్కాలం అసాంతమైపోయింది. హేమంతంలో హిమధూమం ఎల్లెడలావం వ్యాప్తమవుతోంది. చలికితాళ జంతుసంతతులు శరీరాల్ని రాచుకు తిరుగుతున్నాయి.

పక్షిసంతతులు ముక్కులు రాచుకుంటున్నాయి. స్త్రీపురుషులు పీడని కౌగిళ్ళలో హిమబాధనించి ముక్తులవుతున్నారు. తరుజాతులు గడవడకుతున్నాయి. రసాల వృక్ష కాండాలను కౌగలించుకుంటున్నాయి మాధవీలతలు!

అలాంటి శీతాకాలం సమాసన్నమైంది.

రాఘవుడు అయోధ్యను స్మరించినాడు. ఈ చలికి నా తల్లి ఎలా ఉందో! నా ప్రియసోదరుడు భరతుడు నేను తిరిగివచ్చిందాకా భూశయనం చేస్తానని చెప్పి వెళ్ళాడు. సరయూ తీర శీతపవనాల బాధను అతడెలా భరిస్తున్నాడో అని చింతిల్లినాడు.

సిద్ధులు దేవగణాలవారు నివాసముండే అగస్త్యఆశ్రమాన్ని వదలి పంచవటికి వచ్చేవేళ రామునికి జటావుతో పరిచయమైంది. అతడు దశరథుని ఆత్మమిత్రుడు. రామకథవిని చింతిల్లినాడు.

"రామా! ఈచోటున రావణమూకలు ఆవాసముంటున్నాయి. మీరు వేటకు వెళ్ళినవేళ మైథిలిని నేదు కాచుకుంటాను" అంటూ తన నివాసం పంచవటి ప్రాంతాలకు తరలించుకున్నాడు.

ఇప్పుడు వచ్చిన శీతపవనాల ధాటికి అతడెలా ఉన్నాడో అనికూడ బాధపడినాడు రాముడు. వీటి నిమిత్తమై అడవిలోకి వచ్చినప్పుడల్లా జటావును సందర్శించి మ్రొక్కులు చెల్లించాడు.

అతని సోదరుడయిన సంపాతి గురించి యోగక్షేమాలు విచారించినాడు. మొత్తంమీద శీతకాలం ఒక సంచలనమైంది.

పంచవటిలో ఉంటూ తనను చూడవచ్చే మునిజనులనించి గౌతమి గాథలు వింటూ అది దక్షిణాది గంగఅని గ్రహించాడు రాఘవుడు సౌమిత్రి కడవలతో నీళ్ళు తెస్తున్నాడు. వైదేహిక పంచవటిలోకి మనోహరమై సాగిపోతుంది వారికి.

ఐక దశాబ్దానికి పైకాలం రాక్షస సంహారంలోనూ మునిజనగణాల సంరక్షణలోనూ తాను పొందిన అలసటను పంచవటితో పర్ణశాల నిర్మించాక మరచిపోయినాడు రాఘవుడు.

వైదేహి పూలుతెచ్చి మాలలు అల్లుతోంది. దాశరథి పర్ణశాల వెలుపల సౌమిత్రి నిర్మించిన వేదికమీద కూర్చుని ఉన్నాడు.

జానకి మాటలు కూర్చడంలోని నైపుణ్యాన్నిచూచి ముచ్చటపడిపోతున్నాడు. మాలలు కూర్చుతున్నప్పుడు ఆమె అంగుళులు సంచలిస్తూ విచిత్రంగా విన్యసించ టాన్ని తిలకిస్తున్నాడు.

అట్టి సమయంలో ఆ ప్రాంతాలకు ఒక అసురకాంత వచ్చింది. ఆమె బహు కాలంనుంచి రాముడనే వీరుడు అసురగణాలను తురుమాడుతున్నాడని విన్నది. అతని ధాటికి అగ్నిప్రవేశంవల్ల శలభాలు దగ్ధాలయినట్లుగా అసురులు ఉసురులు విడుస్తున్నారు. మానవవీరుడు శక్తులను చూపుతున్నాడు అని విని ఉన్నదామె కాని అతనిని చూడలేదు.

అతడీమధ్య పంచవటి ప్రాంతాలకు వచ్చాడని తెలుసుకుంది. ఇప్పటి శీత పవనాలనించి ఆమె శరీరం మదన తాపంతో వేగిపోతూంది. అసురగణాల మదవతి అయిన ఆమెపేరు శూర్పనఖ దశగ్రీవునికి సాక్షాత్తు సోదరి ఆమె, కైకసికి ఆడ సంతానం. విశ్రవసువంటి మహనీయుని బీజం కైకసి క్షేత్రంలో ఫలించగా అంకు రించినశక్తి, శీతవాతాలనించి తాను పొందుతూన్న మదనతాపానికి రాఘవుని సమాగ మంలోశమనశాంతిని అన్వేషించదలచుకుందామె.

శూర్పనక భర్త అయిన యక్షుడు దశగ్రీవునితో యుద్ధంలో మరణించాడు. అందునించి లంకారాజ్య సరిహద్దులమీదికి ఆమెను రక్షకదళంతోపాటుగా పంపాడు.

తనవల్ల భర్త్రి విహీనఅయింది కావటంనించి జాలితో దశగ్రీవుడామె అగడా లను సంహరించాడు. అన్నదగ్గర ఆమె ఎక్కువచనువును ప్రదర్శించగలుగుతోంది. ముల్లోకాలలో విజేత అయిన రావణుడు తన ప్రియసోదరుడన్న అహంకృతి ఆమెది.

స్వయంగా శక్తిశాలని అందునించి గౌతమీతీరా నా ఎదురులేని కార్యకలాపా లను కొనసాగిస్తోంది. కావాలనుకున్నదల్లా అనుభవించటం ఆమె అభిహితం.

రాముడు వీరుడు, సుందరుడు, మదనమూర్తి, అతనిని తొలిసారి చూడగానే అతనినుంచి విన్నవీధగానిలన్నీ జ్ఞాపకం వచ్చినాయామెకు.

వెంటనే వేదికమీద కూర్చునిఉన్న ఆ సుందరుని దగ్గరకు వచ్చింది. లోపల మైధిలి పుష్పమాలలు అల్లుతోంది. శూర్పనఖ రాముని దరిచేరవచ్చింది. అతనివంక చూస్తూ రెప్పవేయటం మరచింది.

"నీవా రాముడంటే—?" ఆశ్చర్యంగా!

మర్యాదను అనుసరించి రాముడు చెప్పాడు. "జంబూద్వీపే, భరతఖండే, సరయూతీరే, అయోధ్యానగరవాసీ అహంభో అభినాదయే" అంటూ ఆమెను గౌరవించాడు.

"ఓయీ! నీలసుందరా! ఏమి నా నీ నేత్రాల సౌందర్యము. ఏమి సుందర నీలవపుషము? ఏమి సువిశాలమయిన ఎడద? ఏమి నీ బాహుబలము? నిన్ను చూస్తూ ఉంటే ఏ ఆడదానికయినా మనసు చలించకుండా ఎలా ఉంటుంది. ఎంత ధీరసుందరుడవో, అంత పరాక్రమనంతుడవు.

ఎంత మదనమూర్తివో అంత విక్రను చరిత్రడవు. నిన్ను కౌగలించని నా బాహువులు వృథా!" అంటూ రాముని కౌగలించాలవి ప్రయత్నించిందామె. వైదేహి అరకన్నులతో ఆ దృశ్యాన్ని చూచింది.

అప్పటికే ఆమె అనేక రాక్షసమాయలు చూచింది. తన ప్రాణపతి అయిన రాముడు ధీరుడు అతని నిగ్రహమేపాటిదో తానెరుగును. అందునించి రాఘవుని మీద పరిపూర్ణమైన విశ్వాసంతో మరొక వంకకు చూపులు మరల్చుకుంది.

"ఆగాగు" అంటూ పైపైకి వొస్తున్న శూర్పనఖను వారించినాడు రాఘవుడు. కనులెత్తి ఆమెను పరీక్షగా చూచాడు.

"నీ వెవరు? అసురకాంతలా ఉన్నావు" అని అడిగాడు.

"ధీరుడా! సరిగా గ్రహించినావయ్యా! అసురకాంతనే! నరమాంస భక్షణకూడ చేయగలను. నేనెవరో తెలిస్తే నీవు నాకు పాదాక్రాంతుడవు అవుతావు. కాని అలా కావటం నాకుయిష్టంలేదు. నీవు పాదాక్రాంతుడ కావటంకాదు. నాకాంతుడవు కావాలని నా కోరిక అందునించి నిన్నేమిచేయను ధైర్యంగా విను!

నా పేరు శూర్పనఖ! విశ్రవను కైకసి దంపతుల ముద్దుబిడ్డను నా సోదరుడు దశగ్రీవుడు ముల్లోకాలకు విజేత. మరొకసోదరుడు మహాబలశాలి అయిన కుంభకర్ణుడు. మరొకడు విభీషణుడున్నాడు కాని అతని గురించి చెప్పవలసింది లేదు.

రావణ రాజధాని అయిన లంకానగరంలో నామాటకు ఎదురులేదు. సరిహద్దు రక్షకదళాలకు అధినేతనుఅయి గౌతమీ తీరాన నేను నా భర్త! నా సోదరుడు యక్షుల స్నిధ యుద్ధం చేస్తున్న సనుయాన మర్ధణించినాడు.

అందునించి భర్తృవిహీనను యథేచ్ఛగా ఆశించిన ప్రతి మగప్రాణినీ అనుభవించిన దానను. రావణ సోదరి పొందు అంటే ఏమిటనుకున్నావు.

నన్ను వలచి వలపించినావో ఇంక రాక్షస భయంనాకుండదు. ఎంతకాలమైనా అరణ్యాలలో సుఖంగా ఉండగలవు" అంటూ శస్త్రాస్త్ర నిశారదుడయిన దాశరథికి అడగకుండానే అభయమిచ్చి వేసింది శూర్పనఖ రాఘవుడు దరహాసం చేశాడు.

"అసుర కామినీ! నీ మాటలు విడ్డూరంగా ఉన్నాయి. నీవు కామించేందుకు చాలిన వీరులు అసురగణాలలో ఎవరూ కన్పించలేదా! ఈ చోటుకు పొరపడివచ్చినావు. నేను భార్యాసహితుడనయి అడవులకు వచ్చాను. భర్తవిహీనవయిన నీవు నన్ను కామించటం ధర్మంకాదు" అన్నాడు రాఘవుడు.

శూర్పనఖ రవంత నిరుత్సాహ పడిపోయింది. కాని తను పట్టిన పట్టువిడిచి పుచ్చలేదు దాశరథికి మరింత దగ్గరగా వచ్చింది.

"మదనసుందరా! అంతటి వీరాధివీరుడవు యింత నిస్సారంగా మాట్లాడుతున్నావేమిటయ్యా! నావంటి సుందరి ముల్లోకాలలో ఎక్కడయినా నీకు దొరుకుతుందా! మానవకాంత అయిన జానకి ఎంత వికృత రూపిణిగా ఉన్నదో నన్ను చూచిన తరువాత ఐనా నీకు అర్థం కాలేదాని" అని అడిగింది శూర్పనఖ.

"ఆమె ఎలా ఉన్నదో నేనెరుగుదును. కామినీ! ఆమెను అగ్నిసాక్షిగా నేను అర్ధాంగిగా స్వీకరించాను.

ఈ బ్రతుకులు ఉన్నంతకాలం మేమిద్దరం ఒకరికొకరుగా జీవించాలని ప్రమాణాలు చేసుకున్నాం అందునించి ఒకసారి కరగ్రహణంచేసిన ఆడదాన్ని విడచి పుచ్చేందుకు నైతికధర్మం అంగీకరించదు" అని ధర్మప్రబోధం ప్రారంభించినాడు రాఘవుడు.

అసురగణావనిత అయిన నిస్సారమైనట్టుగా తనకు వినిపిస్తున్న ఆమాటలకు విసురుగా, విసుగుగా తల ఊగించింది.

"ఎంత అమాయకుడవోయీ అయోధ్యరామా! వైదికమయిన జీవనరీ ఎంత నిస్సారమయిన జానకింకా అర్థంకాలేదా! మనసుకు నచ్చిన అనుభవాలను అందుకోనివ్వని ఆ జీవితం నాకెందుకు నాకు భర్తలేదు.

ఉన్నా కామించినవానితో కలయికను పొందే అవకాశం నాకున్నది వైదిక ధర్మాన్ని అనుసరించే అర్భకుడవు కావటంనించి నాకా అదృష్టం లేకుండాపోయింది,

నా అందాన్ని చూచిన తరువాత అయినా నీ మనసు చలించలేదా! ఈ శరీరాన్ని అనుభవించేందుకయినా వైదిక ధర్మాన్ని విడిచి వృచ్చాలని నీకు అనిపించలేదా!

నా చేయిపట్టుకో! హాయిగా గౌతమీతీర భూముల్ని మన విహార వేదికలుగా మార్చేస్తాను. నాకు భర్తలేడు. నీకు భార్యఉన్నదంటావా! ఆమెను మ్రింగివేస్తాను. అప్పుడు నీవు భార్యలేనివాడవు అవుతావు. ఇక ఆ పైన నీకు నీవారులేరు. నాకు నావారు లేరు.

మనకు ఈ జగతిలేదు. కామవాంచా లాలసులమయి శరీరాలు పెనవేసుకుని జగత్తుని విస్మృతిలోకి నెట్టివేద్దాం స్త్రీ పురుసయోగలలో బ్రతుకు క్రొత్త అర్థాలను సృష్టించుకుందాం" అన్నదామె.

రాఘవుడామాటలకు పరిహాసప్రాయంగా నవ్వాడు.

"జాతులమధ్య సంకీర్ణ స్థితిని మా వైదికధర్మం అంగీకరించను కామినీ! నీవు కామాతురురాలవయి యధార్థాన్ని విస్మరిస్తున్నావు. కాని నీవు అసురగణకాంతవు. నేను సురపక్షపానులయిన మునిజన సంరక్షకుడను.

గణాలమధ్య వైరుధ్యం ఉన్న మనం ఎలా కలియగలమనుకుంటున్నావు. వర్ణాలు సంకీర్ణం కావటాన్ని వేదనిహితమైన సాంఘికజీవన పద్ధతి తిరస్కరిస్తోంది కదా!" అన్నాడు.

శూర్పనఖలో నిరుత్సాహం మరింత అయింది. చక్రవర్తికి సోదరిఅయిన తాను తనంతగావచ్చి అర్థిస్తూవుంటే కాదని అదలించే రాఘవునిమీద మరులుమాత్రం త్రెంచుకోలేకపోయిందామె. అందునించి తన కోపాన్ని నరమాంసా శవాన్ని దిగ మ్రింగినట్లుగా మ్రింగివేసుక్కుది.

"పిచ్చివాడా! నా అందాన్నిచూచిన తరువాతకూడ యిలా మాట్లాడతున్నావాడంటే ఎంత అమాయకుడనుకోవాలి. వైదికమైన ధర్మాలంటున్నావు. అవి ఎంత నిర్హేతుకమయినవో నీకు తెలియదు.

నా తాత ఐన సుమాలి ఆ ధర్మాన్ని వ్యతిరేకించాడు. జాతులమధ్య వల్లనే మహాపురుషులు ఉద్భవిస్తారనటానికి ఉదాహరణలు ఎత్తి చూపించాడు. నా తల్లి అసురకాంత కైకసి ఆమె సురగణాల నాడయిన విశ్రవసుని ఆశ్రయించి ఆదరాన్ని పొందీ అతనివల్ల తల్లి అయింది.

సురలకూ అసురలకూ పుట్టిననాడు కావటంనించే నా సోదరుడయిన దశగ్రీవుడు సంకీర్ణ మహాపురుషుడైనాడు. అతడు ముల్లోకాలను జయించిన సంగతి నీకు తెలుసుకదా!

బ్రహ్మావర్తమూ, హిమావర్తమూ, దక్షిణావర్తమూ అనే మూడు లోకాలలో ఈనాడు నా సోదరుని సాటిరాగలవీరుడు లేడని నాకుకూడ తెలుసుకదా రాఘవా!

మరొక్క సంగతి కూడ చెప్తున్నాను విను!

నా సోదరుడైన దశగ్రీవుడు నన్ను చేపట్టిన మరుక్షణం నీకు బంధువు అవుతాడు. అతని అండదండలుంటే ముల్లోకాలలోనూ నీకు ఎదురులేదు. హాయిగా బ్రతకవచ్చు.

అంతేకాదు. అనేక మంది అసురులను ముని జనరక్షణకై నీవు వధించినావు. అందునించి అసురగణాధ్యక్షుడైన నా సోదరుడును హితుడై వున్నాడు. ఐనప్పటికీ సాధారణ మానవ ప్రాణపనీ, ఒక మామూలు రాజకుమారుడవనా ఉపేక్ష వహించాడు. నీ మీదికి రావడం తన ప్రతిష్ఠకు భంగకరంగా భావించి ఊరుకున్నాడు.

ఇప్పుడు సౌందర్యారాసినైన నన్ను ప్రేమిస్తే నిన్ను ఆదరిస్తాడు. తిరిగి నీ రాజ్యం నీకు యిపిస్తాడు అసురగణాలను సహస్రాధిక సంఖ్యలో నీకు పరిచారకులుగా నియమిస్తాడు. నీ భార్యలవల్ల వచ్చిన కోపతాపాలను మరచిపోతాడు అందునించి నన్ను ప్రేమించటం నీకు అన్ని విధాలామంచిది" అని రాజకీయం చెప్పింది శూర్పనఖ.

రామునికి ఒరిమి నశించింది.

"నేను భార్యా సహితుడని చెప్పాను కదా!" అన్నాడు విసుగ్గా! అందు కామె నిరాశపడలేదు. "రాఘవా! నీ భార్యను వధించి మాంస ఖండాలను నేను భుజిస్తాను. జీర్ణించుకుంటాను ఆమె శరీరంలోని జీవధాతువులను అరగించుకుంటాను. అప్పుడు నాలో నీ భార్యను చూచుకోవచ్చు. ఆనందంగా నన్ను అనుభవించవచ్చు.

అంతేకాదు, చక్రవర్తి సోదరిని- అడుగుతున్నానని మరీ అంత చులకన చేయకు నిన్ను చూచిన తరువాత శీతవాతాలను భరించిలేకుండా ఉన్నాను. ఒక్కసారి నన్ను బిగియార కౌగలించుకో! అందామె తమకంగా.

కామాతురులైన వారికి కళ్ళుమూసుకు పోతాయని వేదవిదులయిన పెద్దలు చెప్పిన మాటలను స్మరించాడు దాశరథి. అతనికి శూర్పనఖపై జాలివేసింది. ఒక తూరి లక్ష్మణుని విగ్రహాన్ని స్వయంగా పరిశీలించాలని కూడ అనిపించింది.

పెదవులపైకి చిరునవ్వు వచ్చింది.

"మదవతీ! నాకు భార్య ఉన్నది. అడుగో నాసోదరుడు సౌమిత్రి. అతడు భార్యను అయోధ్యలో విడిచినా వెంట అడవులకు వచ్చాడు.

నీకు భర్త పరలోకాన ఉన్నాడు అతనికి భార్య పరదేశాన ఉన్నది. అందు నించి సంయోగం సాధ్యమవుతుందేమో ప్రయత్నించు" అన్నాడు ఆ దిక్కున చూచింది శూర్పనఖ.

నిక్షణుడు అప్పుడే ఆమె వంకకు చూచినాడు. చూపులు కలసినాయి. ఈ బాదస్తపు వైదిక ధర్మ స్మరణం విడువని రాఘవుని కన్నా అతడేనయమనిపించిం దామె. తన మదనదాహం తీరిన తరువాత అందరినీ మ్రింగివేయవచ్చునని సంక ల్పించుకుంది.

ముగ్గురిని మాంసఖండాలుగా మార్చి తన అనుయాయులకు విందుచేయవచ్చు నని అనుకుంది. రాఘవుడు చూపినదారి వెంట సౌమిత్రి దగ్గరగా వచ్చిందామె. ఏకాగ్రనిష్ఠకు యావత్తు సృష్టిలో ఏకైక సంకేతంలా నిలచి ఉన్నాడు సౌమిత్రి.

చిన్నవాడా! పసందైన పడుచుదాన్ని పరువాలన్నీ వెంటతెచ్చాను. కామితా లయిన విందులన్నీ అందిస్తాను. అందుకోవా! అని అర్థించింది రావణ సోదరి అయిన శూర్పనఖ.

లక్ష్మణుడు ఈ విచిత్ర స్థితి ఏమిటో అర్థం చేసుకోలేకపోయినాడు. అన్న వంక అర్థవంతంగా చూచినాడు. రాఘవుడు ఒక చిరునవ్వు నవ్వినాడు. దాని అర్థమేమిటో అవగతం చేసుకున్నాడు సౌమిత్రి.

ఛ్రరున ఖడ్గాన్ని దూశాడు. ఉలికిపడింది శూర్పనఖ. అంతలో మనసు దిటవు పరుచుకుంది. "ఇంతకన్నా భయంకరమైన ఖడ్గాలను మా రక్షోగణాల బాలకులు ప్రయోగించగలరు. అందునించి ఖడ్గాన్ని ప్రక్కన ఉంచి కౌగిలి ప్రసా దించు" అన్నది రాక్షసకాంత.

సౌమిత్ర ఆమెకు సమీపించాడు.

అసిధార రవి కిరణం సోకి తళుకు మనటంతో శూర్పనఖ గుండె చేజారు ఐంది. అతని కనులలోంచి జాలువారుతున్న పరాక్రమ విస్ఫూర్తికి ఆమె కన్నులు

చెమ్మగిల్లినాయి. రాఘవుడు చురికల వంటి మాటలతో పొడిచాడు. ఈతడు ఏకంగా ఆయుధంతో మీదికి వొస్తున్నాడు. శూర్పనఖ ఒకసారి తన అన్నగారైన దశగ్రీవుని విక్రమస్ఫూర్తిని ప్రతిష్టను జ్ఞాపకం చేసుకుంది. గుండె దిటవుకొన్ని తెచ్చుకుంది

"ఇది నా అన్న వొదినల పవిత్ర పాదాలనడయాడిన పుణ్యస్థలి! నీ వంటి వేదనిందచేసే అపవిత్రులు నిలువరానిచోటు. వెంటనే వెళ్ళిపోదువా? లేదా?" అన్నాడు చివరిసారిగా!

"వేదనింద చేయటం అపవిత్ర ఐతే వేదాల్ని నమ్ముకుని సాంఘిక జీవితానికి అంతకన్నా మంచిదారి లేదనుకోవటం అజ్ఞానమనినే నంటాను. నన్ను బెదిరించాలని చూడకు. నా అన్నగారెవరో చెప్తే నీ గుండెలు పగులుతాయి" అన్నదామె బింకంగా.

సౌమిత్ర మరొక్క అడుగు ముందుకువేసినాడు.

"నీకు తగిన గుణపాఠం చెప్తాను. దుష్ట స్త్రీలకు మా నాగరిక లోకంలో ఎలాంటి శిక్ష విధిస్తారో అలాంటి శిక్ష నీకు యిప్పుడు ఇక్కడ విధిస్తాను. మరొక్కసారి అవకాశమిస్తున్నాను వెళ్ళిపో" అన్నాడు లక్షణుడు. శూర్పనఖకు ముచ్చెమటలు పోసినాయి.

తన వెనుకవున్న పదునాలుగు వేల రక్షోబలాన్ని ఖరదూషణాది మహా వీరులందరినీ మనసులో మరొకమారు స్మరించిందామె. మరికొంచెం ధైర్యాన్ని తెచ్చుకుంది.

"ఓరీ! నరుడా! కామించి వచ్చిన కాంతను కాదన్నదికాక కత్తిదూసి మీదికి వస్తావా! ఎంత ధైర్యం నీకు! ఈ సంగతి నా అన్నగారయిన రావణునికి తెలిస్తే నిన్ను ముక్కలుకోసి మా రక్షో వీరులకు ఆహారంగా యివ్వగలడు" అన్నదామె.

రావణుని పేరు విని సౌమిత్రి భయపడలేదు. సరికదా మరింత కసిగా చూచాడు. "దశగ్రీవుని సోదరివా నీవు మునివాటికలను నిర్జనం చేయాలని దండకలోనికి వచ్చిన రాకాసి మూకలతో కలసి వచ్చినావా. అయితే తగినశాస్తి తప్పక చేయవలసిందే" అంటూ ఆమె నాసికాగ్రాన్ని, కర్ణపుటాలను కత్తరించినాడు. ముఖమంతా చిదిమిన మందారం లాగున అయిపోయింది.

బాధాపరితప్త అయింది శూర్పనఖ. తన పరివేదన యావత్తూ అన్నగారైన దశగ్రీవునికి నివేదించుకునేందుకు లంకా నగరం వైపుగా పరుగు తీపింది.

మైథిలి ఈ దృశ్యాన్ని చూచి పకాలున నవ్వింది!

శూర్పనఖ అలా వెళ్ళిపోతూ తన సహచరులయిన ఖరదూషణాదులకు ఈ అవమాన వార్త చెప్పి మరీ వెళ్ళింది.

ముందుగా కొందరు అసురవీరులు పంచవటిలోని రాముని పర్ణశాల మీదికి దండెత్తి వచ్చారు. వారందరినీ పిండి కొట్టారు రామలక్ష్మణులు. అయినా రాముడు ముని జనులు తనకు అందించిన అద్భుతమైన ఆయుధాలతో వారిని నుగ్గునుగ్గు చేశాడు.

దండకలో రాక్షసుల మాయాజాలాన్ని అవగతం చేసుకుంటూ వీరిని నిరోధించే విద్యలో రాముడప్పటికే పరిపూర్ణత సాధించాడు. సాధారణ రాజులు ఈ పని చేయలేరు. రాజుల మధ్య యుద్ధాలు వేరు వారి ఎత్తుగడలు వేరు.

కాని అసురగణాలతో యుద్ధాలకు ప్రత్యేకమయిన శిక్షణ కావాలి. రామునికి మునిజనులవల్ల ఆ రహస్యాలన్నీ తెలిశాయి. ఆ విద్యలో అతడిప్పటికి నిష్ణాతుడయినాడు. రావణ సంహారం చేయగడన్న విశ్వాసం మునులకు అతని పై కలిగింది ఈ ఖరదూషణాది పదునాలుగు వేలమంది రాక్షసులను వధించి నందువల్లనే!

వీరంతా వచ్చి రాఘవుని స్తుతించారు. గౌతమీ తీరాన ఇంక రాక్షస బాధ లేదు. ఒక్క గౌతమీ తీరాన అని ఏమిటి గంగకు పశ్చిమంగా ఐనా దక్షిణంగా అయినా అడవులలోని అసురులంతా అప్పటి రామబాణం రుచి చూచి చనిపోయారు. లేదా పారిపోయినారు.

పది సంవత్సరాల పై కాలంలో, ఒక్కచేతి మీదుగా రాఘవుడు అచంచల ధైర్యసాహసాలతో ఈ విజయాన్ని సాధించాడు. మునులకేకాక జనులందరికీ వందనీయుడు అయినాడు. అతని సాహసాలను వీరులందరూ కథలుగా స్మరించి వారి వీరత్వానికి వన్నె తెచ్చుకున్నారు. వీరత్వమూ సౌజన్యమూ కలసి రాఘవుని లోచిన అపూర్వమైన సమ్మేళనం జరిగింది. అట్టివాడు మరొక్కడు చరిత్రలో లేడనిపించాడు.

పోయినవారంతాపోగా ప్రాణ వశిష్టులయి మిగిలి పారిపోయిన కొద్ది మందితో అకంపనుడొకడున్నాడు.

అకంపనుడీ వార్తలన్నీ చెప్పేందుకు నేరుగా లంకా నగరం చేరుకున్నాడు.

× × × ×

అది దిద్దిగంత విశ్రాంతమూ, దిశాంత పరిశ్రాంతమూ ఐన అద్భుత నగరం! దాని పేరు లంకా నగరం. ఒకనాడు ధనాధ్యక్షుడైన కుబేరుడనీ యక్షుడు దానిని పాలించాడు. మయుడనే యక్షుడు యక్షగణాధ్యక్షుడైన కుబేరుని కోసం దాన్ని నిర్మించాడు.

కుబేరుని తల్లి హలబిళి! ఆమె విశ్రవసు రెండవ అర్ధాంగి కావటం నించి దశగ్రీవుని అతడు సోదరుడు. చిన్న తనంలో పుష్పకం ఎక్కి వచ్చిన కుబేరుని చూపించి తల్లి కైకసి దశగ్రీవునికి చెప్పింది.

"నాయనా! దాన్ని నీవు సాధించాలి" అని.

ఆ తరువాత దశగ్రీవుడు వర బల గర్వితుడైదాన్ని, అది ఉంటే యావత్తు లంకా నగరాన్నీ సాధించినాడు. అన్నను నిర్వాసితుని చేశాడు. అతడు కాందిశీకుడై పోగా మహాదేవుడు మరలించి నైరుత దిద్భాగానకి చేరక నగరం కట్టుకోమని అనుమతి యిచ్చాడు.

అలా రావణుని ఆవాసమయిన లంకానగరంలో యిప్పుడు యక్షగణాల వారెవరూ లేరు. అందరూ రక్షోగణాలకు సంబంధించిన వీరాధివీరు లేవుంటున్నారు మహత్తరమయిన అంతటి చరిత్ర కలిగిన లంకా నగరం అద్భుతాలకు ఆవాసం!

నగరంలోని మందిరాలు మహోన్నతాలు బంగరు మలాముపూ యించిన కోట గోడలు చూస్తే కన్ను చెదరుతుంది. నగరంలో అందందు నెలకొన్న మహా వృక్షాల నీడన వచ్చలు, కెంపులు, చంద్రశిలలు మొత్తం దేశం పరివ్యాప్తమయి వున్నాయి.

అన్ని వంకలా జలనిధులు విస్తారంగా ముట్టడించి ఉన్నాయి. అది సముద్ర మధ్యన నెలకొన్న నగరం కావటం నించి తీరప్రాంతాలలో రత్నాలు ముత్యాలు విస్తారంగా లభిస్తాయి.

నగరం చుట్టూ ప్రాకారం ఉన్నతోన్నతమైనది. ప్రవేశద్వారం దుర్గమమైన కట్టుదిట్టాలు చేయబడి ఉంది. దానికి సంరక్షకురాలయిన రక్షోకాంత పేరు లంకిణి!

నగర మధ్యంలో సువిశాల సుందరవనాలున్నాయి. అందు నీటి నెలవులున్నాయి. ఊటబావులున్నాయి. తేటనీటిలో అందంగా తిరిగే జలచరాలున్నాయి. అందమయిన పొదరిండ్లు ఉన్నాయి. ఆ నగరమంతటికీ అత్యంత సుందరమయిన స్థలం అశోక వనమయితే అత్యంత వైభవోపేతమయిన భవనం దశగ్రీవునిది.

దాని శిఖరాలు కొండకొన కొమ్ముల అంత ఎత్తున ఉన్నాయి. రథాలు మేరు పర్వత శిఖరాలవలె ఉన్నాయి. స్వర్ణకలశాలు గిరి శిఖరాలంత ఉన్నాయి. అన్నింటికి మించి దశగ్రీవుడు రాజు కావటమే ఆ నగరానికి శోభ, ఆతడు ముల్లోకాలను జయించి లంకా నగరానికి ఎనలేని ప్రతిష్ఠను ఆర్జించిపెట్టాడు

హిమావర్తం నించి, బ్రహావర్తం నించి. దక్షిణావర్తం నించి ఎన్నెన్నో ఫల వృక్షాలను తెచ్చి లంకలో నాటించాడు ఆలాగే ముల్లోకాలనించి సుందరీమణులను చెరపట్టి తెచ్చి తన రత్నాలు పొదిగిన రాణివాసంలో ఉంచాడు. అతని నగరంలోనూ, నగరిలోనూ వేదఘోషలు విన్పిస్తాయి. కాని వేద విహితమయిన జీవన సరళి కన్పించదు.

అతడు అసురకాంత అయిన కైకసికీ. సురగణ నాయకుడయిన విశ్రవసుకూ ప్రాదుర్భవించిన సంకీర్ణ మహా పురుషుడు. సురాసురగణాల సంకరానికి సంకేతంగా నిలిచిన వీర పురుషుడు.

ఇప్పుడాతడు తాత అయిన సుమాలి, మంత్రి మండల ప్రముఖులయిన విద్యుజ్జిహ్వుడు. అగ్నినేత్రుడు మొదలయిన వారంతా పరివేష్టించి ఉండగా కొలువున నెలకొని ఉన్నాడు. అతడది వశించిన లంకానగర సింహాసనం ఉన్నతమై, నవరత్న ఖచితమై, ఛత్రచామర పరివేష్టితమై ఇంద్రసింహాసనంలా తరళాయతమవుతుంది. అతని మణిమకుటం హిమాద్రికి అమరించిన కైలాస శిఖరంలా విరాజిల్లుతోంది,

అతని కేయూరాలు కెంపుల గనుల్లా ఉన్నాయి

సింహ కంకణాలు, కుంతలాలు, మణిభూషణాలు, మణిగణఘటితమయిన మొలనూలు మిరుమిట్లు గొలుపుతున్నాయి. ఆతడు ధరించిన యజ్ఞోపవీతం మహాదేవుడు ధరించిన శ్వేతభుజంగంలా తళతళలు కురిపిస్తోంది.

అతని ముందు మోలపడి ఉన్న రక్షోలోంత శూర్పనఖ. ఆమె నాశికాగ్రమూ కర్ణపుటాలూ కత్తిరించబడి ఉన్నాయి. ముఖ మంతా రక్తంతో తడిసి చిదిమిన మందారంలా తరళిస్తోంది.

"సోదరీ! నీ ముక్కు చెవులను కత్తరించిన మత్తుడెవడు. వాని పేరుచెప్పు. తక్షణమే నా పాదాలచెంతకు రావించి జరిగిన అవమానానికి తగిన ప్రతీకారం నెరవేర్చుతాను" అన్నారు దశగ్రీవుడు. ఆతడు గళమెత్తగానే సముద్ర ఘోష ఆగిపోయినట్లు అని పించింది,

"అన్నా! అన్నా!! నన్ను మన్నుకరిపించినవాడు రామన్న! ధశరథాత్మజుటద జనకుని ఆత్మజఐన జానకిని సమార్థంగా స్వీకరించినాడట! సవతి తల్లి కైకేయి కోరికపై పదునాలుగేండ్లు వనవాసం చేయను వచ్చినాడట! దండకలోని అసురగణా లన్నింటిని ఆ ప్రాంతంచేశాడు.

మునిజన హితైషి అట! అతడు మునిజన గణాలు విజయగర్వంతో అతనికి నీరాజనాలు అందిస్తున్నాయి పురుషోత్తముడని ప్రస్తుతి చేస్తున్నాయి

దండకలోకి నీవు పంపిన గణాలు ఇప్పుడు మట్టిలో కలసినాయి. అన్నా నిన్ను మించినవాడొకడున్నాడు అతడే అవమానం చేశాడు" అంటూ దుఃఖ వివశ అయి విన్నవించుకుంది శూర్పనఖ.

రావణుడు ఉద్విగ్నుడై చూచినాడు.

"సోదరీ! ఏమిటసీ ప్రేలాపన! ఈ ముల్లోకాలలో రావణుని మించినవాడు మరొక్కడా! నీకు ఈ అవమాన భారంతో మతిభ్రమణం కలుగలేదుకదా!" అంటూ ఉరిమాడతడు.

"లేదన్నా లేదు రావణునిమించినవాడు ముల్లోకాలలో లేడని మురిశాను యింత యింతకాలం ఇప్పుడు అంతటివాడిని మరొకడిని చూచాను.

అతనిపేరుకూడ అగ్నిబీజమైన రకారంతోనే ప్రారంభమవుతుంది. రాముడట" అన్నది శూర్పనఖ కంగారుగా.

"ఎవడువాడు" అని రెట్టించాడు దశగ్రీవుడు.

"రామ: రామ: రామ:" అంటూ ముమ్మారు ఉచ్చరించి మూర్ఛపడిపోయింది శూర్పనఖ. సభయావత్తూ విభ్రాంతమైంది.

"ఓహో రాముడా! తాటకను, మారీచుని, విరాధుని కొట్టినవాడతడే కదా! యింతటివాడైనాడా ఆ అర్భకుడు నేను ముల్లోకాలను జయించిన తరువాత పుట్టిన బాలకునికి ఇంత పొగరా!" అన్నాడతడు

అప్పుడే అక్కడకు ప్రవేశించిన అనంగుడు ఉందుకున్నాడు.

"అవును మహాప్రభూ! అతడేఇతడే ఖరదూషణాదులను పద్నాలుగువేల మందిని మట్టిలో కలిపేశాడు. అదేమి విక్రముడు! ఏకైక వీరుడుగా నిలచి అందరినీ ఖయించినాడు,

ప్రభూ! అతని ధనుస్సు మెరుపుతీగ అల్లెత్రాడు యమపాశం. బాణం అశనిపాతమే! ఇంతకు మించి నేను వర్ణించలేనా" అన్నాడు అతడు.

రావణుని జగద్విఖ్యాతమైన అహంకృతి ఆదిశేషువులా వేయిపడగలువిప్పి బుసలుకొట్టింది.

అతడు హుటాహుటిన బయలుదేరి రహస్యమందిరాలకు వెళ్ళినాడు. తన మంత్రులను పిలిపించుకున్నాడు. రాఘవుని గురించి ఈ వరలో విని ఉన్నాడు. కాని అతడింత శక్తిశాలి అని, ముందుముందు ఇటువంటి సమస్యలు ఉత్పన్నమవుతాయనీ అప్పటిలో ఊహించలేదు ఉపేక్షించాడు.

తాను గుర్తించవలసినంతగా అసురవీరులు మృతవీరులుగా మారిపోయినారని వింటూంటే గుండెలు రగులుతున్నాయి. సైన్యం నష్టమైనందుకుకాదు.

తనపట్ల ఇంతటి అపచారంచేసిన వ్యక్తి అందునా ఒక సామాన్య రాజపుత్రుడయింకా బ్రతికి ఉన్నాడని విన్నందుకు అతనిలో అగ్నిమాత్రంలేచింది.

రక్షోగణాలు ఒకసాధారణ రాజపుత్రుని వధించలేనంతగా నిర్వీర్యమైనాయా! ఎంతసిగ్గుచేటు. మహేంద్రుడ్ని జయించి, అష్టదిక్పాలకులను అదలించి, కైలాసగిరిని పెకలించి, యముని మీద రణరంగం చేసిన తాను అతనికోసం బయలుదేరవలసి రావటం ఎంత అప్రతిష్ట?

సుపార్శ్వుడు, ప్రహస్తుడు, సుమాలి అకంపనుడు అందరూ ఆలోచనా మందిరానికి చేరుకున్నారు. మంత్రులముందుకు సమస్యనుంచాడు రావణుడు. వారు కూడ ఈ వార్తలు వినేఉన్నారు.

ఉద్దండుడైన రావణుడు రాఘవుని గురించిన వివరాలు చెప్పమని అకంపనుణ్ణి అడిగాడు. అకంపనుడు భయపడ్డాడు.

"ప్రభూ! దశరథాత్మజుడయిన రాముడు అడవికి రావటానికి పూర్వకారణాలన్నీ నిమిత్త మాత్రమైనవి.

అసలు కారణం మునిజన రక్షణమే! అతడు రాక్షసులందరినీ సంహరించి మునిగణాలను రక్షించేందుకు ఉద్భవించినవాడని చెప్పుకుంటున్నాడు. అదియథార్థమే అన్నట్లుదండకలోని అసురగణాలు యావన్మందినీ సమూలంగా నిర్మూలించినాడు రాఘవుడు. ముఖ్యమైన దుర్వార్త ఏమంటే ఇప్పుడు సురపక్షపాతులయిన మునులునిశ్చింతగా బ్రతుకుతున్నారు. యజ్ఞయాగాది క్రతువులు సజావుగా సాగిపోతున్నాయి.

ఎక్కడ యజ్ఞవిఘ్నం చేయాలన్నా అక్కడ రాముడే ప్రత్యక్షమవుతున్నాడు. గుర్తించవలసిన సంగతి ఏమిటంటే అతడు పురుషోత్తముడనిన విష్ణుమూర్తి అవతారమనీ నమ్ముతున్నారు తాపసులు'' అని వచించాడు అకంపనుడు.

ఆ మాట వింటూనే సుమాలి వంకచూచాడు రావణుడు. ఎంతకాలం క్రితం తాతగారిని అవమానించి, అతని అజ్ఞాత వాసానికి కారకుడై, ఇంతకాలం కనుమరుగయిన విష్ణువు ఇతడు!

"తాతా! రాఘవుని వధించటం ప్రస్తుత కర్తవ్యంకదా!" అన్నాడు రావణుడు. "అవునవును" అన్నాడు సుమాలి పాతకక్షల్ని మనసు లోపల స్మరిస్తూ!

వెంటనే దండకలోని పంచవటి ప్రాంతాలలో తపస్సు చేసుకుంటున్న మారీచుని పిలిపించాడు రావణుడు రాముని గురించి అడిగాడు "దశగ్రీవా! నీవు ఉద్ధతుడవేకాని రాముని ఊసుమాత్రం ఎత్తకు.

అతని శిలీముఖాలు అశనిపాతాలు, ఒకసారి అతని వాడి బాణం రుచిచూచిన వాడనునేను. అందునించి చెపుతున్నాను" అన్నాడు మారీచుడు. దశగ్రీవుని మాటను తిరస్కరించి తిరిగి తపోవనానికి వెళ్ళిపోయినాడు.

రావణుడు అందరి దగ్గరా విషయసేకరణ చేశాడు. రాముని మీదికి నేరుగా ఎత్తిపోవటంకన్నా అతని భార్య అందాలరాసి అయిన సీతను అపహరించటం మంచిదన్న నిశ్చయానికి వచ్చాడు.

ఈ విషయం మంత్రులకూ మండోదరికీ తెలియకుండా జాగ్రత్త వహ్డాడు గాడిదలు పూన్చిన బంగారు రథమెక్కి మరీచాశ్రమానికి బయలు దేరాడు.

"మళ్ళీ వచ్చావేమిటి—?" అని ప్రశ్నించాడు.

"సీతాపహరణం చేయాలి. లేదా నా చేతిలో నీ ఉసురులు అ సాంతమయి పోవాలి" అని ఖండితంగా చెప్పేశాడు దశగ్రీవుడు. మారీచుడు ఆలోచించాడు. ఈతని చేతిలో ముడియటంకన్నా రామ బాణానికి అసువులర్పించట మేలు అని కృతనిశ్చయుడు అయినాడు.

"సరే" అంటూ తన అంగీకారాన్ని తెలియచేశాడు రావణుడే సంగ్రహాణం చేయగల ఉపాయాన్ని బోధించినాడు. పథకాన్ని అనుసరించి మారీచుడు సువర్ణ హరిణం కథను నడిపించాడు.

అందమయి అమరిన ప్రకృతిని పరవశభావంతో తిలకిస్తూ పర్ణశాల బయట కూర్చుని ఉన్నారు సీతారాములు, బంగారులేడి వైదేహికంట పడింది" దీనిని నా అత్తలకు కానుకగా ఇస్తే ఎంత సంతోషిస్తారో" అని ఆలోచించింది జానకి.

ఆలేడి నాకు కావాలి, ప్రాణాలతో ఐనా సరే! కాకున్నా సరే!" అని అర్థించింది మైథిలి రాముడు ఎన్నడు ఏమీ అడగని ఆమె కోరికను ముందు అభ్యంతరం చెప్పినా తుదకు అంగీకరించాడు.

సువర్ణహరిణం గెంతుతూ రాఘవుని బహుదూరం తీసుకుపోయింది. ఇంక దాన్ని ప్రాణాలతో పట్టి తీసుకురావటం అసాధ్యమని తలపోశాడు దాశరథి అల్లెత్రాడు ఆవర్ణాంతమూ లాగి బాణంవదలి పెట్టాడు.

రామబాణానికి ప్రతిగా హాసీతా హాలక్ష్మణా? అన్న కేకలు విన్పించాయి. ఇది రాక్షస మాయఅని గ్రహించినాడు రాఘుడువు, నిర్ఘాంతపడినాడు.

కాని సీత ఇది రాక్షస మాయ అనుకోలేకపోయింది" హాసీతా, హాలక్ష్మణా!!" అన్న దీనాలాపాన్ని వినికలవరపడిందామె.

"మరదీ! అన్నగారికేదో ఆపదవచ్చినట్టుంది. సాయం వెళ్ళరాదా!" అని అడిగిందామె. అందుకు సౌమిత్రి సాధారణంగా నవ్వాను

"ఏమిటాదరహాసం? అన్నగారికి ఆపద అంటే నవ్వువస్తోందా" అని అడిగింది భర్త గురించి ఆరాటంలో చిక్కుకున్న సీత. లక్ష్మణుడు తిరిగి మందంగా నవ్వాడు.

"నొదినగారూ! రాఘవునికి ఆపద ఏమిటి?" అని ప్రశ్నించాడు. సీత మరింతగా స్త్రీ సహజమైన ఆలోచనలతో భర్త గురించి కళవరపడిపోయింది.

"అవునయ్యా! నేనిప్పుడే ఒక విపరీతం చూచాను. మనసుని ఉపరించుకోలేకపోయినాను. సువర్ణహరిణాన్ని తీసుకురమ్మని ప్రేరేపించి పంపివేశాను. ఇప్పుడయినా జాగ్రత్తపడవద్దా? వెళ్ళరావయ్యా? అదేదో రాక్షసమాయ అన్పిస్తోంది నాకిప్పుడు" అన్నదామె.

సౌమిత్రి కదలలేదు మెదలలేదు, ఇంతకాలం తన మాటను ఆజ్ఞగా దలదాల్చిన సౌమిత్రి ఇలాతన పరితాపాన్ని అర్థంలేనిదిగా భావించటాన్ని మరొకలా అర్థంచేసుకుందామె.

"మరది! ఆనాడు నా భర్త యువరాజ్య పట్టాభిషిక్తుడు అవుతాడని భరతుడు అంశపని చేయించాడు. ఈనాడు అతడు విగతజీవుడు అయితే నన్ను హరించాలని

నావ్వు చూస్తున్నావు. ఇటువంటి సోదరులను పొందిన దాశరథి ఎంత దురదృష్ట వంతుడో నాకిప్పుడు అర్థమవుతోంది.

ఒక వేళ ఉసురులువిడిస్తే నేను అగ్ని ప్రవేశం చేస్తాను. కాని నీకు మాత్రం లొంగను" అన్నదామె. లక్ష్మణునికి నెత్తిమీద పిడుగులుపడినట్లు అన్పించింది. అన్నగారి కోసం కాకపోయినా వొదినగారి బాధ తగ్గించేందుకయినా ఆ వంకకు వెళ్ళాని కృతనిశ్చయుడు అయినాడు.

పర్ణశాల ముంగిట శిలా ముఖంతో ఒక రేఖను రచించాడు. అది లక్ష్మణ రేఖ. వొదినగారూ! మిమ్మలను ఒంటరిగా విడిచిపోవటం నాకు సమ్మతికాదు. ఐనా మీరు శాశించారు. నా చిత్తశుద్ధిని అనుమానించారు. అందుకోసం వెడుతున్నాను. మరికొద్ది సేపటి తరువాత మేమిరువురం క్షేమంగా తిరిగివస్తాం. అందాకా ఈరేఖను దాటనని మాట యివ్వండి" అన్నాడతడు.

"అలాగే!" అన్నది భూజాత భూమి మీది రేఖను చూస్తూ. అతడలా వెళ్ళ గానే దిగులు పడిపోయి పర్ణశాలలోనికి వెళ్ళింది.

రావణుడు భూరిభస్మరాసులను శరీరమంతా అలదుకున్నాడు. కపాలాన్ని భిక్షా పాత్రగా ధరించాడు. వామహస్తాన శంఖాన్ని పట్టి భూనభోంతరాళాలు దద్ద రిల్లేలాగ దాన్ని పూరించాడు

"భగవతీభిక్షాందేహి" అని అర్థించాడు. ముల్లోకాలను జయించి లంకా నగ రాన్ని చతుర్దశభువనాలకు సింహ స్వప్నంగా తీర్చిదిద్దిన పరాక్రమశాలి అతడు. విశ్రవసు గర్భవాసాన పుట్టి కైలాసగిరిని గజగజలాడించిన బలశాలి. సుమాలి అద్భుతమంత్రాంగంలోంచి ప్రాదుర్భవించిన సంకీర్ణ మహా పురుషుడు.

ఇప్పుడు భిక్షపాత్రపట్టి వైదేహి వాకిటి ముంగిట నిలిచి భిక్ష కోసం అర్థించి నాడు. సూడు సార్లు, జానకి అతని అర్థింపులు విని భిక్ష తీసుకుని వచ్చింది.

నట జంగమునిలా ఒక జంగముడు ప్రత్యక్షమయినాడు.సౌమి త్రిశిలాముఖ ంతో సృష్టించిన లక్ష్మణరేఖకు అవలనిలిచి భిక్ష అందించాలని ప్రయత్నించిందామె.

"ఈ జంగమునికి భిక్ష అందించేందుకు అభ్యంతరపడి మహాదేవునికి కోపం తెప్పించకు భగవతీ!" అని హెచ్చరించినాడు విరూపధారి అయిన దశగ్రీవుడు.

వైదేహి భిక్ష అలరించేందుకై లక్ష్మణరేఖను దాటి అతనిని సమీపించింది. వెంటనే అతడు భిక్షా పాత్ర అయిన కపాలాన్ని అవతలకు విసరికొట్టాడు. ఆమెను

రెండు బాహువులతో బంధించి బలాత్కారంగా గార్దభాలను పూన్చిన చాంపేయరథం మీద కూర్చోపెట్టాడు.

వైదేహి కొవ్వుపీడింది. భిక్షా పదార్థాలు చిందరవందరగా నేలమీద చెల్లా చెదరు అయినాయి. ఆమె తనయావత్తు శక్తినీ సమీకరించుకుని పెనుగులాడింది. కాని విఫలురాలు ఐంది. రామా రామా అని ఎలుగెత్తి అరచింది. ఏడ్చింది. రావణుని నఖాలతతో బాధించింది. అయినా రావణ బంధం విడలేదు. రథముందుకు సాగిపోయింది.

# 11

దశగ్రీవుని శరీరం రక్తసిక్తమయింది. జానకి మరింత పోరాడి లేనట్లుగా ముఖం వాల్చేసింది. గార్దభాలు పూన్చిన చాంపేయ శకటాన్ని మరింత ముందుకు నడిపించాడు రావణుడు.

ఈ స్థితిని అంతటినీ గ్రహించాడు జటాయువు. తాను తొలిసారి పరిచయ మయినప్పుడు రాఘవునితో చెప్పాడు. "నీవూ సౌమిత్రా వేటకై వెళ్ళినప్పుడు వైదేహి రాకాసి మూకల మాయలనించి నేను రక్షిస్తాను" అని కాని అనుకోని ఈ సంఘటనవల్ల తన మాట పొల్లు అయిపోతోంది.

శ్యేన జాతీయుడయిన జటాయువు విక్రమించాడు. దశగ్రీవుని చాంపేయ శకటాన్ని అడ్డుకున్నాడు. శిలీముఖాల వంటి తన వాడిగోళ్ళతో రావణుని గాయ పరచాడు. శకటానికి పూన్చిన గార్దభాలను సంహరించాడు. రథాన్ని తుత్తునియలు చేశాడు. అది ఏ మాత్రం ప్రయాణానికి పనికిరాకుండా చేశాడు వైదేహిని విడిపించాలని విశ్వప్రయత్నం చేశాడు.

"రావణా! ఇంతకాలానికి నీకు అంత్యకాలం సమీపించింది కాబోలు. అందుకే దశరథులతో వైరం పెట్టుకుంటున్నావు. జానకి పతి మీద మనసు లగ్నం చేసిన మగనాలి. ఆమె మనసు మంత్రంలా చెక్కుచెదరనిది. కుసుమంలా పరిమళ భరిత మయినది. అందునించి నీవు యిలా చేసిన దురాగతం వల్ల నీకు కీడు మూడుతుంది.

మైథిలిని విడిచి పెట్టివెళ్ళిపో! లేకపోతే నీ లంకా నగరం దగ్ధమయి పోతుంది. నీవు వల్లకాటికి పయనిస్తావు" అని హెచ్చరించాడు.

ఉద్దండుడైన రావణుడా మాటలను రవంత అయినా ఐడియలేదు.

"ఓరీ పక్షీ! రక్షోగణాల ధృతి సంపన్నత ఏమిటో నీకు తెలియదు. నా సంకల్పానికి చతుర్దశభువనాలలో ఎదురులేదు. అందునించి దారి విడువు. లేకుంటే అడవి కట్టెల మధ్య నీ శరీరం కాలిబూడిద అవుతుంది" అంటూ ఉరిమాడు.

పక్షిరాజు మిత్రుడయిన దశరధుని స్మరించాడు భ్రాతృతుల్యుడయిన రాఘవునికి వచ్చిన ఆపదను స్మరించాడు ప్రాణాలకు తెగించి విజేత అయిన రావణుని మీద విరుచుకు పడిపోయినాడు.

శిలీముఖాల వంటివాడి గోళ్ళతోనూ, వజ్రపుతునుక లాంటి ముంచువుతోనూ రావణుని ఎదుర్కొని యుద్ధం చేయసాగాడు. లంకాధినేత ఖడ్గాన్ని ఛర్రునలాగి జటావు పక్షాలను ఖండించాడు. పెద్దపెట్టున అరచి జటాయువు నేల కూలినాడు.

కాని రావణుని రథం తుత్తునియలు అయింది. గార్దభాలు విగత ప్రాణులయి నాయి. అందునించి భూజాతను వామ బాహువుతో బంధించి లంకా నగరం వైపుగా పురోగమించినాడు. సీతాపహరణ విజయవంగా చేయగలిగానన్న సంతోషంతో యమదిశ వైపుగా మునుముందుకు సాగిపోయినాడు దశగ్రీవుడు

మార్గ మధ్యంలో తనను రక్షించే వారికై అన్వేషించింది మైథిలి. కనీసం తాను వెడుతున్న మార్గమయినా రాఘవునికి గుర్తులు తెలిస్తే అతడు రాగలడని ఊహించిందామె.

పంపా సరోవరం తీరాన ఉన్న ఋష్యమూకాద్రిపై కొందరు వానరులు తచ్చాడుతూ కన్పించారు. ఆమె రోదించింది. అయితే ఆ రోదన ధ్వనులు వారికి విన్పించలేదు. అత్రి మహర్షి అర్ధాంగి ఐన అనసూయను సందర్శించినప్పుడు ఆమె యిచ్చిన నగలు ధరించి ఉన్నదామె. అయోధ్యను వీడి వస్తున్నప్పుడు దశరధుడు పట్టుపుట్టాలనీ వెంటయిచ్చిపంపాడు. అత్తగారైన కౌసల్యాదేవి కొన్ని నగలు యిచ్చింది. వైదేహి తన చీరకొంగు చింపి స్వర్ణాభరణాలన్నీ మూటగాగట్టి ఋష్యమూకంమీద విడిచిపెట్టింది. వానరులకు అవి దొరికినాయి.

ఎవరో రాక్షసుడు ఒక స్త్రీని బలాత్కరించి తీసుకుపోతున్నాడని గ్రహించారు వాడు. అయితే అందు గురించి పట్టించుకోలేదు.

ఫలితాంశంగా దశగ్రీవుడు వైదేహితోకూడ క్షేమంగా లంకానగరం చేరుకున్నాడు. "వేలాదిమంది అసురగణాలను అంతమొందించిన రాఘవుడు నా దగ్గరకు రాక ఏమి చేయగలడు! ఇది నాకు స్థానబలిమి కలిగిన అద్భుతమైన మహానగరం.

ఒకవేళ సముద్రం దాటి రాగలిగితే నీ చేతులలో మరణిస్తాడు. లేదా! భార్యాపహరణవల్ల కలిగిన అవమానాన్ని భరించలేక దుఃఖించి ప్రాణాలు విడుస్తాడు. ఎటుఅయినా దాశరథికి మరణం అనివార్యం" అని మంత్రులతో చెప్పాడు దశగ్రీవుడు.

కొందరీ పనిని గర్హించారు. కొందరు ప్రశంసించారు. మొత్తంమీద భూజాతను అద్భుతమైన అశోకవనంలో వుంచి, పారిపోకుండా త్రిజట వంటి రక్షా కాంతలను కాపుంచి రాఘవా గమనంకై ఎదురుచూడసాగారు లంకాపతి.

× × ×

రఘురాముడు మారీచుని మాయ లేడిని వధించాడు. మారీచుడు విగత ప్రాణి అయినాడు. అంతలో సౌమిత్రిరాకను గమనించాడు. సోదరా! వైదేహిని ఒంటరిగా వదలి నీవెందుకు వచ్చావయ్యా" అని ఆతృతగా అడిగాడు. దాశరథి.

"అన్నా! ఆమె నన్ను తూలనాడింది. ఈ అసురుడు అరచిన అరుపులు నీవే అనుకుని మోసపోయింది వొదిన. ఆమె ఆలోచనలు సరికావన్నందులకు నన్ను అనుమానించి అవమానించింది. వొదినగారి తృప్తికోసమే నేను యిలా వచ్చాను." అని వివరించాడు సుమిత్రా నందనుడు అన్నదగ్గర కన్నీరు పెట్టాడు.

ఇద్దరూ తిరిగి పంచవటిలో పర్ణశాలకు వచ్చినాడు. వారు అనుకున్నంతా అయింది. సీత జాడ కన్పించలేదు.

"అన్నా! వొదినను ఈ రేఖదాటి రావద్దని చెప్పాను. కాని యివతల ఆమె పాదాల గుర్తులు కన్పిస్తున్నాయి. ఇవిగో! ఈ పెద్దపాదాల గుర్తులు చూడు వొదిన గారు పెనుగులాడిన చిహ్నాలుకూడ కన్పిస్తున్నాయి. అసురుదెవరో ఆమెను బలవంతంగా ఈడ్చుకుపోయి వుండాలి" అని చిహ్నాలను అనుసరించి పరిస్థితిని విశ్లేషించినాడు సుమిత్రాతనూభవు.

ఆ మాట వింటూనే రాఘవుడు అర్ధాంగి పట్ల తనకున్న అమితానురాగాన్ని స్మరించుకున్నాడు. ఆమె లేకుండా తాలా ఎలా బ్రతుకగలడు? భూజాత లేని రాఘవుడెక్కడ?

ఎక్కడయినా మేఘాలు లేకుండా మెరుపుతీగలుంటాయా?

అనుకుంటూ నేలమీదపడి విలపించినాడు. ఇంతకాలం ఇన్ని కష్టాలలో తనకు వెన్నాడివచ్చిన వైదేహి తాను కూడా అయోధ్యకు ఎలా తిరిగి వెళ్ళటం?

అలాగే చెప్పింది భూజాత! మునిజనుల కిచ్చినమాటకోసం తనపట్లవైరభావం లేని అసురులను చంపివేస్తే తానే వారికి ప్రధానశత్రువు అవుతాడని చెప్పిందామె. అది యిప్పుడు యథార్థమయింది.

ఆమె అలాచెప్పినప్పుడు తాను తన పరాక్రమాన్ని నమ్ముకుని బీరాలు పలికాడు ఇప్పుడిలా నిజంగా అతనికి సమయం ఆసన్నమయితే ఏమీ చేయలేని వాడయినాడు.

ఇవన్నీ తలపోసి కన్నీరు మున్నీరుగా విలపించాడు రాఘవుడు. సుమిత్రా తనయుడు అన్నను ఓదార్చాడు.

"అన్నా! నీవు విజ్ఞుడవు. ధీశాలివి. అందునించి విలాపాన్ని విడిచిపెట్టి కర్తవ్యాన్ని స్మరించు పరాక్రమంలో సాటిలేని మేటివి. అందునించి నిక్రమించు. వొదినగారిని అపహరించిన దుండగీడు చతుర్దశ భువనాలలో ఎక్కడున్నా గాలిద్దాం. ఎక్కడదాగినా అతడిని సంహరిద్దాం" అన్నాడతడు.

రాఘవుడు చింతాసముద్రుడు అయినాడు. "అయ్యో సీతా! ఈనాటికీ రాఘవుడు అర్ధాంగిని రక్షించుకోలేని అసమర్థుడయినాడు.

కోరికలే దుఃఖానికి మూలకారణాలని ఆర్యులు చెప్పారు. నీ కేందుకు మనసు పడిందో! మళ్ళీ నీవు నాకు ఎప్పటికి కన్పిస్తావో? నన్ను చూడనిది ఒక్క లిప్తకాల మయినా నిలువరించుకోలేవు నీవు. అలాంటిది తిరిగి నాకు కన్పించేంతవరకూ ఎలా వుంటావు.

అసలు అందాకా వుంటావా? లేక! వియోగభారాన్ని భరించలేక ప్రాణాలు వొదులుతావా? వైదేహీ!!" అంటూ విరుచుకుని పడిపోతున్నాడు. రాఘవుడు అతని నీలికమ్ములనించి జాలువారుతున్న అశ్రుపూరధారలు నీలమేఘంనించి పడుతున్న వర్షాధారలవలె కన్పించినాయి.

అతని చెంపలమీద చారికలు కట్టిన కన్నీరు కొంచరియలపై ఉరికిన సెల యేరులా అయిపోయింది. అతడు నిలువెల్ల దుఃఖంపలైనట్లుగా అయిపోయినాడు. విషాద వార్నిధి అయినాడు.

ఊర్మిళా నిభుడు అతనిని ఓదార్చి అన్వేషణకయి బయలు దేరతాడు. కొంత ముందుకుపోయిన తరువాత ప్రథమంగా వారి కెదురయినవాడు జటాయువు. అతడు విహక్షి అయిపోయివున్నాడు. మృతుడు అయేందుకు సంసిద్ధునిలా కన్పించాడు.

"మిత్రుడా! నీ కట్టిదుర్గతి ఏమిటయ్యా!" అని ప్రశ్నించాడు రాముడు.

"నెచ్చెలీ! నీ సీతను రావణుడు అపహరించుకుని లంకానగరం దిక్కుగా పోయినాడు. ఆమెను రక్షించే ప్రయత్నంలో రావణునితో నేను పోరాడి విపక్షిని అయినాను. యిప్పుడు నా ఉసురులు అసాంతమవుతున్నాయి.

దశగ్రీవుడు దుండగీడు ఐనప్పటికీ ఉద్దండుడు సంకీర్ణ మహాపురుషుడు. ఇంత కాలం మునిజన హితార్థమై వేలకు వేల రాక్షసులను జయించావు. చంపావు. ఇంతకాలమూ ఈ స్థితి వచ్చేంతదాకా నాకు ఆయుధాలిచ్చి రాక్షస సంహారానికి ప్రోత్సహించిన మునులతో ఇకపైన నేను కన్పించను.

యిప్పుడు ప్రత్యక్షంగా రంగంలోకి దిగాడు ఏమైనా నీ ప్రశస్తివిని సాయం చేసేవారు అనేకులుంటారు. సీతను తిరిగి నీవు పొందగలుగుతావు. ఆమె అపహరించబడిన క్షణాలు గ్రుడ్డిలో మెల్లలా కొంత మేలయినవి. ఆ ముహూర్తంలో పోగొట్టుకోబడిన వస్తువులు తిరిగి త్వరలోనే దొరుకుతాయి.

అందునించి అన్వేషణ సాగించి. సీతను రక్షించలేకపోయినా ఆమె గురించిన ఆరా చెప్పగలిగినందుకు సంతోషంతో నేను చచ్చిపోతాను" అంటూ చెప్పాడు జటావు. ఆపైన అతని ఉసురులు అసాంతమైనాయి.

రాముడు తన తండ్రికి మిత్రుడైన విగతజీవి జటాయువు కళేబరానికి ప్రదక్షిణలు పూర్తికావించాడు. వైదికమైన రీతిలో దహన సంస్కారానికై అగ్ని నియోగించినాడు రాఘవుడు.

దుఃఖభారాన్ని దిగమ్రింగుతూ కర్తవ్యాన్ని స్మరిస్తూ మరికొంత దూరం ముందుకుపోయేక వారికి మరొక ప్రాణి ఎదురు ఐంది. అదికుల మహా పర్వతంలా పరివ్యాప్తమైన శరీరం. అతని పేరు కబంధుడు. అతి వికృతరూపం కలవాడతడు

దారికి అడ్డంగా పరుండి గుహలాంటి నోరు తెరచి పెట్టుకున్నాడు. బాహువులను బహుదూరంచాచి ఉంచాడు. అందిన ఐరావతాల వంటిదం తావళాలను సైతం అశనంగా స్వీకరిస్తున్నాడు. ఇప్పుడాతని పాలచిక్కడి పోయినారు రామలక్ష్మణులు.

కబంధుడు తన బంధాలలో వారినిపట్టు కున్నాడు. వెంటనే వారిని మ్రింగాలని ప్రయత్నించాడు. దాశరథి సౌమిత్రి చురుకుగా అతని బంధాలనించి తప్పుకున్నారు బాహువులను అద్వితీయమైన బలంతో, అనూహ్యమైన వేగంలో ఖండించారు.

రక్తం ఏరులై పారింది. అతని ప్రాణాలుపోలేక ఉండలేక మరణయాతన అనుభవించసాగాడు "ఓయీ తెరువరీ! యింత తెగువదారిగా నన్ను వధించినావు. నువ్వెవరు?"అని ప్రశ్నించాడు కబంధుడు. రాఘవుడు తన ప్రవరచెప్పుకున్నాడు

జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే సరయూతీరే అయోధ్యానగరవాసీ దశరథాత్మజః అని. అది విన్న కబంధుడు అంతటి మరణయాతన లోనూ సంతోషాతిరేకాన్ని పొందాడు. "రామా! నీవా! ధన్యుడనయినాను. నీ చేతిలో మరణమంటే ముక్తిమార్గమే కదా! నేను ఒకప్పుడు బలగర్వితుడనయి స్థూలశిరుడనే మహర్షిని ఈ వికృతాకారంతో జడిపించాను. అతని తపోశక్తి వల్లనాకు ఈ రూపం స్థిరమయింది. నీ వల్లనే తిరిగినా యథార్థ రూపం పొందగలుగుతానని అతడు తిరిగినాకు వరం ప్రసాదించాడు.

ఇప్పుడుదది ఈడేరింది నా శరీరాన్ని కాష్ఠాలతో అగ్ని తప్తం చేయండి" అని అడిగాడతడు

అది విహితకర్మ కావటం నించి అందుకు అంగీకరించాడు రాఘవుడు. అగ్ని దత్తతమయిన శరీరాన్నించి అతని తేజస్సు వెలువడింది.

"రామా! నీవు భార్యావియోగంతో దుఃఖిస్తున్నావు. ఇక్కడనించి దక్షిణంగా పోతే పంపాతీరాన ఋష్యమూకం కన్పిస్తుంది. దాని మీద అమిత శక్తిశాలురు, క్రియాశీలురు ఐన నరవానరులున్నారు వారు నాకు సకలవిధాలా సహకరించగలరు. అందునించి ఆ వైపుగా పయనించు" అనిహిత హెచ్చరికలు పలికినాడు కబంధుడు.

రాఘవుడు సౌమిత్రి ఆశాపూర్ణమయిన హృదయాలలో పంపాతీరానికి చేరుకున్నారు. అది శబరులనేకులున్న ఆవాసం. ఒక శబరకాంత వృద్ధురాలు. ఆమె రాముని దివ్యమోహనమై రూపాన్ని చూచి వివశఅయింది.

"రామా! స్వాగతమయ్యా! ఎంతోకాలం నించి నీ కథలు వింటున్నాను. ఈ ప్రాంతాలకు వస్తావని ఆశించి ఎదురుచూస్తున్నాను. అసుర సంహారంలో అద్వితీయుడవు! మునిజన రక్షణలో మునిగితేలన వాడవట. ఎంత పుణ్యశాలి వయ్యా నీవు. ఎంతటి మహత్తరమైన కార్యక్రమాన్ని నీ జీవిత లక్ష్యంగా ఎన్నుకున్నావు. నీది వ్యరూపాన్ని దర్శిస్తేనే బ్రతుకులు పండుతాయి.

రామా! అందరు అసురులను వధించి నీ చేతులు ఎంతగా నొచ్చుకున్నాయో! యివిగో! ఈ మధురఫలాల ఆరగించు. ఈ నిర్మల జలాలను త్రాగి ప్రశాంతుడవు కావయ్యా! అంటూ సకలమైన మర్యాదలు చేసిందా వృద్ధురాలు.

సౌమిత్రి ఆమె ముచ్చటలు చూచి అబ్బురపడిపోయినాడు. సోదరుల మార్గాయాసం తీరేంత వరకూ ఆతిథ్యమిచ్చింది శబరవృద్ధురాలు. రామునిది వ్యరూపాన్ని చూచి కన్నీరునింపుకుంది. ఆమెకు వేద విహితమైన జీవన మార్గమేమిటో తెలుసు. మతంగాశ్రమంలో అనేకమయిన తాత్త్విక చర్చలతో పాల్గొన్న విజ్ఞానమూర్తి శబరి.

రాముని చూచిన తరువాత మరింక బ్రతికిఉండాలని ఆమెకు అనిపించలేదు. రాఘవుని చేతులలో ప్రాణాలను విడిచి మోక్షమార్గాలను అన్వేషిస్తూ వెళ్ళిపోయిందా జీవి. రాముడామెకు నివాళులు అర్పించి పురోగమించినాడు. పరిపాతీరం చేరుకున్నాడు.

పంపా సరస్సుకు అల్లనంత దూరంలో కన్పిస్తాయి ఋష్యమూక సానువులు. వాటిమీద కపి సేన ఆవాసము టోంది. అక్కడ ఉన్నవారంతా సుగ్రీవుని హితులు అనుయాయులు.

వారందరికీ తలమానికం హనుమంతుడు. పావనమూర్తి ఐన హనుమంతుడు అంజనీసుతుడు. వాయు కుమారుడు. సుగ్రీవునికి సచివుడు ఆతడి ఉత్సాహశక్తి మేధాసంపత్తీ అనిర్వచనీయమైనవి. ఆతనికి అసాధ్య మన్నదిలేదు.

సుగ్రీవుడు వాలి సోదరుడు. వారిది కిష్కింధానగరం. అయితే ఋష్యమూకం మీద వారుండటానికి వెనుక ఒక బాధాకరమయిన సంఘటన ఉన్నది.

కిషికింధా నగరాన్ని ఏలుతున్న రాజు వాలి. అతడు అమిత బలశాలి. ఇంత వరకూ అనేకులతో యుద్ధాలు చేశారు. కాని పరాజయమన్నది ఎరుగనివాడతడు. రావణుడు సైతం అతని బాహు విక్రమ స్ఫూర్తికి తలవొగ్గి మిత్రుడయి మసలుతున్నాడు

అతడొకసారి దుందుభి అనే అసురునితో తలపడినాడు. అతనిని వధించి కళేబరాన్ని తన విక్రమస్ఫూర్తి జగజ్జేగీయమానమయి లాగున కొనగోట చిమ్మినాడు. రక్త బిందువులు వెళ్ళి ఋష్యమూక పర్వతం మీద పడినాయి. అందుకా మహర్షి కోపించాడు.

"విచక్షణా జ్ఞానశూన్యుడా! తపోమందిరాల మీదికి కళేబరాలను చిమ్ముతావా! ఇంకెప్పుడూ ఈ పర్వత ప్రాంతాలకురాకు. వచ్చావంటే తలపగిలి చస్తావు" అంటూ తన కోపాన్ని ప్రదర్శించినాడు మౌని మునులకు కోపంరాదు. రాకూడని కోపం తన అపరాధం వల్లనే వచ్చింది కాబట్టి భయపడ్డాడు మతంగుడు ఆశ్రమం చాయలకు రాకూడదని శపథం చేసుకున్నాడు.

ఆ తరువాత వాలి సుగ్రీవులకు వైరం వచ్చింది. అదొక దురదృష్టకరమైన సంఘటన. ఎవరి తప్పిదమూ లేకపోయినా అని వార్యంగా దుష్పరిణామాలు సంభవించినాయి.

వాలికి భక్తి భావంతో పూజించి గౌరవించేవాడు సుగ్రీవుడు. వాలి అర్ధాంగి తార. సౌందర్యమూ, విజ్ఞతా ఆమెకు బంగారానికి తావిచ్చినట్లుగా అమరినాయి. సుగ్రీవుని భార్యమ ప్రస్తుతం వారిద్దరూ వాలి అధీనంలో ఉన్నారు.

దుందుభి సోదరుడు మాయావి అన్నచావుకు ప్రతీకారం తీర్చుకోవాలని వాలి మీదికి వచ్చాడు. నగరం వెలుపల నిలిచి సమర రంగానికి ఆహ్వాన మందించాడు. అది అర్ధరాత్రి సమయం వాలి శయ్య మీదినించి లేచారు. అతనికి ఇరు వంకలా పరుండి ఉన్న వానరులు ఉలికిపడ్డారు.

"ఇదేదో రాక్షసమాయ అయివుంటుంది. అర్ధరాత్రి సమరానికి ఆహ్వానించి కాదంటే అతడు నిశాచరుడనే కదా అర్థం" అని చెప్పింది విచక్షణాశీలి ఐన తార. కాని శరీరబలంతో సాటిలేనివాడైన వాలి ఆ మాటలను రవంత ఐనా లెక్కచేయ లేదు.

"అవతల శత్రుకూటమివారు సమర రంగానికి ఆహ్వానిస్తూవుంటే చేతులు ముడుచుకుని కూర్చోవటం నావల్లకాదు" అంటూ భార్యకు ఎదురుపలికాడు. భీష ణంగా వీరాలాపం చేశాడు.

సుగ్రీవుడు అన్నగారికి అండకోసం అతని వెనుకగా వచ్చాడు. ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు దుంబుభి సోదరుడు మాయావి. ఇద్దరూ కలయబడినారు. మాయవి మహాబలశాలి కాపటం నించి బహుకాలం జరిగింది పోరాటం ఎటూ తేలలేదు.

క్రమేపి మాయని బలం క్షీణించసాగింది. అందునించి అతడు ఒక క్రమేపి మాయావి బలం క్షీణించసాగింది. అందునించి అతడు ఒక బిలంలోకి దూరాడు. అది తుదిమొదలు తెలియకుండా భూమిలోకి తొలుచుకుపోయిన బిలం, వాలి కూడ అతనిని వెన్నంటిపోయినాడు. అన్నగారు విజేత అయి తిరిగివస్తాడని నిండుగా ఒక సంవత్సరకాలం ఎదురు చూచినాడు సుగ్రీవుడు. అన్నగారు రాలేదు.

పైగా బిలం నించి రక్తఫేనం వెలుపలకు వచ్చింది. అది చూచిన సుగ్రీవుడు అన్నగారు ఓడిపోయి చనిపోయి చనిపోయినాడని భావించాడు. అతని రక్తమే అటు ఫెనంగా వచ్చింది. మరికొంత సేపటికి మాయావి ఐనా వెలుపలకు రావచ్చు.

అతడు తిరిగి కిష్కింధానగరం మీద దాడి చేయవచ్చు అమిత శక్తి సంపన్నుడైన అన్నగారినే ఓడించిన అతనికి మిగిలిన వారేమిలెక్క?

ఇలా ఆలోచించిన వానికి మహా శిలాఖండాలను అడ్డుంచి నగరానికి తిరిగి పోయినాడు సుగ్రీవుడు. ఐతే అతడు అనుకున్నట్టుగా చనిపోయినది వాలి కాదు. మాయావి చనిపోయినాడు. వాలి అడ్డుంచిన మహా శిలాఖండాలను అవలీలుగా అడ్డు తొలగించుకుని కిష్కింధకు వచ్చేశాడు. అప్పటికి తారరుమలతో సకల భోగాలను అనుభవిస్తున్నాడు సుగ్రీవుడు.

వాలి అతని మీద మండిపడ్డాడు. తాను నమ్మకద్రోహం చేయలేదని ఎన్నో విధాలుగా ప్రతిమాలుకున్నాడు సుగ్రీవుడు. కాని వాలి రవంత ఐనా పట్టించుకోలేదు. సోదరుని అన్ని విధాల అవమానించి తన్ని తగలేశాడు. కన్పిస్తే ప్రాణంతీస్తానని బెదిరించాడు.

అయితే హనుమ అతనికి అండగా నిలిచాడు. మతంగ ఆశ్రమ ప్రాంతాలకు రావాలంటే వాలికి భయం. అందునించి ఋష్యమూకం మీద సుగ్రీవుడు తల దాచుకున్నాడు. వైదేహికి విసిరిన నగల మూటనుచూచింది వారే!

యిప్పుడు అశ్వనీ దేవతల్లా నడచి వస్తున్న రామలక్ష్మణులను చూచింది కూడవారే!" హనుమా! ఆవచ్చే వారెవరు? ఆశ్వనీ దేవతలా? అన్నగారు నన్ను సంహరించేందుకు పంపిన గూఢచారులా?" అని అడిగాడు సుగ్రీవుడు భయంగా వేలి వంకచూస్తూ.

అతనిది ప్రభుశక్తి. హనుమంతునిది ఉత్సాహశక్తి. మంత్రి అయిన పావని వ్యాకరణ వేత్త. మంత్రాలోచనా తత్పరుడు. ఏకాగ్ర నిష్ఠాగరిష్ఠుడు. స్వామిభక్తిలో తత్పరమైన భావం కలిగినవాడు.

"సుగ్రీవా! వారు అమితతేజస్సంపన్నులై కన్పిస్తున్నారు. దేవతలో గంధర్వులో ఐవుండాలి. లేదా క్షత్రియులయినా అయివుండాలి. ఒకవేళ గూఢచారులే అయితే మనమూ రహస్య పద్ధతిలోనే వారి గురించి తెలుసుకోవటం సముచితంగా ఉంటుంది" అన్నాడు కపిశేఖరుడు.

"హనుమా! బుద్ధిశాలివి ఐయి నీవే అందుకు సమర్థుడవు. వారెవరో వివరాలు సేకరించి ఇక్కడున్నట్లుగా రావాలి. మన శత్రువులు అయితే భయోత్పాతం సృష్టించు. వారిని పారద్రోలు. మిత్రులు అయితే వెంటపెట్టుకురా!" అని చెప్పి హనుమంతుని పంపాడు సుగ్రీవుడు.

బుద్ధిశాలి ఐన కపీశుడు ఆ సోదరులను డాయవచ్చాడు బ్రాహ్మణ వేషంలో వారు అతని వంక అనుమానంగా చూచాడు. ప్రథమ దర్శనంలోనే ప్రశాంతమైన రాఘవుని ముఖముద్ర చూచి ఆకర్షితుడైనాడు హనుమ. అతని రాజీ వాక్షలు అమితంగా ఆకర్షించినాయి. ధనుర్బాణాలు అతని కొసమే అన్నట్లుగా బాహువులలో అమరినాయి.

"మహా పురుషులారా! మీరెవరు? చూస్తే ఈ ప్రాంతాలకు క్రొత్తవారిలాగ అనిపిస్తున్నారు" అంటూ అభివాదం చేశాడు అంజనాసూనుడు. పురుషోత్తముడైన రాఘవుడు తన ప్రవరచెప్పాడు. "జంబూద్వీప భరతవర్షే భరతఖండే సరయూతీర అయోధ్యావాసీ దశరథాత్మజః అహారిభో అభివాదయే!" అన్నాడు.

హనుమంతువు మాటలు వింటూనే నేరుగా రామపాదాలకు శిరసు తాకించి మ్రొక్కాడు. "రామా! నీవా! అసుర సంహారం లోకంకణ బద్ధుడవు అయినావని, మునిజనులకు పురుషోత్తముడవు అయి ఆరాధనీయుడవు అయినావని ముల్లోకాల జనులు స్తుతించగా విన్నాను" అన్నాడు హనుమంతుడు శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు

"నీ పెవరు?" అని అడిగాడు.

"కిష్కింధాపుర అగ్రహారీకుడమ"

"పేరు"

"హనుమంతుడంటారు"

"ఇక్కడున్నావేమి—?"

"రామా! నా ప్రభువు అయిన సుగ్రీవుడు అన్నవల్ల వంచితుడైనాడు. ప్రస్తుతం భార్యావియోగ దుఃఖంలో వగ చెందుతున్నాడు. మహా బలశాలి అయిన వాలి అతని సోదరుడు రాజ్య భాగాన్ని భార్యను అపహరించి కిష్కింధలో మలుపుతున్నాడు" అంటూ అభియోగం చెప్పాడు హనుమ. రాముడు దుఃఖితుడయినాడు.

"నా వలెనే నీ ప్రభువు కూడ భార్యా వియోగదుఃఖంలో ఉన్నాడా ? హనుమా! ఒకసారి నేను నీ ప్రభువుతో మాట్లాడాలి. నాకు చేతనయిన సాయం ఏదైనా ఉంటే చేస్తాను" అన్నాడు రాఘవుడు.

హనుమంతునికి రాముని మీద భక్తి విశ్వాసాలు కుదిరాయి. బహు కాలం నించి తనకు చేరువ కావలసిన వ్యక్తి ఎవరో అనూహ్యంగా దగ్గరకు వచ్చినట్లు

అనిపించింది. రాఘవునితో బహు జన్మలబంధుత్వమేదో తనకు ఉన్నదని అని పించింది.

"రామా! శ్రీరామా! పరంధామా! అంతకన్నా కావలసినదేమున్నది. ఆప దలో ఉన్నవారు ఇరువురు మిత్రులయితే పరస్పరం సహాయ సంపత్తులు అందించు కోవచ్చు. కనీసం ఓదార్పు వాక్యాలయినా ఒకరికొకరు చెప్పుకోవచ్చు. అందు నించి మీరు అవశ్యం ఋష్యమూకం వాదికి రావలసిందే" అంటూ ముందుకు దారి తీశాడు పింగాక్షుడయిన కపిశేఖరుడు. సోదరుడు బాగా అలసిసొలసి ఉండటం నించి కపీగమకాన్ని అందుకో లేక పోయినారు.

అమిత విక్రముడైన వాయు పుత్రుడు జానువుల మీద కూర్చుని "మహా పురుషులారా! నా భుజస్కంధాల మీద కూర్చోనండి. రివ్వున ఎగిరి గమ్యం చేర్చు తాను. పుణ్య పురుషులైన మీకు యిలా సేవ లందించి నా జన్మ చరితార్థం చేసు కుంటాను" అన్నాడు

రామలక్ష్మణులు కపిశేఖరుని భుజస్కంధాల మీదికి ఎక్కి కూర్చున్నారు. కొద్ది క్షణాలలో సుగ్రీవుని సమక్షానికి చేర్చాడు హనుమంతుడు. వారిని నేలకు దింపినాడు.

"వీరు అయోధ్యవాసులైన దశరథాత్మజులు. అగ్రజుడైన ఈ నీలవపుషి పేరు రాముడు భార్యా వియోగ పరితాపం వల్ల నీలాగానే వెత చెందుతున్నాడు. అందునించి వెంటపెట్టుకు వచ్చాను" అని సుగ్రీవునికి సరిగతాన్ని వివరించాడు.

నరవానరుల మైత్రికి ఆ ముహూర్తం సుముహూర్తమైంది. తన కథ అంతా చెప్పాడు సుగ్రీవుడు. "నాకు సాయం చేయగల మహాపురుషుడి కోసం ఎంతో కాలం ఎదురుచూస్తున్నాను" అన్నాడు దిగులుగా.

"మిత్రుడా! నీవు రవంత ఐనా బాధపడకు వాలి ఎంత బలశాలి అయినా అతనిని నేను వధిస్తాను. నీ రాజ్యాన్ని అర్ధాంగిని నీకు దక్కేలాచేస్తాను. బాధ పడకు" అని ఓదార్చాడు రాముడు.

సుగ్రీవునికి రవంత ఐనా సంతోషం కలగలేదు.

"నా సంగతి అలా ఉంచు. నీ భార్యను అపహరించిన దుండగుడు ఎవరు?" అని ప్రశ్నించాడు. సౌమిత్రి జరిగినదంతా వివరించాడు. వైదేహి ఋష్యమూకం మీదుగా తరలిపోతూ విసిరిన ఆ భరణాలను తెచ్చి చూపించారు కపులు. వాటి వంక చూడనైనా లేకపోయినాడు రాఘవుడు. దుఃఖ వివశుడైనాడు.

పాదనూపురాలను మాత్రం గుర్తు పట్టాడు సౌమిత్రి.

"రామా! నీ భార్యను అపహరించిన రావణుడు ముల్లోకాలలో ఎక్కడ ఉన్నా సరే అతనిని వధిస్తాను. నీ సీతను నీకు అప్పగిస్తాను. కాని నాకు ఋష్య మూకం మీదినించి దిగేదారి ఏది. కాలు క్రింద మోపిన మరుక్షణం నా అన్న నన్ను వధిస్తాడు" అంటూ దుఃఖించాడు సుగ్రీవుడు

ఎప్పుడైతే సుగ్రీవుడు రావణుని మరించి వివరాలు సేకరించి సీతను తిరిగి తీసుకురాగలనని అన్నాడో అప్పుడే రామునికి మనసుకు పూర్ణమైంది ఆశలు చిగు గించినాయి.

"సుగ్రీవా! మిత్రుడా! వాలి నిన్నేమి చేయగలడు. ఇదిగో ప్రతిజ్ఞ చేస్తు న్నాను. ఈ క్షణంనించే నీవు కిష్కింధపాలకుడవు నిన్ను పంచ భూతాలసాక్షిగా కిష్కింధకు పట్టాభిషిక్తుడను చేస్తున్నాను. చతుర్ద శభువనాలలో ఉన్న ఏ శక్తులూ ఈ వాక్కుని విరోధించజాలవు. వెంటనే బయలుదేరు అంటూ పీరాలాంప చేశాడు రాఘవుడు. అయినా సంశయంగానే చూచాడు సుగ్రీవుడు. అందుకు రాఘవుడు రవంత నొచ్చు కున్నాడు.

ఆ సమయంలో హనుమంతుడు వారి మాటల మధ్యకు తనంత తానుగా వచ్చాడు. వారిమైత్రిని పటిష్టంచేయాలని సంకల్పం.

"రాఘవా! నీవు అంతట శక్తిశాలివే! కాని అనేక మారులు వాలి విక్రమాన్ని చూచి వున్నాడు సుగ్రీవుడు. నీ గురించి విన్నాడు కాని చూడలేదు. ఇప్పుడతని వల్ల బహు పర్యాయాలు అవమానితుడు అవటమే కాకుండా దెబ్బలుతిని ఉన్నాడు. అతని భయం తీరలేదు." అంటూ పరిస్థితిని వివరించాడు హనుమంతుడు.

"హనుమా ఈతనిని నమ్మించాలంటే నేనేమి చేయాలంటావు" అని అడి గాడు రాముడు. వాయు పుత్రుడు రవంత సేపు యోచించాడు.

"రాఘవా! ఇతఃపూర్వమే వాలి దుందుభిని వధించి ఆతని కంకాళయష్టిని యష్టిని బహుదూరం విసరికొట్టాడు. సప్తసాల వృక్షాల మీదుగా శిలీముఖాన్ని చూప్పించాడు. అవి నీవు చేయగలగితే సుగ్రీవుడు నీపైన పరిపూర్ణ విశ్వాసం ఉంచ గలుగుతాడు. అంతకు మించి దారిలేదు" అన్నాడు గౌతముని దౌహిత్రుడయిన హనుమ.

రాఘవుడు తన విక్రమాన్ని ప్రదర్శించాడు. దుందుభి కంకాళయష్టిని వాలి విసరిన దాని కన్నా పదిరెట్లు అధికం విసిరాడతడు. ఇంక ధనుర్విద్యలో అతడు సాటిలేని మేటి. సప్తసాల వృక్షాలలోంచి శిలీముఖాన్ని చొప్పించగలడు వాలి. కాని రాఘవుడు సప్తసాల వృక్షాలను ఒక్క బాణంతో నేలకూల్చాడు.

అతని విలు విద్యా విభవాన్ని కన్నుల పండుగా తిలకించినారు కపిపుంగవులు. రాముడు వాలిని నిగ్రహించగలడన్న సంపూర్ణ విశ్వాసాన్ని పొందినాడు సుగ్రీవుడు

అరణి పుల్లల్ని సంపాదించి వాటిని నిర్మథనం చేసి అగ్ని రగిలించాడు హనుమంతుడు. అగ్నిసాక్షిగా వారు మైత్రి పూర్వకమయిన ప్రమాణాలు చేసుకున్నారు. నరులకోసం వానరులు. వానరుల కోసం నరులు. పరస్పరం సహకరించుకోవాలని నిర్ణయమయింది.

ముందుగా వాలిని వధించాలి సుగ్రీవునికి కిష్కింధకు సింహాసనాధిష్ఠాతను చేయాలకదా! అందుకు ఉద్యుక్తుడయినాడు రాఘవుడు. వాలి సోదరుని వెంట పెట్టుకుని కపిసేన వెంటరాగా కిష్కింధా నగరానికి పయనమయినారు వాలిని సమరానికి ఆహ్వానించేందుకు ఒక గంట నగరం వెలుపల అమరించి ఉన్నది. దాన్ని మ్రోగించాడు సుగ్రీవుడు.

అంతేకాదు పడకటింటిలో తారతో సరాగాలాడు తున్న వాలికి విన్పించేలా సింహనాదం కూడ చేశాడు. తారను విడిచిలేచాడు వాలి తార అభ్యంతరం చెప్పింది.

"మీరంటే భయపడి రుష్యమూక పర్వతం మీదికి పారిపోయినాడు మీ సోదరుడు. ఇప్పుడు మళ్ళీవచ్చాడు. ఇది విచిత్రమే! ఏదో కారణం ఉండి ఉంటుంది. మీరు విషయసేకరణ చేయకుండా వెళ్ళకండి. వీరులను ఎప్పుడు ప్రమాదాలు పొంచి ఉంటాయి" అన్నది తార.

అందుకు పరిహాసంగా నవ్వాడు వాలి.

"ఈ చతుర్దశభువనాలలో సుగ్రీవునికి అండగా ఎవరు నిలిచినా అతనిని రక్షించలేడు నీ విలాగే చూస్తూఉండు. అలావెళ్ళి విజేతను అయి తిరిగివస్తాను" అంటూ అభ్యంతరాలు చెప్తున అర్ధాంగిని వదలి క్రీడాస్థలికి పరుగులు చేసే బాలకునిలా ఉత్సాహంతో ఊరి వెలుపలకు వచ్చి చేరినాడు వాలి.

సుగ్రీవుడు నవాగతమయిన ఉత్సాహశక్తితో తొడలుచరిచాడు.

వాలి ఆతని మీద విరుచుకుపడినాడు. మదమత్తేభం మీదికి మృగరాజు ఉరికి నట్లుగా ఉరికాడు ఒళ్ళంతా హూనం చేశాడు ముక్కు చెవులు కొరికాడు. నఖానతో శరీరమంతా రక్కులు పెట్టాడు. పిడిగులవంటి ముష్టిఘాతాలతో విమ్ములు పిండి కొట్టాడు. ఎంత ఎదురు చూచినా రామబాణం రాలేదు.

సోదరుని వక్షస్థలం చాలలేదు. పైగా క్షణక్షణానికి విజృంభించినాడు వాలి సుగ్రీవుడు క్షతగాత్రుడయి ప్రాణభయంతో పరుగులంకించుకున్నాడు. రుష్యమూకం మీదికి పోయాక వెనుదిరిగి చూచాడు. క్రోధంతో అతని నేత్రాలు అగ్ని వర్షి స్తున్నాయి.

"ఏమిటీ మోసం ?" అని అడిగాడు తీక్షణంగా.

రాఘవుడు నెమ్మది ఐన స్వరాన చెప్పాడు. "మిత్రుడా! ఇందులో నా వంచన కించిత్తు అయినా లేదయ్యా! మీ రిద్దరూ ఒకే రూపున ఉన్నారు. కలియపడే వేళ కనిపెట్టటం కష్టతరమయింది ఆ విషయం నాకు ముందుగా చెప్పిఉంటే మార్గాం తరం ఆలోచించి ఉందును. కాని నీవు అలా చెప్పలేదు" అన్నాడు రాఘవుడు. అతని మీద తప్పులేదని తేలిపోయ్యా ఖిన్నుడైనాడు సుగ్రీవుడు.

సౌమిత్రి గజముష్టి తీవను వ్రేళ్ళతో సహా పెకలించి తెచ్చి సమగ్రవుని గళంలో అలంకరించాడు.

"మిత్రమా! రేపటి సుప్రభాతాన నీవు విజేతవు కాబోతున్నాను. ఈ రాత్రికి విశ్రాంతి తీసుకో" అన్నాడు, భయపడుతుతూ నీ సుగ్రీవునికి తెల్లవారింది. పిరికి మందుతిన్న వానిలా అయినాడు.

కిష్కింధను రాను అని భీష్మిందాడు. వాలికాయాన్ని డిచ్చరిస్తేనే వాణికి పోయినాను. అన్ని విధాల అతనికి ధైర్యం చెప్పారు. రాఘవుడు తన మధుర వచ నాలతో ఆతనికి ఊరట కలిగించాడు

ఎలా అయితేనేం అతి ప్రయత్నం మీద గజముష్టితీగను కంఠహారంగా ధరించి బయలుదేరినాడు సుగ్రీవుడు.

మళ్ళీ సమరాహ్వానంగా గంటకొట్టి సింహనాదం చేశాడు. తార ఉలికిపడింది. వెళ్ళేందుకు ఉద్యుక్తుడు అవుతున్న భర్తను నిరోధించింది. "ప్రాణవల్లభా! ఇదేదో మాయ. కుట నీవు వెళ్ళరాదు" అంది. కాని వాలి వినలేదు.

"నిన్నటిలానే విజేతను అయి తిరిగి వస్తాను. త్వరపడకు" అని ఓదార్చి

వెళ్ళిపోయినాడు. ఈ మారు వృక్షం మాటున పొంచి నిలచినాడు రాఘవుడు. సోదరులు చేతులు కలిపారు.

వాలి విక్రమించి సుగ్రీవుని శరీరాన్ని చిత్రహింసలకు గురిచేస్తున్నాడు. రామ బాణం త్వరగావస్తేబాగుండును అని బాధల్ని భరిస్తూ ఎదురుచూస్తున్నాడు సుగ్రీవుడు.

ఈ పర్యాయం అతని అభా పనితనం నిండుగా నెరవేరింది.

మేఘాలనుంచి చీల్చుకువచ్చిన అశనిపాతంలా రామబాణం వచ్చి వాలి గుండెల్ని బద్దలు కొట్టింది. రాఘవుడు అల్లెత్రాటిని ఆ కర్ణాంతం లాగి బాణం వద లటాన్ని ఒక మధుర దృశ్యంగా నేత్ర పర్వంగా చూచాడు వాయుపుత్రుడు. ఆ దృశ్యం అతని మనసులో చెరగని ముద్రలా నిలచిపోయింది.

రాముడాతనికి ఆరాధనీయుడని అని పించాడు.

పిడుగుపాటు లాంటి బాణం దెబ్బతిన్న వాలినేలకు ఒరిగినాడు. సుగ్రీవుడు వికటాట్టహాసం చేశాడు.

దాశరథి వృక్షమూలాల నుంచి వెలుపలకు వచ్చాడు.

వాలి అతనిని దర్శించాడు! "నీవా దాశరథీ! ఎంత దురదృష్టమో ! సజ్జను లందరికీ నీపెంతో మంచిపేరు సంపాదించుకున్నావు. మునిజనులను హింసించే అసురులయిన వీరుల నెందరినో ముఖాముఖి ఎదిరించినావు.

వారిని హతమార్చి విజేత అయినావు. సాటిలేని వీరుడవు అనిపించుకున్నావు వీరులకు వీరులతో పోరాడాలని వుత్సాహం ఉండటం సహజమేకాని వారు అదృష్ట మేమి? నామీదకు యిలా దొంగచాటుగా దాడిచేసినావు చారులు చెప్పగా నీ ఆగమన వార్త విన్నాను.

దాశరదీ! మహావీరుడవయినా భీరుడవు అయినా కనిష్టునితో చేయి కలపాలనీ అవుసరమేమిటయ్యా! రావణుడు నేనెరుగని వాడనుకున్నావా! అతనిని కిష్కింధకు పిలిపించగలిగిన ప్రతిష్ట నాకున్నదని నీకుతెలియదా?

అవుసరమైతే వీరోచితమైన పోరాటంలో అతన్ని వధించి అయినా వైదేహిని నీకు అప్పగించేవాన్ని. దండకలో ఇన్ని సంవత్సరాలుగా సాగించిన నీ కార్యకలాపాలను మునులవల్ల అని ఎంతో సంతోషించాను.

వీరుడవు దక్షుడవు అనుకున్నాను. కాని ఇప్పుడీపని చూచాక నామీద నాకు ఏర్పడిన సదభిప్రాయమంతా దిగజారిపోయింది చావుదేముంది.

వీరులకు అది ఎప్పుడైనా ఎలాగయినా ఎదురుకావచ్చు. అందునించి దాని గురించి నేను బాధపడను కాని మంచిపేరు తెచ్చుకుంటూన్న నీవు ఇలా కుటిల చర్యను కొనసాగించినందుకే నేను బాధపడుతున్నాను.

నీవు ధర్మస్వరూపుడవని అంటారు. కాని ఇలా సాటివీరుని వృక్షమూలం చాటున నిలిచి చంపటం ఏ ధర్మశాస్త్రం అంగీకరించేవని ఇప్పుడు నీవు రాజువు కూడకాదు.

ముఖ్యమయిన సంగతి ఒకటుంది.

అదేమిటంటే నేను మరొకరితో పోరుతూ వుండగా నీవు నన్ను వధించావు. ఇలా చేయటాన్ని ధర్మమని ఎవ్వటికయినా ఎవరయినా అనలేదు.

ఏది ఏమైనా పురుషోత్తముడవన్న పేరు సంపాదించుకున్నా నీ బాణం దెబ్బకు ప్రాణాలర్పించటం అదృష్టమనుకుంటాను. నాకు విముక్తి ప్రసాదించు" అని అర్థించాడు వాలి జాలిజాలిగా!

రాముడు నలునివంక అజ్ఞాపూర్వకంగా చూచాడు. అతడు వాలి వక్షోభాగాన దిగివున్న అమ్మును పెరికివేసినాడు. వెనువెంటనే "రామా! నా అంగదుని జాగ్రత్తగా చూచుకో! అతనికి అన్యాయం జరగనివ్వను" అని చెప్పి ప్రాణాలను విడచినాడు వాలి. అప్పటికే తార తదితర పరివారము అక్కడకు వచ్చినారు.

తార భోరున విలపించింది.

"రామా! అద్వితీయుడవయిన విలుకాడవని పేరుంది. నా భర్తను చెట్టు చాటునించి చంపావు. అలాగే నన్నుకూడ వధించి ఈ విషాదమయ జీవితముక్తి ప్రసాదించు" అని ప్రార్థించిందామె.

ఆమెను కపి సేనలోని పెద్దలు ఓదార్చినారు. రాఘవుడు ఎవరికీ ఏమీ సమాధానం ఇవ్వలేదు. సుగ్రీవునికి అందించాడు. అందరూ దానివంక చూచారు.

అది అద్భుతమైన సువర్ణ సుమమాల దానికి కొన్ని సాంకేతికమైన శక్తులున్నాయి. అద్భుతమైన ఆ మాలను దేవేంద్రుడు వాలికి యిచ్చాడు.

అది మెడలో ధరించిన వారిమీద ఎవరూ పోరాడలేరు. ఎందుచేతనంటే ఆ శక్తులు ఎదుటివారి శక్తిని హరించి వేస్తాయి.

దాన్ని తీసి సుగ్రీవునికి ఇచ్చినాడు రాఘవుడు. సుగ్రీవుడు దాన్ని ధరించి కిష్కింధా నగరానికి అధినేత అయినాడు

వాయునందనుడు మంత్రి పదవిని అధిష్టించినాడు. అంగదుడు యువరాజు అయినాడు. ఇంతకాలం వాలిని ఆశ్రయించిన తార, ఇప్పుడు విజేతఅయిన, సుగ్రీవుని అధీనమయినారు.

బహుకాలం ఋష్యమూకంమీద నానాబాధలుపడిన సుగ్రీవునికి ఇదిఅటవిడుపు అయింది. అతడు సకలమయిన సుఖసంతోషాలను అందిపుచ్చుకున్నాడు. రామ లక్ష్మణులను తనతోపాటుగా కిష్కింధకు రమ్మని ఆహ్వానించాడు.

అందుకు రాఘవుడు అంగీకరించలేదు.

"మిత్రుడా! నేను వనవాస జీవితం గడుపుతున్నానయ్యా! అందునించి నగరాలకు ప్రవేశించాను. వర్షాకాలంవచ్చింది. ఈ ఋతువుబడి పోదాకా నేను కొండ గృహలో గడుపుతాను. ఆ తరువాత సీతాన్వేషణకయి బయలుదేరినావుకదా!" అని అతని కోరికను తిరస్కరించాడు.

ఒక మహానుభావుడు చేశాడు. రాఘవుడు నిద్రాహారాలమ మరచి సీతా సంస్మరణం ప్రారంభించినాడు. ఎడతెగని దుఃఖం అతని వంతు అయింది.

"సౌమిత్రి! ఇంతకాలం నేను ధర్మాన్ని ఆశ్రయించినాను. ఆ ధర్మమేనన్నా స్థితికి తీసుకువస్తోంది. సీతలేకుండా నేనెలా జీవించగలనయ్యా! ఆమె ఎంతో సుకుమారి. అయినా నేను వనవాసం బయలుదేరినా ఎంతో సంతోషముతో బయలు దేరింది. ఎన్నో సందర్భాలలో నన్ను హెచ్చరించి మంచిమార్గాన నడిపించింది. యిప్పుడు ఆమెలేదు. నేనెలా అయోధ్య వెళ్ళను. అమ్మలకు ఏమని సమాధానం చెప్పను.

భార్యను రక్షించుకోలేని అర్భకుడని లోకులు అడిపోసుకుంటారుకదా! వారి నిందలు నేనెలా భరించను? సీత జాడ తెలియకపోతే నేను అయోధ్యకురాను. ఇక్కడే అగ్నిప్రవేశంతో ప్రాణత్యాగం చేస్తాను" విలపించసాగాడు రాముడు. సౌమిత్రి అతనిని అనేక విధాలుగా ఓదార్చుతూ వచ్చాడు. వర్షాకాలం అసాంతమయింది. హేమంతం వచ్చింది.

# 12

హనుమత్స్వామి చిత్రకూటస్థుడయినాడు.

త్రికూట పర్వతంమీద అలకానగరంతో పోటీచేయగల లంకానగరం నిర్మిత మయింది. దాన్ని నిర్మించినవాడు మయుడు. నిర్మింపచేసినవాడు రావణుని పెద్దతల్లి కుమారుడయిన కుబేరుడు.

అనుభవించేవాడు ఉద్ధతుడయిన రావణుడే! బలవంతుడే భూమి పతికావాల్నది సంకీర్ణ మహాపురుషుడయిన దశకంధరుని సిద్ధాంతం.

అతని ఏలుబడిలో ఉన్న లంకానగరం వాకిటి ఎదుట నిలిచే ధైర్యం సృష్టిలో ఎవ్వనికి లేదన్నది నిన్నటి మాట నేడు ఆమాట డిల్లపోయింది.

ఈనాడు కపిశేఖరుడు ఆ వాకిట నిలివటమేకాక లంకానగరం పరిరక్షణ దక్షురాలైన లంఖిణిని ఒక్క పిడిగ్రుద్దుతో వధించాడు.

ఆ సుందర తరనగర విధ్వంసకాండలో తొలి అధ్యాయం విజయవంతంగా ప్రారంభించినాడు.

ఎటుచూచినా అందం రాసిపోసినట్టుగా కన్పిస్తోంది. పగడాలు పచ్చలు కెంపులు పద్మరాగాలు పొదిగిన అద్భుతలోకం రావణ నగరం!

కపినాథుడు అలోచనాముద్రుడై అవలోకిస్తు అడుగు ముందు కేసాడు. చీకటి చిమ్మినరాత్రి! చీకటి ఆవరించిన మహానగరం! చీకటినిండిన మనసులతో నగర వాసులు నిద్రిస్తున్నారు. అన్నింటా చీకటి దోగాడుతోంది.

కేసరి తనకు తానై చిరుదివ్వెగా మునుముందుకు పురోగసుస్తున్నాడు. ఆకసంలో తారకలు బిక్కుబిక్కుమంటున్నాయి ఎత్తయిన బురుజులు ప్రాకారాలు వ్యోమవిభాగాన్ని ముద్దాడుతున్నంత ఉన్నతంగా కన్పిస్తున్నాయి.

కపినాయకునికి మనసయింది కాబోలు రివ్వునగెంతి ప్రాకారాలమీదుగా బురుజులమీదికి చేరుకున్నాడు. అది విరోధులు ప్రవేశించేందుకు క్లిష్టమైనచోటు.

అయినా వాయుసూతికి చొరరానిదోటెక్కడున్నాయి? శ్రీరామనామ సంస్మరణ చేస్తూ అతని రూపాన్ని ధ్యానిస్తు మునుముందుకు సాగినాడు.

నగరంలో కొన్నిచోట్ల కల్లుపాకలున్నాయి. మరికొన్నిచోట్ల వేదాధ్యయన వేదికలున్నాయి కొందరు చైతన్య విహీనులవలె వికృతంగా నిద్రిస్తున్నారు. మది

కొందరు లంకావాసులయిన స్త్రీపురుషులు నెగళ్ళ చుట్టూచేరి త్రాగుతూ తూలుతూ పాడుతూ ఉల్లసించి ఉన్నారు.

వారిలో కొందరు అతిసుందర శరీరులు! మరికొందరు అతివికృత రూపులు. అంజనాతనూభవుడు పురోగమిస్తు మరొక అడుగు ముందుకేస్తూ ఒకవిచిత్రాన్ని తిలకించినాడు.

అక్కడ కొందరు స్త్రీపురుషుల సమూహించి ఉన్నారు. అచటి వస్తుసంచయ మంతా విలక్షణంగా కన్పిస్తోంది.

రాక్షసులు చాతబడిలాంటి ఒకఅభిజాత కర్మను నిర్వహిస్తున్నారు మరికొందరు అత్యంతాసక్తితో తిలకిస్తున్నారు. చేసేవారికీ చూచేవారికీ అక్షుద్రక్రియా కలాపం గొప్ప ఉత్సాహాన్ని తెకెత్తిస్తోంది.

తమ ప్రత్యర్థుల భరతం పట్టేందుకోనమని వారా విధానాన్ని అవలంభిస్తు న్నారని అర్థంచేసుకున్నాడు హనుమంతుడు. ప్రత్యర్థులమీద ప్రత్యక్షంగా పోరాడ లేని దుర్బరులు వాళ్ళు. అందు క్రియాకలాపాలద్వారా విరోధులమీద దాడిచేస్తున్నా రని అతడు గ్రహించినాడు. వారి అల్పత్వానికి లోలోపల నవ్వుకున్నాడు.

లంకానగరం పద్మంలా కన్పిస్తోంది. దానికి కేంద్రబిందువయిన కర్ణికారంలో అతిసుందర, సువిశాల, సుసంపన్నమయిన మహాభవనం ఒకటి కన్పించింది.

లంకాపతికి ఆవాసం కాదగిన చోటు అదే అని గ్రహించాడు రామకార్య తత్పరుడయిన హనుమదేవుడు, ఆసక్తుడై అందులో ప్రవేశించినాడు.

కన్నులు మిరుమిట్లు గొల్పినాయి.

రత్న దీపాలు బారులు తీర్చి ఉన్నాయి. సహస్రకోణాలుగా చెక్కిన రత్న శకలాన్ని ఒకచోటు నమరించినారు. వాటి కెదురుగా సరియైన కోణంలో ఒక చిన్న ప్రమిదలో తైల దీపాన్ని కనుపట్టకుండా అమర్చారు. ఆ చిరుదివ్వెనించి చిమ్మిన దీపకాంతి అల్పమైనదే! కాని అది సహస్రముఖాలుగా చెక్కిన రత్నశకలాలమీద ప్రతిఫలించి సహస్ర కిరణపుంజాలుగా రెట్టించబడి మిరుమిట్లుగొలిపే ఉజ్వలకాంతిగా ప్రసరించబడుతోంది. ఒకమారు దీపం ఉజ్వలకాంతి అయిన విధానమిది.

రావణుడు కూడ ఒక చిరుదివ్వె! సుమాలి (అతని తాత), ఎవరివలన మహదాశయాలకు మారురూపమై ప్రతిఫలించి అతడు ఉజ్వలుడయినాడు. ఉద్ధతు డయినాడు.

రత్నకాంతులలో రావణ తత్వాన్ని సంభావించాడు. అజేయుడయిన హనుమంతుడు అతడు మేధావి.

విశాలమైన కావడులుదాటిన తరువాత రావణ మందిరంలో మరిన్ని విశేషాలు ఎదురుకావటం ప్రారంభించినాయి. సీతామాత ఉండదగిన చోటు ఇదే ఎందుకు కాకూడదు అని కూడ ఆలోచించినాడు.

ఆ ఆలోచన మనసుపొరలను తాకగానే అతని కట్టెదుట హంసాతూలికా తల్పంమీద ధాత్రిపుత్రి అతనికి దర్శనమిచ్చింది. ఆ లావణ్య ఆదమరచి నిదురిస్తోంది.

ఆమె త్రిలోక సుందరి. అతి సుకుమారి. నిదురపోతున్నా రాజసం ముఖంలోంచి చిమ్ముతోంది రాజ లాంఛనాలన్నీ శరీరాన్ని కౌగలించు కున్నాయి. నిదురపోతున్నా పద్మినీ జాతిస్త్రీ కావటంనించి నిద్రాముద్ర అసహ్యంగా లేదు ఆకర్షణీయంగా కన్పిస్తోందామె. ముఖం రాత్రివేళ పద్మంలా, ఇంకా సానపట్టని పద్మరాగంలా మనోహరంగా ఉంది.

పవమాన తనయునికి సీత గురించి ఎందరో చెప్పగా విన్న వర్ణనలు మనసులోకి వచ్చాయి. రాముడు ఎంతో వ్యథా పూర్ణమనస్కుడై ఆమె గురించి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

ఊర్మిళాధవుడు భక్తితో కొన్ని గుర్తులు చెప్పాడు.

కాని అంజనా తనూభవుడు మనసులో చెదరకుండా మిగుల్చుకున్న జ్ఞాపకం ఒక్కటే! గంధమాదన పర్వతం మీద నగలు మూటగాకట్టిన చీర రంగు అతని మనసులో ఉంది.

ఎవరు ఏ వర్ణన చేసినా కపివల్లభుడు ఆ చీరలో ఉన్న మాతృరూపాన్నే ఊహించాడు. ఆ రూపాన్నే స్మరించాడు. ఆ రూపాన్నే యిప్పుడూ మనో పథంలోకి తెచ్చుకున్నాడు. కన్నులు చికిలించి చూచినాడు.

కాని ఈ హంసతూలికా తల్పం మీద ఉన్న స్త్రీ మూర్తి ధరించిన చీర అది కాదు. అంత కన్నా ఎంతో విలువయినది. భర్త వియోగంలో ఉన్న వైదేహి అలాంటి విలువైన వస్త్రాన్ని ధరించి, విలువైయిన నగలు ధరించి ఆదమరచి నిద్రించ గలదా అని ప్రశ్నించుకున్నాడు.

నా తల్లి ఎన్నటికీ అలా ఉండదు అని తనకుతానే సమాధానం ఒప్పుకున్నాడు.

అదృష్ట విహీనమైన స్థితిలో ఉన్న అమ్మ ఎంతో దయాపూర్ణ ముఖముద్రతో కన్పించాలి. నిరాహారంగా, నిర్నిద్రంగా ఉన్న ఛాయలు గోచరించాలి. కాని యిలా సంతుష్టమైన ముద్రలో ఆదమరచి నిద్రించటం ఏమిటి ?

అందునా రాక్షసుని అంతఃపురంలో అమ్మ ఒక్క క్షణమైనా రెప్పవాల్చ గలదా? అనుకున్నాడు.

ఆమె మండోదరి! రావణుని ధర్మపత్ని.

అక్కడనించి తక్షణం బయలుదేరి మరింత ముందుకు సాగాడు ప్రభాదివ్య కాయుడు.

అతని చూపులు సువిశాలమైన శయనా గారంలోని నల్దిక్కులు పరిశీలిస్తున్నాయి.

తెల్లని శయ్యమీద ముత్యాల చామరం లాంఛనంగా అమర్చుకుని హాయిగా నిద్రిస్తున్నాడు లంకాపతి!

అతని శరీరం నిద్రా ముద్రలో చీకటి రాసపోసినట్లుగా మినుములు గ్రుమ్మరించినట్లుగా కన్పిస్తోంది. శరీరం మహా మేరువులా అత్యంత విశాలమైనది.

అతని ఊర్పులు దీర్ఘతరంగా భయావహంగా విన్పిస్తున్నాయి. సుప్త భుజంగం వాయువుని పీల్చి ఒదులుకున్నట్లుగా అనిపించింది

ఉన్నతమైన శయ్య అది బంగారు పట్టెలమీద రత్నాలు తాపడం చేసు ఉన్నాయి, ముత్యాల సరాలు వ్రేలాడుతున్నాయి. త్రిలోకాలు జయించిన జౌద్ధత్యం ముఖం లోద్యోతక మౌతోంది.

దేవేంద్రునితో పోరాటంలో శరీరం మీద అయిన గాయాలు ఘనమైన జ్ఞాపకాల్లా ఉన్నాయి. ఐరావతం దంతంతో కోరాడిన గుర్తులు ఉన్నత వక్షస్సుపై కన్పిస్తున్నాయి. పరాజయ మెరుగని జగజ్జేత!

కొదువలేని నిద్రలో రాజసం ఉట్టిపడేలా కన్పిస్తున్నాడు. రెప్పవేయటం మరచినాడు వాతాత్మజుడు.

"ఓ సీవా రావణా! ఘనమైనవాడవోయీ! అమ్మ కనిపించాక నీ గురించి ఆలోచిస్తాను. బ్రహ్మావర్తము, ఆర్యావర్తము, దక్షిణావర్తము అనబడే ముల్లోకాలను గడగడ లాడించిన ఘనాపాఠివి నువ్వే కదా! కలుసుకుందాం! చూదుకుంటే నీతోనే చూసుకోవాలి" అని భావించాడు వానరయోధ ముఖ్యుడు.

శ్రీరామ దూత శిరసువంచి మరొకవంకకు చూచినాడు, ఆ వంక అంతా అవ్యవస్థనే!

సదాచారి అయిన బ్రహ్మచారి చూడకూడని దృశ్యాలన్నీ ఆవంక కన్పించి నాయి. వారంతా ఆదమరచి అనగా ఒళ్ళు మరచి నిదిరించే సుందరీమణులు. రావణుని ప్రేమించి అతనికై పరితపించే లంకా వాసులయిన సుందరీమణులు వారిలో కొందరు!

భుజబల విక్రమంతో ముల్లోకాలనించి ఎత్తుకు వచ్చి అతనితో కలిసిపోయిన రతీ దేవతలు మరి కొంధరు. వారి నిద్రాముద్రలు బ్రహ్మచారి అయిన వనచారికి క్రొత్త అనుభవమే!

ఒక అందాల అతివ వీణాదండాన్ని కౌగలించుకుంది. ఒకకాలు తంత్రుల మీద విసరింది. ఆచ్ఛాదనా రహితమైన వక్షోజాలు వీణాదండం మీద అదనంగా బిగించిన బంగారు బంతుల్లా కన్పిస్తున్నాయి.

పెద్ద వృక్షాన్ని అల్లుకున్న బంగారుతీగల్లా కాండం మీదికి వ్రాలిపోయిన బంగారు కొమ్మలా కల్పింపించిందామె.

వనచారి రెప్పలు అప్పళించినాడు.

వారిలో కొందరు శారీరకంగా సుందరీమణులు. కొందరు వికృతరూపలైన రక్షోకాంతలున్నారు. వారి ప్రేమ ప్రపూర్ణమయిన ఆత్మసౌందర్యాన్ని దర్శించి అంతఃపుర ఆవాసం కల్పించాడు రావణుడు.

నిద్రలో అందాల సుందరులు వికృతరూపాలైన వనితామణులు అందరూ ఒకలానే కన్పిస్తున్నారు. సుషుప్తి వారి అంతరాలను తుడిచిపెట్టి అందరిని అస్తవ్యస్తగా నేలమీదకు నెట్టివేసింది.

ఒకామె మరొకయువతి వక్షోజాలను గట్టిగా పట్టుకుని నిద్రిస్తోంది. ఇంకో అందాలరాసి మరో సుందరి పిరుదులమీద తలపెట్టుకుని పడుకుంది.

చవతి అనే అసూయను మరచి ఒక చిన్నారి మరొక పొన్నతొడల మధ్య తలయిరికించి పడుకుంది ఒకచోట స్త్రీ శరీరాలు గుట్టగా రాసిపోసి ఉన్నాయి.

కొన్ని కాళ్ళు. చేతులు, వరుసగా వక్షోజాలు, పెద్దపెద్ద బంతుల్లా పిరుదులు కన్పిస్తున్నాయి. కాని శరీరభాగం ఎవరిదో గుర్తించరానంతగా వారు చుట్టముట్టుకు పోయిఉన్నారు.

తమందరికి తృప్తినిచ్చే పురుషుడు రాసిపోసిన మినుముల కుప్పలా మరో శయ్యమీదికి చేరిపోయినాడని గుర్తిందలేనంతగా ఆసవాన్ని సేవించారువారు.

అందునించి అందిన శరీరభాగాన్ని తమ శరీరాలకు తృప్తికలిగే చోటునపెట్టి అదుముకుంటున్నారు.

అస్తవ్యస్తమయిన ఆ దృశ్యాలన్నీ చూచాడు బ్రాహ్మమయమూర్తి అయిన వానర శ్రేష్ఠుడు.

"ఈ శరీరాలు వివిధ రకాలయిన మలినాలను సృష్టిచేసే మురికికూపాలుకదా! పవిత్ర భావనతో పరమేశ్వరుని ఆలయానికివెళ్ళి పరమభక్తితో ప్రసాదించే దాన్ని రసాన్ని తన అవుసరానికి తీసుకుని అమేధ్యంగా మార్చివేస్తే శరీరాలుకవా ఇవి.

త్రికాలవేత్త, త్రిలోక విజేత, సంధాత అయిన లంకేశ్వరునికి ఈ మురికి కూపాలమీది ఆకర్షణ నశించలేదా?" అని ప్రశ్నించుకున్నాడు బ్రహ్మజ్ఞుడయిన కపిదేవుడు.

ఆ క్షణంలో అత్యంత ఉన్నతమైన లంకావతి రూపం కొండొకగుజ్జు రూపమై అతనికి కన్పించింది.

అటువంటివాడు కనుకనే అమ్మను సైతం అపహరించినాడు అని సంభావించి నాడు ఆంజనాసూతి.

ఒక చిన్న ఛీత్కారం చేసి అక్కడనించి కదలిపోయినాడు. అటువంటి చోటున భూజాత ఉంటుందని కాని, ఆమె కోసం వెతకాలని కాని అతనికి అని పించలేదు.

ఆ భవనంలో ఇంకా అనేక అందాలు, అద్భుతాలు కన్పించినాయి కాని సీత కన్పించలేదు. పుష్పక విమానం అతన్ని బాగా ఆకర్షించింది కాని అక్కడ కూడ నిలువలేక పోయినాడు.

సకలబహిః ప్రదేశాలలో వెదికాడు ఎక్కడా అమ్మజాడ కన్పించలేదు.

అల్లంత దూరంలో అశోకవనం ఆంజనేయుని దృష్టి పథాన్ని ఆకర్షించింది. ప్రశాంత సుందరమైన వనస్థలి! అవసరపడి ఆ చోటుకు చేరుకున్నాడతడు.

ప్రాకారం మీదినించి ఓ యిరుగుడు చెట్టుమీదికి లంఘించాడు. చెట్ల మీదుగా తిరుగుతూ ఒక అద్భుతమైన విశ్రాంతి మందిరం అతని దృష్టిని ఆకర్షించింది.

అప్పుడప్పుడే తెలతెలవారుతోంది. పక్షులు కలకూజితాలను చేస్తున్నాయి. తూర్పున తెలితెలి రేఖలు గోచరిస్తున్నాయి. చీకటి నిండిన లంకానగరంలో హను మత్స్వామి తన తల్లిని చూచేవేళకు వెలుగు పరచుకొంటోంది.

రవంత వెలుగులో రక్షోకాంతలనడుమ తెగిపోయిన పూల చెండులా, తెగి పడిన చంద్రరేఖలా కన్పించింది ఆర్తురాలైన ఒక స్త్రీ మూర్తి.

ఆమెను చూడగానే పింగాక్షుని కన్నులు చెమరించినాయి. వాలం ఎక్కు పెట్టిన వింటి బాణంలా సువ్వున పైకి లేచింది. శరీరమంతా రోమాంచమయింది.

ఆనాడు నగలమూట కట్టగా శేషమైన వస్త్రం ఆ స్త్రీమూర్తి శరీరాన్ని అంటి పెట్టుకుని కన్పిస్తోంది

ఆమె నిద్రించి ఎంతకాలమైందో, భుజించి ఎన్ని నాళ్ళయిందో ఊహించటం అసాధ్యమన్పించింది. చాంపేయ సుమమాలకు అలసట అనే మలినం అంటినట్లుగా కన్పిస్తోంది ఆ మూర్తి.

పెదవులు వాడి వత్తలయి అరుణ వర్ణాన్ని కోల్పడి పాలిపోతున్నాయి. చూపులు గతంలో కూరుకుపోయి నిశ్చలంగా నిలిచిపోయినట్లు కన్పిస్తున్నాయి.

దస్యుకాంతల మధ్య దయనీయంగా పడి ఉన్న ఆమెను చూస్తూ రెప్ప వేయటం మరచినాడాంజనేయుడు.

వివిధ ఆయుధాలను ధరించిన వికృతరూపిణులు కొందరు, ఆలవోకగా కూర్చున్న సుందరీమణులు కొందరు అక్కడున్నారు.

లంకాధినాథుడు ఆమెను అపహరించి తెచ్చిన దాదిగా ఆమెకు వారేమి చెప్పి విసిగిస్తున్నారో యిప్పుడూ అదే చెప్తున్నారు. ఆమె ఆ కూటలు వినకపోవటం వారు రవంత అయినా నిరుత్సాహపడటం లేదు.

ఈ నాటకీయత కొనసాగుతున్న దురదృష్టకరమయిన క్షణంలో పిడుగుపాటు లాంటి ఘంటానాదం వారి చెవులను సోకింది. లంకాపతి విజయంచేసే సూచన అది.

ఒక్కరు తప్ప మిగిలిన వారంతా ఉలికిపడినారు వైదేహి నిర్లిప్తంగా కూర్చుంది. ఆమె కాక మరొకామె ఒళ్ళుతెలియక నిద్రిస్తోంది. ఆ వృద్ధ వనిత పేరు త్రిజట!

రావణుని విజయం సీతాదేవిని కలవరపెట్టలేదు. కాస్తందుకు తాను చెప్పే బదు లేమిటో ఆమెకు బాగా తెలుసు. అది పదే పదే సాగుతున్న ఏకాంకిక!

ఎన్ని మార్లయినా జరిగేది అదే!

ఈ మారుకూడ జరుగనున్నది ఏమిటో కూడ ఆమెకు తెలుసు. రావణుడు దురాశతో తన కోసం అర్థించటం, నిరాశతో తిరిగి వెళ్ళిపోవటం!

ఇలా ఎన్ని మార్లు జరిగినా అతనికి తెలివిరాలేదు. దురాశకు నిరాశ ఒక్కటే ఫలితమని అర్థంకాలేదు. అర్థంకానంత మూర్ఖుడుకాదు లంకాపతి. అర్థం చేసుకుని అందుకు అనువుగా తన అభిప్రాయాలను మలుచుకునేందుకు సంసిద్ధుడు కాలేకపోతున్నాడు. అంతే!

అతడు వచ్చి మాటాడిన మాటలకు జనక తనూభవ ఎలాంటి సమాధానం యిస్తుందో అతనికి తెలుసు. ఎన్ని యుగాలు ప్రయత్నించినా అదొక్కటే మారని మాట అని అతదెరుగును. కాని ప్రయత్నించక మానడు.

ప్రయత్నమేకదా పురుషార్థమని అతని ఆంతర్యం!

వెనువెంట పరిజనులు నందడించగా విశ్రాంతి మందిరంగా వున్న అశోక వృక్షచ్ఛాయను చేరవచ్చినాడతడు.

జనకజాతకు దాపుగా ఉన్న దస్యకాంతలందరూ అతనికి గౌరవపురస్సరంగా అభివాదం చేశారు.

త్రిజట మాత్రం అలానే నిద్రిస్తోంది.

రావణుడు నోరు విప్పి అడిగాడు.

"సుమగాత్రీ! ఓ కుసుమనేత్ర! భూపుత్రీ! ఇంకనూ నీ మంకుపట్టు మానవా! మాననీయుడను నేనని గుర్తించవా ? గుర్తించి నావు కదా ఈ నగర వైభవము? వైభవోపేతమగు మరింకదానాకై దండ అందుకున్న అదదాని జీవితము. జీవితమువై నీకు వాంఛలేదా?

లేదుకదా నీ మగనికి మగపోడిమి? పోడిమికల వాడైతే ఇంతకాలం నిన్ను రక్షించలేకపోవునా? పోవునా లేదా నీకు నీ మగని పరాక్రమముపై నున్న అంధ విశ్వాసము? విశ్వాసమున కదా ఈ పరివారకాంతా శ్రేణి నన్ను వెన్నంటి సుఖించునది.

సుఖించు అవకాశమన్నది నీ ముంగిట నిలచి యాచించినదికదా! యాచకుడై నాడే లంకాధినాధుడు నీ పొందుకోరికదా! కోరికల నెందుకు అర్చుకుని అదృష్ట విహీనవు అవుతున్నావో తెలియదు.

తెలియదుకదా అని ఆలోచించు కునేందుకు కావలసినంత వ్యవధి యిచ్చినాను. యిచ్చిన సమయం వృథా!

వృధా ఐన కాలం తిరిగిరాదు! రాదు కదా ఎంత వారికైనా రావణుని పొందు భాగ్యం!

భాగ్యాలివి వికాదలుచుకుంటే నా చేయి అందుకో! అందుకో సురలోక సౌభాగ్యము! సౌభాగ్యవతివి కాగలవు దేవీ!

దేవీ! యిప్పటికయినా మనసు స్వాధీనమైనదా? అయినది చాలుకదా!" అన్నాడతడు.

శ్రీరామ పత్ని కన్నెత్తి ఆ మహాసీయగాత్రుని చూడలేదు. వన్నెత్తి పలుక లేదు. పగలనున్న అగ్నిపర్వతంలా, మేఘాల మధ్య దాగి ఉన్న జల ప్రళయంలా, కనుపించని దూరతీరాలలో ఉన్న ఉప్పెనలా అర్థంకాకుండా మౌనంగా కూర్చుని ఉందామె. చేతికి అందుబాటులో ఉన్న ఒక రెల్లుపోచ తీసుకుని లంకానాధినాధునికి తనకు మధ్య భూమిపై ఒక రేఖ రచించుకుందామె

అలనాటి లక్ష్మణరేఖకాదిది. సీతారేఖ! జానకిరేఖ! పాతివ్రత్య రేఖ! పవిత్రరేఖ!

"జడుడా! సామాజిక న్యాయపత్రం నీకూ నాకూ మధ్య ఒక అభ్యంతర రేఖను రచించింది. దాన్ని దాటేందుకు నీకయినా నాకయినా శక్తిలేదు. ఆ రేఖకు ఆవలనీవు. ఈవల నేను ఉండిపోవాలి.

ఇది శాశ్వత సత్యం. ఎవరూ కాదనరానిది. కాదనలేనిది. నీవు ముల్లోకా లను జయింగా గడ్డిపోచ రచించిన గీతకు మాత్రదాటలేవు" అన్నట్లుగా అభివ్యక్తీ కరణ చేస్తూ అలవోకగా రేఖను రచించిందామె.

ఆమె అభిప్రాయాన్ని గ్రహించిన లంకాపతి భయభ్రాంతుడయినాడు తాను పాలకుడు. అంతేకాదు. త్రిలోక పాలకుడు కావాలన్న ఆశకలవాడు.

పాలకునికి పాలితులుండాలి. పాలితులే సమాజం! ఆ సమాజం నిర్మించిన న్యాయసూత్రాలకు ప్రతీక ఆమె రచించిన రేఖ! దాన్ని దాటిన మరుక్షణం పాలితుల దృష్టిలో అతని ఉద్ధతి అణగారిపోగలదు.

శక్తిపాలిని అయిన సీతామాయి ఆ విధమయిన ఆలోచనతో అతని శక్తు లన్నింటినీ నిర్వీవం చేయగలిగింది. ఆనాడు తాను లక్ష్మణరేఖ దాటివచ్చి ఇలా కష్టాల పాలయింది రావణుడు సీతారేఖ దాటిననాడు పతితుడై దృష్టిలో, పాలితులమనో లోకంలో భ్రష్టుడై అణగారి పోగలడు.

సామాజికమైన న్యాయసూత్రమే సీతాదేవి శక్తి రూపంగా మారి రావణుని కట్టడి చేసింది. అతడు అడుగుముందుకు వేయాలని ప్రయత్నించలేదు,

భయ విహ్వలుడై నిలిచిపోయినాడు.

దేవరాజుపై, దిక్పాలకులపై, తుదకు దక్షిణాధిపతి అయిన యమునిపైరణభేరి మ్రోగించేందుకు వెనుకాడని మహామూర్తి అతడు.

ఒక స్త్రీ అందునా చెరపట్టితెచ్చి తన దాసజనులమధ్య ఒంటరిగా ఉన్న అబల! ఆమె గడ్డిపోచతో గీచిన గీటుదాటేందుకు మాత్రం శక్తివంతుడు కాలేకపోయినాడు. సమాజశక్తి అతనిశక్తిని నీరుకార్చివేసింది

పరివారజనులు తలకొక విధంగా మాట్లాడటం ప్రారంభించారు. వందిమ గధుల్లా దశకంధరుణ్ని గురించి స్తోత్రపాఠాలు వల్లించటం మొదలయింది.

ధ్రూమ్రకాళి, విద్యుజ్జిహ్వాం, రక్తజిహ్వ శ్రీరామపత్ని అయిన వైదేహిముందు అవకాశాన్ని విడుచుకోవద్దని చెప్పసాగారు. రావణుడు ఇంత అవకాశం మరెవ్వరికీ ఇవ్వలేదని తెలియజేశారు.

దశకంధరుడు అత్యంత బలవంతుడనీ, అతడు తలచుకుంటే ఏమైనా చేయగలడనీ, కాని మంచివాడు కాబట్టి ఇంకా ఆలోచిస్తున్నాడని హెచ్చరించారు.

సీతాదేవి ఆమాటలు విన్నదో లేదోకాని వారికిచ్చిన సమాధానం మాత్రం మౌనమే!

మరికొద్ది సమయం చూచిన తరువాత అతడు ఆజ్ఞయిస్తే రాక్షసులు నిన్ను కాల్చుకుతింటారు అని భయపెట్టారు. అన్నింటికి ఆమె బదులు చెప్పలేదు. సరికదా ఆమాటల్ని తాను లక్ష్య పెడుతున్నట్లు కూడ ప్రవర్తిలేదు.

శక్తి అనేది మనోజనితమయినది.

అతడు శక్తిశాలి అయితే నేను మనోబలంతో ఆదిశక్తిని అన్నట్లుగా నిర్లక్ష్యంగా ఊరుకుందామె.

అంతా అయింతరువాత లంకావల్లభుడు కృంగిపోయినాడు ముల్లోకాలను జయించిన తాను ఒక అబల మనోబలంముందు తలవొంచవలసిరావటం అవమానకరం అనిపించింది.

అతడు చేయదగింది మరేమి కన్పించలేదు.

దేవగంధర్వ యక్షకిన్నెర మానవరాక్షసకాంతలు తన పొందుకోసం పడిగాపులు పడిచుంటారు కాని ఈమె మొండితనం అత్యంత ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

బహుశా ఈ మండోదరీ వల్లభుని ఔద్ధత్యమేమిటో ఆమెకింకా అర్థంకాలేదు పోనీ అర్థం చేసుకునేందుకు మరికొంత సమయం యిచ్చి చూద్దాం అనుకున్నాడు.

"మధురగాత్ర! మరికొంత సమయం పోయాక నేను తిరిగివస్తాను. అప్పటి కయినా నీ మనసుని సమాధాన పరుచుకో! నా అంతఃపుర కాంతగా నువ్వు అనుభ వించబోయే భోగభాగ్యాలను ఒక్కసారి ఊహించుకో! గొప్పఅవకాశాన్ని చేజార్చు కున్నావని అప్పటికయినా తెలుసుకుంటావు నేను తిరిగి వస్తాను. ఈ లోగా నువ్వు సిద్ధపడి ఉండాలి సుమా!"అని చెప్పి తిరిగిచూడకుండా వెళ్ళిపోయినాడు.

ధాత్రీపుత్రి ఇంతఃపూర్వమే ఒంచుకున్న తలఎత్తలేదు.

ఎప్పటిలాగానే రావణుడు హెచ్చరికలు వినిపించి వెళ్ళగానే అతనిపొందు అందుకోమని పోరుపెట్టడం ప్రారంభించారు రక్షణగా ఉన్న రక్కసికాంతలు తలకొక విధంగా నూరిపోయడం మొదలెట్టినారు.

వారు చేస్తున్న అసంగతమయిన ప్రసంగాలు సీతాదేవి మనోగతాలను అప్ర సన్నంగా మార్చేస్తున్నాయి.

అటువంటి సమయంలో వృద్ధనారి అయిన త్రిజట అవులించి నిద్రకాచింది.

"ఈ లంకకు చేటు దాపురించింది" అంటూ ప్రారంభించిందామె.

"ఏమయింది నీకు?" అన్నట్టుగా అందరూ ఆమె వంకకు తిరిగారు. నిద్ర మత్తు వొదిలించుకుని సరిగా కూర్చుంది వృద్ధనారీ అయిన త్రిజట. చెప్పటం ప్రారంభించింది.

తెలతెలవారుతోండగా వచ్చిన కలలు నిజమవుతాయంటారుకదా! యిప్పుడే నాకు కలలో కొన్ని విచిత్రమయిన దృశ్యాలు కనిపించినాయి. శ్రద్ధగా వినండి చెప్తాను" అందామె.

వికృత రూపిణులయిన రక్కసికాంతలు, సుందరీమణులయిన గాంధర్వ సుందరీమణులు చెవులు రిక్కించారు అనుభవమూర్తి అందరికన్నా వృద్ధ అయిన త్రిజట మాటలు విలువైనవే! ఆరంభంగా "లంకకు చేటువచ్చింది" అన్న ఆమె మాటలు జనకపుత్రి ఆసక్తిని కూడ ఆకర్షించినాయి.

రాముని ఆగమనం గురించి ఆమె ఏదయినా చెప్పవచ్చునని ఆశించిందామె ప్రజలు మాటలు వినేందుకు సంసిద్ధురాలయింది. వృక్షాలమీద శాఖాచంక్రమణ లోలు డయిన కపిరాజుకూడ త్రిజట మాటలు వినేందుకుద్యుక్తుడయి నిలిచిపోయినాడు.

"ఈ సుందరాంగి సామాన్యురాలుకాదు. వినండి. ఈ వనితావల్లభుడయిన రామచంద్రుడు నాకిప్పుడే కలలో కన్పించాడు. అతడు తెల్లని ఏనుగుమీద విచ్చే శాడు. ధవళవస్త్రాలు ధరించాడు. ఈ అందాలభామ అతని ప్రక్కనే ఉంది. అతడు విజయ విజయచిహ్నాలన్నీ ధరించివచ్చాడు, ఆదితలచుకుంటే భయమౌతోంది.

మనలంకా నగరాధ్యక్షుడయిన దశకంధరుడు రక్తమందారమాల ధరించి బలికి సిద్ధంగా ఉన్న ప్రాణిలా కలలో కన్పించాడు నాకు. ఎర్రని వస్త్రాలు కట్టుకున్నాడు. పగడాల పేరులు వేసుకున్నాడు నిరాయుధుడై నిరామయుడై దిక్కుతోచని వానిలా తిరుగుతున్నాడు.

ఈ సుందరాంగి తెల్లని ఎద్దులు పూన్చిన వాహనంమీద ఎక్కి భర్త తొడ మీద కూర్చొంది మన రాజేమో ఎర్రగన్నేరుపూలు ధరించి గాడిదలు పూన్చిన రథం ఎక్కాడు.

అంధకార వర్ణం వస్త్రాలు ధరించిన కాంత రావణుడి మెడకు ఉచ్చులుబిగించి దక్షిణ దిక్కుగా లాక్కుపోయింది.

అన్నిటికన్నా విచిత్రమేమిటంటే శ్రీరామునిదూత ఒకడు లంకానగరంలో జొరపడ్డాడు. లంకాదహనం చేశాడు. మేడలన్నీ కూలి అనుచరులంతా నశించగా రావణుడు ఒంటరివాడై మనదిశగా పయనించటం నాకు కలలో కన్పించింది" అని చెప్పింది త్రిజట. విన్నవారు విభ్రాంతులయినారు.

అంతటితో ఊరుకోలేదు త్రిజట. "లంకానగరానికి చేటు దాపురించిన సూచనలు రగ్గరపడ్డాయి" అంటూ వ్యాఖ్యానించింది అందరూ దుఃఖభారంతో నిట్టూర్చినారు.

సీతామాయిమాత్రం చాల సంతోషతరంగిత అంతరంగ అయిపోయింది. రాముడు వస్తాడు, తొడలమీద కూర్చుండబెట్టుకుని తనను తీసుకుపోతాడన్న కల కూడ ఆదీనురాలికి ఎంతో తృప్తినిచ్చింది.

కాలుతున్న లోహంమీద నీరు దిమ్మరించినట్లుగా అయింది. ఆమె దుఃఖ భారంలో కొంత అవిరిఅయింది.

త్రిజట మాటలు విని శాఖాంపాలమీద కూర్చుని ఉన్న ఆంజనేయుడు ఎంతో ఆశ్చర్యపడిపోయినాడు. ఇది శుభారంభమే! కాని ఆ విషయాన్ని ముందు చూచిన త్రిజట మాత్రం అసామాన్యురాలు" అనుకున్నాడు.

# 13

వైదేహి మనసులో పురుషోత్తముడైన రాఘవుని గురించిన జ్ఞాపకాలు ఉవ్వెత్తున పొంగినాయి. దుఃఖసాగరం తిరిగి సముద్ర కెరటంలా పొంగి వచ్చింది. నరేంద్రుడు వస్తాడన్న ఊహవల్ల కలిగిన ఆనందాన్ని దుఃఖ తరంగాలు కొట్టుకు పోయాయి.

ఆ సమయానికి జీవితేచ్ఛ పూర్తిగా అణగారిపోయింది. ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుందామె. ఆ తుది క్షణాలతో విధిసానుకూలమై పవమాన తనయుడు కొమ్మలమాటున దాగిన ఇరుగుడు వృక్షం క్రిందకే వచ్చిందామె. పైట కొంగుతో ఉరిపోసుకుని చచ్చిపోవాలనుకుంది సీత!

హనుమంతుడు అటువంటి సమయం కోసమే వేచిసూస్తున్నాడు.

రాక్షస సంహారం చేయాలని మనసు ఎంతగా తొందరించినా, ముందుగా జనకీమాతతో మాట్లాడాలన్న అభిలాషవల్ల మనసుని కట్టడి చేసుకున్నాడు. రామ స్మరణ చేస్తూ ఆత్మహత్యాప్రయత్నం ప్రారంభించిన సీత వంక జాలిగాచూచాడు.

తల్లిన చూచిన పసికందు కేరింతలు కొట్టినట్లుగా వానరుడు వృక్షశాఖలమీద నృత్యం చేశాడు ఆమె తనను నమ్ముతుందా అన్న సందేహం మనసుని తొలుస్తోంది.

చెట్టుకొమ్మల మీదినించి ఛెంగున ఆమెముందుకు దుమికాడు అంజనేయుడు.

"అమ్మా. లోకపావనీ! ఎందుకమ్మ ఈ బేలతనం ముల్లోకాలకు ఆదర్శమైన నీవు ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నావా? పునీతురాలయిన నా తల్లి ప్రాణ త్యాగం చేస్తే నావంటి బిడ్డలకు దిక్కెవరు తల్లీ!

ఆగాగు నేను శ్రీరామ దూతను. నిన్ను తీసుకుపోయేందుకు వచ్చాను. ఇంత గుజ్జురూపుడు నన్నెలా తీసుకుపోగలడని సందేహించకమ్మా! నేను సముద్రాన్ని లంఘించివచ్చాను.

సుగ్రీవుడి మంత్రిని! వానరుడను. పవమానసూతిని. నా తల్లి అంజనాదేవి! ఇప్పుడు నువ్వే నాకు అమ్మవు. తొంభయ్యారంగుళాల ఎత్తున్న శ్రీరామచంద్రుణి అతని సోదరుడైన సౌమిత్రిని ఈ భుజాలమీద మోశాను.

నిన్ను అవలీలగా సముద్రం దాటించగలను. నా తల్లీ! నీ పవిత్ర పాదాలను

ఈ బుజంమీద మోపి కూర్చో! రామ సన్నిధికి చేరుకుందాం" అంటూ వినమ్ర గాత్రుడై విన్నవించాడు.

జానకి అలవోకగా కనురెపలెత్తి బిడ్డవంక చూచుకుంది అతని వర్చస్సు విశ్వాసపాత్రత కొట్టవచ్చినట్లు కన్పించినాయి. మంచుపొరల్లా మనసులోని సందేహాలు విడిపోతున్నాయి.

అట్టి స్థితిలో రామ కథాగానం ప్రారంభించారు వాయుపుత్రుడు చేయవలసిన అభివర్ణనలనీ చేశాడు.

సీత ముఖంలో చాలకాలం తరువాత చిరునవ్వొకటి దోదాసింది. అరుణపల్లవాలవలె ఉన్న అధరాలు రవంత ఎదిగినాయి. కన్నులు దీప్తివంతాలయినాయి. ముఖకాంతి ఉజ్వలమయింది.

అంతర్యం ఆశాపూర్ణమయి పోయింది.

"కుమారా! నీ పేరేమిటమ్మా!" అని ప్రశ్నించింది జనకజాత.

"శ్రీరామ పదధ్యాయిని! శ్రీరామదూత అంటారు నన్ను" అన్నాడతడు.

"నాయనా! నీకు వేరే పేరు లేదా?" అన్నది సీత.

"పేరుతో నేమి పనేముంది తల్లీ!" కుమారా అని సంబోధించించినావు. అదే నా పేరు. లోకపావనీ! నీ పిలుపుతో నా జన్మ పావనమయిందమ్మా! నన్ను అలాగే పిలుపు" అన్నాడాంజనేయుడు. అప్పటికే అతడు పులకాంకితుడైనాడు కన్నులు చెమరించినాయి.

సీతామాతా మాతృహృదయం పొంగిపోరలింది. వాత్సల్య పరిపూర్ణమై పోయిందామె అంతర్యం.

"కుమారా! నా రాముడు నీకు కన్పించాడా! ఎలాఉన్నాడు. ఏమిచెప్పాడు. ఏమితింటున్నాడో నా రాముడు. సౌమిత్రి సుకలుదేనా? వారితో మైత్రి నీ కెలాలలభించింది?" అని అడిగిందిజానకి.

ఆశలన్నీ అణగారిపోతున్న వేళ తనబ్రతుకు మరోదారికి మళ్ళించి ఆశాపూర్ణాలోకాలకు నడిపించవచ్చినా బిడ్డ ఎదుట మనోగతాలన్నీ వెళ్ళబోసుకుందామె.

"అమ్మ! నీ రాముడు నా రాముడేతల్లీ! ఆ వినీలవపుషుడయిన మహామూర్తి అనుక్షణంనాకు కన్పిస్తునే వుంటాడు. అతడు కుశలుడే! ముల్లోకాలలో అతడే కదా శాశ్వతుడు, కాకాసురథ చెప్పాడు. నేనువస్తాను నా దగ్మపత్నిని రక్షిస్తాను అని చెప్పాడు. అయినా దిగులు మాత్ర మే తింటున్నాడు.

సౌమిత్రి సోదరక్ష్మనాకాంక్షతో కృంగిపోయి వున్నాటమ్మా" అని విన్నవించాడు అంజనేయుడు. విశ్వాస పూర్ణమయిన ఆ మాటలు సీతాదేవికి గుండెకోత పెట్టినాయి.

అంజనేయుడు గుర్తుగా తనవెంట తెచ్చిన అంగుళీయకాన్ని అందించాడు దాన్నిచూచుకొని వలవల ఏడ్చింది జానకజాత! అంజనేయుడామె కన్నీటి వెనుక సప్త సముద్రాల ఘోషను దర్శించాడు.

"అమ్మా! రాక్షస సంహారం జరిగే మంచి ముహూర్తం దగ్గరలోనే ఉంది. నిశ్చింతగా నా యీ పురంమీద కూర్చో! శ్రీరామ సన్నిధికి తీసుకుపోతాను" అని అశ్రుజలిఘటించాడు. పవనాత్మజుడు.

ఒక్క క్షణం సీతాదేవికి తన విభుని పదసన్నిధికి సత్వరమే చేరుకోవాలని అనిపించింది. అమ్మా! అని సంబోధించిన దూత అందుకు చాలినంత సమర్థుడే అనిపించింది. అటువంటి అవకాశం తిరిగిరాదు.

కాని పరాయిపురుషుడు తీసుకొన్పిన తనను తన విభుదే విడిపించుకుపోవాలి. ఈ చెర నించి రాముడే రక్షించాలి.

అలా కాక మరొకవల్ల రక్షిత అయితే రాముని కీర్తి కళంకితమవుతుంది. అతని శక్తి సంపన్నతను లోకం శంకిస్తుంది. అందునించి అతనిలో కలిసి ప్రాణవల్లభుని చేరుకోవాలన్న ఆకాంక్షను అమిది ఉంచుకెందామె.

మనోగతాలయిన కామకలు భర్త సన్నిధికోసం పరుగులు తీపినా తనను తాను నిలువరించుకుంది.

"కుమారా! ఎన్నినాళ్ళకు యింత మంచి మాటలు వినగలిగినానయ్యా ఇటువంటి మాటలు వినిపించిన నిన్ను సర్వదేవతలు చల్లగా చూస్తారు అస్తురాలయిన ఒక స్త్రీ మనోవేదన తీరిపోయే విధంగా మంచి మాటలు మాట్లాడినందుకు నీవు చిరంజీవి అవుతావు. నా రాముడు నీ రాముడే నంటున్నావుకదా!

అభిరాముడు పరంధాముడయ్యా!

అతడు ముల్లోకాలలో ఎదురులేని విలుకాడయ్యా! అతడే రావాలి. నాకు యీ మనస్తాపాన్ని కలిగించిన రాక్షసరాజును జయించాలి. మగపొడిమి నిరూపించు కుని నా చేయి అందుకుని వెంటతీసుకుపోవాలి.

అందుకా నేను యిక్కడే ఉంటా.

నా వల్లభుడైన కోదండపాణి నా కోసం వచ్చిందాకా ఒక్కడే అతని కోసం ఎదురు తెన్నులు చూస్తుంటాను. నీవు తక్షణమే తిరిగి వెళ్ళు. ఈ వార్త రామునితో చెప్పు.

అతడు తక్షణమే బయలుదేరి వస్తాడు" అంటూ చూడామణిని అందిలిచిందామె.

హనుమ ఆ చూడామణిని అందుకున్నాడు. వ్రేలికి తొడిగి దాన్ని పదిలంగా భద్రపరచినాడు. ఆ వానరుని అంతర్యంలోల ప్రధానమయిన ఆశయం నెరవేరింది.

కాని యింకా మిగిలిపోయిన కోరికలు కొన్ని ఉన్నాయి. లంకా నగరంలోకి తాను రాగలగటం ఒక సంచలనాత్మకమయిన అంశంగా నిలిచిపోవాలన్న ప్రధాన అకాంక్ష అలానే నిలిచి ఉంది. అందుకుతాను చేయవలసిందేమిటో వానరునికి తెలుసు. పర భార్యను అపహరించి తెచ్చిన వానికిది శిక్ష అన్న రీతిలో అది గుణపాఠంలా భావితరాలు స్మరించాలి.

అందునించి వెనువెంటనే వీడ్కోలు తీసుకుందుకు ఉద్యుక్తుడయినాడు.

"అమ్మా! లోకపావనీ! నాకు శలవు దయచేయి తల్లీ! ఈ చోటున ఇంకా నేను నెరవేర్చవలసిన సంగతాలు కొన్ని మిగిలి ఉన్నాయి. కోదండధారి నీకోసం తప్పక వస్తాడు. నీవు జనకరాజర్షిగా రాలపట్టివి. దశరథుని వంటి మహా మహుని యింటి కోడలివి. రాముని యిల్లాలివి. హంసతూలికాతల్పాలపై శయనించవలసిన దానవు.

ఇక్కడ భూమాత ఒడిలో శయనించినావు. రాముడు పగతీర్చుకుందుకై రాగానే ఇక్కడి చీకటులు తొలగిపోతాయి. ఈ నగరం నేల మట్టమవుతుంది. ఈ రాక్షసపాళి సమూలంగా విధ్వంసమవుతుంది.

ఈలోగా నేను కొట్టిపాటి కాలక్షేపంచేసి తిరిగి వెళ్ళిపోతాను తల్లీ!" అంటూ అంజలి ఘటించాడు హనుమ" అలాగే అంటూ ఆశీర్వదించింది వైదేహి.

తల్లి అనుజ్ఞతో అతడు నూతనోత్సాహి అయినాడు. శరీరం మేరువులా పొంగింది. ఒక్క ఉదుటున నేలమీదినించి గగనతలానికి లంఘించాడు.

విదేహరాజతనూజ ముఖం మంచులో తడిసిన పద్మంలా వికసితమయింది. కడిగిన ముత్యాల్లా పలువరుస కన్పించేలా మందహాసంచేసి తలదించు కుందామె.

చెంపలు తిరిగి పాండుర వర్ణంగా మారిపోయి పద్మరాగ వర్ణాన్ని సంతరించు కున్నాయి. ముఖకాంతి ఉజ్వలమైంది. కన్నులు కెందామర పత్రాలవలె తరళించి నాయి.

చిన్నగా నడుచుకుంటూ రాక్షసకాంతల మధ్యకు వెళ్ళి కూర్చుందామె. మనసులో మనోవల్లభుని జ్ఞాపకాలు దోబూచులాడగా అంతర్లోకాలలో మునిగి మౌన మూర్తి అయింది.

రాక్షస కాంతలు ఆమె గురించి అంతగా పట్టించుకోలేక పోయినారు. అప్పటికే అశోక వనంలో నలుమూలల చెలరేగిన కోలాహలం గురించి ఆలోచించ సాగినారు

ఇదంతా విందు చేశాననేకదా నీ సందేహం!

శ్రీ రాముడు నా దేవుడు. సీతమ్మ నా కన్న తల్లి! నాతల్లిని చెరపట్టావు కాబట్టి నీ చరిత్ర సమాప్తం కావాలి. ఆ ఘట్టంలో తొలి అధ్యాయమే ఇప్పుడు నేను చేసిన అల్లరి!

అర్థమైందా రావణా! ఇక నిన్ను వధించి లంకా నగరాన్ని నేలమట్టం చేయటమే తరువాయి ఘటం.

"ఈ వాస్తవాన్ని తెలుసుకో!" అంటూ నిర్భయుడై గుండెల మీద గుద్దినట్టుగా బదులు చెప్పాడు కపిరాజు రాజు.

"ఓరి వాచాలుడా! ఒక మానవుడట! ఆ మానవునికి ఈ వానరుడు భక్తుడట. ఎంత హాస్యాస్పదమైన ప్రల్లదనాలు పలుకుతున్నావురా? మీరిద్దరూ కలిసి నన్ను హతమార్చుతారా! అది బ్రహ్మావర్త, ఆర్యావర్త, దక్షిణవర్తాలలో ఎవరికీ చేతకాలేదు అల్పులు మీ రెంత!

వీరులారా! ఈ వాచాలుణ్ణి వికృతరూపుణ్ణి చేసి వదిలిపెట్టండి. వెళ్ళి ఆ అల్పమానవుడితో మొదపెట్టుకునేట్టుగా చేయండి అంటూ హుంకరించాడు లంకాపతి.

వెంటనే వీరులు హనుమను చుట్టుముట్టినారు. అతని వాలానికి వస్త్రాలను చుట్టి తైల పరిషేచనం చేశారు నిప్పు అంటించారు. వీధులన్నీ తిప్పి ఆటలు పట్టించటం ప్రారంభించారు.

అతడు బ్రహ్మాస్త్ర బంధితుడై ఉన్నాడని ఏమీ చేయలేదని వారి అంధవిశ్వాసం పైకట్టు పడగానే బ్రహ్మాస్త్ర బంధాలు విడిపోయినాయి. కాని హనుమయుక్తిగా ఆ సంగతి పైకి తెలియనీయలేదు.

నగరం మధ్యకు వచ్చాక వాలం మీద మంటలు బాగా అంటుకున్నాయి. గణ గణ మండుతున్నాయి.

అక్కడకు చేరుకోగానే హనుమ శరీరాన్ని పెంగించి సాధారణ రజ్జువుల్ని త్రెంచేశాడు హనుమ. ఒక మారు సింహనాదం చేసి గగన తలానికి లేచాడు.

అప్పటికే రాక్షసులు చెప్పుకుంటున్న వార్తలు విన్న వైదేహి నా బిడ్డ సామాన్యుడు కాడు అని సంభావించింది ఎవరి అనుమతి లేకుండ లంకలోకి రాగలిగాడు. అశోకవనాన్ని విధ్వంసం చేశాడు. రాక్షస వీరుల్ని సంహరించాడు. అంగుళీ యిచ్చాడు. చూడామణి గైకొన్నాడు. ఇప్పుడు రావణుని ముఖాముఖి ఎదిరించే లంకకే నిప్పు పెట్టాడు. నాబిడ్డ వానరమాత్రుడే కాదు సరిష్టుడే! అనుకుందామె.

అప్పటికే రాక్షస సమూహాలు కలగుండు పడినాయి. నగర మంతా మంటల్లో కాలిపోతోంది. హాహాకారాలు చెలరేగినాయి ఎన్నడు ఎరుగని కల్లోలం సంప్రాప్తమయింది లంకా వాసులకు.

గగన తలం మీదనించి సింహనాదం చేశాడు హనుమ!

ఓరీరావణా! లంకకు చేటువచ్చింది చూచావుగా! ఈ మంటలు నీ మరణంతో కాని చల్లారవు అంటూ ఉత్తరదిక్కుగా పయనమైనాడు కపి శేఖుడు.

రావణుడుపైకి హుంకరించినాడే కాని లోలోన ఆలోచనలు ఆరంభమైనాయి.

# 14

"అడుగడుగో మనవాయు సుతుడు" అన్నాడు బాలుడు.

"అమిత వేగంతో వస్తునాడు" అన్నాడు గవణుడు.

"ఆవేగానికి ముక్కలు తెగిరాలున్నాయి" అన్నాడు గవాక్షుడు.

అంజనా సూతి ఆర్భాటం చూస్తుంటే రామకార్యం సాధించినట్లే అని పిస్తోంది" అన్నాడు అందరి కన్నా వయోవృద్ధుడైన జాంబవంతుడు.

వారంతా అప్పటివరకూ మహేంద్ర గిరిమీద అంజనాగర్భసంభూతుని కోసం ఎదురతెన్నులు చూస్తున్నారు. వారలా అనుకుంటూ ఉండగానే అమిత వేగంతో వచ్చి వారి మధ్య వాలాడు ఆంజనేయుడు ఆ అదురుపాటుకు మహేంద్ర గిరి శిఖరాలు దొర్లిపడినాయి.

గిరి ప్రాంత భూములన్నీ ప్రకంపించినాయి.

వొస్తూనే వార్తలన్నీ చదివేశాడాంజనేయుడు. అది విని కపిశ్రేణి కేరింతలు కొట్టటం ప్రారంభించింది.

సీతమ్మ దొరికింది. రామయ్య కష్టాలు తీరేరినాయి. ఈ వార్త వెనువెంటనే రాఘవుని కందించాలి. వారు చెట్లు విరుస్తూ, కొమ్మలు త్రుంచుతూ, కొండ కొమ్మలను దొర్లిస్తూ అమితోత్సాహంతో తిరుగు ప్రయాణమయినారు.

మార్గమధ్యంలో ఎదురైన వారందరినీ ఆటలు పట్టించటం ప్రారంభించాడు. మధువనం చేరుకున్న తరువాత అప్పటికే తిరిగివచ్చిన కపి సమూహాలు పండుగ చేసుకొన్నాయి. సంతోషాతి రేకంతో వనాన్ని విధ్వసం చేయటం ప్రారంభించినాయి.

ఈ వార్త విన్న సుగ్రీవుడు ముందు మండిపడ్డాడు. మధువనంలో సురవిస్తారంగా లభ్యమైతుంది. అది ఆతనికి ప్రీతిపాత్రమయిన వనం. ఎంత వానరులైనా అలా చేయటం అతనికి కోపాన్ని కలిగించింది.

కాని రామకార్యం సాధించారని విన్న తరువాత మనసు కుదుటపడింది. ఆ సంతోషంలో తన మామగారయిన దధిముఖుణ్ణి ఒళ్ళంతా చీరి గాయాలు చేసిన సంగతి కూడ క్షమించేశాడు వానరరాజు సుగ్రీవుడు. అప్పటికే కపి సేన కేరింతాలు కొడుతూ, గంతులువేస్తూ, చెట్ల కొమ్మలు విరుస్తూ, పెదలలు విరుస్తూ, కను రెప్పలు అప్పగిస్తూ, భూమిని కుళ్ళగిస్తూ, పుట్టల్ని మట్టం చేస్తూ హద్దులు మీరిన సంతోషంతో ఉంది.

సుగ్రీవుడు వారిని వారించలేదు సరికదా! వారితోపాటుగా కలిసిపోయి నాట్యం చేయటం ప్రారంభించాడు. ఒక్కొక్కరూ ఎదురైన కపికాంతల్ని ఎత్తి ముద్దాడుతున్నారు. కపికాంతలు తమ పురుషుల మధువు రుచి మరచి పోయేందుకు అధర మధువులందిస్తున్నారు.

అందరూ కలిసి జనకాత్మజా వియోగదుఃఖ భారంతో కృంగిపోయి వున్న రాఘవుని సన్నిధికి చేరుకున్నారు.

"వెళ్ళిన పని ఏమయింది?" అని అడిగాడు దాశరథి.

"మన హనుమ సీతమ్మను చూచి వచ్చాడు. అమ్మను చూచి రమ్మంటే లంకా నగరాన్ని కాల్చి మరీవచ్చాడు" అంటూ సంగతాన్ని వివరించినాడు కిష్కింధా పురపాలకుడయిన సుగ్రీవుడు.

ఆ వార్త వినగానే రాఘవుని మనోగతాలు ఉవ్వెత్తున పొంగినాయి. అంతర్యం కల్లోల తరంగిణి అయిపోయింది. రాజీవ నేత్రాలు అశ్రుపరిపూర్ణ కలశాల వలె అయినాయి.

హనుమా! ప్రియదర్శనా! ఇటురావయ్యా!" అంటూ హనుమత్స్వామిని బిట్టున కౌగలించుకుని భోరున ఏడ్చేశాడు రాఘవుడు. లక్ష్మణుడు అన్నను ఓదార్చేందుకయినా శక్తిచాలని వాడయినాడు

సీతను చూచిన గౌతముని కన్నుల్ని ముద్దాడినాడు అయోధ్యరాముడు.

"రామయ్యతండ్రీ! నా తల్లి సీతమ్మ లంకలో రాకాసుల మధ్య ఒంటరిగా ఉందయ్యా! నువ్వు కోదండం సారించాలి. వింటనారి సంధించాలి. ఆ కర్ణాంతమూ ఆకర్షించి ఆ రావణునిమీద బాణం ప్రయోగించాలి. దుష్టసంహారం కొనసాగించాలయ్యా !

నా కన్నుల్ని ముద్దాడిన నీ పెదవుల సాక్షిగా, నా గుండె గుహలో ఉన్న నీ పాదాల సాక్షిగా, బ్రాహ్మీమయమైన నీరూపు సాక్షిగా, నీ అజానుబాహువుల సాక్షిగా, పద్మరేఖలున్న నీ పాదాల సాక్షిగా, చక్రరేఖలున్న నీ అరచేతులసాక్షిగా నామాత సీత పునీత! ఆమె లోకపావని! లోక పూజిత!

నా తల్లిని చూచేందుకు రెండు కన్నులు చాలలేదు. ఇదిగో పవిత్ర చూడామణిని నీ కందీయమంది

నీ రాకకోసం చూపులు జ్యోతుల్లా చేసుకుని, కంటివాకిట చూపుల దీపాలు వెలిగించి ఎదురుచూస్తానంది.

ఓ పరంధామా! పురషపుంగవా! నీ ఆడదాన్ని నువ్వేకాపాడుకోవాలి! ఆమెకు తిండిలేదు. నిద్రలేదు. మనశ్శాంతిలేదు. యింకా ఎక్కువకాలం బ్రతుకుతుందన్న ఆశ కూడలేదు.

పెళ్ళు! వెళ్ళి అమ్మను తీసుకువచ్చి నీ బిడ్డలయిన మమ్మందరినీ ఓదార్చు! ఉత్తిష్ఠ రాఘవా! ఉపక్రమ!!" అంటూ ఉద్బోధించి నాడాంజనేయుడు.

రాఘవుడు హనుమంతుని చేయివదలి కోదండంమీద చేయిపెట్టినాడు. ఆశీర్వదించే హస్తాన్ని బాణంతో పట్టాడు. అతని పద్మపత్ర నేత్రాలు ధేగచూపుల్లాగున అయినాయి.

విసీలవపుష్పము ఉప్పొంగింది.

"సుగ్రీవా! రణభేరి మ్రోగించు" అంటూ సింహనాదం చేశాడు రాముడు. సుగ్రీవుడు ఉత్సాహితుడై గగనతలానికిలేచి క్రిందపడ్డాడు

"కపిశేఖరులారా! ఆయుధాలు ధరించండి రణభేరులు మ్రోగించండి. రామ కార్యనిర్వహణలో సర్వసుఖాలను త్యాగంచేయండి. నిర్విఘ్నంగా రామకార్యం నిర్వహించిన తరువాతనే నిద్రాహారాలు అని ఉద్యమించండి.

రావణుని వధించి లంకను మట్టుపెట్టిన తరువాతనే ఆయుధాలు దింపుతామని ప్రతిజ్ఞ చేయండి.

ఇది సుగ్రీవాజ్ఞ!" అంటూ స్వరపేటిక సెకలించి పెనురంకె వేశాడు సుగ్రీవుడు. తక్షణమే కపులు సమీపవృక్షాలన్నింటినీ విరచి కొండలను, కొమ్మలను ఆయుధాలుగా ధరించారు. మరికొందరు పెద్ద పెద్ద బండల్ని ఎత్తుకున్నారు.

వాడి అయిన కత్తుల్లా ఉన్న నఖాలకు, దంతాలకు మరింత వాడి చేకూర్చు కున్నాడు. రావణ మారణకాండ గురించి కృతనిశ్చయులై ఉల్లసితంగా సాగరతీరం చేరుకుంది కపివాహిని.

ఉత్తుంగ తరంగాలతో, గిరిశిఖరాల్లా పేరుకున్న ఫేన-తో రాముని శరీరంలా వినీల వర్ణాన్ని సంతరించుకున్న సముద్రం అహరహ ఘోషతో సందడిస్తోంది

దాన్ని కపులంతా ఎలా తరించాలి. రామలక్ష్మణుల సందిగ్ధంలో పడిపోయి నారు. సుగ్రీవుడు ఆలోచనాముద్రుడైనాడు. ఆటవిడుపుగా కపిసేనకు విశ్రాంతి ఇవ్వటం జరిగింది. కాని వారంతా యుద్ధకండూతి తొందరించగా అశాంతితో ఎదురు చూడసాగారు.

× × × ×

లంకా నగరంలో రావణుడు సభతీర్చాడు. అప్పటికే లంకలో కొన్ని వార్తలు పొక్కాయి. కొన్నివార్తలు అస్పష్టంగా ఉన్నాయి. అన్నీ కలిసికలగాపులగమై నాయి. అసలు సంగతులేమిటో అడుగున పడినాయి.

అంతనించి లంకాపతి సభతీర్చాడనగానే అందరూ ఆ వంకకు పరుగులు తీశారు. అంతఃపురకాంత ఐన ధాన్యమాలి రావణుని యుద్ధోన్ముఖంగా ప్రబోధించా లని ప్రయత్నించింది.

ఆమె గంధర్వకాంత.

అత్యంత బలవంతురాలు.

రావణుని ఏలుబడి చాలమంది వీరవనితలున్నారు వారిలో కొందరికి అతడు బాధ్యతాయుతమైన పదవులు అనేకం ప్రసాదించినాడు. తనసహోదరి అయిన శూర్పనఖ పదునాలుగువేలమంది సేనావాహినికి అధ్యక్షురాలుగా గౌతమీనదీ తీరాన జనస్థానంలో రాజప్రతినిధిగా ఉండేది.

తాటకవంటి వీరకాంతలు దూరప్రాంతాలలో రావణుని ఉద్యమానికి ప్రతినిధులుగా రాచకార్యాలు నిర్వహించేవారు సురస, సురమవంటివాడు సింహికతో కలిసి సముద్ర సరిహద్దులమీద బాధ్యతలు నిర్వహించేవారు. లంఖిని అపారశక్తిసంపన్నత కలిగిన వీరవనిత! ఆమె యావత్తు లంకానగరానికి రక్షకురాలిగా చాల బాధ్యతాయుతమైన పదవిలో ఉండేది. త్రిజట విద్యుజ్జిహ్వ అశోకవనంలో బాధ్యతలు నిర్వహి. చేవారు.

అలా వీరవనితలకు రావణరాజ్యంలో అత్యంత బాధ్యతాయుతమైన పదవులు అప్పగించబడినాయి. అటువంటి వారిలో ధాన్యమాలి ఒకర్తి. ఆమె పంటలు పండించటంలో అత్యంత నిపుణ!

దిగుబడిఅయిన పంటల్ని నిలువవుంచి అవుసరాన్ని అనుసరించి వాటిని పంపిణీ చేయటం, ఆహారపు నిల్వలకు — ఆహారపు అవసరాలకు మధ్య నిష్పత్తిని సలఅయిన స్థాయిలో కాపాడటం ఆమె నిర్వర్తించవలసిన కార్యకలాపాలు!

శూర్పనఖ భర్తఅయిన గంధర్వుడు రావణుడు గందర్వులమీద దాడిచేసిన సందర్భంగా మరణించాడు. ఆమె భర్తృవిహీన అయింది. సరిగా అ సమయంలోనే గందర్వకన్య అయిన ధాన్యమాలి తాలూకు బంధువులందరూ చనిపోయినారు. తండ్రి తల్లి సహోదరులు అందరూ విగతజీవులైనారు.

సోదరి భర్తను రక్షించమని వేశుకుంది. కాని అది వీరధర్మంకాదని బావమరదిని రావణుడు నిర్దాక్షిణ్యంగా చంపేశాడు చెల్లిఅయిన శూర్పనఖకు మాత్రం పెద్ద పదవియిచ్చి కొంత సైన్యం అప్పగించి జనస్థానం పంపేశాడు.

రావణ సోదరి అయిన శూర్పనఖ భర్త ఐన గంధర్వునితో కలిసి జీవించిన కాలంలో గంధర్వకాంత ధాన్యమాలి ఆమె కుమారి స్నేహితురాలు అయింది.

గంధర్వులతో యుద్ధం జరుగుతున్న సమయంలో ఆమె రావణుని శక్తి సంపన్నతనూ పరాక్రమాన్నిచూచి అతనిమీద మరులు పెంచుకొంది. రావణుడామెను ప్రేమించలేదు ఆమె సానుకూలతనీ శక్తి సంపన్నతనీ గుర్తించాడు.

అంతఃపురంలో చేర్చుకున్నాడు. అత్యంత కీలకమైన బాధ్యతలు అప్పగించాడు మనసు చెదిరినవేళ ఆమె సలహాలను పాటించాడు సీతను తనకోరిక తీర్చమని అడుగుతున్న వేళ ఆమె కూడ రావణునితో పాటుగా ఉండేది.

అందవిహీనఅయిన వైదేహి నీ శరీర తాపాన్ని చల్లార్చలేదు. అందుకుతగిన శక్తిశాలిని నేనే! రావణా! కన్యగాఉండిపోయి ఇంతకాలంనించి నీ పొందుకోసం నేను ఎదురుచూస్తున్నాను. నువ్వు నన్ను తృణీకరించి పోతున్నావు.

నిన్ను తృణీకరించిన వారికోసం పరితపిస్తున్నావు. సీత నీ కేందుకు నీ శరీర తాపాన్ని చల్లార్చాలని కొన్ని శతాబ్దాలుగా ఎదురుచూస్తున్న నేనున్నాను! రావయ్యా!" అంటూ ఆహ్వానించింది. ధాన్యమాలి! రావణుని మనోగతం ఏమిటో ఎవ్వరికి తెలయదు.

ఆమె మాటలకు కృతజ్ఞతాపూర్వకంగా నవ్వాడు. "సరే" అని మాత్రం అనలేదు. తన పరీరతాపాన్ని చల్లార్చుకుందుకు ఆమె శరీరాన్ని తూలికగా వాడుకోలేదు.

"ధాన్యమాలీ! నీవు సంపూర్ణమయిన స్థాయిలో నా విశ్వాసాన్ని చూరగొన్నావు. నీకేదికావాలన్నా ఇవ్వగలను. కాని నాకౌగిలిలో మాత్రం నీకు ఏకాంతాన్ని ప్రసాదించలేను" అని బదులు చెప్పాడప్పుడు.

అలాంటి ధాన్యమాలి ఆ సందర్భంలో విరక్తిగ నవ్వుకుంది. ఈ జన్మకు అటువంటి అవకాశం ఎప్పుడయినా వస్తుందా అని ఆలోచిస్తు ఊరుకుంటుంది. రావణుడు అత్యంత ఆదరంతో చూస్తాడు. ఎన్నో బాధ్యతాయుతమైన పదవులు ఇస్తాడు. ఎంతో విశ్వాస పూర్ణంగా ప్రవర్తిస్తాడు. ఒక్కసారి తన ఒడిలో ఏకాంతాన్ని మాత్రం ఇవ్వడు.

అతడు ఎందరో సుందరీమణుల్ని ముల్లోకాలనించి అంతఃపురంలో పెట్టి అనుభవించాడు. తాను కావాలని కోరినా తనవంక ఆ దృష్టితో చూడడు. తాను ప్రేమించిన పురుషుని సన్నిధిలోనే అతని పొందు లేకుండానే అత్యంత దురదృష్టకరమైన జీవితాన్ని అనుభవిస్తోంది ధాన్యమాలి!

ఆమె వీరకాంత! అందునించి ఒకవానరుడు చేసిన ఆగడాలకు ప్రతీకారం తీర్చాలని నదోృధించింది ఇప్పుడు రామలక్ష్మణులు కపిసేనలతో వచ్చి సముద్ర తీరాన విడిది చేశారని వినగానే యుద్ధభేరులు మ్రోగించాలంది.

వారికి బాగా బుద్ధిచెప్పి రావణ బౌద్ధత్యాన్ని మరొకమారు నిరూపించాలని కోరింది.

రావణుని యుద్ధోన్ముఖంగా ప్రేరేపించింది. ఆమె ఏది మాట్లాడినా రావణుని గుండెల్లో నాటుకుంది.

ప్రహస్తుడు, సుమాలి, జంబుమాల, యజ్ఞశత్రువు, శోణితాక్షుడు భూపకర్ణుడు, ధుర్ధరుడు వంటివారు సభలో తర్జనభర్జనలు చేశారు. పదేపదే చర్చించారు.

వారందరూ కలిసి ఒక తీర్మానం చేశారు. "రాఘవుని అర్ధాంగిని అపహరించి తీసుకురావటం ఔచిత్యంకాదు. రాఘవుడు చాలగొప్ప రాజనీతిని, శక్తిసంపన్నతని ప్రదర్శిస్తున్నాడు.

దండకలో రాక్షస వీరుల్ని ఊచకోత కోసింది కాక సరిహద్దు వీరులయిన కపి శ్రేణితో అగ్నిసాక్షిగా మైత్రి సంపాదించాడు. అతడు పంపిన ఒక దూతను ఎవరూ ఏమిచేయలేక పోయినారు.

ఇప్పుడొకడు అంతటి శక్తి వంతుల్ని అసంఖ్యాకంగా వెంట పెట్టుకుని వచ్చి సముద్రతీరాన రణభేరి మ్రోగిస్తున్నాడు.

ఇది జాతి గౌరవం కోసమో మరొక రాజకీయ కారణం కోసమో తల ఎత్తిన సంఘర్షణ కాదు. కేవలం ఒక ఆడదాని కోసం వచ్చిన తగాద ఇది అందునించి రావణా! రాజీపడటం మంచిదయ్యా!" అని ఉద్బోధించారు మంత్రి మండలి యావత్తూ కలిసి.

కాని రావణునికి ధ్యానమాలి అన్నమాటలే చెవుల్లో మార్మోగుతున్నాయి. "లంకేశ్వరా! నీవు ముల్లోకాలను జయించిన మహా పురుషుడవు. నీ మీదికి ఒక మానవుడు కవులతో కలిసి ఎత్తిరావటం ఏమిటి? నీ ఔద్ధత్యన్ని మరొకమారు నిరూపించుకునే మంచి అవకాశమిది. ఆయుధాలందుకో! యుద్ధరంగంలో మరొక మారు నిన్నందు కోవాలని చాల కోరిగా ఉందయ్యా! ఆ కోరికను నిర్లక్ష్యం చేశావు. ఈ కోరికైనా తీర్చు" అన్నదామె.

ఆ మాటలు రావణుని మనసంతా ఆక్రమించినాయి.

ఐనా ఒక నరుడు వానరులతో కలిసి తన మీదికి రావటం ఏమిటి? ఒకసారి బాగాబుద్ధి చెప్పాలి లేకపోతే ముల్లోకాలలో నగుబాటు అధికమవుతుంది కదా అని ఆలోచించాడు లంకాపతి.

అందువించి మంత్రుని మాటలను తృణీకరించినాడు.

సహోదరుడైన విభీషణుడు ఎంతగానో చెప్పి చూచాడు.

"సోదరా! ఎందరూ సుందరీ మణులు నీ కోసం పడికాపులు పడి ఉండగా పరికాంతా వ్యామోహంలో పడవలసిన అవసరం నీ కేమిటయ్యా! ఆమె నెందుకు తీసుకువచ్చావు. ఇప్పుడైనా తిరిగి ఆమెను రాఘవేంద్రునికి అప్పగించు" అన్నాడు విభీషణుడు.

"ధాన్యమాలి ఒక్కర్తి మాత్రమే నా మనసెరిగి మాటాడగలదు సోదరులు మంత్రులు నా మనసు గుర్తించలేదు" అని ఆలోచించినాడు రాక్షసరాజు వారి మాట లన్నింటిని తిరస్కరించినాడు.

వెనువెంటనే తిరస్కార పూర్వకంగా విభీషణుడు వెళ్ళిపోయినాడు. అతడు రాఘవుని ఆశ్రయించేందుకు పోతున్నాడని వార్త లందాయి.

లంకేశ్వరుడు అంతఃపురంలోని వెళ్ళిపోయాడు.

మండోదరి కన్పిస్తుందేమో అని రవంత సేపు ఎదురు తెన్నులు చూచినాడు. ఈలోగా ధాన్యమాలి కన్పించింది.

"చక్రవర్తీ! నీ వేమి ఆలోచిస్తున్నావో కదా! ఆనాడు ఒక వానరుడు వల్ల నీ బలదర్పాలను, నగరంలో గుట్టుమట్టులను చూచి వెళ్ళాడు. ఈతడు ఈ నగర వాసి నీ సహోదరుడు ఐన విభీషణుడు వెళ్ళాడు. నీ గురించి అంతా దాశరధికి తెలిసి పోతోంది.

"మూషికాలు కలుగు త్రవ్వి భూమిని గుల్లపరచినట్లుగా లంకలో కొన్ని అవాంఛితాలైన సంఘటనలు జరుగుతున్నాయి. రాముడే తెలివయినవాడా? నీవు కూడ రవంత రాజనీతి ప్రదర్శించాలి సుమా!" అంటూ హెచ్చరించింది ధాన్యమాలి.

ప్రశ్నార్థకంగా బొమముడిచి ధాన్యమాలి వంక చూచినాడు లంకేశ్వరుడు ఆమె మందహాసం చేసింది.

# 15

సుగ్రీవుడు మెదరిక్కించాడు. కనురెప్పలు అప్పళించి చూచిచాడు. అతని మనోగతం మండుతున్న నెగడులా ఐంది. శుక సందేశం విన్న తరువాత అతని ఆత్మగౌరవం విఘాతమైంది.

"ఏమిటో! రావణుడు చాల గొప్ప చక్రవర్తి అనుకున్నాము. ఇటువంటి రాచకం ప్రారంభించినాడా! అగ్నిసాక్షిగా మైత్రి పాటించిన దశరథాత్మకుడు నా ప్రాణ సమానుడు. అతడిని నేను మోసగించాలా? అలా చేస్తానని రావణుడు ఎలా ఊహించాడు?

సుగ్రీవుడంటే మిత్రద్రోహి అనుకున్నాడు కాబోలు! ఇది గొప్ప అప జయమని చెప్పండి. అగ్నిసాక్షిగా చేసిన మైత్రిపథం నించి ఒక్క అడుగడునా నేను ప్రక్కకు తొలగే అవకాశం లేదని అతనికి విశదపరచంగా అపార్థం తొలగించుకోమనండి.

అతని సహోదరుడైన విభీషణుడు వచ్చి రాముని శరణమంటి లేదు అలాగే రావణుడుకూడ వచ్చి పాదాక్రాంతుడైతే కరుణాసముద్రుడైన రాఘవేంద్రుడు అభయమిచ్చి కాపాడుతాడు.

అలాకాక యుద్ధమే అని వార్యమైతే జరిగే దేమిటో తెలుసా? రామబాణం లంకానగరం గుండెల్లో గ్రుచ్చుకుంటుంది రాముడు లేనికోటున కవులెవ్వరూ ఉండరు. రామునికి కోపం వస్తే భూమి ప్రకంపిత మవుతుంది. అతడు కోదండం ఆ కర్ణాంతం ఆకర్షించి బాణం విడిచిపెట్టాడో ముక్కలు తెగిపడతాయి. సముద్రాలు యింకుతాయి.

ఆనాడు తానొక్కడుగా నిలిచి పదునాల్గువేల మంది ఖరదూషణల్ని వధించాడు జ్ఞాపకం లేదా!

అరణ్యవాస కాలంలో రాఘవేంద్రుడెందరు రాక్షసుల్ని వధించాడో ఒక్కసారి స్మరించుకోమని మీ రాజుకి చెప్పండి రాక్షసజాతిని నిర్మూలించేందుకే రాఘవుడు పుట్టాడు.

ఆ కార్యం రావణ సంహారంతో కాని ఫలించదు.

అందునించి రాముడు విల్లు ఎక్కుపెట్టి ఉంచాడని అతన్ని హెచ్చరించండి. ఇంక నా సంగతి అంటారా?

సుగ్రీవుడు మంచి మిత్రుడు. మిత్ర ద్రోహికాదు. ఇటువంటి కుతంత్రాలు యిక ఫలించవు. వెళ్ళండి" అంటూ కసరికొట్టాడు సుగ్రీవుడు. అతని మాటలు విని శుకుడు నిరాశోపహతుడైనాడు. తన రాయబారం ఫలించనందుకు ఉగులు పడ్డాడు. ప్రథమ పర్యాయం విరోధి కూటమిలోంచి వచ్చిన అతణ్ణి వధించాలని కపులు అభిలషించారు. సుగ్రీవుడు వారిని వారించాడు.

"చిలుక ఉపదేశం సక్రమంగా ముగియనివ్వండి.

లంకానాథుడు మనసు మార్చుకుంనేందుకిది చివరి అవకాశం. ఈ అవకాశం లేకుండాచేసి అతని అదృష్టాన్ని తుడిచిపెట్టకండి" అంటూ తన వారందరిని వారిం చాడు సుగ్రీవుడు.

శుకుడు చీకటి తారాడుతున్న ముఖముద్రతో తిరుగు ప్రయాణమైనాడు. అక్కడి సేనా వాహినులలో పొంగిపొరలుతున్న ఉత్సాహశక్తి చూచి అతడు అప్రతిభుడైనాడు. శ్రీరాముని కోదండం చూడగానే అతని గుండెలు దడదడలాడి నాయి. లక్ష్మణుని తేజస్సు చూచి మహా సర్పాన్ని చూచిన వానిలా ఉలికి పడ్డాడు శుకుడు.

లంకానగరం చేరుకుని రావణునితో ఈ సంగతులన్నీ వివరించి యుద్ధ ప్రయత్నం మానుకోమని సలహా ఇవ్వాలనుకున్నాడు. అతడు తిరుగు ప్రయాణా మయినాడు.

సుగ్రీవుని హృదయానందకరమైన ప్రవర్తన అతని వినిర్మలమనోవృత్తి కలిగి సీతా వల్లభుడు సంతోషంతో ఉప్పొంగి పోయినాడు. నేరుగా వచ్చి కపిరాజును కౌగలించుకున్నాడు.

"సుగ్రీవా! మైత్రికి నీవు సరి అయిన నిర్వచనం ప్రవచించి నావయా! సాధు! జయాపజయాలు దైవానికి అధీనమయి ఉంటాయి. కాని మానవుని మనో వృత్తి పవిత్రంగా ఉంచుకోవటం అతని చేతులోనే ఉంది. బుద్ధిశాలి ఐన మానవుడు సుఖ జీవనం కోసం సమాజాన్ని నిర్మించుకున్నాడు సమాజం వ్యక్తులకు భద్రత కల్పించే అవకాశమిది. ఈ అవకాశాన్ని చేజార్చుకోకుండా ఉండేందుకు అతడు సామాజిక న్యాయ సూత్రాలను అనుసరించి నిబద్ధుడయి జీవించాలి. సమాజంలోని దుష్టశక్తుల్ని చీల్చి చెండాడి సర్వజనుల శ్రేయఃకామనకై బద్ధ కంకణుడు కావాలి. అలా నిలిచిన వాడే మనిషి!

సమాజంలోని ఒక వ్యక్తిగా సామాజిక ధర్మాలకు నిబద్ధుడయి ఉండాలి.

ధర్మాన్ని అతడు పరిరక్షించాలి. అప్పుడా ధర్మమే అతన్ని రక్షిస్తుంది. ఈ ప్రవృత్తితో సందర్శిస్తే నీవు పరమపావనుడవయినావు.

మహనీయుడవైనావు. ధర్మానికి త్రాతవైనావు. మిత్రునికి అగ్నిసాక్షిగా యిచ్చిన మాట నిలుపుకోవటానికి స్వార్థాన్ని జయించినావు. ధర్మానికి బద్ధుడవై లోకపూజితుడవయినావోయి సుగ్రీవా!

ఆ పన్నుడయిన ఈ రామునికి ఆప్తమిత్రుడయి నిలిచినావు ఎంతటి వారి కయినా ఆ పన్నులయిన దశలో మిత్రుని అవసరం ఏమిటో లోకానికి చూపించావు. ఆ విధంగా కృతార్థుడవయినావు చరితార్థుడవయినావు. కష్టభూయిష్టమయిన రామ కథలో నీవు చిరస్మరణీయుడవయినావు" అంటూ సంభాషించాడు ధర్మానికి విగ్రహ రూపుడయిన రాఘవుడు.

సుగ్రీవుడు అంజలి ఘటించి అతని పాదాలకు తాకి లేచాడు.

దాశరధీ! కృతఘ్నుడైనవాడు పరమపాపి. ఋష్యమూకం మీద మలయ సానువులలో ప్రాణాలు అరచేత ఉంచుకుని భ్రాతృ భయావహుడనయిన నాకు పునః ప్రశాంత జీవనం ప్రసాదించినావు. కాత సుమనః ప్రాణాలను నీకు దత్తం చేశాను. ఎప్పుడేది అవసరమైతేదాన్ని అర్పించి రామకార్యం సాధిస్తాను.

"ప్రాణానికి ప్రాణం యివ్వ గలిగినదే మైత్రి అని లోకానికి నిరూపిస్తాను" అన్నాడు కిష్కింధాపాలకుడు కన్నులు చెమరించగా!

రాఘవుడు లోక కల్యాణ కారకుడు, లోక కల్యాణం అభిలషించిన వాడు. వేదవిహితమైన మార్గంలో సమాజం పురోగమిస్తుందన్న విశ్వాసం మీద నిలిచిన వాడు.

అందునించి వ్యక్తులలో సమాజశ్రేయస్సు సాధించే లక్షణాలు కన్పిస్తే ఆర్ద్రీ భూతుడవుతాడు. తాను ఆ కోవలో అగ్రగామిగా నిలిచిపోవాలని అభిలషిస్తాడు. గాధేయుడు, అరుంధతీపతి, భారద్వాజుడు, గౌతముడు, అత్రి, శరభంగసు తీక్ష ణాదులైన మునుల నించి అలవడిన ఆధర్మని బద్ధత అతని జీవితానికి వెలుగుదారి!

రావణసంహారం అనివార్యమని అర్థమైపోయింది కొన్ని సంవత్సరాలుగా కొనసాగిస్తూ వచ్చిన రాక్షస సంహారకాండ రావణునితో కాని అంతంకాదని పించింది.

దండలో వేదవిహితమైన జీవన గమనాన్ని ఎదిరించి నిర్మూలించ ప్రయత్నిం చిన వారంతా తన ప్రత్యర్థులే! వారందరిని ఏకధాటిన సంహరించే అవకాశం పిన తల్లి ప్రసాదించిన అరణ్యవాసం వల్లనే కదా లభించింది.

ఇప్పుడు ఇతఃపూర్వం కన్నా మానులకు తాను ప్రియతముడైనాడు. ముని జనరక్షదక్షుడన్న పేరు సంపాదించుకొన్నాడు. ఈవాల రావణసంహారంతో కాని దృఢమై శాశ్వతమై నిలిచిపోదు.

కాని సముద్రాన్ని తరించటం ఎలా?

ఇంతకాలంగా తాను చేసిన ప్రయాణం మైదానాల మీద! యిప్పుడు సముద్రాన్ని తరించాలి. అసంఖ్యాకంగా ఉన్న కపిసేన కేకల మీద జలధిని తరించాలంటే అసాధ్యం. దాన్ని సుసాధ్యం చెయ్యాలన్నా చాల సమయం కావాలి. అంత కాలం వేచిచూచే ఓరిమి తనకు కాని కపిశేఖరులకు కాని లేదు.

అందునించి తక్షణం సముద్రాన్ని తరించే మార్గాలను అన్వేషించాడు రాఘవుడు. శత్రువులు చేరవచ్చినా రన్నవార్త రావణునికి తేటతెల్లమైంది. వెంటనే విజృంభించకపోతే అతడు మరింత బలాన్ని సమీకరించుకోవచ్చు.

లేదా సీతతో సహా లంకా నగరాన్ని విడిచి పారిపోవచ్చు. అలాంటి అవకాశం కలిగేంతగా జాప్యం చేయటం రాజనీతి కాదు.

కపులతో సభాషించాడు జానకీ వల్లభుడు.

బాణాలతో సముద్రం మీద మార్గం చెయ్యాలని ప్రతివాదించాడు. ప్రళని పాతాలవంటి శర సమూహాలతో సముద్రాన్ని ఆవిరిచేస్తానని సన్నిద్ధుడైనాడు రాఘవుడు.

బాలుడు శ్రీరామపాద రేణువులు శిరసునంటేలా మొక్కి లేచాడు.

దయాపయోనిధీ! నీవు కరుణా సముద్రుడవు. ఈ సముద్రాన్ని యింకించటం నీకెంత పని. కాని అటువంటి అవుసరం లేదయా! ఈ కపి వాహిని నిన్ను వెన్నంటి ఉండగా నీవు చేయి చేసుకోనక్కరలేదు. మాలో అన్ని రంగాలలో నిపుణులున్నారు వారు నీకెప్పుడేఅవుసరం వచ్చినా తీర్చేందుకు సంసిద్ధులయివున్నారు.

ప్రస్తుతం జలధిని తరించటమే కదా మన ముందున్న సమస్య! ఈ ప్రశ్నకు సమాధానంగానీ వాడను నీలుడను నేనున్నాను. నీవు నీలవ పుర్ధారివి నేను నీలనామధారిని ఈ సాదృశ్యం వల్ల నా జన్మ పావనమైంది. శిలాశాస్త్రంలో నిష్ణాతుడను నేను.

ఈ జలధిని తరించేందుకు ఈ కపి వాహినులకు చాలినంత విశాలంగా వారధిని నిర్మిస్తాను. నీ మనసు నాకు తెలుసయ్యా! జానకీ మాతను చూడాలని తొందరించే హృదయంతో నేవున్నావు. నీ అంతర్యానికి తగినట్లు అమిత వేగంతో వారధి నిర్మిస్తాను" అంటూ కార్యోన్ముఖుడైనాడు. బాలుని అండదండలుగా కపి సేనా వాహినులు నిలిచినాయి.

కొండలను కుళ్ళగించి బండలను దొర్లించాడు. వార్నిధిపై వారధి నిర్మాణం సంరంభం సమారంభమైంది. వనచర సమూహాలు అమితోత్సాహంతో కేరింతలు కొట్టినాయి. నృత్యాలు చేశాయి.

రాఘవుడు రవంతగా దుఃఖభార విముక్తుడవు తున్నాడు. అతని మనఃఫలకం మీద యుద్ధ తంత్రాలు రూపందుతున్నాయి. వారధి నిర్మిస్తూ వానరులు చేస్తున్న సింహనాదాలు సింహాలయం (సింహళం) కోటగోడల్ని తాకుతున్నాయి.

ద్రవిడ సంమోహం రెప్పలప్పళించి చూచింది. వానరుల ఉత్సాహశక్తి అంగద, జాంబవంత, హనుమంతులయంత్ర శక్తి, సుగ్రీవ, రాఘవుల ప్రభుశక్తి వారి లెక్కలకు మించి కన్పిస్తోంది. వారి గుండెలు సంద దడి చేయటం ప్రారంభించినాయి.

లక్ష్మణుడు యుద్ధ కార్యాల పర్యవేక్షణ చేస్తున్నాడు. హనుమ మహా పర్వతాలను పెకలించి తెచ్చి నీలులునికి అందించు తున్నాడు. జలధి ఈ దరినించి ఆదరికి వారధి నిర్మాణం పూర్తి అయింది. రామ కార్య నిర్వహణలో బ్రతుకులు పునీతమయినాయని భావించారు కపులు.

కర్కశమైన రాతి చెట్టుల మీదుగా రాముని నడిపించదలుచుకో లేరు వారు. శిలా మార్గం మీద వృక్షశాఖలను పరచి గోతులు పూడ్చారు. ఆపైన వనపత్రాలను విస్తారంగా కోసుకొచ్చి సమతలంగా హరితపత్ర మార్గాలను నిర్మించినారు.

"నా స్వామి కోదండపాణి పాదాలు రాజీవ పత్రాలు! పద్మరేఖాంకితాలు. అందునించి ఆకుల మీద నా తండ్రి కాలుసోకితే లేచివుళ్ళ వంటి అరికాళ్ళు పొక్కుతాయి" అన్నాడు అంజనాగర్భ సంభూతుడు.

వెనువెంటనే కపి సమూహాలు పుష్పించిన వన ప్రాంతాలకు వెళ్ళి పుష్పాల రాసులను తరలించు కొచ్చినారు. హనుమ సమతలంగా ఉన్న హరిత పత్రాల మార్గాలమీద ఎత్తుగా, ఒత్తుగా పుష్ప మార్గాలను నిర్మించి తన స్వామిని మెత్తగా నడిపించాడు.

కపి సమూహం దక్షిణ సముద్రం ఈవం కనించి ఆ వంకకు వెళ్ళిపోయింది. సింహగర్జనలు చేసింది. వారు అరచిన అరుపులకు సింహాలయం లాంటి లంకలో కోట బురుజులు తృళ్ళింతలయినాయి.

వైదేహి దగ్గరకావుగా ఉన్న సురస అనే విచిత్ర ద్రవిడకాంత ఆమెను ఓదార్చింది. నీ మగడు సామాన్యుడు కాడుకదే సీతా! కపిసేనతో సముద్రానికి వంతెన వేశాడట! వాడిచేష్టలు చూస్తుంటే లంకను నేల మట్టంచేసి, మారాజుని చంపి, నిన్ను రక్షిస్తాడనే నాకనిపిస్తోందే పిచ్చిదానా!" అంది సురస.

# 16

రాఘవుడు తుదిసారి కృతనిశ్చయుడయినాడు.

ఈలోగా కపిచరులు కొందరు సుగ్రీవునికి ఎక్కువ చెప్పారు. రావణుడు అలా మనవాహినుల ఆకుపోనులు పట్టుకోపటం చాల అనాచారమని దుయ్యబట్టారు. అతనికెంత ధైర్యంలేకపోతే ఎదురుగా వచ్చి అంతసేపు నిలుస్తాడు.

ఆచోటునించి రావణుని అవతలకు నడిపించాలని వారు నిర్ణయించారు. కాని ఆ వచ్చినవాడు రావణుడు. స్వయంగా అతని తాత అయిన సుమాలి! నారిని పరివేష్టించి ఉన్నవారు ప్రహస్తుడు జంబుమాలివంటి మిత్రులు.

అంతంత మాత్రపు వానరులు వెళ్ళినావారు లెక్కించరు.

అందునించి సుగ్రీవుడు తానే స్వయంగా వెళ్ళవచ్చేందుకు సంసిద్ధుడైనాడు. అప్పటికి ప్రాకారకుడ్యాల బురుజులమీదినించి రావణాదులందరూ తిరిగి వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నారు.

సరిగా సమయంచూచి సుగ్రీవుడు పైకి లంఘించాడు. ఒక్క ఉదుటున వారిమీద దాడిచేశాడు. అందినవారందరినీ వాలంతో తాటించాడు. పళ్ళతో ముక్కు చెవులు ఎక్కడ వీలయితే అక్కడ కొరికిపెట్టాడు.

వాడిఅయిన ముఖాలతో వారి ముఖాలు శరీరాలువారి రక్తధారలు కట్టించినాడు. హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనతో వారు తిరుగబడినారు. జరుగుతున్నదేమిటో వారు అర్థంచేసుకుని ప్రతీకారం తీర్చుకుందుకు ప్రయత్నించే లోపుగానే తిరిగి సముద్రతీరానికి వచ్చేశాడు.

లంకాపతి నేత్రాలు రోషకషాయితాలయినాయి. ఈ నికారపు చేష్టలు చేస్తున్న కోతిమూకల్ని సమూలంగా సంహరించితీరాలని అతడు కృతనిశ్చయుడై ఆచోటు విడిచి వెళ్ళిపోయినాడు.

ఇటువంటి నిర్వాకాన్ని విజయవంతంగా పూర్తిచేసుకుని వడిగా తిరిగివచ్చిన సుగ్రీవున్ని కపిశేఖరులందరు కౌగలించుకున్నారు. వాలాలను పైకిఎత్తి కేరింతలు కొట్టారు. సుగ్రీవుని కర్ణపుటాలకు తమపెదవులు తాకించి ఎంతో ప్రశంసించారు.

కొందరు ఇది ప్రథమ విజయంగా భావించి సింహనాదాలు చేశారు.

"అన్నా! మీరు ఆనందంలో పాలుపంచుకొనలేదేమి? మీ మౌనానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు సౌమిత్రి.

"నాయనా! ఇపుడు చూచినావుకదా! మినుములు రాసిపోసినట్లుగా కన్పట్టుతున్న ఆ లంకేశుడు మహాపురుషుడు. అతనితో యుద్ధం అనివార్యమే! కాని మహాపురుష లక్షణవముపేతుడయిన అతడు మహాపండితుడని కూడ విన్నాను. నాపట్ల అపచారంచేసినవాడు ఎన్నో అబద్ధాలుచేసి విజయుడయిన త్రిలోకాధినేత.

అటువంటివానితో దురదృష్టవశాత్తు మనకు ప్రతికూలం పాటించివలసిన అవసరం ఏర్పడింది. అతణ్ని వధించటం అనివార్యమే! కాని రాజనీతి క్రమంగా పాటించాలికాదా!

అందునించి యుద్ధప్రకటనచేయబోయే ముందుగా మనదూతను అతనివద్దకు పంపాలని అనుకుంటున్నాను రాయబారానికి అరిఅయిన వ్యక్తిని నిర్ణయించు" అంటూ తన మనోగతాన్ని ప్రకటించాడు రాముడు. సౌమిత్రి రవంతసేపు ఆలోచించు" అంగదుడే అందుకు సరిఅయినవాడు" అంటూ ప్రకటించాడు.

రాముడు తలపరికించాడు. వెంటనే హనుమకీ విషయం ఎరుకపరచి అంగదుని అక్కడకు రప్పించారు.

నాయనా! నీవు దివ్యమయిన భవితవ్యంకలవాడవు. సంభాషణ చతురుడవు. అమితపరాక్రమశాలివి, బుద్ధికుశలుడవు. నీమీద నాకు కల్గిన సంపూర్ణప్రేమాతిశయము కారణంగా నిన్ను రాయబారిగా పంపాలని తీర్మానించినాను. వారు రజనీతిని పాటించే అవకాశాలు కన్పించుటలేదు. అయినా మహాశరీరుడు త్రిలోకపాలకుడు అయిన మండోదరీ ప్రాణవల్లభునికి తప్పుదిద్దుకునేందుకు ప్రాణాలను కాపాడుకునేందుకూ చివరి అవకాశం యివ్వాలని అనుకుంటున్నాను.

అందువల్ల నీవువెళ్ళి సమయోచితంగా సంభాషించి ఫలితం ఎలాంటిదయినా నియమిత మనోవృత్తుడవయి క్షేమంగా తిరిగిరా! వారివాచాలత్వానికి ఆ చేష్టలకు తృళ్ళిపడక సావధాన చిత్తుడవయి కార్యంసాధించుకుని రావాలి! అందుకే నిన్ను పంపుతున్నాను.

రావణునితో నామాటగా చెప్పు.

ఓయీ మహావిక్రమశాలీ! నీవుముల్లోకాలను జయించినావని మునులు చెప్పగా విన్నాను. మొత్తం లంకానగరాన్ని హిరణ్మయంగా నిర్మించినావని తెలుసుకున్నాను. బ్రహ్మపుత్రుడవు విశ్రవసు కుమారుడవు నీవు అవాంచితాలను చేయకూడదు కదా!

నాతో విరోధం పాటించకు. నా భార్యను నాకు అప్పగించి క్షమాభిక్ష అర్థించు. నీ మహనీయతమీద విశ్వాసంతో నిన్ను క్షమిస్తాను. వాస్తవానికి పాలకులు ప్రజల మనోవాంఛితాలను తీర్చాలి.

"నా అండచేరిన మునులు వేదవిహితమార్గాసక్తులు, నీజనులకు అటువంటి ఆసక్తిలేకపోవచ్చు. అలాంటప్పుడు ఎవరికివచ్చినమార్గంలో వారు శాంతిగా జీవించాలి. అదే సమస్త మానవులకు కల్యాణప్రదమయిన జీవనమార్గం.

ఎవరిదారిలో వారు పయనించాలి!

కాని నీవు వైదిక విశ్వాసులను అణచివేయాలని హింసించాలని ప్రయత్నించావు. నీ అనుచరుల్ని దండకలోకి పంపి వారు యిష్టపడే మార్గంలో జీవించే అవకాశం లేకుండా వారియజ్ఞ యాగాదులకు అవరోధం కల్పించినావు.

వాస్తవానికి నీకా అధికారంలేదు.

వారి కిష్టమయిన మనోవృత్తిలో జీవించే హక్కు వారికుంది. ఆ హక్కుకు నీవు భంగం గలిగించి వారిని భయభ్రాంతులను చేయించినావు. నీ అనుచరవర్గానికి నీకు ఇది కూడనిపని. ఆ కార్యం! అయినా చేయించాలి,

ఒకరికీ వనమార్గాన్ని మరొకరు అడ్డుకోవటం అసాంఘికం. బలవంతుడు ప్రతివాడు నాయిష్టంవచ్చిన పద్ధతినే అనుసరించాలని ప్రజల్ని నిర్బంధించరాదు.

ప్రజలు తమంతతాముగా అనుసరించేమార్గం చూపగలిగిననాడే నిజమయిన పాలకుడు.

సాంఘిక భద్రతలేని మౌనిజనులంతా నన్ను ఆశ్రయించినాడు. అందునించి నేను వారికోసం న్యాయంకోసం నిలిచాను. అరణ్యవాసకాలంలోనూ చనుగ్గుగా నీ అనుచరుల్ని వధించి వారి యిష్టంవచ్చిన వైదికపద్ధతిలో జీవించేలా అవకాశాలు మెరుగుపరచినాను.

అంతటితో నేను తిరిగి అయోధ్యానగరానికి పోవాలి లంకకువచ్చి నీ అనుచరులతోపాటుగా నిన్ను వధించాలని నేనెన్నడు సంకల్పించలేదు.

కాని నా భార్యను అపహరించి లంకా వినాశాన్ని అనివార్యంగా చేసినావు. ఇప్పటికయినా తెలుకో!

పాలకుడనేవాడు ప్రజలకు రక్షణ కల్పించి వారి మనో వాంఛితాలను అనుగుణంగా జీవించే అవకాశం చూపించాలి. అలాకాక వర్గపక్షపాతియై మరొకవర్గాన్ని తొక్కివేయాలని ప్రయతించరాదు. అది సాంఘిక న్యాయం కాదు,

అంటే లోకకళ్యాణప్రదం కాదు.

నీవు అవకాశం చిక్కించుకుని మాయోపాయంతో నా భార్యను అపహరించినావు. ఇలా అవకాశం చిక్కిన ప్రతివాడు పర భార్యను అపహరించాలని ప్రయత్నిస్తే సామాజికులకు భద్రత ఎక్కడ!

నీవు మహనీయుడవై దారి తప్పావు. లోక కల్యాణ కార్యమైన సాంఘిక భద్రతకు అవరోధం కల్పించావు. శిక్షకు పాత్రుడైనావు. తప్పు దిద్దుకో!

చేసింది తప్పిదమని అంగీకరించి నా భార్యను నాకు అప్పగించి క్షమాభిక్ష అర్థించు.

లేదా యుద్ధం అనివార్యం!

లంకకు చేటు తప్పదు నీకు చావు తప్పదు—అని నా మాటలుగా లంకేశునికి వివరించు;

"నాయనా అంగదా! క్షేమంగా వెళ్ళి లాభంతో తిరిగిరా!" అంటూ ఆశీర్వదించినాడు రఘురాముడు. అంగదుడు అందరికన్నా వయసున చిన్నవాడు కావటం వల్ల అందరికీ వందనాలు సమర్పించి బయలు దేరాడు.

క్షణాలమీద లంకానగరంలో రావణుడి సభాప్రాంగణం చేరుకున్నాడు. పౌలస్త్యుడు కొలువు తీర్చి ఉన్నాడు.

"వానరా నీ వెవరు? ఎందుకొచ్చావు. (రాఘవుడు ప్రాణభిక్ష అర్థించి నిన్ను పంపాడా?" అని అడిగాడు మండోదరి మనోవనవిహారి.

అంగదుడు అట్టహాసం చేశాడు.

"రాక్షసేంద్రా! నీవు పొరపడినావయ్యా! నీ తప్పిదాలను మరొకమారు గుర్తుచేసి చక్కదిద్దుకునేందుకు చివరి అవకాశంగా నను పంపాడు దాశరథి! నీకు తెలుసుకదా అతడు కోదండపాణి.

పాలకుడు చేయకూడని పనులు నీవు చేశావు. ఎవరికి నచ్చిన మనోవృత్తితో జీవించే అధికారం లేకుండా నీ అనుచరులచేత సాంఘికమయిన అన్యాయం చేయించినావు.

అందుచేత ధనుర్ధారి అయిన రఘూత్తముడు నీ అనుచరులను అత్యధిక సంఖ్యలో వధించాడు. అంతటితో అతడు వనవాసం చాలించి వెళ్ళిపోవలసింది. అలా చేయకుండా అతని భార్యను అపహరించి తెచ్చి లంకకే ముప్పు తెచ్చావు.

నిన్ను నమ్మిన నీ అనుయాయులు దురదృష్టవంతులు. ఒక గ్రుడ్డివాడి చేయి పట్టుకుని నూమమంది అమాయకులు కూపంలో పడిపోయినట్లుగా అయింది వారిపని.

వారిని రక్షించేందు కయినా నీవు రాఘవుని భార్యను తిరికి అప్పగించి క్షమా భిక్ష అర్థించు" అన్నాడు అంగదుడు

సభలో కలకలం చెలరేగింది ఒక కోతి లంకను దహించాడు మరొక కోతి ప్రాకార కుడ్యంమీది బురుజులలో ఉన్న లంకాపతి కిరీటాన్ని కాలతో తన్నాడు.

ఇప్పుడొకకోతి రాయబారం చియవచ్చిందనగానే వారందరిలో ఒళ్ళుమండి పోయింది ఒంటరికోతిని వధించాలన్న ఉబలాటం వారందరికీ అధికాధికమైంది.

దశకంధరుడు వారికి అభ్యంతరం చెప్పలేదు అలతటితో సమూహాలు విజృంభించినాయి. ఇంతవరకు జరిగిన అవమానాలకు యిప్పుడయినా ప్రతీకారం చెయాలనిపించింది.

వెంటనే మహాబలశాలురయిన ఇద్దరు భటులు అంగదున్ని పెడరెక్కలు విరిచి పట్టి సభాప్రాంగణం దాటించి తీసుకువచ్చారు. అందాకా నిస్సహాయునివలె నటించిన రాయబారి బహిఃప్రదేశానికి రాగానే ఆకసానికి లేచాడు. తనను నిర్బంధించినవారితో సహా గగనానికి లేచి పైకి వెళ్ళాక పట్టినవారిని విదిలించాడు.

ఆ యిరువురూ భూమితలానికి తృళ్ళిపడినారు.

నేరుగావచ్చి సముద్రతీరాన వానర సమూహాలమధ్య వాలాడు. మునిపాదాలంటి లేచాడు.

"కోదండపాణీ! యుద్ధమనివార్యం. సంధి విఫలమయింది" అంటూ ఫలితాంశాన్ని ప్రకటించేశాడు.

రాఘవుడు రవంత సేపు రాజీవపుత్రనేత్రాలను అరమొగిచినాడు. కానిమిగిలిన పరివారమంతా యుద్ధమే నిశ్చయమయినందుకు అమితోత్సాహంతో కేరింతలు తృళ్ళింతలయినారు.

అప్పటి కప్పుడు బయలుదేరి వెళ్ళిపోయి లంకానగరంమీద విరుచుకుపడి పోయినారు. హనుమంతుడు నేర్పిన విధంగా ఎవరివాలానికి వారే తైలవస్త్రాలను చుట్టబెట్టుకుని నిప్పంటించుకున్నారు. లంకానగరంలో నాలుగు మూలల అగ్ని జ్వాలలు లేచినాయి.

అశోకవనంలో సీతకు రాక్షస కాంతలవల్ల ఈ విషయమంతా తెలిసింది.

అప్పటికే వారిలో కొందరు ఆమెను ఆశాపూర్ణమయిన మాటలు చెప్తూ ఓదార్చటం ప్రారంభించినారు.

"మారాజు నన్ను నిర్బంధించి గొప్ప తప్పిదమే చేసినాడమ్మా! అందుకే లంకకు చేటువాటిల్లింది. ఇంతకాలంగా అతడు స్త్రీలను చెరబడితే ఎదిరించేనాధుడు ముల్లోకాలలో లేకపోయినాడు. ఇప్పుడు నీ నాధుడే అందరికీ దిక్కు అయినాడు. జగన్నాధుడయినాడు" అన్నది సరస! ఆమె నాగవనిత! బుసలుకొట్టింది.

సీత మంచికాలం రాబోతున్నందుకు సంతోషతరంగ అయింది. త్వరలో అయోధ్యానగరానికి పోవచ్చు. అత్తలు తన కన్నీరుతుడిచి కౌగలించుకుంటారు కదా అని ఊరటపడింది.

నగరంలో దహనకాండ అవిచ్ఛిన్నంగా సాగింది.

రావణుని రాణువయుద్ధ సన్నద్ధమై సముద్రతీరానికి తరలి వస్తోందన్న వార్తలు అందరికీ తెలిసాయి. లంకలోని కపిరాజులంతా జలనిధితీరాలకు తిరిగి వచ్చేశారు.

ఇంద్రజిత్తు యుద్ధరంగంలో కాలుపెట్టాడు. వజ్రదంష్ట్రుడు తదితర నాయక శ్రేణి విజృంభించి యుద్ధంచేయసాగింది. అదంతా తుములయుద్ధమే! ఎవరు ఎవరితో పోరాడినారన్న విచక్షణలేదు. ఎదురయిన ప్రత్యర్థిని విచక్షణా రహితంగా మర్దించటమే పని!

అలాంటి సమయంలో వాయునందనుడు మేఘనాధునికి ఎదురయినాడు. అని భూమిలో అటువంటి మహత్తరమైన అవకాశం యిప్పుడొస్తుందా అని యిద్దరూ ఎదురుచూస్తున్నవారే!

తన బ్రహ్మాస్త్రం పట్టుతప్పించుకుని పారిపోయిన వాయుపుత్రుని కోసం మేఘనాధుడు ఎదురుచూచాడు తనను బ్రహ్మాస్త్రం పేరుతో బంధించిన రావణ పుత్రునికోసం హనుమ ఎదురు చూచాడు.

ఇద్దరూ ప్రతీకారవాంఛతో పట్టుదలతో ఢీకొన్నారు. కపిరాజరాజుకు గదా దండంగా ఆయుధంగా అమిరింది. కాని ఆయుధాలతో పోరాడటం అతనికి ప్రీతిపాత్రంకాదు.

ప్రత్యర్థికి నేరుగా ఎదురువెళ్ళి నిలుస్తాడు.

"మిత్రుడా! అవకాశం వచ్చింది కాబట్టి బలా బలాలు తేల్చుకుందాం నీవు నీ శక్తికొలదీ ముష్టిప్రహారంచేయి, నేను బ్రతికి వుంటే నిన్ను అలాగా ముష్టిప్రహారం

చేస్తాను. ఇలా ఎవరో ఒకరు తేలిందాకా చేసుకుందాం. నీకిష్టమేనా? ముందు నాముష్టి ప్రహారంచేసే అవకాశం నువ్వేతీసుకో! ఎందుకంటే నేను గ్రుద్దిన తరువాత మరో అవకాశం తీసుకునేందుకు నువ్వు మిగులవుకాబట్టి" అని అడుగుతాడు.

అలాగే చేయటం వనచారి అయిన బ్రహ్మచారికీ అమిత ప్రీతి?

ఇప్పుడెదురయిన మేఘనాధుని అలాగేప్రశ్నించాడు మేఘనాధుడు అందుకు అంగీకరించాడు.

పిడికిళ్ళు బిగించి హనుమంతుని వక్షస్సుపైవేయిఏనుగుల బలంతో ప్రహారం చేశాడు. హనుమంతుడు కన్నులు మొగిచి "రామ" అన్నాడు. ఆ రెండక్షరాల స్మరణవల్ల కలిగిన ఆనందంతో దేవేంద్రుని జయించిన ఇంద్రజిత్తు గ్రుద్దినా నొప్పి తెలియలేదు.

"ఇక అవకాశం నీదేహనుమా!" అన్నాడు మేఘనాధుడు. జనకాత్మనాతను దశరథాత్మజుని మనసులో స్మరించాడు పావని

వజ్రముష్టి బిగించాడు. ఇంద్రజిత్తు వక్షస్థలిమీద బలంగా మోది రెప్పలు అప్పళించాడు.

కొండచరియమీద పిడుగుపాటు సోకినట్లుగా అయింది. ఇంద్రజిత్తు మూర్ఛాగతుడయినాడు అతడు కొంతవరకూ సపర్యలు చేశాడు ఆంజనేయుడు లేచిన తరువాత జబ్బచరచి సింహనాదం చేశాడు.

"బుడతా యిప్పుడవకాశం నీ దోయీ!" అన్నాడు.

ఇంద్రజిత్తు రుషాకషాయిత నేత్రుడైనాడు. తనపోరాట గరిమను ఒకసారి మననం చేసుకున్నాడు. అతడు లంకలో జరిపిన దహనకాండ అంతటినీ స్మరించి కోపాన్ని పెంచుకున్నాడు.

అప్పటికే శరీరాన్ని ప్రసత్యర్థికి అప్పగించి రామనామస్మరణతో తనువునే మరచినాడాంజనేయుడు.

ఇంద్రజిత్తు కొండబండలా ఉన్నావాడు కుమారుని వక్షస్సు రాలిపోతుందా అనిపించేంతగా బలగర్వంతో ఒక్క ప్రహారం చేశాడు. ఆంజనేయుడు కదలలేదు, పలకలేదు రాతిబొమ్మలా అలాగే నిలిచిఉన్నాడు.

అతడు రామనామస్మరణ ముగించి కనులు విప్పేసరికి యింద్రజిత్తు అక్కడ లేడు. అతడు కొట్టిందీ తెలియదు. వెళ్ళిందీ తెలియదు అంజనేయునికి.

అప్పటికే ఇంద్రజిత్తు నలునితో మరొకపోరాటం సాగిస్తున్నాడు. ఓరిమాయల మారీ! ప్రాణాలు దక్కించుకున్నావు. నీ తండ్రిని పుత్రవియోగ ముహూర్తం ఆసన్నంకాలేదు కాబోలు" అంటూ మరొకవంకకు చూచాడు. ఆ వంక సంకుల సమరం జరుగుతోంది. వానరులు రాక్షసులు శరీరాలు మరచి పోరాడుతున్నారు.

రాఘవుడు బాణానికి ఒకడు చొప్పున రాక్షసుల్ని ఏరేస్తున్నాడు.

అప్పటికి దివాకరుడు పశ్చిమాద్రిలో కృంగిపోయినాడు, రజనీచరుడు విజయం చేస్తున్నాడు.

రాత్రించరులకు బలంద్విగుణీ కృతమయింది.

అంధాకా ప్రత్యక్ష పోరాటం సాగించిన దస్యులు పరోక్షపోరాటము ఆరంభించినారు. యింద్రజిత్తు మయలమారిగా పోరాడుతున్నాడు మేఘాలమధ్య తారాడుతున్నాడు.

వెన్ను చూపినవారికి మరణమేశిక్ష "అంటూ ఆజ్ఞయిచ్చాడు సుగ్రీవుడు వానర మూకలు కలగుండుపడినాయి. లంకవీరులు వానరవీల్ని చీల్చి చెండాడుతున్నాడు. రాఘవుడు వాలికి రక్షణా కల్పించలేక నిస్పృహాయుడయినాడు, సౌమిత్రిముఖం మ్లానమయింది.

చివరకు కోదండపాణి మేఘనాధుని పొలకువ తెలుసుకున్నాడు. దస్యులందరూ ఆతని అండనచేరి రహస్య పోరాటం కొనసాగిస్తున్నారు ఆతని పొలకువ తెలియగానే రాఘవుడు బాణం ప్రయోగించినాడు. దస్యులకది వజ్రఘాతంలా అయింది.

చాలమంది విగతజీవులై నేలమీదపడి పోయినారు. మేఘనాధునికి శరీరం చిల్లులుపడి పోయింది. వానరశ్రేణి ఊపిరి పీల్చకుండా తిరిగి విజృంభించారు.

అంతటితో దస్యులు బలాయనం చిత్తగించారు.

ఇంద్రజిత్తు తిరిగి వెళ్ళిపోయాడు. మరి కన్పించడు—అనే అనుకున్నారు అందరూ! కాని ఆతడు మాయావి రహస్యమయిన చోటునదాగి రామలక్ష్మణుల మీద నాగాస్త్రం ప్రయోగించాడు. దశరథాత్మజులు ఇరువురూ నాగపాశబద్ధులే భూమి తల్లిని కౌగిలించుకున్నారు.

మరింక యింద్రజిత్తు కన్పించలేదు.

రామలక్ష్మణులు నాగపాశబద్ధులై మరణించినారని తండ్రిని నిద్రలేపి మరీ నివేదించాడు. అది యథార్థమైతే ఇకనేను విశ్రాంతి తీసుకుంటాను అన్నాడు తండ్రి!.

రామలక్ష్మణుల శరీరాలు రక్తవిహీనంగా ఐనాయి వైద్యవిద్యా విశారదుడైన సుషేనుడున్నాడు అతని ప్రయత్నాలు కూడ ఫలించలేదు.

ఆ సమయానికి అనుకోని అతిధిలా అక్కడకు ఒక మహనీయుడు విచ్చేశాడు. అతని నాసికకొన తేలిఉంది. దక్షిణ వామపక్షాలు మరింత బలసంపన్నంగా ఉన్నాయి. నఖాలు వాడికత్తుల్లా కన్పిస్తున్నాయి.

అతని రాకతో అక్కడ ఉధృతమయిన వాయుసంచలనం జరిగినట్లుగా అయింది. అతడు తనతోపాటుగా అమృతపాత్ర ఒకటి తెచ్చి అప్పగించాడు.

రాఘవుడు ముందుగా నాగాస్త్రంవల్లే కలిగిన మూర్ఛనించి తేరుకున్నాడు. తమ్మునికోసం విలపించాడు. నవాగతుడైన మహాపురుషుడు సౌమిత్రినికూడ విముక్తున్ని చేశాడు.

రాముడు కృతజ్ఞతాభావంతో అతన్ని అభినందించాడు.

"ఓయి! మహాపురుషుడా! నాకు ప్రాణదాతవైన నీవు చిరస్మరణీయుడవోయీ నీ వెవరు?" అని ప్రశ్నించాడు.

అనవాగతుడైన మహాపురుషుడు రాఘవునికి నమస్కరించాడు.

"స్వామీ! నన్ను గుర్తించలేదా! నా పేరు గరుడుడు" అన్నాడు.

# 17

మహా శరీరుడూ, మహా బలశాలి, అఖండ నిద్రాలోలుడవు ఐన కుంభకర్ణుడికి సీతా పహరణం గురించి ఆ తరువాతి పరిణామాల గురించి తెలియనే తెలియదు.

ఏనుగులతో త్రొక్కించి, శూలాలతో పొడిపించి, గదలతో మోదించి అతడిని నిద్ర మేల్కొలిపినారు. జరుగుతున్న సంగతాన్నంతా అతనికి వివరించినారు. తన అన్నగారు తీసుకున్న తొందరపాటు నిర్ణయాలకు రవంత బాధపడ్డాడు కుంభకర్ణుడు.

"అన్నా! నీకు కావాలంటే యక్ష కిన్నెర గంధర్వ దేవకాంతలలో ఎవరయినా సరే తీసుకువచ్చి అప్పగిస్తాను. అల్ప మానవకాంతను అపహరించటం ఏమిటి? ఆ నరుడు కొందరు వానరులను వెంట తీసుకుని రావటం ఏమిటి? ఏమిటో అసంగతాలన్నీ?" అని ప్రశ్నించాడు.

"సదహోరా! ఇది తుది పోరాటం. మన తాతగారైన సుమాలికి ప్రతిష్ఠాకర మైన యుద్ధం! ఏ ఆశయంతో మన తల్లి కైకసి విశ్రవసుని ఆశ్రయించి కడుపు పండించుకొన్నదో ఆ ఆశయం నెరవేర వలసిన తుది ఘడియలు ఆసన్నమైనాయి. ఈ పోరాటంలో జయించ లేకపోతే యింతకాలం చేసిన పోరాటాలు, జగజ్జేగయ మానంగా సాధించిన విజయాలు అర్ధవిహీనాలవుతాయి.

రావణుని చరిత్ర కళంకి తమవుతుంది. ఇంతకాలం ఒక ఉద్యమ స్ఫూర్తితో నడచిన మన చరిత్ర పరాభూతమవుతుందా, విజయోపేతమవుతుందా అన్నది. ఈ యుద్ధ విజయం మీద ఆధారపడి ఉంది. ఆపైన నీ మనసు చెప్పిన మార్గంలో పయనించు" అన్నాడు రావణుడు.

కుంభకర్ణుడు రవంత సేపు ఆలోచించాడు.

"సోదరా! నీ వెందుకో ఆత్మస్థయిర్యాన్ని కోల్పోడినావు. ఇదంత జటిల సమస్య ఐతే ఇతఃపూర్వమే నన్ను నిద్రలేపి ఉండవలసింది. ఈ పాటికి ఆవరు లను వానరులతో కలిపి మింగేసి ముఖ్యంగా నిద్రంచే వాడిని.

ఇప్పుడైనా మించిపోయింది లేదు. నేను తక్షణమే బయలుదేరి వెళ్ళిపో తున్నాను. నర వానరులందరినీ భోంచేసి వెంటనే యుద్ధ పరి సమాప్తం చేస్తాను. అంతవరకు నాకు అప్పగించి మిగిలిన పనులు నువ్వు చూచుకో!" అంటూ యుద్ధ భూములకు బయలుదేరినాడు కుంభకర్ణుడు.

అతని రాకతో అని భూముల్లో హాహాకారాలు చెలరేగినాయి. వానరులు కలగుండు పడిపోయినారు. కుంభకర్ణుడి కాళ్ళ క్రింద నలిగి వానరులు చనిపోయి నారు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కొందరు మరణించారు. అతడు గుహ లాంటి నోరు తెరచి మరికొందరిని మింగేశాడు. ఆయుధాలతో మరికొందర్ని మర్దిం చాడు. అలా జరితే కొద్ది సేపటి తరువాత వానరశ్రేణి యావత్తు నశించిపోయి యుద్ధం పరిసమాప్తమయే అనకాశాలు కన్పించినాయి.

అతడు సుగ్రీవునితో సహా అనేక మంది వానరులను పిడికిట బంధించి లంకకు తీసుకుపోయినాడు. కపిసేనలు హాహాకారాలు చేసినాయి. సుగ్రీవుడు ఎలాగో పట్టుతప్పించుకుని అతని శరీరమంతా గిచ్చి కొరికి గాయాలుచేసి తిరిగి సముద్రతీరానికి వచ్చేశాడు.

కపిసేనలు కొంత ఊరటపడినాయి.

తిరిగి కుంభకర్ణుడు యుద్ధ రంగానికి వచ్చాడు. అతని శరీర భాగాలు తుత్తుని యలవుతున్నా కపిసేనను మర్దిస్తూనే ఉన్నాడు. రాఘవుడు ఇంద్రాస్త్రం ప్రయోగించిన తరువాత అతని శిరస్సు దొర్లి క్రింద పడిపోయింది. అతని మహా కాయం సముద్రం బారునా పర్వతంలా వ్రాలిపోయింది.

ఈ సంగతి తెలిసి రావణుడు విలపించాడు. తన జీవితకాలంలో దుఃఖాలను సృష్టించటమే కాని దుఃఖించటం తెలియని లంకాపతి కన్నీరు మున్నీరుగా విలపించినాడు. నా సోదరుని వధించిన వాళ్ళని మూలమట్టుగా నాశనం చేస్తాను" అంటూ రణస్థలికి బయలుదేరినాడు.

ఈ పర్యాయం లంకా నగరంలో ఉన్న మూలబలగ మంతా బయలుదేరింది. వారు చాల ఆర్భాటంగా వానరులపైకి ఎత్తివచ్చారు. కండూతితో వృక్షకాండాలను కోరాడు తున్న దంతావళాల వలె యుద్ధ కండూతితో వచ్చారువారు. వస్తూనే వానర సేన మీద విరుచుపడ్డారు

లంకాపతి సోదర వియోగదుఃఖంతో మంటలా మండుతున్నాడు. ఎదురైన వానరులు శలభొల్లా మాడిపోతున్నారు. అతని రథం వెడుతున్నదారి అంతా నిర్వానరం అయిపోతున్న సంగతిని గ్రహించాడు.

ఇది గమనించిన సుగ్రీవుడు కోపంతో అతనికి ఎదురువచ్చాడు. కోట బురుజుల మీద తన కిరీటాన్ని కాలితో తన్నిన కపి రాజు యితడే! రావణుడు ప్రతీకారంతో అతని మీద ఆయుధాలను ప్రయోగించాడు. ఆఘాటికి తట్టుకొలేక సుగ్రీవుడు మూర్ఛ పోయినాడు

ఇంక అతని పరాక్రమం ద్విగుణీకృతమైంది. మూర్ఛాగతుడై ఋక్షరజుని కుమారుణ్ణి అంతటితొ వొదిలి పెట్టదలుచుకోలేదు. అతన్ని హతమార్చాలని సమాయత్తుడైనాడు లంకాధినాధుడు.

తన రాజుకు తుది క్షణాలు సమీపించినాయని తెలుసుకున్న వాయుసూతి వెంటనే రివ్వున వచ్చి రావణుని ముందు వ్రాలాడు. అతని శరీరం అప్పటికే సెలయేళ్ళతో నిండిన కొండచరియలా కన్పిస్తోంది. ప్రతి రాక్షసుణ్ణి ఎదిర్చి నిలవటం, ఒకరి తరువాత ఒకరు ముష్టి ఘాతాలను తగిలించుకోవటం అతని యుద్ధ పద్ధతి! ఆ పద్ధతిలో జరిగిన యుద్ధాలలో హనుమంతుడు చాలమంది రాక్షసుల్ని సంహరించినాడు కాని అతని శరీరం నిండా గాయాలయ్యినాయి.

రావణుని ఎదురుగా నిలిచి మూర్ఛాగతుడయిన మా రాజు మీద ఆయుధాలు ప్రయోగించకు నాతో యుద్ధం చెయ్యి" అని అడిగాడు.

"నీ యిష్టం వచ్చిన ఆయుధం తెచ్చుకోరా కోతీ! నువ్వేకదా లంకా దహనం చేశావు. ఆనాడు పారిపోయావు. ఈ నాడు పరలోకానికి పోతావు" అంటూ హను మంతుని మీద పళ్ళు నూరాడు రావణుడు.

అయితే రావణుని రథం మీదినించి రవంతయినా కదలలేదు ప్రత్యర్థి అయిన పావని. రావణా! ఆయుధాలు ధరించి రావటం నా యుద్ధ పద్ధతి నాచేతులే నాకు వజ్రాయుధాలు. ఈ ముష్టి ఉంది చూచావూ! ఇది గిరి శిఖరాల కన్నా దృఢమైనది. గరుత్మంతుని కన్నా వేగమైనది యమ దండం కన్నా భయంకరమైనది. ముందు నుంచి నా చేతులే నాకు ఆయుధాలు. వాటితోనే యుద్ధం చేస్తాను అన్నాడు.

రావణునికి మాటలు నవ్వు తెప్పించినాయి. "అనాగరికుడు" అనుకుంటూ ముఖం చిట్లించుకునాడు. అయినా ఎన్నో యుద్ధాలు చేశాడు తాను ఇన్ని యుద్ధాల లోనూ తన వంక తేరిపార చూచిన వారే లేరు. అలాంటిది రాముడుదై తన రథం మీదికి వచ్చి ముష్టి యుద్ధానికి ఆహ్వానిస్తున్నాడు. ఈతనికి తుది క్షణాలు సమీపిం చాయి కాబోలు అనుకున్నాడు.

"సరే! నీతో ముష్టి యుద్ధానికి నేను సిద్ధమే!" అంటూ ప్రకటించాడు.

"ముందు అవకాశం నీకే యిస్తున్నాను" అన్నాడు వాయుపుత్రుడు.

రావణుడు అందుకు అంగీకరించాడు. ముందుగా యినుప ముద్దల్లా పిడికిళ్ళు బిగించాడు. సువిశాలమైన అంజనేయుని వక్షస్థల మీద పెద్ద శబ్దం వచ్చేలా ఒక్క పెట్టు పెట్టాడు.

సముద్రాన్ని లంఘించిన అంజనేయునికి చుక్కలు తెగిపడుతున్నట్లు అన్పిం చాయి. కనుల ముందు మంచు తెరలు కమ్మినట్లు అన్పించినాయి. మొట్టమొదటి సారిగా అతడు పెద్ద అర్తనాదం చేసినాడు. రవంత తూలి నిలువరించుకున్నాడు. అతడి పని పూర్తి అయిందని భావించాడు రావణుడు.

యించుమించు ప్రాణావసాని ముహూర్తాన్ని సమీపించిన వానిలా అయి పోయిన మహాబలుడు ఆచితూచుచి క్షణాలలో రామనామాన్ని స్మరించాడు అతడికి తనకర్తవ్యం కనుల ముందు ప్రత్యక్షమయింది.

రామనామ స్మరణంతో పునఃశక్తి సముపేతుడై నిలిచినాడు.

"రావణ ఇంతటి ముష్టిఘాతాన్ని యింతవరకూ నేను రుచిచూడలేదమన సాధు! నిజంగానీవు శక్తివంతుడవే! అయితే ఈనాడు నాచేతిలో చనిపోవలసి, దుర్గతి నీకు సంప్రాప్తమయినందుకు చాల విచారిస్తున్నాను. యిప్పుడిక అవకాశంనాది" అన్నాడు. అందుకు అంగీకరించి రావణుడు బోరవిరిచి నిలబడ్డాడు.

వానరసింహుడు వజ్రబిష్టిబిగించాడు. పెద్దగా సింహనాదంచేసి రావణుని విశాలవక్షంమీద అమిత వేగంతో తాకించినాడు. ఆ ప్రహారం తాకుతూనే రావణుడు తూలి క్రిందపడిపోయినాడు ఆంజనేయుడు రామనామం జపిస్తూ రావణుని శరీరం చుట్టూగెంతుతూ నాట్యం ప్రారంభించాడు. రవంతసేపు అయాక రావణుడు స్వస్థుడయి లేచి నిలబడ్డాడు.

"ఓరీ వానరా! నీవు శక్తిసమన్వితుడవే! అయితే ఈసారి నేను చాచిన తావుతోనీ సర్వశక్తులు కృశిస్తాయి. కాచుకో!" అన్నాడు. ఆంజనేయుడు గెంతటం మాని రామ నామం జపిస్తూ బోరవిరిచి నిలిచినాడు

లంకాధినాధుడు ముల్లోకాలను జయించిన తన పరాక్రమాన్ని ఒకసారి స్మరించినాడు. తన సోదరుని మరణాన్ని మననం చేశాడు. ధాన్యమాలి తన కిచ్చిన మనోధృతిని దిటవు పరచుకున్నాడు. తాతగారయిన సుమాలి ఆశయాన్ని సంస్మరించనాడు.

వీటన్నింటిని అతడు తన బాహుల్లోకి సమీకరించినాడు. ఇప్పుడు దస్యువీరుని బాహువులు అయఃఖండాలవలె అయినాయి. ముష్టివక్రపుతుసకలా బిగిసిపోయింది.

పొలి రంకె వేసి వానరుని వక్షం చీలిపోయేలా చాచికొట్టాడు రావణుడు. అంజనాగర్భసంభూతుడు రామ రామ అంటూ భూమి మీదకి వాలి సోలిపోయినాడు. మరింక కన్నులు తెరవలేదు.

ఈ వార్త తెలిసి వానరసేనా వాహినులు కృంగిపోయాయి. వారికి ఉత్సాహపరచేందుకు సౌమిత్రి ధనుశ్శాలి అయి రావణుని కట్టెదుటనిలచి సింహనాదం చేశాడు.

ఆదిశేషువులా బుసలు కొట్టాడు.

అయితే రావణుడు సోదరి వియోగదుఃఖంతో విజృంభించినవాడు కావటం వించి వివశంగా పరాక్రమించి యుద్ధం చేశాడు. రామానుజుడు సొమ్మసిల్లినాడు, శరీరం విశేషంగా క్షతమయిపోయింది,

ఈ వార్త దాశరధికి తెలిసింది.

లంకాధినాధుడు స్వయంగా పరాక్రమించినాడని వానరసేనలు పయనం చిత్తగించసాగాయి సుగ్రీవుడు, ఆంజనేయుడు, లక్ష్మణుడు అందరూ ఒకరివెంట ఒకరు మూర్ఛాగతులయినారని విన్నాడు రాఘవుడు అతనిరాజీవ పత్రనేత్రాలు సువిశాలమయినాయి.

వినీలవపుర్ధారి అయిన అతని ముఖం వికసితని నీలకల్హారంలాసున అయిపోయింది. ఊర్పులు దీర్ఘశరాలై అయిదు తలల నాగేంద్రుడిలా కన్పిందాడు శరధారి దాశరధి!

“ఈ ముల్లోకాలలోని ఏ శక్తివచ్చినా రావణుని రక్షించలేదు. దేవేంద్రుడు దిక్పాలకులుకూడ అతన్ని కాపాడలేరు నేను కౌసల్యాతనూభవుడను అయితే మైథిలీ మనోహరుడను అయితే, రాఘవుడను అయితే రావణుడు పరాభూతుడు కావలసిందే. కపిశేఖరులారా! ఇది నా ప్రతిజ్ఞ! వెనుదిరగకండి. దస్యుల మూల బలాన్ని సమూలంగా ఛేదించండి” అంటూ ప్రతిజ్ఞచేసి వానరులందరినీ ప్రోత్సాహపరచినాడు రాఘవుడు.

వానరులు కొంత ఊరడిల్లి యుద్ధోన్ముఖులయినారు.

లంకాపతీ! నేను కౌసల్యా తనూభవుడను. నీవు మహాపురుషుడవే అయినా సంకీర్ణమహావృత్తికలవాడవు. వ్యక్తిగతంగాకూడ నా భార్యను అపహరించి నాకు ప్రత్యర్థివయినావు. అందువించి నిన్ను వధించాలని సంకల్పించినాను వానరులతో కలిసి వార్ధికి వారిధి నిర్మించాను. శ్రీరాముడనువాడనునేనే! నాతో పోరాడు” అంటూ ఎదురు నిలిచాడు. రావణుడు కనురెప్పలు బాగా విప్పి రాఘవుని వంకచూచినాడు. అతని ప్రసన్న సుందరరూపం ఆ ముఖవర్చస్సు హృదయాన్ని చూరగొంది.

“ఓయీ నీలవపుషా! పదునాలుగేండ్లుగా నా అనుచరులను విచక్షణా రహితంగా వధించావు. బాలకుడవు, అనుభవం చాలనివాడవు ఈ లంకవంక కన్నెత్తి చూచేందుకు ముల్లోకాలలో వీరికి ధైర్యంచాలదు. దేవేంద్రాదులకు దిక్పాలురకు నా పేరు చెవిశే నిద్రపట్టదు.

అలాంటిది ఒకబాలకుడవు వానరులను తోడుగా తీసుకుని లంకమీదికే వచ్చావు. దుస్సాహసివి ఒక సాధారణ రాకుమారుడవు. నా సామంతుడయేందుకై నా అర్హత చాలనివాడవు. నన్ను ఎదిరించాలని నీ కెందుకు అనిపించింది. ఇంత

సాహసం కల్పించటానికి నీకు ప్రేరణఏమిటి? లేక అజ్ఞానంవల్ల రావణునితో యుద్ధనుంటే బంతులాట అని పొరపడ్డావా! అది యథార్థమయితే నీకు చివరి అవకాశం చూపుతున్నాను. వెన్నిచ్చిపారిపో!" అన్నాడు లంకేశుడు.

మైథిలీ మనోహరుడు ప్రసన్నముద్రలో చిరుదర హాసంచేశాను.

"మండోదరీ మనోవల్లభా! నీవు ఒక్కసంగతి గుర్తించాలి. రావణుడు మహాపురుషుడే! నిన్నుచూచి ముల్లోకవాసులు గడగడలాడుతున్నారు. మునిజనవాళి ఉల్లసించి కీర్తిస్తోంది.

త్రిలోక భయంకరుడవునీవు. త్రిలోక ప్రసన్నమూర్తినేను మన ఇరువురిలో జనులను పాలించేందుకు అర్హులెవరో నీవే చెప్పు" అన్నాడు.

లంకాపతి ఆలోచనా ముద్రవహించినాడు. ఆతని అంతర్యం కల్లోలితమయింది.

తనజీవిత శృతితప్పిన రుద్రవీణ!

ఓయి మహాపురుషుని ఆశయసాధనకై ఒకతూలిసేలా భూమిమీదికి కొనిరాబడినవాడుతాను తాతగారయిన ఆతని ఆశయ సాధనకు అనుకూలంగానే తీర్చబడినాడు. కొన్ని కారణాలకై రూపొందించబడిన వ్యక్తిత్వంతనది.

త్రిలోక భయంకరుడన్న పేరు అనివార్యంగా వచ్చింది. అలాంటి కార్యనిర్వహణ తన కర్తవ్యమైంది. త్రిలోకజన సుప్రసన్నుడయిన ఈ బాలకుడ లోకపూరితుడు. నేను లోకభయంకరుడను.

కనుక ప్రపంచాన్ని పాలించేందుకు ఆతడే అర్హుడు అని సంభావించినాడు రావణుడు. పాలకుడయినవాడు ప్రజారంజకుడుగా ఉండాలి. కాని ప్రజాకంటకుడు కారాదు. ముల్లోకాలమీద ఆధిపత్యం సంపాదించిన తాను ముల్లోకాలతోనె ప్రజలను రంజింపచేయగల ప్రభువుగా పాలించలేదు.

వైదికమతానుయాయుల్ని పంపించాడు. పరభార్యల్ని అపహరించాడు. ఇవి ప్రజాకంటకమయిన కార్యక్రమాలు రాక్షస జనమనోరంజకమైన పరిపాలన తనది. ముల్లోకాల అధినేతకు ఈ పక్షపాతవైఖరికూడ నిది.

ఆ సుప్రసన్నమూర్తి ఎదుట తన వ్యక్తిత్వంలోఉన్న అసంగతాలేమిటో రావణునికి తెలియవచ్చినాయి. కాని వాటిని తలచుకునేందుకిది సమయంకాదు. సుమాలి చెప్పిన కర్తవ్యాలు తిరిగి జ్ఞాపకం వచ్చినాయి.

తనజన్మ కారణం వేరు. దానికి అనుకూలంగా ప్రవర్తించాడుతాను. అది రాక్షసానుకూలము, లోకకంటకము అయింది. ఇందులో తన ప్రమేయం నామ మాత్రమయింది. జరిపించవలసినవారు జపించారు. ఇదంతా జరగవలసి ఇలా జరిగింది ఇప్పుడు వెనుదిరిగి ఆలోచించటం అనవసరం!

రావణుడు యుద్ధోన్ముఖంగా కృతనిశ్చయుడైనాడు.

"మునిజన మనోభిరామా ! వావరహృదయధామా ! ప్రసన్నభావ ప్రపూర్ణ రాలయిన నీ మాటలు నా మనసుకి నచ్చాయి. కాని నా కర్తవ్యం వేరు. ఈ జన్మ ఇచ్చిననాడే నా తల్లి నా తాతగారు నా కర్తవ్యాన్ని కూడ నిర్ణయించారు. అందు నించి ఇప్పుడు నీతో యుద్ధం చేస్తేనేకాని వాదిస్తూ కూర్చోను అన్నాడు.

అతని మనోగతమేమిటో మైథిలీ మనోహరునికి అర్థమయింది బాణం ఎక్కు పెట్టి యుద్ధ సన్నద్ధుడయినాడు రాముడు.

వారి మధ్య చాల భయంకరమయిన యుద్ధం జరుగుతోంది క్షణక్షణానికి రావణుని బలంహీనమయిపోతోంది ధర్మం తన పక్షాన ఉన్నదన్న ఆత్మస్థయిర్యంతో రాముడు అనుక్షణం విజృంభించినాడు

లంకాపతి ఆయుధాలన్నీ డిల్ల అయినాయి. అతడు నిర్వీర్యుడైనాడు. రామ బాణాల ధాటికి సర్వశక్తులు కృంగి నిర్వీర్యుడయినాడు. అతడు రథం మీద చలన రహితంగా శవమాత్రుడుగా మిగిలిపోయాడు.

"రథాన్ని లంకకు మరలించు" అంటూ సారథిని హెచ్చరించాడు తల వాల్చేస్తూ! ఈ విజయం వానర సేనలో గొప్ప చైతన్యాన్ని తీసుకువచ్చింది. త్రిలోక భయంకరుడైన రావణుడు అలా పారిపోవటంతో వారు రాఘవునిపై భక్తి ప్రపత్తులను అధికాధకం చేసుకున్నారు. అతనికి జేజేలు పలికినారు.

లంకానగరంలో దీపాలు మలిగినాయి. రావణ పరాభవంతో ఇంద్రజిత్తు అగ్నిహోత్రునిలా మండిపడి లేచాడు. దేవేంద్రుని జయించటానికి వెళ్ళే సమయంలో ఎంతటి యుద్ధశక్తిని సమకూర్చుకున్నాడో అంతకన్నా అధికాధికమయిన యుద్ధ శక్తిని సమకూర్చుకుని అతడు రణభూమికి వచ్చాడు. పరాక్రమించి యుద్ధంచేశాడు.

సౌమిత్రి ఇతఃపూర్వం నాగపాశాలతో బంధించిన అతనిపై ప్రత్యేకమయిన ప్రతీకారం కోసం ఎదురు చూస్తున్నాడు. రావణవధ జరగాలంటే ముందుగా కుంభ కర్ణమేఘనాధులు నశించాలి.

ఆ యిరువురిలో యిప్పటికే ఒకడు గతించాడు రెండవవాడు మేఘనాధుదే! లంకాపతి తరువాత తిరిగి అంతటి శక్తి శాంయితడు సుమిత్రా నందనుడు అతనిపై శరవర్షం కురిపించాడు. మాయా యుద్ధం ప్రారంభించే అవకాశం లేకుండా అతడిని కట్టడిచేశాడు.ఆదిశేషువులాచు పడకొడుతూ పగపట్టినమహాసర్పంలా విజృంభించాడు.

అతని ధాటికి తట్టుకొలేక మేఘనాధుడు యుద్ధ రంగంనించి పారిపోయిని కుంభిల ఆలయంలో ఉపాసనలు పూర్తి చేశాడు ద్విగుణీకృత శక్తిశాలి అయి తిరిగి యుద్ధరంగానికి వచ్చాడు.

కక్షతీరక అందాకా పొంచి ఉన్న సుమిత్రా తనూభవుడు అతడి అగడాలు కొంతసేపు కొనసాగిన తరువాత ఇంద్రాస్త్రం ప్రయోగించాడు. ముందుగా శ్రీరాముని ధర్మనిష్ఠను మననం చేసుకున్నాడు.

ఆ తరువాత గురిచూచి అస్త్ర ప్రయోగం చేశాడు సౌమిత్రి. అది మాయా యుద్ధ విశారదుడు. దేవేంద్రుని జయించినవాడు, రావణుని ఆత్మరూపుడు, అతి ప్రీతిపాత్రుడు అయిన మేఘనాధుని తలను తృళ్ళింతలు చేసింది. మేఘనాధుని మొండెం ఇసుక తిన్నెల మీద చైతన్య విహీనంగా వాలిపోయింది.

కపులు లక్ష్మణుని చేతుల మీద ఎత్తి సింహనాదాలు చేశారు. ఆనందోత్సాహంతో నాట్యాలు చేశారు. ఈ కేకలు లంకానగరం కోట గోడల్ని గడగడలాడించినాయి.

నీళ్ళు నిండిన కళ్ళతో తాత ఆశయాన్ని స్మరించాడు పేలస్త్యుడు. లంకా నగరానికి నేను సమకూర్చిన వాసి నిలబెట్ట కలిగిన ఆశాకిరణం మేఘనాధుడొక్కడే! అతడే చనిపోయాక లంకానగరానికి కాని ఈ విశ్రవసు తనూభవునికి కాని యింక చరిత్ర ఏమున్నదీ.

ఇంతకాలం ఏ ఆశయానికై పోరాడి రావణుడు త్రిలోకభయం కరుడన్నవాదు సంపాదించటం జరిగిందో ఆ ఆశయం కోసం ప్రాణాలు అర్పించటమే తరువాయి. ఇక యుద్ధరంగమే నాచివరి లక్ష్యం! విజయమయినా వీర స్వర్గమయినా అక్కడే తేలిపోవాలి" అని సంభావించాడు.

తన అర్ధాంగి అయిన మండోదరిని సమీపించాడు. వీడ్కోలు చెప్పాడు. బహుకాలం నించి తన కౌగిలింతలకై ఎదురుచూస్తోంది ధాన్యమాలి. యింతకాలంగా ఆమెను తాను తిరస్కరిస్తూ వచ్చాడు.

యిప్పుడు వెళ్ళి హఠాత్తుగా ఆమెను తనివితీర కౌగలించాడు రావణుడు.

ప్రియతమా! యుద్ధ కంకణం ధరించాక స్త్రీని తాకరాదుకదా! యిప్పుడీ అకార్యమేమిటి? బ్రతుకంతా ఎదురుచూచింది ఈ వరం కోసమే! కాని ఇప్పుడిలా అకాలంలో అందించినారు. అశుభం కాదా!" అని కన్నీరు పెట్టుకుంది ధాన్యమాలి!

ఆమె కన్నీరు తుడిచాడు రావణుడు. "ప్రేయసీ! ఈ దశకం ధరునిచరిత్రలో శుభాశుభాలు ముందుగానే నిర్ణయించబడినాయి. నేను నిమిత్తమాత్రుడను. జరుగుతున్నదంతా నిర్ణీతమయిన కార్యక్రమమే! వరించి వచ్చినవారెవరూ నావల్ల అపరితుష్టులుకాలేదు. నీవు మాత్రం అలా ఎందుకు మిగిలిపోవాలి. ఈ రావణుని వల్ల అసంతుష్టులయిన వారెవరూ ఉండకూడదు. అందునించి యుద్ధ కంకణం ధరించాకే తిరిగి దాన్ని విప్పేవరకూ బ్రహ్మచర్యం పాటించాలన్న నియమాన్ని విడిచి నిన్ను తాకాను.

ఇకనాకు వీడ్కోలు చెప్పగలవా?" అని ప్రశ్నించాడు రావణుడు.

కన్నులు నిండిన నీరు సాక్షిగా పూర్ణహృదయంతో వీడ్కో చెప్పింది ధాన్యమాలి. అతని స్పర్శవల్ల కలిగిన అనుభవాలు చిరస్మరణీయం చేసుకుని లంక నగర సౌధాలలో ఒంటరిగా మిగిలిపోయింది.

ఆమెను విడిచి రావణుడు అమీతుమీ తేల్చుకుందుకు చివరి సారిగా రణభూమిని చేరుకున్నాడు. అతని దృష్టియిప్పుడు శ్రీరాముని మీద లగ్నకాలేదు. తన ప్రాణాధికుడైన కుమారుని వధించిన సౌమిత్రిని వెదుకసాగాడు. ప్రతీకారం తీసుకోవాలని.

సాధారణ వానరులు అతనిని కవ్వించ సాగారు. కాని లంకేశుడు వారినిక్కవంతయినా లక్ష్యపరచలేదు. సుమిత్రా నందనుని కోసం అన్వేషించాడు. ఎట్టకేలకు అతని అన్వేషణ ఫలించింది.

సౌమిత్రి యుద్ధభూమిలో ఎదురైనాడు.

"నిలునిలు నీ తరువాతనే నీ సోదరుని వధిస్తాను. నాకు కావలసిన ప్రధాన ప్రత్యర్థివి తక్షణం నీవే!" అన్నాడు రావణుడు. సౌమిత్రి ఆదిశేషువులా తలపంకించినాడు.

తన అన్నగారి వంతుగా మిగలవలసిన వాడు తన వొంతు అయేదుకు ఉల్లాస పడటం మంచి అవకాశమని పించింది. ఎంతయినా పుత్రశోక భారంతో కడుపు మండి ఉన్నవాడు పేలస్త్యడు.

అతడికి మరే ప్రపంచమూ కన్పించలేదు. తన తరువాత తనంతటివాడు, రావణుని తరువాత కూడ లంకానగర ప్రతిష్ట, నేతృత్వము రవంతయినా సడలవని ముందుగానే ఆశలు కల్పించినవాడు, ప్రాణ ప్రదుడైన మేఘనాథుడు ఈతని వల్లనే వధించబడినాడు.

కాబట్టి అతని వధించి పుత్ర శోకానికి ప్రతీకారం తీర్చుకోవాన్న ఏకైక లక్ష్యం ఒక్కటే అతని మనసంతా నిండిపోయింది ఆ ఏకాగ్రతవల అతని శక్తి యినుమడించింది. ఇతఃపూర్వం చేసిన యుద్ధాలలో ఎన్నడూలేనంత గాజవ సత్వాలమ ప్రదర్శించాడు.

ఆ స్థితిలో రావణుని ఎదిర్చటం దుస్సాధ్యమైంది సౌమిత్రికి నిస్సహాయుడై అతని అస్త్రాలఘాటికి ఒరిగిపోయాడు లక్ష్మణుడు విభీషణుడు బాగా పరిశీలించి అతడు ఇంచుమించు మృతుడైనాడని ప్రకటించాడు.

సంజీవని తీసుకురావటం తప్ప మరొకదారి లేదని చెప్పాడు. హనుమంతుడు ఆ కార్య భారాన్ని నెత్తిన వేసుకున్నాడు. ఓషధీ ప్రభావంతో సౌమిత్రి తిరిగి ఊపిరిపీల్చాడు.

తన తనూభవుని మరణం వల్ల రావణునికి ఎంత ఏకాగ్రత వచ్చి శక్తి శతాధికమైందో అంతటి ఏకాగ్రత ఈ పర్యాయం రాఘవుని వంతు ఐంది.

తన సహోదరునికి ఈ స్థితిని కల్పించిన రావణునిపై అతడు పూర్తి శక్తులతో విజృంభించాడు. ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా అవన్నీ విఫలమవుతున్నాయి. రావణుడు ఏకధాటిన ఆయుధాలను ప్రయోగించటం ప్రారంభించాడు.

దశరథాత్మజుని శారీరక శక్తులన్నీ భిన్నమైనాయి. మనోధృతితూలి పోతోంది రావణుని వధించటం అసాధ్యమా?

అలాంటి స్థితిలో మాతలి అతనికితోడైనాడు. రావణునివల్ల అతని కుమారుడైన మేఘనాదునివల్ల పరాభూతుడైనవాడు దేవగణపతి. అతడు నేరుగా వారిపై ప్రతీకారం తీర్చుకుందుకు శక్తి చాలనివాడు

అవిదునించి యుద్ధ విజయాన్ని అప్పటికే లాంఛనంగా స్వీకరించిన దాశరథికి సహాయపడి ఆ విధంగా తన గుండె మంట చల్లార్చుకోవాలని ఆశించాడు దేవగణాల అధినేత.

తన దగ్గర కొలువుచేస్తున్న మాతలి అత్యంత నిపుణుడయిన రథ చోదకుడు. అతడ్ని రామునికి సాయం చేయవలసిందిగా నియమించాడు.

మాతలి రామ రావణ సంగ్రామం జరుగుతున్న ముహూర్తాన రామునితోనే ఉన్నాడు.

రాఘవా! ఈ దశకంధరుడు వరపుత్రుడయ్యా! అంతేకాక అమిత బలశాలి. అంత సులభంగా మరణించేవాడుకాదు. పైగా ఎన్నోయోగ విద్యలు సాధించినవాడు.

యోగవిద్యా విశారదులకు ప్రాణశక్తి స్వాధీనమై ఉంటుంది. అతేకాక రావణుడు గొప్ప రసాయనవేత్త అతడు యోగశక్తితో చతుర్దశ నాడీమండలాను స్వాధీనపరచుకున్నాడు.

అమృత బిందువయిన ప్రాణరూపాన్ని నాభిదేశంలో దాచుకున్నాడు. ఇది అత్యంత రహస్యమైన హఠయోగ ప్రయోగము. అతని శరీర భాగాలన్నింటిని ఖండించినా అతడు మరణించడు.

యోగశక్తితో అమృత బిందువయిన ప్రాణవాయుని బంధించిననాభి దేశాన్నినీ శరపరంపరతో బ్రద్దలు కొట్టాలి అప్పుడే అతడు మరణిస్తాడు. అలాకాక మరే ఇతర మార్గంలో అయినా అతన్ని వధించటం అసాధ్యమే!" అంటూ రావణుని యోగవిద్యానుధకమయిన ప్రాణ రహస్యాన్ని రామునికి ఉద్బోదించాడు మాతలి. ఆ సంగతి తెలిశాక రాఘవుని ఉత్సాహశక్తి అనికాధికమైంది. విజయం మీద ఆశ జీవం పోసుకుంది.

రాముని ప్రసన్న రూపాన్ని కనులారదర్శిస్తూ ఆయుధ ప్రయోగాలు చేస్తున్నాడు లంకాపతి. "ఈతడు పురుషోత్తముడే! సందేహం లేదు. తాను నమ్మిన ధర్మంకోసం నిస్వార్థంగా ప్రాణాలకు తెగించి పోరాడుతున్నాడు.

తన కోసం పోరాడేవాడు మనిషి!

తాను నమ్మిన సిద్ధాంతాల కోసం పోరాడేవాడు మహనీయుడు!

ఈ రాముడు మహనీయుడే! ఈతడు నా మిత్రుడయి ఉంటే నేను త్రిలోక భయంకరుడన్న కీర్తికన్నా ఎక్కువ తృప్తిని అనుభవించే వాణ్ణి!" అని సంభావిస్తూ ఎవరు తన మనసుని ఆకర్షించినాడో అతని మీదనే ఆయుధాలు ప్రయోగిస్తున్నాడు.

రామునిలో ఇప్పుడు విజృంభించిన అద్భుతశక్తిని అతడు గమనించలేదు. రాఘునికి తన పాణ రహస్యం తెలియదు. అతడు అమిత ఓజస్వి కాబట్టి పరా

భూతుడూ కాడు. మైత్రి నెరుప లేకపోయినా యిలాగే యుద్ధ ప్రత్యర్థిగా కాలాని రామ దర్శనాభిలాషతొ వెళ్ళదీయవచ్చు అని తలచాడు

కాని రాముడు యింకా అంత సమయం మిగల్చలేదు.

కోదండాన్ని వామహస్తంలో బిగియపట్టి, నింటినారిని ఆకర్ణాంతము ఆకర్షించి బాణాన్ని విడిచిపెట్టాడు అది రామ బాణం. అమిత వేగంలో నేరుగా వెళ్ళి రావణుని నాభిదేశంలో గ్రుచ్చుకుంది. ఎక్కడ అతని యోగ శక్తి ఫలంగా ప్రాణ శక్తులనీ సమీకరించబడి కేంద్రీకృతమయి ఉన్నాయో ఆ ప్రదేశాన్ని బ్రద్దలు కొట్టింది రామబాణం.

అమృతబిందు రూపాలయిన ప్రాణశక్తులు జీవన్ముక్తాలయి ఉత్క్రమణమయినాయి. అమిత తేజోరాసి, అమిత ఓజస్సు కలవాడు, ముల్లోకాల వీరులను తన బాహుపటిమతో గడగడలాడించిన వాడుగా రావణుడు వానరులకు తెలుసు.

అటువంటి మహాశక్తిశాలి కూలిపోతున్నాడని వారంతా ప్రక్కలకు పరుగులు తీశారు. అతని శరీరం సముద్రతీర సైకత భూముల్లో నిట్టనిలువునా పడిపోయింది.

ఈ వార్త విన్న మండోదరి కుప్పకూలిపోయింది మైథిలికి రావణుడు మరణించినాడన్న వార్త తెలియగానే ప్రక్కనే నిద్రిస్తున్న సురమను ముద్దు పెట్టుకుంది.

ధాన్యమాలికీ వార్త తెలిసింది.

ఆమె బ్రతికి నంతకాలం రావణుని ప్రేమకై పరితపించింది. అది చిరకాలం ఫలించలేదు. ఫలించిన తుది క్షణాలలో అతడు విగత జీవుడైనాడు.

ధాన్యమాలి రక్తసిక్తమయిన రణస్థలిలో ఒంటరిగా తిరుగాడుతొంది. విధాత సంకల్పాలకు అర్థాలను వెదుకుతున్నట్లుగా ఆమె శూన్య దృక్కులు సముద్ర ఫేనంలో గ్రుచ్చు కుంటున్నాయి.

అచేతన అయింది ధాన్యమాలి!

× × ×

లంకలో యుద్ధ జ్వాలలు చల్లారినాయి. రాఘవుడు సోదరునితో కపులతో భల్లూక వీరులందరితో కలసి లంకానగర ప్రవేశంచేసినాడు. సీతాదేవి వారి మధ్యకు వచ్చింది.

ఆమె దుఃఖాశ్రమం ఆ సొంతమయింది.

"ఆర్యపుత్రా!" అని ప్రతిష్ఠాకరంగా రాముని సంబోధించింది మైథిలి.

"నీవు పునీతవా?" అని ప్రశ్నించాడు రాఘవుడు.

"నేను ఎన్నటికి సీతనే!" అన్నదామె.

"లక్షణా చితి పేర్చవయ్యా!" అని ఆజ్ఞాపించింది. బదులు చెప్పటం ఎరుగని మరది వదినగారి మాటకు కన్నీటితో పాటించాడు.

విభీషణుని పట్టాభిషేకం అయిన తరువాత రామలక్ష్మణులు లంకానగరాన్ని సందర్శించారు. అక్కడ రావణుడు సేకరించిన వస్తు సంచయమెంతో కనులు మిరుమిట్లు కలిగిస్తోంది.

"అన్నగారూ! ఈ సంపదలన్నీ చూస్తే ఇక్కడే ఉండిపోవాలన్న భ్రాంతి కలుగుతోంధి" అన్నాడు సౌమిత్రి!

మరికొద్ది ప్రొద్దుల తరువాత పుష్పకం మీద వెళ్ళి పట్టాభిషిక్తుడు కానున్న రాఘవేంద్రుడు చిరు దరహాసం చేశాడు.

"నాయనా! లక్ష్మణా! నాచేత జయించబడిన ఈ లంక స్వర్ణమణిమయమైనదే! సర్వసంపద్విలసితమైనదే కావచ్చు. కాని ఇంత కన్నా అయోధ్యానగరమే నాకు అత్యంత ప్రీతిపాత్రమైనది.

జనని జన్మభూమి స్వర్గం కన్నా మహనీయమైనవి కదా! అందువల్ల ఈ సంపదలన్నింటిని విభీషణునికే వదలి అయోధ్యానగరానికి వెళ్ళి తల్లుల ఆశీర్వచనాన్ని పొంది మునిజన మనోరంజకంగా మాతృ భూమిని పరిపాలించాలన్నదే నా కోరిక" అంటూ బదులు పలికాడు జానకీ వల్లభుడు.

ఆ మాటలు విన్న విభీషణుడు కృతజ్ఞతా పూర్వకంగా రాఘవునికి మ్రొక్కాడు. "నా అన్నగారయిన రావణుడు రసవాది. అతడెన్నో అద్భుతాలను సాధించాడు.

ధాన్యమాలి యందు కృత్రిమమైన శిశువును ఉత్పన్నం చేశాడు. బంగారాన్ని సృష్టించాడు. ఎన్నో మారణాయుధాల్ని సృష్టించాడు. అంతేకాక అన్నింటికన్నా అద్భుతమయిన మరొక వస్తువుని కల్పించాడు.

దానిపేరు పుష్పక విమానము. అది ఆకాశగమనం చేయగలదు. అసంఖ్యాక జనులు దానిలో నిశ్చింతగా ప్రయాణం చేయవచ్చు. అటువంటి అద్భుత వస్తువు అద్భుత వీరుడవు మునిజన మనోభిరాముడవయిన నీ దగ్గర ఉండదగినది. దాన్ని నీకే యిచ్చివేస్తున్నాము.

నీ పరివార జనులందరితో కలిసి దానిలో నీవు అయోధ్యానగరానికి వెళ్ళి పోవచ్చును" అంటూ పుష్పకాన్ని బహూకరించాడు విభీషణుడు.

అది అయోధ్యా నగరం దిక్కుగా ప్రయాణమయింది.

**(అయిపోయింది)**





పేరు : శ్రీమాన్ పరుచూరి నారాయణాచార్యులు

(కలం పేరు లల్లాదేవి)

ఆస్థాన పౌరాణికులు దేవాదాయశాఖ, గుంటూరు

టి టి డి పురాణ పండిట్ డి పి పి

ప్రచార అధిపతి,

పురాణ ప్రచార పరిషత్, గుంటూరు.

శ్రీమతి పరుచూరి ఆదిలక్ష్మి

చిరంజీవులు పి. నందగోపాల్

ఎస్. హరిప్రసన్నరాణి

నివాసం : నిమ్మగడ్డవారిపాలెం

విలాసం : ప్రత్తిపాడు (మండలం)

గుంటూరు (జిల్లా) 522019